C

ఫ్రెంచ్ [illegible]

# NANA

A NOVEL BY

B. RAMADASU

# నా నా

ఎమిలీ జోలా.

1

# నానా

[ ఎమిలి జోలా ]

అనువాదం :

బెల్లంకొండ రామదాసు



థమండలి, విజయవాడ.

# 3

# నానా

తొమ్మిది గంటలైంది. వెరైటీ థియేటర్ ఇంకా ఖాళీగానేవుంది. జనం అక్కడక్కడ చెదురుగా వున్నారు. బాల్కనీలో, ఆర్కెస్ట్రా స్టాల్స్‌లో కొద్దిమంది ప్రేక్షకులు, అనేక సిల్కుసోఫాలమధ్య, సగం ఆరిన గ్యాస్‌లైటు కాంతిలో మరుగుపడి కనుపిస్తున్నారు. బ్రహ్మాండమైన ఎర్రనితెర నీడలో మరుగుపడి వుంది. స్టేజీలోపలనుంచి రవంత ధ్వనికూడ వినిపించడంలేదు. 'పుట్‌లైట్లు' ఇంకా వెలగలేదు. గాయకుల కుర్చీలు ఖాళీగా వున్నాయి. నగ్నవనితల చిత్రాలు, మబ్బుల్లో ఆడుకుంటున్న పసిపిల్లల చిత్రాలు అలంకరింపబడివున్న మూడవ గాలరీవద్ద కేకలూ, నవ్వులూ, గుసగుసలు, సంభాషణలు వినవస్తున్నాయి. పనివారు ధరించే టోపీలు ధరించి, స్త్రీలు పురుషులూ గుంపులుగా బారులుతీరి ఇంచుమించు చూరునంటుతూ కూచుని ఉన్నారు. మధ్య మధ్యలో ఒక పరిచారకుడు వచ్చి ఎవరో ఉత్తమతరగతికి చెందిన ఒక స్త్రీకీ పురుషునికీ వారి సీట్లు చూపుతున్నాడు. అతను సాయంకాలపు దుస్తుల్లో ఉన్నాడు. ఆమె సన్నగా నాజూకుగా ఉంది. మెల్లని చూపులతో హాలునంతా వీక్షిస్తూ కొంచెం వంగి నడుస్తోంది. ఆర్కెస్ట్రావద్ద నున్న స్టాల్సు దగ్గరికి ఇద్దరు యువకులు హఠాత్తుగా వచ్చి అటూఇటూ పరికిస్తూ నిల్చున్నారు.

"నేను చెప్పలేదూ, హెక్టర్! చాలాముందుగా వచ్చేశాం. నన్ను చుట్టనైనా పూర్తిచేయనివ్వావుకాదు" అన్నాడు వారిద్దరిలో పెద్దవాడు. పొడుగ్గా ఉన్నాడు. సన్నని నల్లని మీసాలున్నాయి అతనికి.

ఆ క్షణంలో అటుగుండా ఒక పరిచారకుడు వెడుతున్నాడు. "ఓ, మిష్టర్ ఫాష్‌రె, ఇక అరగంటకుకాని నాటకం మొదలెట్టేటట్లులేరు" అంది ఆమె పరిచితురాలిలాగా.

"అయితే తొమ్మిదింటికే ప్రారంభిస్తామని బిల్సులో ఎందుకు వేసినట్లు" అన్నాడు హెక్టరు. అప్పుడు అతని పల్చని పొడవైన ముఖం

మీద తీవ్రమైన గాభరా కనుపించింది. తొమ్మిది గంటలకు తప్పకుండా తెర లేస్తుందని ఈ ఉదయాన్నే నాకు క్లారిసీ చెప్పాడు." అన్నాడు హెక్టర్.

ఒక నిమిషం వారిద్దరూ మాట్లాడకుండా ఊరుకున్నారు. తలలెత్తి 'బాక్స్'లవంక చూచారు. అసలే నీడలో ఉన్న బాక్సులు పచ్చకాగితం అంటించి వుండడంవల్ల మరింతచీకటిగా కనుపించాయి. బాల్కనీ క్రిందుగా ఉన్న చిన్న 'బాక్సు'లు పూర్తిగా చీకట్లో కలిసిపోయాయి. బాల్కనీ 'బాక్స్'ల్లో సిల్కు సోఫాపై అనుకుని కూచున్న ఒకలావుపాటి స్త్రీమాత్రం కనుపిస్తోంది, అటూ ఇటూ ఉన్న స్టేజిబాక్సులు ఖాళీగాఉన్నాయి. తెలుపు, బంగారురంగుల్లో అలంకరింపబడిన ఆ నాటకాల పెద్ద స్ఫటికపు గ్యాస్ లైట్‌నుంచి వస్తున్న మందమైన కాంతిలో మంచులా కరిగిపోతున్నట్లుగా ఉంది.

"లూసీకోసం ఒక స్టేజిబాక్స్ సంపాదించగలిగివా?". అని అడిగాడు హెక్టర్. "సంపాదించాను, కాని కొంత కష్టమైంది. లూసీ త్వరగా రాకపోయినా ఫరవాలేదు" అన్నాడు మరొకడు. ఒకచిన్న ఆవులింతను ఆపుకుని కాసేపాగి, మళ్ళీ ప్రారంభించాడు. 'నీవు చాలా అదృష్టవంతుడి వోయ్. నీవు ఇంతవరకు మొదటిరాత్రి ఎప్పుడూ రాలేదు. "బ్లాండీవీనస్" నాటకం ఈ సంవత్సరపు నాటకాలన్నిటిలోకి ప్రథమవిజయం పొందుతుంది. ఆరునెలలనుంచి ఎవరినోటవిన్నా, దీన్ని ప్రశంస్తే వినిపిస్తూఉంది. ఎంత చక్కని సంగీత మనుకున్నావు! ఓహో! అన్ని విషయాలూ చక్కగా తెలిసిన బోర్డ్‌నెవ్ ఈ నాటకాన్ని ప్రత్యేకంగా ప్రదర్శనోత్సవ సందర్భం కోసం ఆపి ఉంచాడు."

హెక్టర్ యిదంతా మతబోధ విన్నట్టు శ్రద్ధగావిన్నా, కొంచెం ఆగి నెమ్మదిగా యిలా ప్రశ్నించాడు, 'మరి — నానా — వీనస్‌పాత్ర ధరించే కొత్తతార - ఆమె నీకుతెలుసా?'

"ఓ! ఆవిషయమా! ఇవాళ ఉదయంనుంచి యెక్కడ విన్నా 'నానా' విషయమే! యించుమించు యిరవయిమంది మిత్రులను కలుసుకుని వుంటాను. అందరూ నానా విషయమే. ఎక్కడికి వెళ్ళినా 'నానా' విషయమే. బోర్డునెవ్ కనుగొన్న నూతనతార నానా!" అని ఉపన్యసించాడు పాష్‌రె,

ఉపన్యాసానంతరం కాస్త చల్లబడ్డాడు. కాని, ఆ నాటకశాల ఖాళీగావుండడం, నాటకశాలనంతా ఆవరించిన మందకాంతీ, తలుపులుమూసి తెరుస్తున్న చప్పుడూ, చర్చిలోలా వినిపించే గుసగుసలూ-ఈ వాతావరణం అతనిలో అదోవిధమైన తొందరకు, అసహనాన్ని కలిగించింది.

హఠాత్తుగా యిలా అన్నాడు. 'అబ్బ ! ఇక్కడ ఊపిరాడడంలేదు. బైటికి వెళ్ళాలి. కింద బహుశ శాబర్డ్‌నెవ్‌ను కలుసుకోవచ్చు. అతనిద్వారా కొన్ని వివరాలు తెలుసుకోవచ్చు.'

టిక్కెట్లిచ్చే గదిదగ్గర చలువరాళ్ళు పరచిన దోవవద్ద జనం రావడం వాళ్ళు చూచారు. తెరచివున్న మూడుతలుపుల సందునుంచి చూస్తే గుంపు కూడిన జనం అందమైన ఏప్రిల్‌నెల సంధ్యాసమయాన్ని ఆనందించడం కనిపిస్తుంది. బండ్లు ఛటఛటలాడుతూ వచ్చి యించుమించుగా నాటకశాలను ఢీకొని నిల్చిపోయాయి. తలుపు తటాలునతెరచి మూసిన శబ్దమైంది. ఇరువురు యిరువురుగా, ముగురు ముగ్గురుగా జనులు బుకింగ్ ఆఫీసువద్దఆగి రెండువరుసలుగావున్న మెట్లెక్కి పైకివెళ్ళారు. స్త్రీలు నడుస్తూ ఊగుతూ సాగిపోయారు. 'నానా' పేరు పెద్ద నల్లని అక్షరాలతో వ్రాసిన పసుపుపచ్చని పోస్టర్లు గోడలకు అంటించబడి గ్యాస్‌లైట్ కాంతిలో కనుపిస్తున్నాయి. జనం ఈ పోస్టర్లుచదివి అక్కడే మసలుతూవున్నారు, కొందరు నిల్చుని తమలో తాము మాట్లాడుకుంటూ వున్నారు.

బుకింగ్‌ఆఫీసు దగ్గర ఒక లావుపాటివ్యక్తి యెంతప్రయత్నించినా సీట్లుదొరకని కొందరితో కటువుగా ఏదో జవాబు చెపుతున్నాడు.

'అడుగో బోర్డ్‌నెవ్'--అన్నాడు ఫాషరె— హెక్టర్‌తో కలిసి మెట్లు దిగుతూ.

మానేజర్ అతన్ని చూశాడు. పెద్ద గొంతుకతో ఇలా అన్నాడు. "భలేవాడివోయ్ మొత్తంమీద ! ఇదేనన్నమాట నీవు నా గురించి వ్రాసే పద్ధతి ! ఇవాళ ఉదయం 'ఫిగారో' పత్రికతెరిచిచూచాను. ఒక్క ముక్క కూడా కనుపించింది కాదు." "ఉండవయ్యా కొంచెం, నేను మొట్టమొదట 'నానా'ను చూడాలి. చూడందే యెలావ్రాస్తాను చెప్పు, ఆమెనుగురించి? అదీకాక నేనేం వాగ్దానంచెయ్యలేదుకదా!" అంటూ జవాబిచ్చాడు ఫాషరె.

ఇక చర్చఆపివేస్తూ హెక్టర్‌ను పరిచయంచేశాడు. పారిస్‌లో చదువు

పూర్తి చేదామని వచ్చాడు హెక్టర్. ఒక్క చూపులో హెక్టర్ సంగతి గ్రహించేశాడు మేనేజర్. హెక్టర్ మానేజర్‌ను కొంచెంతటపటాయిస్తూ చూచాడు. ఇతనే బోర్డ్‌నెవ్! స్త్రీలను ప్రదర్శిస్తాడు. జైబువార్డ్ పైడీలను చూచే పద్ధతిలో స్త్రీలను చూస్తాడు. ధనసంపాదనకు ఇతనిబుర్ర ఎప్పుడూ ఏదో ప్లాను వేస్తూంటుంది. ఇతనిదృష్టిని ఆకర్షించాలని హెక్టర్ యత్నించాడు.

"మీ నాట్యమందిరి..." అంటూ ప్రారంభించాడు. సన్నని సక్కని విస్పష్టమైన కంఠంతో.

ఏ విషయాన్నైనా దానికి సరియైనపేరుతో పిలిచేవానిలాగా ప్రశాంతంగా అతన్ని ఆపుచేసి బోర్డ్‌నెవ్ 'నా వేశ్యాగృహం' అను సరిపోతుంది" అన్నాడు.

ఫాషరె నవ్వాడు అంగీకారసూచకంగా. కాని లాఫలోసీ కొంత గాభరా తిన్నాడు. హాస్యాన్ని ఆనందించాలని యత్నించినా ఆలోచించి విసిరిన విశేషణం గొంతుకు అడ్డుపడ్డట్టయింది.

ఈ లోగా మానేజర్ ఎవరో ప్రసిద్ధ నాటకకళా విమర్శకునితో కరస్పర్శచెయ్యటానికి వెళ్ళి మళ్ళీ వచ్చాడు. లాఫలోసీ కాస్త తనూయించుకుని నిలబడ్డాడు. మరీ గాభరా కనుపరిస్తే తనను యెక్కడి అనాగరిక రాష్ట్రాల నుంచి వచ్చిన వ్యక్తిగా పరిగణిస్తారో అని భయపడిపోతుంటాడు.

మొత్తంమీద ఏదో ఒకటి చెప్పాలని యత్నిస్తూ "నానా కంఠం చాలా తీయనైనదని నాకు అనేకులు చెప్పారు" అన్నాడు.

"దానికా! ఓ! అచ్చం నీళ్ళు చిమ్మినట్టుంది దానిగొంతు" అన్నాడు మానేజర్.

"అదీకాక గొప్పగా అభినయిస్తుందట" అన్నాడు యువకుడు కొంచెం అనుమానంగా.

"అదా! దానికి కాళ్ళెలా తిప్పాలో, చేతులెలా తిప్పాలో తెలీదు" అన్నాడు మానేజర్.

లాఫలోసీ కొంచెం చకితుడైనాడు. అతనికేమీ తోచిందికాదు. ఎలాగో ఒకలా ఇలామాత్రం అనగలిగాడు. "యెలాంటి సంపర్కంలోనైనా ఈ మొదటిరాత్రి నాటకాన్ని చూచే అవకాశం పోగొట్టుకునేవాణ్ణికాదు. మీ థియేటర్ "

"థియేటర్ అంటారేమిటి? 'భోగంకొంప' అనండి" అంటూ అతని మాటలను అడ్డుకున్నాడు బోర్డ్‌నెవ్— తను చెబుతున్న విషయాన్ని పూర్తిగా విశ్వసించి చెప్పేవ్యక్తిలా ప్రశాంతంగా.

వీళ్ళిలా సంభాషిస్తూ ఉండగా ఫాష్‌రె థియేటర్‌లో ప్రవేశిస్తున్న స్త్రీజనాన్ని పరిశీలిస్తూ నిల్చున్నాడు. ఏడవాలో నవ్వాలో తెలియని అయోమయ పరిస్థితిలోపడ్డ తన సోదరుణ్ని రక్షించడంకోసమై, "బోర్డ్‌నెవ్ ఇచ్చనే నెరవేరనీ. అతను కోరినట్లుగానే అతని థియేటర్‌ను పిలు. ఇంతలో పోయిందేముంది. కాని బోర్డ్‌నెవ్! నీవుమాత్రం మమ్మల్ని వెర్రివాళ్ళనుచేసి ఆడించలేవు. నీ 'నానా' కు ఆటాపాటా రాకపోయినట్లయితే ఈ రాత్రిమాత్రం గలభాజరక్కపోదు. ప్రదర్శనం అధ్వాన్నం కాకపోదు." అన్నాడు.

'ప్రదర్శనం అధ్వాన్నం కావడమా!' అంటూ అరిచాడు మానేజర్ కోపంచే ఎరుపెక్కిన ముఖంతో. "ఆడదానికి ఆటా పాటా రావడం అవసరమటోయ్ పిచ్చివాడా! నానాలో మరోశక్తి ఉంది. అది అన్నిలోపాలనూ కప్పేస్తుంది. నేను దాన్ని ముందే కనిపెట్టాను. దానిలో ఆ శక్తి కావలసినంత ఉంది. అది స్టేజిపైకి రావాలి, అంతే. ప్రేక్షకులందరూ లొట్టలెయ్యాల్సిందే" అన్నాడు. ఉత్సాహాతిశయంతో కంపిస్తున్న దీర్ఘహస్తాలను పైకెత్తి తనలో తాను యిలా గొణుక్కున్నాడు. "అది చాలా పైకి వెడుతుంది....చాలా పైకి....దానిశరీరం....ఎలాంటి శరీరం! "

తరువాత ఫాష్‌రె అడిగిన కొన్ని ప్రశ్నలకు సమాధానమిస్తూ ఎన్నో వివరాలు చెప్పాడు. అతను మాట్లాడుతూ ఉపయోగించిన భాషకు హెక్టర్ గాభరాపడ్డాడు. అతనికి నానాతో పరిచయమైనప్పుడు నానాను పైకి తీసుకురావాలనే భావం కలిగింది. అదీకాక అప్పుడతనికి వీనస్‌పాత్ర ధరించడానికి ఒక స్త్రీ కూడా అవసరమైంది. అతను యెప్పుడూ ఏ స్త్రీని తనను ఎక్కువకాలం అంటిపెట్టుకుని వుండనిచ్చేవాడు కాదు. ఈ సుందరి రాకతో అన్నీ తారుమారైనాయి. అదివరకు అతనివద్దఉన్న తార, గొప్ప అభినేత్రి, చక్కనిగాయకి రోజ్‌మినాన్ రోజూ అతన్ని వదిలేసి వెడతానని బెదిరించడం మొదలెట్టింది. నానా తనకు పోటీ అవుతుందని కోపోద్దీపితురాలైంది. ఎలాగైనా, యిరువురిపేర్లూ సమానమైన సైజులో ముద్రించ

డానికి అతను నిశ్చయించుకున్నాడు. క్లారినీ, సైమన్ అనే తారలు ఒక మాటు చెప్పినట్టు వినకపోతే వాళ్ళను వెనక్కు తోసేశాడు. ఉచితమైన పద్ధతిలో వాళ్ళను అలా వుంచవలసినట్టు ఉంచకపోతే మాట వినరని అతనివూహ.

"అరుగో! మినాన్, స్టీనర్ వస్తున్నారు. ఎప్పుడూ వాళ్ళ కలిసే వుంటారు'' అన్నాడు.

ధియేటరుపై వెలుగుతున్న గ్యాస్‌లైట్లబారు ప్రజలు నడిచే బాటపై వెలుగుదారి పరుస్తుంది. పచ్చగా వికసించిన ఆకులతో కళకళలాడుతున్న రెండుచెట్లు స్పష్టంగా కనుపిస్తున్నాయి. దీపకాంతికి స్తంభం ఉజ్వలంగా వెలిగిపోతోంది. దానిపై అంటించిన పోస్టర్లు దూరానికికూడా స్పష్టంగా కనుపిస్తున్నాయి. దూరంనుంచి చూస్తే వేలవేలలైట్లు చీకటిలో గుంపులుగా కూడినట్టుగావుంది. పొర్లిపోతున్న జన సందోహం కనుపిస్తోంది. చాలా మంది వెంటనే ధియేటర్‌లోకి వెళ్ళడంలేదు. సిగరెట్లు పూర్తిచేస్తూ గ్యాస్ లైట్ కాంతిలో చర్చించుతూ వెలుపల పచార్లు చేస్తున్నారు. దీపకాంతి వారి వదనాలపైన, వారి నీడలు క్రిందపడి విచిత్రమైన శోభకలుగుతోంది.

మినాన్ అనే లావైన పొడుగుపాటివ్యక్తి స్టీనర్ అనే బాంకర్‌ను లాక్కొని జనసందోహంలో త్రోవచేసుకుంటూ పోతున్నాడు.

''నీవు ఆమెను నిన్న నా ఆఫీసులో చూచావుకదూ?'' అన్నాడు బోర్డ్‌నెవ్ బాంకరుతో,

"ఆమేనన్నమాట. నేనూ అలానే అనుకున్నాను. నేను వెలుపలికి వెళ్ళబోతూవుండగా ఆమెచూస్తోంది, సరిగ్గా చూచాను కాదు'' అన్నాడు స్టీనర్.

అవనతమైన కన్నులతో చేతి వుంగరాన్ని తిప్పుతూ ఈ సంభాషణ విన్నాడు మినాన్. నానావిషయాన్నే వారూ మాట్లాడుతున్నారని తక్షణం గ్రహించాడు. క్రొత్తతారను వర్ణించడానికి బోర్డునెవ్ పూనుకోగానే ఇహ తనుకూడా సంభాషణలో ప్రవేశిద్దామని నిశ్చయించుకున్నాడు.

"ఇహ చాల్లెండి అది అంతచూడదగిందేమీకాదు ప్రజలు కొందర లోనే దానిస్థానాన్నిదానికి చూపిస్తారు. స్టీనర్, నీకోసం నా భార్య డ్రెస్సింగ్ రూమ్‌లో వేచివుంటుంది, పద" అన్నాడు.

స్టీనర్‌ను తీసుకువివెళ్ళాలని యత్నించినా, అతను బోర్డ్‌నెవ్‌ను వదిలిరావడానికి ఇష్టపడలేదు. బుకింగ్ ఆఫీస్‌దగ్గర జనంఒత్తిడి ఎక్కువైంది. గుసగుసలు పెద్దవైనాయి. నానా పేరు 'నా-నా' అంటూ పాడినట్టుగా వినిపిస్తోంది. పోస్టర్లవద్దనిలబడిన జనం ఆ పేరు పెద్దగా చదువుతున్నారు. కొందరు ప్రశ్నిస్తున్నట్టుగా చదివి వెడుతున్నారు. స్త్రీలు చిరునవ్వులతో ఆశ్చర్యపూరితులై చదువుతున్నారు. వీరిలో ఎవరికీ నానా ఎవరో తెలీదు. ఈ నానా ఎవరు? ఈ భూస్థలంలోకి నానా ఎక్కడినుంచి ఊడిపడింది? చిన్నచిన్న పరిహాసాలూ, అభూతకల్పనలూ అప్పుడే అక్కడక్కడా ప్రారంభమైనాయి. 'నానా' అనే అక్షరాలే అమృతప్రాయంగా కనిపిస్తున్నాయి. మాటిమాటికీ ఆపేరును వుచ్చరించడం జనంలో ఒకవిధమైన వుత్సాహాన్ని కలిగించింది. ఒకవిధమైన ఆశ్చర్యం, ఆవేశం అందరినీ పెనవేశాయి. ఇలాంటి ఆశ్చర్యావేశం ఒక్కోసారి పారిస్ నగరవాసులను జ్వరంలా ఆవేశిస్తుంది. అందరూ నానాను చూడాలని తహతహలాడిపోతున్నారు. ఒక స్త్రీ గౌనుఅంచు ఈ గందరగోళంలో చిరిగికూడాపోయింది. ఒక పెద్దమనిషి పాపం తన హాటు పోగొట్టుకున్నాడు.

"నా ధుంప తెంచేస్తున్నారు. ఇప్పుడే దాన్ని చూస్తారు. నేను తక్షణం వెళ్ళిపోవాలి" అంటున్నాడు బోర్డునెవ్. తనపై ప్రశ్నలవర్షం కురిపిస్తున్న కొందరిలో ప్రబల వుత్సాహాన్ని చూచి పరవశుడై బోర్డునెవ్ తక్షణం వెళ్ళిపోయాడు. మినాన్ స్టీనర్‌కు అతనికోసం రోజ్ కనిపెట్టుకుని వుంటుందని జ్ఞాపకంచేశాడు.

"అదుగో లూసీ, బండిదిగుతోంది!" అన్నాడు హెక్టర్ ఫాష్‌రేతో.

నిజంగా ఆ బండి దిగుతున్న స్త్రీ లూసీయే. నలభై ఏళ్ళుంటాయి. పొట్టిగా అందవికారంగావుంది. మెడ పొడుగ్గా సన్నగావుంది. లావుపాటి పెదవులు. కాని చాలా చలాకీగావుంది. కార్లయిన్ ఏకెట్, ఆమెతల్లీ ఆమెతో వున్నారు.

"నీవుకూడా వస్తున్నావుకదూ! నీకోసం ఒక సీటు రిజర్వుచేశాను" అంది ఫాష్‌రెతో.

"మీతో కూచుంటే ఇహ నాటకం కనుపించినట్టే. ఆర్కెస్ట్రాస్టాల్‌లో ఒకసీటు రిజర్వుచేసుకున్నాను. అక్కడే బావుంటుంది" అన్నా డతను.

లూసీ వెంటనే భగ్గుమని మండిపడ్డది. తనతో కూచుంటే ఎవరైనా చూస్తారని భయపడ్డాడా అతను? క్షణంలోనే చల్లారి మరోవిషయాన్ని ప్రస్తావించింది.

"నీకు నానా తెలుసునని ఎన్నడూ చెప్పలేదేం?" అన్నది.

"నానా! నే నెప్పుడూ ఆమెను చూడలేదే."

"నిజమేనా? నీవు ఒకసారి దానితో పడుకునివుంటావని నాకు గట్టిగా తెలుసు"

ముందు నిల్చునివున్న మినాన్ వారికి మాట్లాడవద్దని సైగచేశాడు. ఏమిటని లూసీ అడుగగా 'నానా! అందమైన నానా!' అని తనలో తా ననుకుంటూ అప్పుడే అటువెళ్ళి ఒక యువకుని చూపాడు.

అందరూ అతనివంక చూచారు. అతను నిజంగా చాలా అందంగా వున్నాడు. ఫాష్‌రె అతన్ని గుర్తించగలిగాడు. అతని పేరు డానెట్. మూడులక్షల ఫ్రాంకుల ఆస్తిని స్త్రీలకోసం తగలేశాడు. ఇప్పుడు చితికి పోయి ఏదో చిన్న వ్యాపారంచేస్తూ కాలక్షేపంచేస్తున్నాడు. ఇప్పటికీ అప్పు డప్పుడూ వాళ్ళకు పార్టీలివ్వడం మానలేదు. అతనికళ్ళు చాలా అందంగా వున్నాయనుకుంది లూసీ.

'బ్లాంసీ వుంది చూచావూ-ఆమె చెప్పింది, నీవు నానాతో పడుకున్నా వని' అంది.

అప్పుడే బ్లాంసీ వస్తోంది; సన్నగా, చక్కగా ముస్తాబైవున్న ఒక వ్యక్తితోకలిసి వస్తోంది.

'కౌంట్ జెవియర్ డి-వాంద్రివె' అన్నాడు ఫాష్‌రె, హెక్టర్ చెవిలో.

కౌంట్ పత్రికా రచయితతో కరస్పర్శచేశాడు. లూసీ, బ్లాంసీ ఉద్విగ్నంగా ఏదో చర్చించుకుంటున్నారు. వారి చర్చలో తరుచుగా నానా పేరు వినవస్తోంది. నానా పేరు వచ్చినప్పుడల్లా వెళ్ళేజనం ఆగి వింటున్నారు. కొంచెం ఆగిన తర్వాత కౌంట్ బ్లాంసీని తీసుకునివెళ్ళాడు. కాని, 'నానా' పేరు నలుమూలలనుంచీ మరింత ఉచ్చస్వరంలో ప్రతిధ్వనించడంమాత్రం ఆగలేదు. ఇంకా నాటకం ప్రారంభించలేదు. అందరికి ఆతృత ఎక్కువ కాసాగింది. ప్రతివారూ గడియారాలవంక చూడడం ప్రారంభించారు. ఆల స్యంగా వచ్చినవాళ్ళు బండ్లనుంచి దూకి త్వరత్వరగా వస్తున్నారు. పేవ్

మెంట్లు ఖాళీఅయిపోయాయి. బైటవెళ్ళేజనం మెడలునిక్కించి థియేటరులో ఏం జరుగుతోందో చూస్తున్నారు.

ఈలవేస్తూ వీధిలో వెడుతున్న ఒక కుర్రాడు పోస్టర్లదగ్గర ఒకక్షణం ఆగి తాగినవాడిలా పెద్దగా, 'నానా' అని అరచి తూలుతూ తుళ్ళుతూ వెళ్ళిపోయాడు. జనం నవ్వారు. ముస్తాబైన పెద్దమనుష్యులు 'నానా! నానా' అంటూ వెళ్ళారు. ఒత్తిడి మరీ ఎక్కువైంది. బుకింగ్ ఆఫీస్‌వద్ద ఒక చిన్న తగాదా రేగింది. 'నానా' అని అరుపులు ఎక్కువైనాయి. జనసందోహానికి సామాన్యమైన, మూర్ఖమైన, పశు సంబంధమైన ఆవేశం వీళ్ళను కూడా ఆవరించింది. హఠాత్తుగా గంటమ్రోగడం వినిపించింది. జనంలో తోసుకోవడం, సందడి ఎక్కువైంది. ప్రతివాళ్ళు ముందుగా లోనికివెళ్ళడానికి నెట్టుకున్నారు. మొదటిసారి గంట మ్రోగగానే ఫాష్‌రెను లాక్కొని హెక్టర్ లోనికి వెళ్ళిపోయాడు. లూసీస్టీవార్ట్ ఉద్రిక్తురాలైంది. 'స్త్రీలను కూడా నెట్టుకుంటూ పోతారు మొద్దుజనం' అనుకుంది. జనంఅందరూ లోనికి వెళ్ళేవరకూ బైటనేవుంది. కొంతసేపటికి థియేటర్ వెలుపలంతా ఖాళీఅయింది.

ఫాష్‌రె, హెక్టర్ తమసీట్లలోకూచుని హాలువంతా పరికించిచూచారు. హాలు కిటకిటలాడుతూ బ్రహ్మాండంగాఉంది. పలురంగుల కాంతులను గ్యాస్‌లైట్ వెదజల్లుతోంది. కాంతి బంగారు వర్షంలో జనంమీద కురుస్తోంది.

ఎర్రని తెరపైబడి ఫుట్‌లైట్లకాంతులు మెరిసిపోతున్నాయి. ఉజ్వలమైన ఆ ఎర్రనితెర బ్రహ్మాండమైన ఆ నాట్యశాలవైభవాన్ని తెలుపుతోంది. హాల్‌లో బాగా వుక్కపోయడం మొదలెట్టింది. ఆర్కెస్ట్రా గాయకులు శ్రుతి సవరించుకుంటున్నారు. సన్నని వేణుస్వనాలు, ఫిడల్‌ధ్వనులు జనుల అలజడిలో మునిగిపోతున్నాయి. ప్రేక్షకులు ఒకరిని ఒకరు తోసుకుంటూ మాట్లాడుకుంటూ చోటుచేసుకుంటున్నారు. వరండాలో జనప్రవాహపు ఒత్తిడి మరీ ఎక్కువైంది. దూరంనుంచి తలలూపి మిత్రులు ఒకరిని ఒకరు గుర్తిస్తున్నారు. పెళపెళలాడుతున్న చక్కని దుస్తులలో ముస్తాబైన జనులు పొర్లివస్తున్నారు. ఆభరణాలు, శిరోలంకారాలు వివిధరీతుల్లో కనుపిస్తున్నాయి. క్రమక్రమంగా సీట్లు నిండిపోతున్నాయి. ఒకచోట ఒక

చక్కని స్త్రీ ధరించిన రోబ్ కనుపిస్తున్నది. మరోచోట ఒక చక్కని స్త్రీ వదనం బాలుగా కనుపిస్తోంది. ఆమె ధరించిన మణిపూస మెరిసిపోతోంది. ఒక 'బాక్స్'లో దంతంలా ధగధగలాడిపోతున్న ఒక స్త్రీ నగ్న భుజం కనుపిస్తోంది. కొందరు స్త్రీలు నిశ్చింతగా కూచుని వీవనలతో విసురుకుంటున్నారు. ఆర్కెస్ట్రాస్టాల్స్‌లో కూచున్న విలాసపురుషులు కొందరు ఒపెరా గ్లాసులగుండా వారినిచూస్తూ ఆనందిస్తున్నారు.

ఇరువురుమిత్రులూ పరిచయస్థులు ఎవరైనా కనుపిస్తారేమోనని హాలంతా కలయచూచారు. మినాన్, స్టీనర్ బాక్స్‌లో పక్కపక్కగా కూచుని ఉన్నారు. బ్లాంసీ స్టేజీబాక్స్‌లో ఒంటరిగా వున్నట్టుంది.

కాని హెక్టర్ డానెట్‌ను ఎక్కువగా గమనించడం మొదలెట్టాడు. డానెట్ పక్కన పదిహేడేళ్ళ కుర్రాడొకడు కూచుని వున్నాడు. ఆశ్చర్యంతో కండ్లు పెద్దవిచేసి చూస్తున్నాడు. అతన్ని గమనించి ఫాషరె చిరునవ్వు నవ్వాడు.

'బాల్కనీలో కూచున్న ఆ స్త్రీ ఎవరు— బ్లాండస్‌లోవున్న ఆ అమ్మాయి పక్కనకూచున్న స్త్రీ?' అని హఠాత్తుగా ప్రశ్నించాడు హెక్టర్.

ఇద్దరుమిత్రులూ ఆమెవంక చూచారు. బిగుతుగావున్న లేస్ ధరించింది. జుట్టుకు పసుపుపచ్చనిరంగు వేసుకుంది. పౌడరుఅద్దినముఖం వంకెలు తీర్చిన జుట్టులో ఇంచుమించుగా మునిగిపోతోంది.

'ఆమె గాగా' అన్నాడు ఫాషరె సూక్ష్మంగా. పేరు చెప్పినమాత్రాన వివరాలు తెలియకపోతే మళ్ళీ ఇలా అన్నాడు, "నీకు గాగా తెలీదూ? లూయీ ఫిలిప్ రాజ్యంచేసే మొదటిరోజుల్లో గొప్ప అందగత్తెలలో ఆమె ఒకతె. ఇప్పుడు కూతురులేకుండా ఎక్కడికీ వెళ్ళడంలేదు."

లాఫలాసిదృష్టిని ఆ కుర్రది అంతగా ఆకర్షించలేదు. గాగా మాత్రం విచిత్రంగా ఆకర్షించింది. ఆమెవంక చూడకుండా వుండలేకపోయాడు. అతనిదృష్టిలో ఇప్పటికీ ఆమె అందంగావున్నట్టు కనుపించింది. కాని అలా పైకి చెప్పలేకపోయాడు.

కొంతసేపటికి ఆర్కెస్ట్రాకండక్టరు సిగ్నల్ ఇచ్చాడు. ఆర్కెస్ట్రా ఆరంభమైంది. జనం ఇంకా వస్తూనేవున్నారు. గుసగుసలు, రొద ఎక్కువవుతున్నాయి. పారిస్‌నగరమంతా అక్కడ వున్నట్టుంది. సాహిత్యానికి,

సంపత్తికి, భోగవిలాసాలకు ప్రసిద్ధికెక్కిన పారిస్ జర్నలిస్టులు, రచయితలు, జూదగాళ్ళు, గౌరవనీయులైన స్త్రీలకంటె ఎక్కువగా ఉంపుడుగత్తెలు, అన్ని రకాలవారు అక్కడ సమావేశమైనారు. అన్నివిధాలైన ప్రతిభనూ, పతనాన్ని అక్కడ చూడవచ్చు. ప్రతిముఖంమీద ఒకే అలుపు, జ్వరోద్విగ్నత ముద్రితమై కనిపిస్తున్నై.

ఫాషరె వివిధపత్రికల ప్రతినిధులు, క్లబ్బుల ప్రతినిధులు, విమర్శకులూ కూచున్న బాక్సులను మిత్రునికి చూపాడు. మిత్రుడు మధ్యబాక్సుల్లో కూచున్న కొందరువ్యక్తులకు నమస్కరించడంచూచి హఠాత్తుగా తనవర్ణనను ఆపేశాడు.

"నీకు కౌంట్ ముఫత్-డి-బివిలీ తెలుసా ఏమిటి?" అని అడిగాడు ఆశ్చర్యపూర్వకంగా.

"తెలియకేం? తెలుసు. చాలా రోజులనుంచీ నాకూ ఆయనకూ పరిచయం వుంది" అన్నాడు మిత్రుడు. "మాకు దగ్గర్లోనే వారి ఎస్టేటువుంది. తరచుగా వాళ్ళను చూడడానికి వెడుతుంటాను." అని చెప్పాడు. కౌంటు ఆయన భార్యతోను, మామగారు-మార్కిస్ డి ఛొవార్డ్‌తోను వచ్చాడు.

ఫాషరె ఉత్సుకతను గమనించి యింకా వివరాలు చెప్పడం ప్రారంభించాడు. మార్కిస్ స్టేట్‌కౌన్సిలర్‌గా వుండేవాడు. చక్రవర్తిని చాంబర్లేన్‌గా ఇటీవలనే కౌంట్ వియోగింపబడ్డాడు. ఫాషరె ఒపెరా కళ్ళద్దాలనెత్తి కౌంట్‌భార్యను పరికించాడు. నల్లగా లావుగా వుంది. నేత్రాలు నల్లగా అందంగా వున్నాయి.

"విశ్రాంతి సమయములో నన్ను వారికి పరిచయంచేయాలి. నేను ఇదివరకే కౌంటును కలుసుకున్నాను. మంగళవారాలు వారింటికివెళ్ళి చూస్తుండాలని కోరుతున్నాను" అన్నాడు.

పై గ్యాలరీలనుంచి 'హుష్' అని పెద్దగా శబ్దం వినిపించింది. ఆర్కెస్ట్రా ప్రారంభించింది. జనం ఇంకా వస్తూనేవున్నారు. కొత్తగా వస్తున్నవారికి దోవచెయ్యడంకోసం కూచున్నవారు లేచి నిల్చోవలసివస్తున్నది. వరండాలో పోట్లాడుకుంటున్నవారి పెద్దగొంతులు వినవస్తున్నాయి. సంధ్యాసమయంలో పక్షుల కిలకిలారావంలా వినవస్తున్న గుసగుసలు, మాటలరొద ఇంకా ఆగలేదు, అంతా గందరగోళంగా వుంది. కూచుం

టున్నవారు, సీట్లకోసం వెదుకుతున్నవారు, నిల్చుని హాలంతా పరికిస్తున్న వారు ఒక పెద్దసముద్రంలా వున్నారు. 'కూచోండి-కూచోండి' అనేకశబ్దాలు, పిలుపులూ, అరుపులూ వినవస్తున్నాయి. వారం రోజులనుంచి అందరినోటా ఒకే ఇదిగా చెప్పుకోబడుతున్న నానాను చూచేతరుణంలో అందరూ ఆతృతతో ప్రకంపించిపోతున్నారు. ఎలాగైతేనేం క్రమక్రమంగా రొద తగ్గిపోయింది. మందంగా వినిపిస్తున్న ఈ రొదనుంచి, గుసగుసలనుంచి ఆర్కెస్ట్రా పెద్దగా మధురశ్రుతులతో వినిపించసాగింది. ఆకర్షితులైన ప్రజలు చిరునవ్వుతో ప్రసన్నులైనారు. తెరలేచింది.

లాఫలాసీమాత్రం ఇంకా మాట్లాడుతూనే ఉన్నాడు. 'లూసీతో ఎవరో పెద్దమనిషి వున్నాడు' అన్నాడు స్టేజీబాక్సు వంక చూస్తూ. బాక్సుకు ఎదురుగా లూసీ కార్లైన్‌తో కూచునిఉంది. కార్లైన్‌తల్లి గంభీర వదనంకూడా కనుపిస్తోంది. చక్కగా ముస్తాబైన ఒక యువకుని ముఖం కనుపిస్తోంది.

'అదుగో చూడు. ఆ పెద్దమనిషి' అన్నాడు లాఫలాసీ మళ్ళీ.

ఫాషరె నెమ్మదిగా అటుచూచి మళ్ళీ ముఖం తిప్పుకున్నాడు.

"అతను 'లాబోర్డెట్'లేవోయ్" అన్నాడు శ్రద్ధగా. ప్రపంచంలో ఒక పనికిమాలిన వస్తువు ఉండడం ఎంత సహజమో అతనక్కడ ఉండడం అంత సహజం.

వారివెనుకనుంచి ఎవరో 'హూష్' అన్నారు. వారు నిశ్శబ్దంగా ఊరుకున్నారు. ఇప్పుడు ప్రతివారూ నిశ్శబ్దంగా ఉన్నారు. హాలంతా ఒక శిరోసాగరంలా ఉంది. 'బ్లాండీ వీనస్' నాటకంలో ప్రథమాంకం సాగుతోంది.

ఇరువంకలా అట్టలతోచేసిన మబ్బులతోకూడిన 'ఒలింపస్' రంగాన్ని అలంకరించింది. కుడివైపున 'జూపిటర్' సింహాసనం. కొందరు దేవతా ప్రతినిధులతోకలిసి మొట్టమొదట ఇరిస్, గానిమీడ్ ప్రవేశించారు; దేవతాసనాలు ఏర్పరుస్తూ స్వరమేళనను ఆలపించారు. లాఫలాసీ క్లారిసీ జెస్సన్‌ను ప్రశంసించారు. క్లారిసీ ఇరిస్‌పాత్రధరించింది. పచ్చని నీలపురంగు దుస్తులను ధరించి ఏడురంగులగుడ్డ నడుముకు చుట్టుకుంది.

"ఈ దుస్తులు ధరించేటప్పుడు ఆమె లోపలిబట్టలు తీసేస్తుంది తెలుసా?" అన్నాడు ఫాష్‌రెతో బిగ్గరగా.

డయానాపాత్రలో రోజ్‌మినాన్ స్టేజీపైకి రాగానే ప్రేక్షకులను ఒకస్వల్ప ప్రకంపనం ఆవేశించింది. సన్నగా నల్లగా ఉండడంచేత ఆమె ఆ పాత్రకు తగకపోయినా, మొత్తంమీద ఆకర్షణీయంగానే వుంది. ఆమె ప్రవేశిస్తూ పాడిన గీతం అర్థరహిత పదాలతో కూడివున్నా ప్రేక్షకులు కొంచెం ఉత్సుకులైనారు. మార్స్ వీనస్‌పై ప్రేమానురక్తుడై తనను నిర్లక్ష్యంచేస్తున్నాడని ఆ గీతం భావం. పక్కపక్కన కూర్చునివున్న ఆమె భర్త స్టేనర్ పెద్దగా నవ్వుకున్నాడు. మార్స్‌పాత్రలో ప్రూలెరీ ప్రవేశించగానే ప్రేక్షకులందరూ కరతాళధ్వనులు చేశారు. అతను సేనాధిపతిలా దుస్తులుతొడిగి, పెద్దఫించాన్ని ధరించి, భుజానికి కత్తి వేలాడవేసుకున్నాడు. మార్స్ డయానాను తృప్తితీర భోగించాడు. అతనికి మొహం మొత్తింది. ప్రూలెరీ తన విచిత్రధోరణిలో పాడిన గీతంతో వారిరువురిపాట సమాప్తమైంది. అతను నడవడం, కండ్లుత్రిప్పడం చూచినప్పుడు బాక్సుల్లో కూచున్న స్త్రీలు నవ్వకుండా వుండలేకపోయారు. తరువాత ప్రేక్షకులు యథాప్రకారంగా చల్లబడిపోయారు. తరువాత దృశ్యాలు మందంగా నడిచాయి. ముసలి 'బాస్క్' జూపిటర్ పాత్ర ధరించాడు. పెద్దకిరీటంలో అతనిముఖం అణిగిపోయింది. అతను జూనోతో తగాదాపడుతూంటే ప్రేక్షకులు చిరునవ్వుమాత్రం నవ్వగలిగారు. నెప్ట్యూన్, ప్లూటో, మినర్వా, ఇత్యాదిదేవతల రాకపోకలు ఇంచుమించు రంగాన్నంతా చెడగొట్టాయి. ప్రేక్షకులలో అసహనం ఎక్కువకాజొచ్చింది. గుసగుసలూ రొదలూ మొదలెట్టాయి. నాటకం చూదామనే శ్రద్ధపోయి హాలునుచూడడం మొదలెట్టారు. లాబోర్డ్‌టీతో లూసీ నవ్వుతోంది. ఫాష్‌రె కౌంట్ కూచున్న వేపు చూచాడు. కౌంట్ గంభీరంగా వున్నాడు. తన కేమీ అర్థం కానట్టుగా, కౌంటెస్ ఏదో స్వప్నంలో వున్నట్టుగావుంది. మళ్ళీజనంలో కరతాళధ్వనులు పిక్కటిల్లాయి. అందరూ స్టేజీవంక చూచారు. నానా వచ్చిందా? ఇంతకాలం వారు కళ్ళుకాయలుకాచేట్టు ఎదురుచూచిన నానా!

కాని అది మరోరంగం. ఇరిస్ మొదలైన మోసంచెయ్యబడిన భర్తలు జూపిటర్ వద్దకు వీనస్‌పై నేరంమోపుతూ ఒక మహజర్ తీసుకుని

వచ్చారు. వారు పాడిన స్వరమేళనము ప్రేక్షకులను తన్మయులను చేసింది. గాయకుల దుస్తులు, వారి ఆహార్యము చాలావిచిత్రంగావున్నై. వారిలో ఒక లావుపాటివానిముఖం చంద్రునిలా గుండ్రంగా వుంది. తరువాతరంగం చాలాపెద్దదిగా కనుపించింది. ప్రేక్షకుల్లో నానాకోసం తహతహ ఎక్కు-వైంది. నానా అసలు రాదాయేం? ప్రేక్షకులలో అసహనం ఎక్కువై మళ్ళీ గుసగుసలు ప్రారంభించాయి.

ఈ క్షణంలో రంగస్థలం వెనకాల మబ్బులు విచ్చుకున్నాయి. వీనస్ ప్రవేశించింది. నానా తన పద్దెనిమిది సంవత్సరాల వయస్సుకు లావుగా పొడుగ్గావుంది. దేవతలుధరించే తెల్లనిదుస్తులు ధరించి, బంగారంలా అందంగా మెరుస్తున్న జుట్టును భుజాలపై విరబోసుకొని, చిరునవ్వునవ్వుతూ తన సహజమైన ప్రశాంత గంభీరతతో ఫుట్‌లైట్లవద్దకు వచ్చింది. ఆమె పెదవులు విడివడ్డాయి. తను ఎప్పుడూపాడే ఉజ్వలగీతం మొదలెట్టింది.

"వీనస్ సంధ్యావాహ్యాళిచేసే సమయంలో" —

రెండవపాదం పాడగానే ప్రేక్షకులు ఒకరిముఖాలు ఒకరు చూచుకున్నారు. ఇంత అసహ్యమైన కంఠాన్ని వారు ఎన్నడూ వినలేదు. ఇంత అవ్యక్తమైన నటన వారెప్పుడూ చూడలేదు. ఆమెకు రంగస్థలంమీద ఎలా నిలబడాలో ఎలా కదలాలో తెలీదు. చేతులు ముందుకుంచి దేహాన్ని చాలా అయోగ్యంగా తిప్పుతోంది. జనంలో గుసగుసలూ రొదా ప్రారంభించాయి. ఆర్కెస్ట్రాస్టాల్స్‌లోనుంచి ఒకగొంతుక పెద్దగా గట్టిగా "అద్భుతంగా ఉంది." అన్నది.

ఈ మాటలు అన్నది ఎవరాఅని ప్రేక్షకు లందరూ అటుచూచారు. అతనొక కుర్రవాడు. కొత్తగా కాలేజీచదువు పూర్తిచేసి వచ్చినట్టున్నాడు. అందమైనకళ్ళు విస్ఫారితంచేసుకుని నానాను చూస్తున్నాడు. పసివాని ముఖంలా ఉన్న అతనిముఖం నానాపై మమకారంతో తీక్షణంగా వెలిగిపోతోంది. అందరూ అతనివంక చూచినప్పుడు సిగ్గుతో అతనిముఖం ఎర్రబడింది. అతనిప్రక్క కూర్చున్న డానెట్ అతనివంకచూచి చిరునవ్వునవ్వాడు. ప్రేక్షకులందరూ పెద్దగానవ్వారు. ఆ కుర్రవాడుకూడా పెద్దగా నవ్వాడు.

అందరూ నవ్వడంచూచి నానాకూడా నవ్వింది. ఆమె నవ్వుతోంటే

గడ్డంమీద అందమైన చిన్న లొట్టఏర్పడింది. ప్రేక్షకులు నవ్వుతూఉంటే ఆమె అసహనం పొందలేదు. పైగా హాయిగా ఉంది.

తనకు ప్రతిభ, నటనాచాతుర్యం లేశమైనా లేవని, కాని దానివల్ల వచ్చినలోపం అట్టే లేదనీ, అంతకుమించినదేదో తనవద్ద ఉందనీ వాలు చూపులతో తనే ప్రకటిస్తూ నిర్భయంగా సంచరిస్తోంది. ఆమె తన రెండవ గీతాన్ని ప్రారంభించింది.

"అర్ధరాత్రి వీనస్ నడిచి వెడుతుంది."

ఇంకా అదేగొంతు, అలాగేవుంది. కాని ఈమాటు శ్రోతలను సరి యైనచోట స్పందింపజేసింది. నానా ఎఱ్ఱని పెదవులపై చిరునవ్వు ఇంకా అలానే వుంది. విశాలమైన ఆమె నేత్రాంచలాలలో ఆ నవ్వు మెరిసి పోతోంది. కొన్ని పాదాలు పాడేటప్పుడు ఆమె ఎఱ్ఱని నాసాపుటాలు పెద్దవై కపోలాలు ఎరుపెక్కుతున్నాయి. దేహాన్ని అదేవిధంగా త్రిప్పుతూ వుంది. కాని ఈమాటు అందరికళ్ళూ అటేవున్నాయి. పాటపూర్తికాగానే పూర్తిగా గొంతుపోయింది. ఇహ లాభంలేదనుకుంది. ఏమాత్రం చలించ కుండా, పిక్కను విచిత్రంగా కదిలించి, నగ్నంగావున్న ఉరోజాలు కను పించేటట్లు దేహాన్ని ముందుకువంచి చేతులుచాచింది. అన్నిమూలలనుంచీ కరతాళధ్వనులు వినిపించాయి. వెంటనే వెనుదిరిగి మెడవంక చూపిస్తూ రంగస్థలం వెనక్కు వెళ్ళింది.

అంకంచివర అంతవుత్సాహం కనిపించలేదు. వల్కాన్ తనభార్యను శిక్షించాలనుకున్నాడు. దేవతలందరూకలిసి ఆలోచించారు. మోసం చెయ్య బడిన భర్తలవిషయం ఆలోచించడానికిముందు భూలోకంలోని విషయాలు విచారించాలని నిశ్చయించుకున్నారు. తెరపడగానే ప్రేక్షకులందరూ లేచి బైటికివెళ్ళడం మొదలెట్టారు. 'ఏడ్చినట్టుంది' అనే మాటమాత్రం ప్రతి చోటా వినిపిస్తోంది. నాటకం తగ్గించి ప్రదర్శించాలని ఒక విమర్శకు డన్నాడు. కాని నాటకంకన్న నానా ప్రధానమైపోయింది. వాతావరణం ఊపిరాడకుండావుంది. ఒక ఇరుకైన నగదిలో వున్నట్టుగావుంది.

స్టీనర్ ఫాష్‌రెను చూడగానే, 'నాకు ఆమె తెలుసు' అన్నాడు. "ఎక్క డనో బాగా చూచినట్టు జ్ఞాపకం. కాసినోలో అనుకుంటాను, చిత్తుగా తాగిందికూడా ఆరోజున" అన్నాడు.

"నేనూ ఎక్కడో చూచినట్టుగానే వున్నాను" అని సన్నగానవ్వాడు ఫాష్‌రె.

"ఏదో ఒక చోట! పాడుపడ్డ చోట! ప్రతిలంజకూ ప్రజలు ఇలా స్వాగతమివ్వడంచూస్తే అసహ్యంవేస్తుంది. ఇహ నాటకరంగంలో గౌరవం గల స్త్రీలకు స్థానం ఉండదు. రోజ్‌ను ఇహ వేషంవెయ్యనియ్యకూడదు" అన్నాడు మినాన్.

ఫాష్‌రె చిరునవ్వు నవ్వకుండా ఉండలేకపోయాడు. జనం మెట్లు దిగి వస్తున్నారు. ఒకడు "ఓ! గుమ్మడికాయలావుంది. తినాలనిపిస్తోంది" అంటున్నాడు.

వరండాలో ఇద్దరు యువకులు తగాదాపడుతున్నారు. ఒకడు కారణం చెప్పకుండానే 'అసహ్యంగావుంది' అంటున్నాడు. మరో యువకుడు-అతనుకూడా కారణం చెప్పకుండానే 'అద్భుతంగావుంది' అంటున్నాడు. లాఫలాసికి నానా ఎంతోనచ్చింది. గొంతుకను మరికొంచెం అభివృద్ధి చేసుకుంటే ఇంకా ఎంతో బావుంటుందన్నాడు. మినాన్ ష్టీనర్ చెయ్యిపుచ్చుకొని, 'రెండోరంగానికి నా భార్యదుస్తులు చూడాలి రమ్మ'ని తీసుకువెళ్ళాడు.

పైన మూడు గాసులైట్లు స్ఫటికంలా స్వచ్ఛమైన కాంతిని విరజిమ్ముతూ వెలుగుతున్నాయి, మిత్రులిద్దరూ ఒక్కక్షణం ఆగి లోపలికి ప్రవేశించారు. కొంచరుజనం నాలుగైదు గుంపులుగాచేరి ఏదో సంభాషిస్తూ నిల్చున్నారు. కొందరు అటూ ఇటూ నడుస్తూ వెడుతున్నారు. వేడిగావున్న వాతావరణానికి అలిసిపోయి సోఫాల్లో కూచునివున్న స్త్రీలు ఈ గుంపునంతా పరికిస్తున్నారు. సెలూన్ చివర బార్‌వద్ద ఒకగ్లాసు షర్‌బత్‌తాగుతూ ఒక లావుపాటివ్యక్తి నిల్చుని ఉన్నాడు. కొంచెం గాలిపీల్చుకోడానికి ఫాష్‌రె వరండాలోకి వెళ్ళాడు. ఫ్రేముల్లో తగిలించివున్న కొందరు తారలఫొటోలు పరికిస్తున్న లాఫలాసి కొంచెం ఆగి అతన్ని అనుసరించి వెళ్ళాడు. బాల్కనీ చల్లగా ప్రశాంతంగా నిర్మానుష్యంగా ఉన్నది. ఒక్క వ్యక్తిమాత్రం ఏకాంతంగా నీడలోనిల్చుని సిగరెట్ కాల్చుకుంటున్నాడు. ఫాష్‌రె అతన్ని గుర్తించాడు. అతను డానెట్.

ఇరువురూ కరస్పర్శచేసుకున్నారు "అక్కడ ఏంచేస్తున్నావోయ్ ?

ఆ మారుమూలల్లో నిల్చుని? మొదటిరోజున ఎన్నడూ స్టాల్సుకదిలి బైటికి వెళ్ళేవాడివికాదు!" అని ప్రశ్నించాడు జర్నలిస్టు.

"ఏముంది? సిగరెట్టు కాల్చుకుంటున్నాను" అన్నాడు డానెట్.

అతన్ని కాస్త వుడికిస్తూ ఫాషరె "అయితే ఆ కొత్తతారనుగురించి నీ అభిప్రాయం ఏమిటి? అందరూ మహాఘోరంగా చెప్పుకుంటున్నారు" అన్నాడు.

"ఏమాత్రం సంబంధం పెట్టుకోని మనుష్యులు అలా అని వుంటారు" అన్నాడు డానెట్ తనలోతాను గొణుక్కుంటూ.

నానానుగురించి అతను చెప్పినవిమర్శ ఇంతమాత్రమే. ఎదురుగా వున్న హోటల్లో, క్లబ్బులో లైట్లు ధగధగలాడిపోతున్నాయి. రాత్రి బాగా పొద్దుపోయినా జనంగుంపు ఇంకా తగ్గలేదు. ప్రవాహంగా వస్తున్నారు. రోడ్డు ఒక ప్రక్కనుంచి మరోప్రక్కకు వెళ్ళడానికి ఐదు పది నిమిషాలు విల్చోవలసివస్తున్నది. బండ్ల రాకపోక అంత ఒత్తిడిగావుంది.

గంట వినిపించింది. సెలూన్ త్వరత్వరగా ఖాళీఅయింది. అందరూ వేగంగా లోపలికివెళ్ళారు. తెరలేచింది. కాని ఇంకా జనంపొర్లుకొని లోప లికి వస్తూనే ఉన్నారు. ఆలస్యంగా వచ్చినవారు తొందరగా తమసీట్లు చేరుతున్నారు. లాఫలాసీ' మొట్టమొదట 'గాగా' కోసం చూచాడు. కాని మొదటి అంకంలో ఆమెపక్కనకూచున్న పొడుగుపాటివ్యక్తి లూసీ స్టేజీబాక్సులో వుండడం చూచి ఆశ్చర్యపడ్డాడు.

'అతని పే రేమిటన్నావు?' అన్నాడు.

'లాబోర్డెటీ' అన్నాడు ఫాషరె ఇదివరకటిలాగానే నిర్లక్ష్యంగా.

రెండో అంకంలో సీనరీ ఆశ్చర్యజనకంగావుంది. ఒక తక్కువ రకానికిచెందిన నృత్యమందిరంలావుంది. కొందరు వేషధారులు పెద్దదుస్తులు ధరించి అడుగులువేస్తూ ఒక స్వరమేళ ఆలాపించారు. వారిమాటలూ అభి నయం పేక్షకులను బాగా రంజింపచేశాయి. ఇరిస్‌వల్ల దోవతప్పిన దేవతల గుంపు ప్రవేశించారు. ఇరిస్ తనకు భూలోకం తెలుసంటూ అబద్ధమాడి వీళ్ళను తీసుకువచ్చాడు.

వారు మారువేషాలు ధరించారు. జూపిటర్, డగోబర్ట్ రాజులాగా వేషంధరించి వచ్చాడు. పెద్ద రేకుకిరీటాన్ని పెట్టుకున్నాడు. మినర్వా

నార్మిన్ దాది వేషంలోవచ్చింది. స్విస్ సేనాధిపతివేషంలో మార్స్‌రాగానే ప్రేక్షకులు కరతాళధ్వనులతో స్వాగతమిచ్చారు. నెప్ట్యూన్‌రాగానే గోల మరీ ఎక్కువైంది. స్త్రీలు విసురుకోడానికి వీవనలు తీసుకున్నారు. యూనీ పెద్దగా నవ్వడం మొదలెట్టింది. కార్లెన్ ఊరుకోమని ప్రార్థించాల్సివచ్చింది. ఇక్కడినుంచి నాటకం రక్తికట్టడం మొదలెట్టింది. విజయవంతమైంది కూడాను.

ఈ దేవతల ప్రదర్శన, మతాన్నీ కవితాకల్పననూ రచ్చకీడ్చి హాస్య ధోరణిలో నిరసించింది. పుక్కిటిపురాణాలు విధ్వంసం చెయ్యబడ్డాయి. పాతకాలపు రాతిబొమ్మలు తునాతునకలైనాయి. రాచరికం ఒక పెద్ద ఫార్స్‌గా మారిపోయింది. సేనానివీరత్వం హాస్యాస్పదమైపోయింది. జూపిటర్ చాకలిదానిమోహంలోపడి, చాకలిదానిపాత్ర ధరించిన పిరున్ అతని ముక్కుదగ్గర తనకాలుంచినప్పుడు ప్రేక్షకులందరూ పిచ్చినవ్వుతో ఊగిపోయారు. ఇలాంటి బూటకాన్ని ప్రేక్షకులు ఆనందించి ఎన్నాళ్ళో అయింది.

చివరకు వీనస్ ప్రవేశించింది. బెస్తపిల్లలా అలంకరించుకుంది. తలకు చేతిరుమాలు కట్టుకుంది. పొడుచుకునివస్తున్న స్థనాలకు చక్కని బంగారు ఆభరణాలు అలంకరించింది. తెల్లగా మెరిసిపోతోంది. ఆమె శరీరకాంతీ, బలిష్టంగా అందంగా కనుపిస్తున్నతొడలూ, సహజసౌందర్య రేఖా—వీటన్నిటివల్లా వెంటనే ప్రేక్షకులందరినీ వశీకృతం చేసుకుంది. నానా తళుకుముందు అందరూ రోజ్ మినాన్‌ను విస్మరించారు. స్త్రీశక్తి సమస్తమూ మూర్తీభవించినట్టు నానా ప్రేక్షకులను మత్తులో ముంచేసింది.

తరువాత నానా ఏంచేసినా ప్రేక్షకు లేమీ అనలేకపోయారు. ఎలా కదిలినా, ఎలామెదిలినా, ఎలానటించినా, పోర్షన్ మరిచినా ఊరుకున్నారు. ప్రేక్షకులవంకచూచి ఒక్క చిరునవ్వు విసిరితే చాలు - ఊగిపోయారు. ఆమె విచిత్రంగా తొడలుకదిలించినప్పుడల్లా స్టాల్స్‌లో కూర్చున్నవారు విచలితులైపోయారు. ఉత్సాహం మిన్నుముట్టింది. నృత్యంచేసినప్పుడు విజయం పరాకాష్ఠనందుకుంది. ఆమె నృత్యసమ్మేళనాన్ని సాగిస్తున్నప్పుడు ప్రేక్షకులందరూ జ్వరితులైపోయారు. తెరపడింది. తెరమళ్లీలేవగానే నటకు లందరూ చెట్టాపట్టాలు పట్టుకొని ప్రవేశించారు. వారిమధ్య నానా, రోజ్

మినాన్ వున్నారు. ప్రేక్షకులలో మళ్లీ కరతాళధ్వనులు పిక్కటిల్లాయి. గతరంగంకన్నా ఈ రంగం బాగుంది. తరవాత హాల్లో సగంమంది బైటకి వెళ్ళారు.

"నేనువెళ్ళి కౌంటెస్‌ముఫత్‌ను కలుసుకోవాలి" అన్నాడు లాఫలాసి. సరేనన్నాడు ఫాషరె. కాని జనాన్ని తప్పించుకొని బాల్కనీబాక్స్‌ల వద్దకు వెళ్ళడం, అంత సులభం కాదు. గోడకానుకొని లావుగానున్న ఒక విమర్శకుడు కొందరికి తనఅభిప్రాయాన్ని తెలియబరుస్తున్నాడు. అటువెళ్ళే జనం అక్కడనిలిచి అతనెవరో ఒకరికొకరు నెమ్మదిగాచెప్పుకుంటున్నారు. అంకం జరుగుతున్నంతసేపూ అతను నవ్వుతూ ఉన్నాడనే అనుకున్నారు. కాని ఇప్పుడుమాత్రం గంభీరమైన ముఖంతో ఉన్నతమైన అభిరుచినిగూర్చి, నీతినిగూర్చి వుపన్యసిస్తున్నాడు.

ఫాషరె అన్నిబాక్స్‌లవంకా చూచాడు. కౌంట్-డి-వాండ్రెవె అతన్ని ఆపి కొన్ని ప్రశ్నలడిగాడు. కౌంటెస్‌ముఫత్‌ను చూడాలని కోరుతున్నా మని చెప్పగా వారికి 7వ నంబర్ బాక్స్ చూపించాడు. తరువాత జర్నలిస్టు చెవిలో, 'ఒకరాత్రి రూ-డి-ప్రొవెన్స్ మూల కలుసుకున్నాంచూచావూ-ఆ పిల్లేనోయ్ ఈ నానా' అన్నాడు. 'అవును నిజమే. నేనూ తప్పకుండా ఇది వరకెక్కడో చూచిఉంటాననుకున్నాను' అన్నాడు ఫాషరె.

లాఫలాసీ ఫాషరెను కౌంట్‌ముఫత్-డి బెవిలీకి పరిచయంచేశాడు. ఫాషరెపేరు వినగానే కౌంటెస్ ఉత్సుకురాలై 'ఫిగార్'లో అతను వ్రాసిన వ్యాసాలను అభినందించింది. సోఫాలో కూచున్న ఆవిడ అందంగా భుజాలు కదిలిస్తూ అతనివంక సగంతిరిగింది. వారు కాసేపు ఏవో విషయాలు మాట్లాడుకున్నారు. తరువాత వారిసంభాషణ పారిస్‌లో జరుగనున్న 'ప్రదర్శనం' వైపుకు మళ్లింది.

"చాలా అద్భుతంగాఉంటుంది. ఇవాళ ఛాంప్‌డిమార్స్‌చూచి ఆశ్చర్య చకితుణ్ణయి వచ్చాను" అన్నాడు కౌంట్.

"కాని, సకాలానికి జరగదని విన్నాను. ఏదో అడ్డంకి వచ్చిందట" అన్నాడు లాఫలాసి.

"తప్పకుండా సకాలానికి సిద్ధమవుతుంది. చక్రవర్తి తప్పక అలా జరగాలంటున్నాడు" అన్నాడు కౌంట్ తన సహజదృఢస్వరంతో.

ఒక వ్యాసంకోసం సామగ్రి సేకరించడానికి ఎక్వేరియంకు వెళ్ళి తన్మయుడైన విషయాన్ని ఫాషరె చెప్పాడు. కౌంటెస్ చిరునవ్వునవ్వింది. ఆమె మాటిమాటికి మెల్లిగా విసుడుకుంటూ హాలంతా పరికిస్తూఉంటె. సీట్లు చాలా ఖాళీగాఉన్నాయి, స్టాల్స్‌లోకూర్చున్న కొందరు సాయంకాలం పేపరు చదువుతున్నారు. చాలమందిస్త్రీలు వారి స్నేహితులకు స్వాగతమిస్తున్నారు. ఇళ్ళలోలాగే కూచున్న స్త్రీలను పరిశీలిస్తూ కొందరు వెలుపల తిరుగుతున్నారు. ఒకక్షణం నిలిచిచూచి మళ్ళీ వెడుతున్నారు.

'మళ్ళీ మంగళవారం కలుసుకుందాం' అంది కౌంటెస్ లాఫలాసితో.

పాషరెనుకూడా ఆహ్వానించింది. అతను ధన్యవాదాలర్పించాడు. కౌంట్ గంభీరంగా అచలంగా వున్నాడు, కౌంటెస్ ఆహ్వానాన్ని అందుకుని ఫాషరె వెళ్ళిపోయాడు, నాటకాన్నిగురించి అప్పుడు చర్చించడం ఉచితం కాదనుకున్నాడు. లాఫలాసి చిట్టచివరకు బాక్సునువదలివెళ్ళాడు. కౌంట్ డి వాండె|వె స్టేజ్‌బాక్సులో లాబోర్డెటీ కూచుని బ్లాంసీతో అతి పరిచయంగా ఏదో సంభాషిస్తూవుండడం గమనించాడు.

'ఈ లాబోర్డెటీకి ప్రతి ఆడదీ తెలిసినట్లుగావుంది' అన్నాడు.

'అందరూ తెలుసు' అన్నాడు ఫాషరె

ఫాషరె మెట్లుదిగి కిందికి వెడుతూవుండగా లూసీస్టీవర్ట్ అతన్ని పిలిచింది. తన బాక్సుతలుపు వెలుపలగా నిల్చునివుంది. బాక్సులోపల చాలా వుక్కపోస్తోందని చెప్పింది. జర్నలిస్టుతో ఒక చిన్న తగాదావేసుకోడానికి ప్రారంభించింది. ఇతర స్త్రీలను చూడాలని తొందరగావెడుతున్నాడు కాని ఒక్కరినీ షర్బత్ తాగడానికి పిలవడంలేదు!

హఠాత్తుగా విషయాన్ని మార్చేసి, 'నానా పెద్ద హిట్ అనుకుంటాను' అంది.

చివర అంకంలో తనబాక్సులో వుండమని కోరింది. కాని నాటకం అయినతరువాత కలుసుకుంటానని తప్పించుకున్నాడు. బైటికివెళ్ళి ఇదువురూ సిగరెట్లు ముట్టించారు.

ఈలోగా మినాన్, స్టీనర్‌ను కేఫ్ డి వెరైటీకి తీసుకెళ్ళాడు. నానా విజయాన్నిగూర్చి ఉత్సుకంగా మాట్లాడాడు. మాట్లాడుతున్నంతసేపూ ఒకకంట అతన్ని కనిపెడుతూనేవున్నాడు. స్టీనర్ విషయం మినాన్‌కు

బాగా తెలుసు. రోజ్‌ను మోసంచెయ్యడంలో రెండుసార్లు అతనికి సహాయ కారి అయ్యాడు. కేఫ్‌లో జనం పొర్లబడి చలువరాతి టేబిళ్ళచుట్టూ మూగు తున్నారు. కొందరు నిల్చుని త్వరత్వరగా తాగేస్తున్నారు. నిలువుటద్దాలలో వీరి వేలవేలశిరస్సులు ప్రతిఫలిస్తున్నాయి. స్టీనర్ వెలుపలగదిలో కూచుని వున్నాడు. ఫాషరె, హెక్టర్ అలా వెళ్ళుతూండడంచూచి వారిని ఆపాడు.

'మాతోకలిసి ఒకగ్లాసు బీర్ తీసుకోండి' అన్నాడు.

ఇప్పుడే అతనికికలిగిన ఒక కొత్తభావాన్నిగురించి అతనుఆలోచిస్తు న్నాడు. నానాకు ఒక పూగుత్తి బహూకరించాలనుకున్నాడు. 'అగస్టస్' అని పరిచితంగా ఒక సర్వర్‌ను పిలిచాడు. మినాన్ అతను చెప్పేదంతా వింటూ సూటిగా అతనికళ్ళల్లోకి చూచి, 'రెండుపూగుత్తులు తీసుకురా ఆగస్టస్. ఇద్దరికీ చెరిఒకటి ఇవ్వమను' అన్నాడు.

ఆగదిలో మరోమూల, నిలువుటద్దానికి తలవాల్చి పద్ధెనిమిదేళ్ళపిల్ల ఒకతె నిశ్చలంగా తనముందున్న ఖాళీగ్లాసునుచూస్తూ కూచునిఉంది. ఎంతోకాలం దేనికోసమో వేచివేచి విఫలురాలైనట్టుగాఉంది. అందమైన అలకలచాటున దాగిన ఆమెముఖం కన్యకముఖంలావుంది. ఆపిల్లకళ్ళు మృదువుగా నిర్మలంగావున్నాయి. లేతఆకుపచ్చ సిల్కుదుస్తులు ధరించింది. సాయంత్రపు చలిగాలిలో తెల్లబారినట్లు కనుపిస్తోంది.

ఆమెను చూడగానే 'సాటిన్‌కూడా వచ్చిందే' అన్నాడు ఫాష్‌రె. లాఫలాసి ఆమె ఎవరని అడిగాడు. ఆమె ఎవరోకాదు. వీధుల్లోతిరిగే పడుపుకత్తె. మాట్లాడిస్తే చాలు. బూతులపంచాంగం విప్పుతుంది.

'అక్కడేం చేస్తున్నావు సాటిన్?' అన్నాడు ఫాష్‌రె.

'ఏం చేస్తున్నాను? చస్తున్నాను!' అంది కదలకుండా మెదలకుండా.

నలుగురూ ఫక్కున నవ్వారు. బీర్ ముగించుకుని స్నేహితులిద్దరూ థియేటర్‌లోకి వెళ్ళాలనుకున్నారు. వారికి చలిగా వున్నట్టనిపించింది. మినాన్, స్టీనర్ మిగిలిపోయారు. మినాన్ రెండుచేతులూ టేబిల్‌మీదవుంచి స్టీనర్‌వంక సూటిగాచూస్తూ, 'మనం ఆమెను కలుసుకుందాం. నిన్ను నేను పరిచయంచేస్తాను. ఇది రహస్యంగా వుండాలిసుమా! నా భార్యకు ఏమీ తెలియనక్కర్లేదు' అన్నాడు.

ఫాష్‌రె, లాఫలాసి తిరిగి తమసీట్లలో కూచున్నారు. వాళ్ళల

రెండవ వరుసలో ఒకచక్కనిచుక్కను చూశారు. ఆమెతో గంభీరంగా వున్న ఒక పెద్దమనిషి వున్నాడు. స్వదేశ మంత్రివర్గంలో ఒకశాఖకు అధి పతి అతను. 'ఆమెపేరు మేడమ్ రోబర్ట్ అనుకుంటాను' అన్నాడు ఫాషరె ఆమెకు ఒకప్రియుడు వుంటాడు. ఒక్కసారి ఒకరికంటె ఎక్కువమంది ప్రియులుండరు. అతను గొప్ప గౌరవనీయుడై వుంటాడు.' వారు తిరిగి చూడగానే డానెట్ వారినిచూచి చిరునవ్వు నవ్వాడు. నానా విజయంవల్ల అతను చాలా ఉత్సాహంగా వున్నాడు. ఆమెవిజయానికి ఆనందిస్తూ హాలంతా తిరిగి పరామర్శించి వచ్చాడు.

అతనిపక్కన కూచునివున్న కుర్రవాడు ఒక్కమాటుకూడా కుర్చీలో నుంచి కదలలేదు. నానా అతన్ని అలా బందీనిచేసేసింది. అతను నానా ధ్యానంలోనే కూచునివున్నాడు. ప్రక్కనున్న వ్యక్తి నానా ప్రస్తావన తీసుకురావడంచూచి చిట్టచివరకు ఇలా ప్రశ్నించడానికి సాహసించాడు. "ఇలా అడుగుతున్నందుకు నన్ను క్షమించండి. ఆమె మీకుతెలుసా?" అన్నాడు.

'అవును....కొద్దిగా....తెలుసు' అన్నాడు డానెట్ ఆశ్చర్యచకి తుడై, కొంచెం సంకోచిస్తూ.

'ఆమె ఎడ్రస్ తెలుసా?' అని అడిగాడు ఆ కుర్రవాడు.

హఠాత్తుగా కుర్రవాడడిగిన ఈ ప్రశ్నతో డానెట్‌కు అతన్ని కొడదామన్నంత కోపంవచ్చింది.

'నాకు తెలీదు' అని కటువుగా డానెట్ ముఖంతిప్పుకున్నాడు.

ఏదో అడగకూడనిప్రశ్న అడిగానని గ్రహించాడు కుర్రవాడు. సిగ్గుతో కుమిలిపోయాడు.

మూడుసార్లు గంటమ్రోగింది. అందరూ మళ్ళీ వాళ్ళసీట్లకు చేరుతు న్నారు. సీనరీ, ఎట్నాశిఖరంతోఉన్న ఒకగుహాగర్భాన్ని తెలియచేస్తోంది. రెండవరంగంలో డయానా ప్రవేశించింది. డయానా ప్రవేశించి దేవతతో అన్ని ఏర్పాట్లుచేసుకుని వెళ్ళిపోయింది. డయానా వెళ్ళిందోలేదో వీనస్ ప్రవేశించింది.

ప్రేక్షకుల్లో విద్యుత్తులా ఒక ప్రకంపంకలిగింది. నానా ఒంటిమీద బట్టఉందో లేదో చెప్పటం కష్టం.

తన దేహవై భవంవల్లకలిగిన ఒక అచంచలమైనధీమాతో నానా నగ్నంగా ఆవిష్కరించింది. ఒకసన్నని వుల్లిపొరలాంటి వస్త్రాన్నిమాత్రం చుట్టుకుంది. గుండ్రని భుజాలు, నిటారుగానిల్చున్నస్థనాలు, బాణాల్లా పొడుచుకుని వస్తున్న గులాబీ మొగ్గల్లాంటి చనుమొనలు, కామాన్ని ప్రకోపింపచేసే తొడలకదలికలూ, ఆమెశరీరం యావత్తూ వుల్లిపొరలాంటి వస్త్రంలోనుంచి స్వచ్ఛమైన నురుగులా కనుపిస్తోంది. తలకట్టుతప్ప మరే ఆచ్ఛాదనాలేకుండా సముద్రంనుంచి ఆవిర్భవిస్తున్న వీనస్ ఆమె! నానా చేతులు పైకెత్తినప్పుడు పుట్‌లైట్లు ఆమెబాహుమూలాలకు ప్రసరించి ఆమె బాహుమూలాల్లోని బంగారంలాంటి జుట్టును బహిర్గతంచేశాయి. ఇప్పుడు ప్రేక్షకుల్లో కరతాళధ్వనులులేవు. ఒక్కరుకూడా నవ్వడంలేదు. గంభీరముఖాలతో తదేకదీక్షతో చూస్తున్నారు. నాసాపుటాలు కుంచింపబడి పెదవులు ఎండి దాహతప్తమవుతున్నాయి. ఒక అవ్యక్తమైన వినాశకరశక్తితో బరువెక్కిన ఒకమందమైననిశ్వాసం అందరినీ ఆచ్ఛాదించినట్టుగా ఉంది. నవ్వుతూఉండే ఆపిల్లలోనుంచి ఒక నూతనస్త్రీ ఆవిర్భవించింది—తనను చూచినవారందరినీ భయస్థబ్ధులనుచేసినస్త్రీ, తన కామదోషాలన్నిటికీ పరాకాష్టనందుకున్న స్త్రీ! తనలో నిగూఢంగా దాగిఉన్న అఖండమైన వాంఛారహస్యాలను ప్రపంచానికంతా ప్రకటిస్తూ ఆ స్త్రీ ఉత్పన్నమైంది. నానా పెదవులపై మందహాసం ఇంకా అలానే ఉంది. కాని అనవ్వు పురుషులందరినీ కాల్చుకుతినే వినాశకర స్త్రీశక్తి హేళనగా నవ్విన నవ్వు.

'రాక్షసి' అన్నాడు ఫాష్‌రె లాఫలాసితో.

తరువాత ఒకరంగం జరిగింది. ప్రులెరీ చక్కగా నటించాడు. ఈ రంగం చివరలో ఒకసేవకుడు లూసీస్టివార్ట్‌కూచున్న బాక్స్‌వద్దకువచ్చి రెండు పూగుత్తులు స్టేజిలోకి విసిరాడు. స్టాల్స్‌లోకూచున్న కొందరు స్టీనర్, మినాన్‌కూచున్న బాక్స్‌లవంక నవ్వుతూచూచారు. తరువాత రంగంలో జరిగిన నటన ప్రేక్షకులను ఉద్రూతలూగించింది. వీనస్ పక్కపై కూచుని మార్స్‌ను తనప్రక్కకు పిలిచింది. ఇలాంటి శృంగారప్రదర్శన రంగస్థలంపై చూపడానికి ఇదివరకెవరూ సాహసించలేదు. నానా చేతులు ప్రులెరీ మెడకు చుట్టి నెమ్మదిగా తనదగ్గరకు లాక్కుంది. ఫాంటన్ కోపోద్దీపితుడై ఒక ఇనుపవలను చేతిలోపట్టుకుని గుహవెనక దాగివున్నాడు. ఆ వలను కాసేపు

చేతిలో ఆడించి వారిపైకి విసిరాడు. వీసస్, మార్స్ ఆ వలతో చిక్కుకున్నారు. ఆ భంగిమలోనే ఉన్నారు.

ఒక దీర్ఘమైన విశ్వాసంలాంటిరొద ఉత్పన్నమైనది. 'కళ్ళన్నీ' వీనస్ పైనే కేంద్రీకరింపబడ్డాయి. క్రమక్రమంగా నానా ప్రేక్షకులను పూర్తిగా వశపరచుకుంది. ప్రతిపురుషుడూ ఆమెకు పాదాక్రాంతుడై పోయాడు. ఆమె ప్రేరేపించిన కామాగ్ని క్రమక్రమంగా తీక్షణమై ప్రేక్షకులందరిని ఆవరించింది. ఇప్పుడు ఆమె చిన్నకదలికకూడా ఆ కామాగ్నిని వీవనలా విసురుతోంది. ఆమె చిటికెనవ్రేలెత్తితే చాలు - అందరూ గజగజలాడి పోతున్నారు. ప్రేక్షకులదేహాలన్నీ ఫిడల్‌తీగలై ఏదో అదృశ్యహస్తం వాటిని మీటుతున్నట్టుంది. ఏదో అదృశ్యమైన స్త్రీనిశ్వాసం ప్రేక్షకసమూహాన్నంతా దిగ్బంధంచేసినట్టుంది. ఆ నిశ్వాసం నిక్కించి ఉన్న ప్రేక్షకుల మెడలపై నృత్యంచేసింది. ఫాషెరె తనముందుసీట్లో ఆందోళనతో కంపించి పోతున్న కుర్రవాణ్ణి చూచాడు. కౌంట్ వాండెవ్రె తెల్లగా పాలిపోయి పెదవులు గట్టిగా బిగించుకుని చూస్తున్నాడు. స్టీనర్ ముఖం పగిలి బద్దలయ్యేలా ఉంది. లాబోర్డెటి - బలిసిన పందెపుగుర్రాన్నిన్ని జాకీచూస్తున్నట్టుగా — ఆశ్చర్యనిమగ్నుడై చూస్తున్నాడు. డొనెట్ చెవులు ఎర్రబారాయి. ఆనందాతిశయంతో కంపించిపోతున్నాడు. కౌంట్ముఫత్ నోరుపెద్దదిచేసుకుని స్తబ్ధుడైపోయిఉన్నాడు.

వేడి ఎక్కువై పోయింది. ఊపిరి సలపనివ్వడంలేదు. తలల్లో చెమటపట్టి జుట్టుకూడా బరువుగా తోస్తుంది. లైటుకాంతిలో చెలరేగిన దుమ్ముకూడా స్తంభీభూతమైనట్టు కనుపిస్తోంది. ప్రేక్షకసమూహంలో ఒక విధమైన అలసట, ఉద్రిక్తత కనిపిస్తున్నాయి. వారి అంతరాంతరాలలో ప్రకోపించిన అవ్యక్తమైన అర్ధరాత్రివాంఛంతో తూగుతూ ఊగిపోతున్నారు. అర్ధమూర్ఛావస్థలో ఉన్న ఈ గుంపుముందు నానా విజేతలా నిల్చుంది. అగాధమైన ఆవేశంలో మునిగిపోయిన ఈ పదిహేనువేలమంది ముందు నానా ఒక్కతే-చలువరాతిలాంటి తన నగ్నదేహంతో-వారందరిని జయించడానికి తనసౌందర్యం ఒక్కటీ చాలన్నట్టుగా, నిర్వికల్పంగా నిల్చుంది.

నాటకం త్వరత్వరగా ముగింపుకువస్తూంది. తన నగ్నదాక్షిణ్యంలోనవ్వుతూ

నిల్చున్న వీనస్‌కు అభినందనసంగీతం పాడుతూ ఉండగా తెరవాలింది.

ప్రేక్షకులు అప్పుడే లేచి దోవచేసుకుని వెడుతున్నారు. 'నానా'! 'నానా!' అనే పిలుపు ప్రతిధ్వనించసాగింది. ప్రేక్షకులు వెళ్ళిపోయారో లేదో హాలంతా చీకటైపోయింది. పుట్‌లైట్లు తీసివెయ్యబడ్డాయి. గాస్ లైట్లు దించేశారు. మృత్యువులాంటి ఒకనిశ్శబ్దం వ్యాపించింది. ఫాష్‌రె, లాఫలాసి త్వరగా బైటికివెళ్ళారు. అనేకమంది దోవకోసం కనిపెట్టుకుని ఉన్నారు. మెట్లపైనుంచి రెండువరుసలుగా జనం దిగుతున్నారు.

స్టీనర్, మినాన్ మొదటనే వెళ్ళిపోయారు. కౌంట్ డి వాండెవ్రె బ్లాంసీచెయ్యిపుచ్చుకొని తీసుకెళ్ళాడు. లాబోర్డెటీ బండినిపిలిచి గాగాను, ఆమెకుమార్తెనూ ఎక్కించిపంపాడు. డావెట్ వెళ్ళడం ఎవరూ గమనించ లేదు. బుగ్గలు ఎరుపెక్కిన కాలేజికుర్రాడు 'పాసేజ్ డి పెనోరమా' వైపుకు త్వరత్వరగా వెళ్ళాడు. పేవ్‌మెంట్‌మీద పచార్లుచేస్తున్న సాటిన్ అతని ప్రక్కగావచ్చి తన బట్టల అంచుతో కొద్దిగాతాకింది. కాని అతను ఆమెను తప్పించుకుని భగ్నహృదయుడై సజల నేత్రాలతో గుంపులోకలిసి వెళ్ళిపోయాడు. "వీనస్ సంధ్యావాహ్యాళివెళ్ళేటప్పుడు" అనే గీతాన్ని పాడుతూ కొందరు వెళ్ళిపోయారు. సాటిన్ తిరిగి కేఫ్‌డివెరైటికి వచ్చి కూచుంది. నాటకంచూచి ఉద్రిక్తుడై వచ్చిన ఒకలావుపాటివ్యక్తి థియేటర్ ప్రక్కకు చీకట్లోకి ఆమెను తీసుకుపోయాడు.

ఇంకా జనం వస్తూనే ఉన్నారు. క్లారిసీకోసం లాఫలాసి వేచి ఉన్నాడు. ఫాష్‌రె లూసీ స్టివార్ట్‌తో కలిసివస్తానని చెప్పాడు. వారందరూ పెద్దగా నవ్వుతూ వచ్చారు. అదేసమయంలో ఒక చిన్నతలుపు తెరుచుకుని బోర్డ్‌నెవ్ ప్రత్యక్షమైనాడు. చెమటతోతడిసి ముద్దయి నాటకవిజయంతో ఉద్విగ్నుడై ఉన్నాడు.

"మీ నాటకం రెండువందలరాత్రులైనా తప్పకుండా ఆడుతుంది. పారిస్‌నగరమంతా చూడడానికి వస్తుంది" అన్నాడు లాఫలాసి వినయంగా.

కాని బోర్డ్‌నెవ్ కోపంతో వణికిపోతూ - వరండాలో గుమిగూడిన జనాన్ని, ఎండిన పెదవులతో, ఎర్రనికనులతో ఇంకా నానాపై తీవ్ర వాంఛతో కంపిస్తున్నజనాన్ని చూపుతూ-తీవ్రంగా ఇలా అన్నాడు —

"నా భోగంకొంప అను. అనలేవూ! పశువా!"

# 2

మర్నాటి ఉదయం పదిగంటలైనా నానా ఇంకా నిద్రపోతూనే ఉంది. 'బోలివార్డ్ హస్‌మాన్' లోని ఒక పెద్దభవంతిలో రెండో అంతస్తులో నివసిస్తోంది ఆమె. పారిస్‌లో శీతాకాలంగడపడానికని మాస్కోనుంచి వచ్చిన ఒక ధనికవర్తకుడు రెండునెలల అద్దె ముందుగానేచెల్లించి ఆమె అక్కడ నివసించే ఏర్పాటుచేశాడు. గదులు చాలా విశాలమైనవి. వాటికి తగినంత సరంజామామాత్రం లేదు. బంగారుపూతపూసిన కొన్ని కుర్చీలు, సోఫాలు ఒకవైపూ, మరోప్రక్క పాతవిలా కనిపిస్తున్న టేబిళ్ళూ, దీపస్తంభాలు వున్నాయి. గదిలోవున్న ప్రతివస్తువూ హృదయపూర్వకంగా ప్రేమించిన మొదటిప్రేమికునిచే అనతికాలంలోనే త్యజింపబడి, అనేకమంది మోసగాళ్ళచేతుల్లోపడి చెదరిపోయిన ఆ సుందరి విషాదచరిత్రనే గుర్తుకుతెస్తున్నవి.

నానా బోర్లాపడుకుని నిద్రిస్తోంది. నగ్నంగా ఉన్న బాహువులతో తలగడను కరుచుకుని, దిండులోతలదూర్చి అలసిసొలసి నిద్రిస్తోంది. గదిలో వాతావరణం వెచ్చగా, మత్తుగా ఉంది. ఇలాంటివాతావరణంలో నానా హఠాత్తుగా ఉలికిపడి లేచింది—తన ప్రక్కస్థలం ఖాళీగా ఉండడం చూచి, ఆశ్చర్యపడ్డట్టు తన దిండుప్రక్కగావున్న దిండువంక చూసింది. ఆ దిండుపై దానిపై నిదురించిన శిరస్సుయొక్క వెచ్చనిముద్రలు ఇంకా అలాగే కనిపిస్తున్నట్టున్నాయి. ఆ దిండును చేత్తో నిమురుతూ తలవైపుగా వున్న ఎలెక్ట్రిక్ బెల్ నొక్కింది.

'అయితే వెళ్ళిపోయాడన్నమాట?' అంది తక్షణం ప్రత్యక్షమైన దాసీతో.

"అవునమ్మా. పాల్ పదినిమిషాలక్రితం వెళ్ళిపోయాడు. తమరు అలసివున్నారని తమర్ని లేపలేదు. రేపువస్తానని తమతో చెప్పమన్నారు" అన్నది.

ఇలా చెబుతూ 'జో' కిటికీతలుపులు తెరిచింది. ఉజ్వలంగావున్న ఉదయకాంతి గదినిండింది. 'జో' నల్లగా వుంటుంది. ముఖం పొడుగ్గా

కొనదేరివుంది. ముఖంనిండామచ్చలు; చట్టిముక్కు; లావుపాటి పెదవులు. కళ్లు ఊరికే అటూఇటూ తిప్పుతుంది.

"రేపు.........రేపు........." అంది నానా, ఇంకా పూర్తిగా మేలు కోకుండానే "అయితే అతనిరోజు రేపన్నమాట!" అన్నది.

"అవునమ్మా. పాల్ ఎప్పుడూ బుధవారాలు వస్తాడు" అన్నది దాసీది.

"అవును. జ్ఞాపకంవస్తోంది" అంటూ నానా లేచికూచుంది. "అన్నీ తారుమారైనాయి. అలా అని ఈవాళ ఉదయం అతనికి చెబుదామను కున్నాను" అంది నానా.

"తమరు ముందుగా చెప్పకపోతిరి. నాకెలా తెలుస్తుంది? ఈసారి అమ్మగారు రోజులు మార్పుచేసినప్పుడు నాకు తెలియజేస్తే బావుంటుంది. ఆ ముసలిపీనాసి ఇహ మంగళవారాల్లో రాడు" అంది జో.

ఈవిధంగా ఇరువురూ చిరునవ్వుకూడా నవ్వకుండా 'ముసలి పీనాసి వాడంటూ మాట్లాడుకున్నవ్యక్తి 'ఫాబర్గ్ సెంట్ డెనిస్'కు చెందిన ఒక వ్యాపారస్థుడు. డానెట్ తనకోసం ప్రొద్దుటిసమయాన్ని ఏర్పరుచు కున్నాడు. వ్యాపారస్థుడు తన దుకాణానికి 8 గంటలకు వెళ్ళాలి. అందు చేత డానెట్ అతను వెళ్ళిపోయేవరకూ 'జో' వంటగదిలో కాచుకుని ఉండి, అత నింతకుముందే ఖాళీచేసివెళ్ళిన వెచ్చనిగదిలోకి దుమికేవాడు. పదిగంటలవరకూ ఉండి, తనదారిన తను వెళ్ళిపోయేవాడు. ఈ ఏర్పాటు అనువుగాఉందని నానా అతనూ కలిసి అనుకున్నారు.

"ఫరవాలేదులే. ఇవాళమధ్యాహ్నం అతనికివ్రాస్తాను. ఒకవేళ అత నికి నా ఉత్తరం అందకపోతే రేపు అతనువచ్చినప్పుడు రానివ్వకు" అంది నానా.

'జో' నెమ్మదిగా గదిలో అటూఇటూ నడుస్తూ గతరాత్రి నానా సాధించిన ఉజ్వలవిజయాన్ని గూర్చి మాట్లాడింది - 'అమ్మగారు మహా గొప్పగా నటించింది! ఎంత చక్కగా పాడారు! ఇహ భవిష్యత్తుకు ఎలాంటి ఢోకా లేదు!'

నానా చేతులు దిండుపై ఆనించి, సమాధానంగా తలఊపింది, ఆమె

లోపలవేసుకునేగౌను భుజంమీదగా జారింది. చెదరినకేశభారం భుజంమీద వాలింది.

'అది సరేననుకో. కాని ఎలా వేచివుండడం? ఇవాళ అన్ని గందర గోళాలు ఉంటాయి. ఇవాళ ఇంటియజమాని ఎవరైనా పంపుతాడు' అన్నది నానా పరధ్యానంగా.

తరువాత ఇద్దరూ ఉపాయాలు ఆలోచించసాగారు. అద్దె బాకీ ఉన్నారు. ఇంటియజమాని బెదరిస్తున్నాడు. ఇంతేకాక ఇంకా ఎన్నో అప్పులున్నాయి. చాకలికి, టెయిలర్‌కు, బొగ్గువర్తకునికి-ఇంకా ఎందరికో ఇవ్వాలి. రోజూవచ్చి తిష్టవేస్తున్నారు. బొగ్గువర్తకుడు కేకలేసిపోయాడు కూడాను.

కాని, నానాను అన్నిటికంటె ఎక్కువగా బాధిస్తున్నది లూయీ విషయం. నానా పదహారోయేట లూయీని కన్నది. రమ్‌బొలెట్ దగ్గర ఒక గ్రామంలో పెంపకానికి వదిలిపెట్టింది. లూయీని మళ్ళీ తనకు విడిచిపెట్ట టానికి అదివరకు తనకివ్వవలసిన 300 ఫ్రాంకులు ఇచ్చెయ్యాలన్నది ఆ పిల్లను పెంచుతున్న నర్సు. ఇటీవల ఆ పిల్లను చూచివచ్చినప్పటినుంచీ నానా మాతృహృదయం ఆమెను ఒకటేవేధిస్తోంది. ఇప్పుడు ఆమెను ప్రధా నంగా బాధిస్తున్న సమస్య ఆ అప్పుతీర్చి పిల్ల నెలా తీసుకునిరావడమా అనేదే. ఆ పిల్లను తీసుకొచ్చి బాటిగ్నొలెలో తనపినతల్లి మేడమ్ లెరాట్ వద్ద తన కందుబాటులో వెళ్ళిచూడడానికి వీలుగాఉంచాలి. ఈ వేదనతో సతమతమైపోతోంది నానా. ఆ 'ముసలిపీనాసికి' ఈ బాధలు తెలియజేస్తే బావుండేదని సలహాఇచ్చింది దాసీది.

'అంతమాత్రం నాకు తెలియకపోలేదు. అతనికి అన్నిసంగతులూ చెప్పాను. కాని అతను ఎన్నో పెద్దబిల్లులు చెల్లించాలని చెప్పాడు. ప్రతి నెలా అతనిచ్చే 1000 ఫ్రాంకులుతప్ప మరి ఇవ్వడు. 'బ్లాక్‌మూర్' విష యం చూదామంటే అతనికింకా కొత్త. 'మిమ్మి'....పాపం! అతనికేడబ్బు కావాలి. నాకు పూలుతెచ్చేపరిస్థితిలోకూడా లేదు' అంది నానా.

ఆమె మాట్లాడుతున్నది డావెట్‌నుగురించి. పొద్దునలేవడంతో నానాకు కొంచెం ధైర్యంకలిగి 'జో'తో అంతా చెప్పింది. నానా ఇలా మాట్లాడడం, వినడం 'జో'కు అలవాటే. అందుకని సగౌరవంగా మౌనంగా

ఆమె చెప్పేదంతా విన్నది. అమ్మగారు తనవిషయాలన్నీ ఇలా చెప్పడం వల్ల తను సలహాలు ఇవ్వడానికికూడా చనువుతీసుకుంది. అమ్మగారంటే తనకెంతో ప్రేమ. అందుచేతనే మేడమ్ బ్లాంసీని వదిలి, అమ్మగారిదగ్గరికి వచ్చింది. మళ్ళీ ఎలాగైనా తనను తెప్పించుకోవాలని బ్లాంసీ ఎంతో యత్నిస్తోంది. తనను అందరూ యెరుగుదురు. తనకు పనిదొరకదనేబెంగ ఎంత మాత్రం లేదు. కాని అమ్మగారినిమాత్రం విడిచిపోదు. ఇప్పుడు పరిస్థితులు ఎలాఉన్నా అమ్మగారికి గొప్ప భవిష్యత్తు ఉంది. దాసీది ఈవిషయాలన్నీ చెప్పుకొచ్చింది. చివరకు ఒక చిన్నసలహాతో కథముగించింది. కుర్రతనంలో ఎన్నో తెలివితక్కువపనులు చేస్తాం. కాని ఇప్పుడుమాత్రం చాలా జాగ్రత్తగా ఉండాలి. మగవాళ్ళు తమసుఖం తాము చూచుకుంటారు. అమ్మగారు ఒక్కమాటంటే అప్పులవాళ్ళందరినీ నోళ్ళుమూయించి, అవసరమైన డబ్బు తేవడం అదెంతసేపు?' అంది దాసీది.

"ఎంతచెప్పినా నాకుమాత్రం 300 ఫ్రాంకులు రావు" అన్నది నానా జుట్టులోకివేళ్ళుపోనిస్తూ. "ఇవాళ తక్షణం నాకు డబ్బుకావాలి. 300 ఫ్రాంకులిచ్చేమనిషి ఎవరూ తెలియకపోవడం ఎంత అజ్ఞానం!" అన్నది.

డబ్బెలా తీసుకరావాలా అని ఆలోచించసాగింది. ఆనాడుఉదయాన మేడమ్ లారెట్ వస్తుందని ఆశించింది. వచ్చినట్లయితే తక్షణం రాంబొలెట్‌కు పంపించిఉండేది. ఆ ఉదయాన కలిగిన చిన్నకోరిక తీరకపోవడం గతరాత్రి విజయోత్సాహాన్ని పూర్తిగా ధ్వంసంచేసింది. తననటన చూచి హోలుయెగిరేట్టు కరతాళధ్వనులుచేసిన ఆ వేలాదిజనంలో తనకు 15 లూయీలు ఇవ్వగలవాడు ఒక్కడూ లేకపోవడం!—ఎంతహాస్యాస్పదం! అయినా తను అలా తీసుకునేదికాదు. ఎంతఘోరంగాఉంది తనపరిస్థితి! నానాకు తనపిల్ల జ్ఞాపకంవచ్చింది. దానికళ్లు దేవతకళ్ళలా మెరసిపోతుంటాయి. 'అ....మ్మా!' అనిమాత్రం అనగలదు. అంతే, అలా అంటూంటే నానా పగలబడి నవ్వుతుంది.

నానా ఇలా ఆలోచిస్తూండగా వెలుపల తలుపుదగ్గర ఎలెక్ట్రిక్ బెల్ మ్రోగింది. "జో" వెళ్లి తిరిగివచ్చి "ఎవరో స్త్రీ" అన్నది.

"జో" ఆ స్త్రీని ఇంతకుముందు ఇరవై సార్లయినా చూచిఉంటుంది. కాని తెలియనట్టు నటించింది. 'ఆమెపేరు మేడమ్ ట్రికన్'ట అన్నది.

'ఓ! 'ట్రికన్' మరిచిపోయాను సుమా. రమ్మను' అంది నానా.

'జో' ఒక పొడుగాటి వృద్ధస్త్రీని ప్రవేశపెట్టింది. ప్రవేశపెట్టి మెల్లగా పాముసడకనడుస్తూ అక్కడనుంచి వెళ్ళింది. మేడమ్ ట్రికన్ కూచోకుండానే "ఇవాళ ఒకరు వస్తానన్నారు. నీకు ఇష్టమేనా?" అంది.

'ఓ. ఏమాత్రం ఇస్తాడు?' అన్నది నానా.

"ఇరవై లూయీలు."

"అయితే ఎన్నిగంటల కొస్తాడు?"

"మూడింటికి. ఒప్పుకున్నట్టేనా?"

"ఓ! ఒప్పుకొన్నట్టే."

వెంటనే మేడమ్ ట్రికన్ శీతోష్ణస్థితినిగూర్చి మాట్లాడనారంభించింది. 'గాలి చాలా వెచ్చగాఉంది. షికారువెళ్ళడానికి బావుంది'అని తను ఇంకా నలుగురైదుగురిని వెళ్ళిచూడాలని వెళ్ళిపోయింది.

నానాకు ఒక బరువు తీరినట్టయింది. కొంచెం చలిజలదరింపువచ్చినట్టయి దుప్పటిలాక్కుంది. పిల్లిలా ముడుచుకుంది. నెమ్మదినెమ్మదిగా ఆమె కళ్ళుమూసుకున్నాయి. మరుసటిఉదయం చిన్ని లూయీకి నీళ్ళుపోసి, బట్టలు తొడగడం తలచుకుని తనలోతాను చిరునవ్వునవ్వుకుంది. క్రమక్రమంగా ఆవరించిననిద్రలో గతరాత్రిస్వప్నం-హాల్లో వేలాదిజనుల కరతాళధ్వనులు ఆమెకువినిపించి, ఆమెఅలసటను ఓదార్చాయి. పన్నెండుగంటలకు మేడమ్ లారెట్‌ను తీసుకుని 'జో' ప్రవేశించినప్పుడు నానా ఇంకా నిద్రపోతూనే ఉంది. చప్పుడువిని లేచి, 'నువ్వా? ఇవాళ రామ్‌బౌలెట్‌కు వెళ్ళాలి నువ్వు' అన్నది.

"అందుకే వచ్చాను. పన్నెండున్నరకు బండి ఉంది. దానికి వెళతాను' అన్నది,

'అలాకాదు. ఈ సాయంత్రానికే నాకు డబ్బువస్తుంది. ముందు కాస్త భోంచెయ్యి. తరువాత చూద్దాం.' అంది నానా ఒళ్ళువిరుచుకుని, సాఫీగాపడుకుంటూ. ఒళ్లువిరుస్తోంటే అందమైన ఆమెస్తనాలు పైకుబ్బి పొడుచుకొచ్చాయి.

డ్రెసింగ్‌గౌను తెస్తూ 'జో' 'అమ్మగారూ! హెయిర్ డ్రెస్సర్ వచ్చాడు' అని చెప్పింది.

'లోపలికి రా ఫ్రాన్సిస్' అంది నానా.

చక్కగా ముస్తాబైన ఒక పెద్దమనిషి తలుపుతీసుకుని లోనికివచ్చి నమస్కరించాడు. అప్పుడే నానా పక్కమీదనుంచి లేస్తోంది. కాళ్ళు పూర్తిగా నగ్నంగాఉన్నాయి. ఏమీ తొందరలేకుండా డ్రెస్సింగ్‌గౌను తొడిగించుకోడానికి చేతులుచాపింది. ఫ్రాన్సిస్ గంభీరంగా వేచుకొని ఉన్నాడు. నానా డ్రెస్‌చేసుకుని కూచున్నతరువాత ఆమెతలలో దువ్వెన దూర్చి 'అమ్మగారు ఇంకా పేపరు చూడలేదనుకుంటాను. 'ఫిగారో'లో చక్కనివ్యాసం ఉంది' అన్నాడు.

అతను ఆ పేపరు తీసుకొచ్చాడు. మేడమ్ లారెట్ ఆ పేపరు తీసుకుని వ్యాసాన్ని బిగ్గరగా చదివింది. అవ్యాసంవ్రాసినది ఫాషెరె. హాస్యధోరణిలో రెండుకాలాలు వ్రాశాడు.

'అద్భుతం' అన్నాడు ఫ్రాన్సిస్.

తనగొంతుకనుగురించి వ్రాసినదానికి నానా ఏమీ లెక్కచెయ్యలేదు. వ్యాసంచదివినతరువాత మగవాళ్ళను నిందిస్తూ మేడమ్ లారెట్ ఒక చిన్న వుపన్యాసం ఇచ్చింది.

ఈలోగా నానా తలకట్టు పూర్తయింది. ఫ్రాన్సిస్ వెళ్ళిపోయాడు.

మిగిలిన ఇద్దరు స్త్రీలూ ఇంకా ఒకర్నొకరు ముద్దాడలేదని గ్రహించారు. మర్యాదగా ఆలింగనంచేసుకుని ముద్దాడుకున్నారు. ఆ వ్యాసం వారిని కొంత ఉద్రిక్తులనుగావించింది. నానాకు మళ్ళీ తనవిజయం జ్ఞాపకంవచ్చి కొంచెం ఉద్రిక్తురాలైంది. రోజ్‌మినాన్ చక్కటి ఉదయాన్ని గడిపి ఉంటుంది. నానా పినతల్లి నానాను "కూతురా" అని ఆప్యాయంగా పిలుస్తూ మాట్లాడసాగింది. అసలుతల్లి పోయినతరువాత ఆమే రెండవతల్లి కదా! నానాకు కళ్ళనీళ్ళుతిరిగాయి. 'గతించినవిషయాలు గతించినవే. ఇహ వాటిని త్రవ్వుకుని లాభంలేదు' అన్నది నానా పినతల్లి. చాలారోజులుగా ఆమె నానానుకలుసుకోవడం మానేసింది—చెడుచోట్లకు వెడుతున్నావని తనబంధువర్గం నిందిస్తోందని. నానా జీవితరహస్యాలు తెలుసుకోవాలనే ఆసక్తి

ఆమెకులేదు. నానా గౌరవనీయమైనజీవితాన్నే గడుపుతున్నదని ఆమె దృఢ నమ్మకం.

ఇలా ఉపన్యసిస్తూ హఠాత్తుగా "అయితే నీ పిల్లితండ్రి ఎవరు?" అని అడిగింది.

నానా చకితురాలై ఒకక్షణం పస్తాయించి, "ఒక పెద్దమనిషి" అని మాత్రం అన్నది.

"ఎవరో తాపీపనివాడని — అతను నిన్ను కొడుతూవుండేవాడని నా కెవరో చెప్పారు. ఆవిషయం ఎప్పుడైనా చెప్పవచ్చుగా" అన్నది పినతల్లి.

ఇదివరకు ఆమె కాగితపుపూలవ్యాపారం చేసేది. సంవత్సరానికి ఆరువందల ఫ్రాంకులు కూడబెట్టింది. నానా ఆమెకోసం కొన్నిగదులు అద్దెకుతీసుకుంటానని నెలకు ఓ వందఫ్రాంకులు ఇస్తానని చెప్పింది నానా ఇలా అనేసరికి పినతల్లి పరవశురాలైంది. మళ్ళీ ఒకర్నొకరు ఆలింగనం చేసుకున్నారు. ఈ ఆనందపరవశత్వంలో లూయీ ప్రసక్తివచ్చి, ఏదో జ్ఞాపకానికిరాగా, నానా కొంచెం ఖిన్నురాలైంది

"అబ్బ! ఏంగొడవ! మళ్ళీ మూడింటికి బైటికివెళ్ళాలి" అని గొణుక్కుంది నానా.

ఇంతలో 'జో' లోనికివచ్చి 'భోజనం సిద్ధంగావున్న'దని చెప్పింది. వాళ్ళు భోజనశాలలోకి వెళ్ళారు. అప్పుడే ఎవరో ఒక స్త్రీ అక్కడ కూచునివుంది. ఆమెనుచూచి నానా ఆశ్చర్యపడలేదు. 'ఇంకా పడకగదిలోకి వెళ్ళలేదేం?' అనిమాత్రం అడిగింది.

'ఏవో మాటలు వినబడ్డాయి. నువు పనిమీదవున్నా వనుకున్నాను' అన్నది ఆ ముసలి స్త్రీ.

మేడమ్ మాలియర్ నానాకు పాతసఖి. నానాను ఆనందపరుస్తూ, నానా ఎక్కడికిపెడితే అక్కడికివెళ్ళేది. మేడమ్ లెరాట్‌నుచూచి కొంచెం బాధపడింది. కాని ఆమెపినతల్లిఅని తెలిసినతరువాత ఆమెవంకిచూచి చిరునవ్వునవ్వింది. అందరూ భోజనంముందు కూచున్నారు. అప్పుడప్పుడూ నానా తన పూర్వసఖి శిరోభూషణాన్ని చూస్తోంది.

"నేనిచ్చినదేనా అది?" అన్నది.

"అవును. నాకుసరిపోయేలా మార్పించుకున్నాను" అన్నది మేడమ్ మాలియర్.

అది ఒక పెద్దఈకతో భీకరంగా కనుపిస్తోంది. తనశిరోవేష్టాలన్నిటినీ మార్పించుకోవడం ఆమెకు అలవాటు. ఎంతచక్కనివస్తువునైనా ఒక్క నిమిషంలో పాడుచేస్తుంది. ఆమెతో బైటికివెళ్ళినప్పుడల్లా అసహ్యకరంగా ఉండకుండా ఉండడంకోసం ఆ శిరోవేష్టాన్ని నానా కొనిచ్చింది.

"అది తీసేస్తే బావుండును" అన్నది నానా బిగ్గరగా.

"ఫరవాలేదు. దాన్నిఉంచుకునికూడా భోంచెయ్యగలను" అన్నదామె.

తరువాత దాసీ కోడిమాంసం, కాలీఫ్లవర్ తీసుకొచ్చింది. నానా ప్రతిదీ వాసనచూచి వదిలేసింది. చివరకు 'జాం'తో భోజనం ముగించింది. ఇంక గతరాత్రి నాటకవిజయాన్నిగూర్చి మాట్లాడుకోనారంభించారు. నానా కుర్చీలోవాలి సిగరెట్ కాలుస్తోంది. 'జో' తన జీవితకథ చెప్పసాగింది. తను మంత్రసాని కూతు ర్నన్నది. తనతల్లికి ఏవోకష్టాలువచ్చాయి. తాను మొదట ఒక డెంటిస్ట్దగ్గర, ఒక ఇన్సూరెన్సు ఏజెంటువద్ద పనిచేసింది. ఆమె కా పని రుచించలేదు. తరువాత తను సేవచేసిన గొప్ప గొప్ప స్త్రీల పేర్లు వరసపెట్టిచెప్పింది. తనకు వారందరూ ఎంతో ఋణపడిఉన్నట్లు చెప్పింది. తనేగనుక లేకపోయినట్లయితే వారు ఎన్నోసార్లు ఎన్నో ప్రమాదాలకు లోనై ఉండేవారు. ఒక చిన్న ఉదాహరణకూడా చెప్పింది. ఒక రోజున మేడం బ్లాంసీ ఆక్టేవ్తోఉండగా ముసలివాడు హఠాత్తుగావచ్చాడు. అప్పుడు 'జో' ఓ చిన్నగమ్మత్తుచేసింది. అతను రావడంచూచి పడిపోతున్నట్టు నటించింది. వృద్ధు డామెను లేవదీసి, ఒక గ్లాసుమంచినీళ్ళు తీసుకురావడానికి వంటింట్లోకి వెళ్ళాడు. ఆక్టేవ్ ఈలోగా వెళ్ళిపోయాడు.

"అద్భుతంగాఉంది" అన్నది నానా ఇదంతా ఆశ్చర్యంగా విని.

"నామట్టుకు నేను కష్టాలనుభవించాను" అని మొదలెట్టింది. మేడం లెరాట్ తన కుర్చీని మేడం మాలియర్ కుర్చీదగ్గరకు లాక్కుని, తన జీవితంలోని ఎన్నోరహస్యవిషయాలు చెప్పింది.

మేడం మాలియర్ తనవిషయం పల్లెత్తైనా చెప్పకుండా ఇతరుల విషయాలుమాత్రం చక్కగా వింటుంది. ఎక్కడనుంచి వస్తుందో ఎవరికీ తెలీని ఒక పెన్షన్పై ఆమె జీవిస్తూవుంటుందనీ, తను నివసించేగదిలోకి

ఎవరినీ రానివ్వదనీ అంటారు.

హఠాత్తుగా నానా ఎందుకో మండిపడింది. 'కత్తులతో ఆడకు, నాకు అసహ్యం' అన్నది పినతల్లితో.

మేడమ్ లెరాట్ తనకు తెలీకుండానే రెండుకత్తులను అడ్డంగా ఉంచింది. నానాకు మూఢవిశ్వాసాలు లేవు. కాని, ఇదిమాత్రం ఎందుకో ఆమెను తల్లక్రిందులుచేస్తుంది. ఏదైనా జరగరానిది జరుగుతుంది.

"అప్పుడే రెండుగంటలైంది. నేను వెళ్ళాలి. పాడుగొడవ!" అంది నానా. నానా మళ్ళీ కుర్చీలోవాలి సిగరెట్ కాల్చనారంభించింది. ఇతరులు పెదవులు బిగించుకొని తాత్వికంగా చూస్తూ కూచున్నారు.

"నీవు వెళ్ళినతరువాత పేకాటవేసుకుంటాం" అన్నది మేడం మాలియర్. ఆట మొదలుపెట్టబోయేముందు తనకు ఓ చిన్న ఉత్తరం రాసిపెట్టమంది నానా. నానాకు ఉత్తరాలు వ్రాయడమంటే విసుగు. పైగా స్పెల్లింగ్ తప్పులుకూడా వుండొచ్చు. తన వృద్ధసఖురాలైతే చక్కగా వ్రాస్తుంది. పడకగదిలోకివెళ్ళి, ఒక చక్కనికాగితాన్ని తీసుకొనివచ్చింది. ఉత్తరం డానెట్‌కు. మేడం మాలియర్ ఉత్తరం వ్రాయసాగింది—'నా చిన్న ప్రియుడా' అని. రేపు రావద్దనీ, కానీ అనుక్షణం అతన్నే తలుచుకుంటూ ఉంటాననీ, వేలముద్దులతో ఉత్తరం ముగింపుచేసింది.

ప్రతిమాటకూ తన అంగీకారాన్ని చూపుతూ మేడం లెరాట్ తల ఊపింది. ఆమెకళ్ళు తళతళలాడాయి. ప్రేమకలాపాల్లో తనుకూడా ఇరుక్కునే స్వభావం ఆమెది. తనుకూడా ఒకమాట కలిపింది. 'నీ అందమైన కళ్ళపై వేలముద్దులు' అంది సన్నని గొంతుకతో మృదువుగా.

'జో' ను పిలిచారు. 'జో' థియేటర్‌నుంచి వచ్చిన ఒక వ్యక్తితో మాట్లాడుతోంది. అతను నానాకోసం స్టేజ్ మానేజర్‌వద్దనుంచి ఒకసందేశాన్ని తీసుకొచ్చాడు. నానా అతన్ని పిలిచి మాట్లాడి, వెళ్ళేటప్పుడు డానెట్‌కు ఆ ఉత్తర మివ్వమని ఇచ్చింది. నానా ఇంకా కదల్లేదు. అలాగే పడుకుని, గడ్డంక్రింద చేతులుంచుకుని వాళ్ళు ఆడుతున్న పేకాట చూస్తోంది. మూడుగంటలు కొట్టడం విని ఉలికిపడిలేచి 'అబ్బ!' అన్నది.

పదినిమిషాల్లో 'జో' సహాయంతో ముస్తాబైంది. ముస్తాబు యెలా వున్నా, అంతపట్టించుకోలేదు. సరిగా వెడుతూండగా మరోమాటు గంట

ప్రోగడం వినిపించింది. బొగ్గువర్తకుడు అప్పుకోసం వచ్చాడు. అతని గొడవతప్పించుకోడానికి వంటింట్లోనుంచి వెళ్ళింది. అలావెళ్ళడం తరచుగా జరుగుతూండేది.

'స్త్రీ మంచితల్లి అయితే యితరవిషయాల్లో యెలావున్నా పరవా లేదు' అన్నది మేడం మాలియర్.

వారు భోజనంచేసిన టేబిల్ యింకా అలానేవుంది. పరిశుభ్రం చెయ్యలేదు. భోజనపదార్థాలవాసన, సిగరెట్లవాసనతోకలిసి — అదో విచిత్రమైన వాసన గదిఅంతా ఆవరించింది. వాళ్ళుమాత్రం పేకాట ఇంకా ముగించలేదు. కాఫీతాగుతూ, చాక్లెట్లు తింటూ ఆడుతూనే వున్నారు. 'జో' వారిఆటమాన్పిద్దామని యెంతో యత్నించింది. కాని వారు బాగా నిమగ్నులై ఉన్నారు. 'జో' తిరిగివచ్చేసరికి వారింకా ఆడుతూనేఉన్నారు. కొంచెమాగి మేడం మాలియర్ 'ఎవ రా వచ్చింది?' అని అడిగింది.

'ఎవరో కుర్రాడులేండి. వచ్చినదోవనే పంపించేదాన్ని. కాని చూడ ముచ్చటగా ఉన్నాడు. ఆడపిల్లల్లె నాజూగ్గా ఉన్నాడు. చేత్తో ఓ పెద్ద పూగుత్తి పట్టుకొచ్చాడు. ఎవరో స్టూడెంట్‌లా ఉన్నాడు' అన్నది దాసీది ఒకవిధమైన నిర్లక్ష్యంతో.

'అయితే అతన్ని ఎక్కడుంచావ్?' మేడం మాలియర్ అడిగింది.

బైట ఖాళీగదిలో ఉంచాను. ఆ గదిలో అమ్మగారిటేబిల్, పెట్టె తప్ప మరేమీ సామాన్లు లేవు. ఇలాంటి కుర్రాళ్ళను ఎప్పుడూ అలాంటి చోట్లనే ఉంచుతూంటాను' అంది దాసీది.

మళ్ళీ గంట వినిపించింది. వాళ్ళు ఉలిక్కిపడ్డారు. జో 'అబ్బ నన్ను బ్రతకనివ్వేటట్టులేరు' అని విసుక్కుంటూ వెళ్ళివచ్చింది. తిరిగివచ్చి మేడం మాలియర్ ప్రశ్నార్థకంగా చూస్తోంటే 'ఏమీలేదు, పూలగుత్తి' అన్నది.

ముగ్గురూకలిసి కాఫీతాగారు. మళ్ళీ గంటవినిపించింది. కాని ఫలితం మాత్రం లేదు. రెండుసార్లు వెళ్ళివచ్చి 'ఏమీలేదు, పూలగుత్తి' అని తన పాతపాటనే వల్లెవేసింది.

అందరూ నవ్వుకున్నారు. అమ్మగారి టేబిల్‌ను ఈ పూగుత్తులు అలంకరిస్తాయి. ఇవి యింత ఖరీదుకావడం, వీటివల్ల పదిఅణాలైనా అప్పు

పుట్టించలేకపోవడం-విచిత్రం: ప్రపంచంలో ఎంతడబ్బు యిలా వృధా చెయ్యబడుతోంది!

"నామట్టుకునేను — పారిస్‌లో పురుషులు స్త్రీలకోసం ప్రతినిత్యం కొనే పూలఖరీదంత ధనం రోజూ నాకు ఉంటే, సుఖంగా కాలక్షేపం చేస్తాను" అన్నది మేడమ్ మాలియర్.

నాలుగు గంటలకు ఇంకా పదినిమిషాలుంది.

అమ్మగారు బైటికివెళ్ళి ఇంకా రాకపోవడంచూస్తే 'జో' కు ఆశ్చ ర్యంకలిగింది. సాధారణంగా అమ్మగారు మధ్యాహ్నంవేళ బైటికివెళ్ళడం తటస్థిస్తే నిమిషాల్లో పనిముగించుకుని వస్తుంది.'కాని మనం అనుకున్నట్టుగా అన్నీజరగవు' అన్నది మేడం మాలియర్.'జీవితమంటే' ఎన్నో అవరోధాలు వస్తుంటాయి. వేచివుండడమే ఉత్తమమార్గం'అన్నది. నానా ఆలస్యంచేసిం దంటే అక్కడ ఉండవలసిన అగత్యం ఉండివుంటుంది. మళ్ళీగంట మ్రోగింది. 'జో' బైటికివెళ్ళి వికసితవదనంతో తిరిగివచ్చింది.

"స్టీనర్ వచ్చాడు అమ్మగార్లూ! బైటవుంచాను" అన్నది.

మళ్ళీ గంటమ్రోగింది. పోయివచ్చి జో, "బ్లాక్ మూర్ వచ్చాడు. ఛీ! సాయంత్రంవరకూ వస్తాడనుకోలేదు" అన్నది.

నాలుగున్నరైనా నానా ఇంకా రాలేదు. ఇంత ఆలస్యమైందేం చెప్మా! ఏం చేస్తూంటుంది? 5 గంటలు కావస్తోంది. వారికి ఆవేగం హెచ్చ యింది. 'ఏదో జరిగివుంటుంది' అనుకున్నారు.

ఆ నిశ్శబ్దంలోనుంచి ఎవరో త్వరగావస్తూన్న అడుగులచప్పుడు వినిపించింది. నానా వచ్చేసింది.

నానా తలుపుతెరవకముందే ఆమె రొప్పు వినిపించింది. ఎర్రగా కందిపోయి అదోలావచ్చింది. బట్టలుమాసి, నలిగి, మురికిగా ఉన్నాయి.

"వచ్చావుటే! అమ్మయ్య!" అన్నది మేడం లెరాట్.

"అమ్మగారు నిజంగా వట్టి వెర్రిబాగుల్ది" అంది జో.

అసలే ఉద్రిక్తంగావున్న నానా ఈ సూటిపోటీమాటలకు మరీ మండిపడ్డది.

ఆమె అనుభవించిన దుఃఖానికి ఇదేనా ఆమెను ఆహ్వానించవలసిన పద్ధతి?

'మీ విషయం మీరుచూసుకోండి చాలు" అన్నది విసురుగా. ఆమె కంఠం గద్గదికమయింది—నే నేం చేస్తున్నాననుకున్నారు. జల్సాచేస్తున్నా ననుకున్నారా? నేను అనుభవించింది మీరు అనుభవిస్తే తెలిసివచ్చేది. ఒళ్ళంతా అగ్గిలావుంది. చేతులు చేతులు కలిసేవరకు వచ్చింది. దగ్గర్లో బండికూడాలేదు. కాలికొద్దీ పరుగెత్తుకొచ్చాను" అన్నది.

"డబ్బువచ్చిందా?" అని అడిగింది పినతల్లి.

"ఏం ప్రశ్న?" అన్నది నానా.

నానా కుర్చీలో కుప్పకూలింది. డ్రెస్‌లోంచి ఒక కవరుతీసింది. కవరులో నాలుగు బాంకునోట్లున్నాయి.

ఆమె చేతుల్లో మాసి చినిగిపోయివున్న ఆ కవరువైపు ముగ్గురు స్త్రీలూ నిశ్చలంగా చూచారు.

"అమ్మగారూ, తమకోసం కొందరు కాచుకుని వున్నారు" అన్నది దాసీది,

నానా మళ్ళీ మండిపడది. 'ఉంచేవుండనీ. నా విషయం ముగిసినతరువాత చూడవచ్చు' అన్నది. డబ్బుతీసుకోడానికి పినతల్లి చెయ్యిచాచగానే ఆపి 'కొంచెమాగు. ఇందులో నర్సుకోసం మూడువందలఫ్రాంకులు; నీ ప్రయాణఖర్చులకు 50 ఫ్రాంకులు; మిగిలిన 50 ఫ్రాంకులు నేను వుంచుకుంటాను' అన్నది నానా.

చిల్లరదొరకడం పెద్ద సమస్యఅయింది. మేడం మాలియర్‌ను అడగలేదు. ఆమె అనాసక్తంగా ఇదంతా వింటూ కూచుంది. ఆమెదగ్గర తిరుగు బస్సుచార్జీలుతప్ప మరి డబ్బులుండవు. చివరకు 'జో' తన పెట్టెలో వెదకి, చిల్లర పట్టుకొచ్చింది, చిల్లర లెఖ్ఖపెట్టుకున్నారు. మరునాటి ఉదయానికి లూయీని తీసుకువస్తానని చెప్పి మేడం లెరాట్ వెళ్ళిపోయింది.

"ఎవరో కాచుకుని వున్నారన్నావుకదూ!" అని అడిగింది నానా.

"అవునమ్మా, ముగ్గురున్నారు" అన్నది దాసీది.

మొదట బ్యాంకర్ సంగతి చెప్పింది. నానా పెదవికరుచుకుంది. "నిన్నసాయంకాలం ఒకపూగుత్తి ఇచ్చినంతమాత్రాన అతని నొల్లువాగుడంతా వింటూకూచుంటాననుకున్నాడా ఏమిటి? అయినా ఇవాల్టికి ఇహ చాలు. ఇంకెవరినీచూడలేను. వెళ్ళి వాళ్ళను వెళ్ళమనిచెప్పు" అన్నది నానా.

"అమ్మగారు కొంచె మాలోచించాలి. స్టీనర్‌తో మాటాడితే ...."
అన్నది 'జో' గొణుగుతూ. కాని నానా మరీ మండిపడి మొండికేసింది.

"అందరినీ మెడపట్టిగెంటెయ్యి. వీళ్ళకు మరీ బుద్ధిలేదు. తలనొప్పి కడుతోంది. మేడం మాలియర్‌తో ఒక పేకాట ఆడుకుంటాను" అని విసుక్కుంది నానా.

మళ్ళీ గంట మ్రోగింది. అబ్బ! వీళ్ళకు అంతున్నట్టులేదు. నానా 'జో' ను తలుపుతెరవొద్దన్నది. కాని ఆ మెమాటవినకుండానే దాసీది బైటికి వెళ్ళింది. తిరిగివచ్చి అమ్మగారికి రెండుకార్డులు అందిస్తూ 'అమ్మగారు చూస్తామన్నదని చెప్పాను. వాళ్ళు డ్రాయింగ్‌రూంలో వున్నారు' అన్నది.

నానా భగ్గునమండిపోతూ లేచింది. కాని కార్డులపైనున్న మార్క్విస్ డి ఛౌర్డ్; కౌంట్ ముఫత్ డి బువిలీల పేర్లు ఆమెను చల్లబరిచాయి. ఒక క్షణం స్తబ్ధంగా కూచుంది.

కొంచెంవంగి, 'ఎవరు వీళ్ళు? నీకేమైనా తెలుసా?' అని అడిగింది.

"ముసలాయన్ను మాత్రం యెరుగుదును; ఒకచోటచూచాను" అన్నది 'జో' చిలిపిగా.

ఈమాటతో నానా ఒకనిశ్చయానికివచ్చినట్టయింది. వెంటనే లేచి డ్రెసింగ్‌రూములోకి వెళ్ళిపోయింది. మేడం మాలియర్ ఒంటరిగాకూచుని పేకముక్కలుకోసి, తనభవిష్యత్తు తానే చెప్పుకుంటోంది. నానా డ్రెసింగ్ రూంలో 'జో' సహాయంతో త్వరత్వరగా బట్టలుమార్చుకుంది. తనుభరించ వలసివచ్చిన దుర్భరకష్టాలకు పురుషులను అనరానిమాటలని, ప్రతికృతి తీర్చుకుంది!

ఈ మాటలు దాసీ నెంతో కలవరపెట్టాయి. సాహసించి కాస్త నెమ్మదించ'మన్నది.

"ఇహ నువ్వూరుకో. పురుషులంటే పందులు! అలావుండడమే వాళ్ళకు ఇష్టం" అన్నది నానా కసురుతూ.

చివరకెలాగో ముఖంలోకి రాజకుమార్తెకళ తెచ్చిపెట్టుకుని, డ్రాయింగ్ రూమువేపు వెళ్ళింది. కాని ఇంతలో 'జో' ఆమెను ఆపి, వారినే డ్రెసింగ్ రూములో ప్రవేశపెట్టింది.

"మహాశయులారా! మీరు వేచిఉండాల్సివచ్చింది. క్షమించాలి" అన్నది నానా అతిమర్యాదగా.

ఇద్దరూ ఆసీనులైనారు.

ఒకతెర గదిలోకివచ్చేవెల్తురును మాపుగారానిస్తోంది. గదిమహాఅద్భుతంగా అలంకరింపబడివుంది. చక్కని చలువరాతి డ్రెసింగ్ టేబిలు, పడక కుర్చీలు వున్నాయి. డ్రెసింగ్ టేబిల్ పై ఎన్నోరకాలపూగుత్తులు అమర్చబడి గదినంతా వాసనలో ముంచెత్తుతున్నాయి. వదులుగావున్న డ్రెసింగ్ గౌనుతొడుక్కుంటూ నానా తనసౌందర్యానికి, తన అలంకారానికి తనే చకితురాలైనట్టు కనుపించింది.

కౌంట్ ముఫత్ గంభీరంగా 'అమ్మా! హఠాత్తుగా ఇలావచ్చినందుకు క్షమించాలి. ఒక చందా విషయంలో మీవద్దకు వచ్చాము. ఈయనా, నేను ఈ జిల్లా దారిద్ర్యనివారణసంఘంలో సభ్యులం' అన్నాడు.

మార్కిస్ డి ఛౌర్డ్ అందుకుని, 'ఈ గృహంలో ఒక గొప్ప అభినేత్రి నివసిస్తోందనితెలిసి, మా దారిద్ర్యసమస్యను నివేదిద్దామని వచ్చాము. ప్రతిభా, ఉదారహృదయం ఎప్పుడూ వేరుగా వుండవు,' అన్నాడు.

నానా ఎంతో వినమ్రతను అభినయించింది. స్వల్పంగా శిరశ్చాలనం చేస్తూ వారిప్రశంసావాక్యాలను స్వీకరించింది. 'ఈ రెండోవ్యక్తిని ఈ వృద్ధుడే తీసుకొచ్చివుంటాడు. అతని కళ్ళు క్రూరంగా కనుపిస్తున్నాయి. అనుకున్నది.

"మంచిది. మీరురావడం నా కెంతో సంతోషం" అన్నది చిరునవ్వుతో. మళ్ళీ గంటమ్రోగేసరికి వులికిపడింది. అబ్బ! మళ్ళీ ఎవరో వచ్చినట్టున్నారు. 'జో' వీరందరినీ ప్రవేశపెడుతుంది కాబోలు! అనుకుంది. 'ఏదైనా ఇవ్వడానికి నే నెంతైనా సంతోషిస్తాను' అన్నది నానా. నిజంగా వారి ప్రశంసకు నానా వుబ్బిపోయింది.

మళ్ళీ మార్కిస్ 'అవునమ్మా, దారిద్ర్యం ఎంతఘోరంగాఉందో మీకు తెలిస్తే - మనజిల్లాలో మూడువేలకుపైగా పేదవారున్నారు. మన జిల్లా బాగా డబ్బుగలజిల్లాట! కాని ఎంత ఘోరంగా ఉన్నదనుకున్నారు పేదరికం! పసిపిల్లలు అన్నంలేక మాడిపోతున్నారు. స్త్రీలు రోగాలతో చనిపోతున్నారు. అబ్బ!' అంటూ మొదలెట్టాడు.

"పాపం" అన్నది నానా రుద్ధకంఠంతో ఎంతో స్పందించి.

అందమైన నానాకళ్ళల్లో సుళ్లుతిరిగాయి. ఎంతో చలించిపోయింది. ఒక ఉద్రిక్తక్షణంలో నానా కొంచెం ముందుకు వంగింది. మెడ నగ్నంగా బైటపడింది. మోకాళ్ళు వంచివుండడంవల్ల లోపలవున్న ఆకృతి సుంద్రదనాన్ని సూచించాయి. మార్కిస్ కపోలాలు కొంచెం ఎర్రబారాయి. మాట్లాడడానికి వుపక్రమించబోతున్న కౌంట్ ముఫత్ కళ్ళు కిందికిదించుకున్నాడు. గదిలో వెచ్చగావుంది. గులాబీలు వాడిపోతున్నాయి. పూల వాసన మత్తెక్కిస్తోంది.

"ఇలాంటి సందర్భాల్లో ఎంతధనికులమైతే అంత మంచిదనిపిస్తుంది. కాని ఎవరికితోచినంత వారు సహాయంచేస్తారు, నమ్మండి. నాకు తెలిసివున్నట్లయితే........" అన్నది నానా.

ఉద్రేకంలో ఏదో అవ్యక్తంగా అనబోయి మళ్ళీ సంబాళించుకుంది. ఒక్కక్షణం—డ్రెస్ విడిచినప్పుడు 50 ఫ్రాంకులు ఎక్కడపెట్టిందో జ్ఞాపకంరాక అస్థిమితంగా కల్లోలపడింది. కాస్త ఆగి జ్ఞాపకం తెచ్చుకుని, లోపలికి వెళ్ళడానికి లేచింది. మళ్ళీ గంటమ్రోగింది. ఈగంటమ్రోగడానికి అంతున్నట్టులేదు. కౌంట్, మార్కిస్‌కూడా లేచి గంటమ్రోగేవంక చూచారు. మాటిమాటికి గంటమ్రోగడంలో అర్థమేమిటో మార్కిస్‌కు తెలియకపోలేదు. ముఫత్ అతనివంక చూచాడు. ఇరువురిచూపులు క్రిందికి వాలి, భూమ్మీదపడ్డాయి. మళ్ళీ వెంటనే సంబాళించుకున్నాడు.

నవ్వుముఖంతో పది పెద్దనాణాలు తీసుకొచ్చి నానా, "మీకు భారం కలిగిస్తానని భయంగావుంది....ఇది పేదలకోసమని స్మృతిలో వుంచుకోండి'' అన్నది.

నానా గడ్డంలో ఓ చిన్నగుంట ఏర్పడింది. ఎవరు తీసుకుంటారో తీసుకోండి అన్నట్టుగా చేయిచాచి నిల్చుంది. కౌంట్ తీసుకున్నాడు. ఒక నాణెంమాత్రం ఆమెచేతిలో మిగిలింది. ఆ నాణెం తీసుకోడంకోసం అతనిచెయ్యి ఆమెచేతిని తాకవలసివచ్చింది. ఆ చక్కని వెచ్చనిచెయ్యి తగిలినప్పుడు అతనినరాల్లో విద్యుత్ ప్రవహించినట్లయింది. నానా నవ్వు మాత్రం ఆపలేదు.

'ఈమారు మరికొంత ఇవ్వడానికి ఆశిస్తాను' అన్నది.

ఇంక అక్కడవుండడానికి వారి కేమీ సాకుచిక్కలేదు. అందుకని సెలవుతీసుకున్నారు. వారు వెడుతూండగా మరోసారి గంట మ్రోగింది. మార్కిస్ చిరునవ్వు ఆపుకోలేకపోయాడు. కౌంట్ గంభీరవదనంపై ఒక నీడ ప్రాకాడింది.

నానా వారిని రెండునిమిషాలు ఆపి, తరువాత 'మంచిది, వెళ్ళిరండి' అన్నది.

తననవ్వుతో, స్వచ్ఛమైనచూపుతో వారిని ముంచేసింది. కౌంట్ అతి వినమ్రుడై నమస్కరించాడు. తన కెంతలోకానుభవమున్నా....ఆ స్త్రీ పరిమళంలో—ఆ పూలవాసనల్లో ఆయనకు ఇంచుమించుగా ఊపిరాడనట్టయింది. మార్కిస్ నానావంక చూడకుండా ఉండలేకపోయాడు. వారిని సాగనంపి డ్రెసింగ్‌రూమ్‌కివచ్చి నానా పెద్దగా నవ్వుతూ, 'అరుగో, జలగలు పోతున్నారు. నా 50 ఫ్రాంకులు ఊడబెరికారు' అన్నది.

కాని, ఆమెకెంతమాత్రం బాధకలుగలేదు. పురుషులు తనను ధనాన్ని అర్థించడం ఆమెకోవిధమైన ఆనందాన్ని కలిగించింది. వారు వట్టిపందులు. తనదగ్గర చిల్లిగవ్వయినా లేకుండాచేశారు. కార్డులు, ఉత్తరాలను చూసే సరికి నానాకు మళ్ళీ కంపమెత్తింది. ఉత్తరాలు పరవాలేదు. అవి తన నటనను ప్రశంసిస్తూ పెద్దమనుషులు వ్రాసినవై వుంటాయి. చూడడానికి వచ్చేవారంటే మరీ అసహ్యంవేస్తుంది.

'వాళ్ళందరినీ పంపెయ్, ముందు ఆ బ్లాక్ మూర్‌గాడిని పంపెయ్' అన్నది నానా.

'అతన్ని పంపేసి చాలాసేపైంది అమ్మగారూ' అన్నది జో చిరునవ్వుతో—'ఇవాళరాత్రికి రానని చెప్పాడు'.

ఈమాట వినేసరికి నానా పరవశురాలైపోయింది. అతను రావడం లేదన్నమాట. ఎంత అదృష్టం! తనకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు వచ్చినట్టు! ఒక పెద్దశిక్ష అనుభవించబోతూండగా క్షమించబడినట్టు — నిట్టూర్చింది. తరువాత డానెట్ విషయం జ్ఞప్తికివచ్చింది. అతను గురువారంకానిరాడు. నానా చాలా అలిసిపోయి ఉంది.

'థియేటర్‌నుంచిరాగానే నిద్రపోతాను' అన్నది ఒకవిధమైన ఆన

క్తితో. 'నన్ను పన్నెండుగంటలవరకు లేపవద్దు అందరినీ బైటికిపంపెయ్' అన్నది.

'స్పీసర్‌నుకూడానా?' అన్నది జో ముక్తసరిగా.

'అందర్నీను. ముందు అతన్నే పంపు.'

దాసీ ఇంకా వేచివుంది, అమ్మగారు మళ్ళీ ఆలోచిస్తుందేమోనని. అతనిద్వారా అమ్మగారు రోజ్‌మినాన్‌ను మించిపోవాలని దాని ఆశ.

ఈ విషయాన్ని అర్థంచేసుకున్న నానా, 'ఇటుచూడు, నన్ను వేధించుకుతింటున్నాడని అతనితోచెప్పు' అన్నది, కాని, వెంటనే మనస్సు మార్చుకుంది. మరునాడు అతనితో అవసరంరావచ్చు. కన్నుగీటుతూ నవ్వుతూ, 'అతన్నిపట్టాలంటే అతన్నే ముందు పంపెయ్' అన్నది.

ఈ మాటకు 'జో' చకితురాలైంది. అమ్మగారివైపు ఒకమాటు ఆప్యాయంగాచూచి బైటికివెళ్ళి స్టీనర్‌ను పంపేసింది.

దాసీది గదిఊడవమని చెప్పి భోజనశాలలోకి వెళ్ళింది. భోజనశాల ఖాళీగాఉంది. కాని అటూఇటూ మరోమారు చూచేసరికి హఠాత్తుగా ఓ చిన్నకుర్రాడు కనుపించాడు. ఒకపెట్టెమీద ప్రశాంతంగా కూచుని ఉన్నాడు — చేతిలో ఓ పూగుత్తి పట్టుకుని.

'ఓ-ఇంకా ఎవరో ఉన్నారే' అన్నది నానా.

ఆ కుర్రవాడు ఉలికిపడిలేచి నుంచున్నాడు. ముఖం ఎర్రబారి పోంది. పూగుత్తిని ఏంచెయ్యాలో అతనికి తోచలేదు. ఆ చేతిలో పూగుత్తిని ఈచేతిలోకి, మళ్ళీమళ్ళీ మార్చుకోవడం మొదలెట్టాడు గాభరాలో. అతన్ని చూసేసరికి నానాకు ఓ విధమైన జాలికలిగి పకాలుననవ్వింది,

పసిపిల్లలుకూడా వస్తున్నారన్నమాట! ఓ విధమైన మాతృత్వంతో ఆమెకు హాయి అనిపించింది. చమత్కారంగా 'ఏం నాయనా, ఏమైనా దెబ్బలుకావాలా?' అన్నది.

'అవును' అన్నాడు కుర్రాడు భయంతో. ఈ జవాబు ఆమెను మరీ ఆనందపరచింది. అతనికి పదిహేడేళ్ళకంటె ఎక్కువ వయస్సు ఉండదు. అతనిపేరు జార్జ్ హూన్. నిన్నరాత్రి థియేటర్‌లో నాటకంచూచి ఇవాళ ఆమెను చూడడానికి వచ్చాడు.

'ఈ పూలు నాకోసమేనా?' అన్నది నానా.

'అవును'

'ఇలా ఇవ్వు, చిన్నబ్బాయ్!' పూలగుత్తి అందుకుంటూంటే అతను ఆమెచేతులు గట్టిగా పట్టుకున్నాడు. అతన్నికొట్టి చేతులు బలవంతంగా వదిలించుకోవలసివచ్చింది. అతన్ని చివాట్లేస్తూంటే నానాకు సిగ్గూ, నవ్వూ కూడ కలిగాయి. తరువాత అతన్ని పంపేసింది, మళ్ళీ రావడానికి అనుజ్ఞ యిస్తూ. ఆ కుర్రాడు గాభరాపడిపోయాడు. నానా డ్రెసింగ్ రూమ్‌కు తిరిగి వచ్చింది. సాయంత్రానికి ఆమెతలకట్టు అలంకరించడానికి ఫ్రాన్సిస్ వచ్చాడు. అద్దంముందు కూచుని, హెయిర్‌డ్రెసర్ చేతుల్లో తలవాల్చి ఏదో ఆలోచిస్తూ ఉండిపోయింది. 'జో' వచ్చి 'ఒకాయన వెళ్ళనంటున్నా రమ్మా' అన్నది.

'అయితే ఉండమను.'

'కొందరు వెడుతూంటే కొందరు వస్తున్నారు' అన్నది జో.

'ఉండమను. ఆకలేస్తే వారే వెళ్ళిపోతారు' అని మళ్ళీ మనస్సు మార్చుకుంది. పురుషులను వేచిఉండేట్టుచెయ్యడం ఆమెకు ఓ విధమైన ఆనందం కలిగించింది. ఏంతోచిందో ఫ్రాన్సిస్‌చేతుల్లోంచి తప్పుకుని, పరుగెత్తుకెళ్ళి తలుపులువేసుకుంది. కాని గంటమ్రోగడంమాత్రం మానలేదు. హఠాత్తుగా నానాకు ఏదో జ్ఞాపకంవచ్చినట్టయి 'ఏవీ నా వేరుశనగపప్పులు?' అన్నది.

ఫ్రాన్సిస్‌కూడా ఆవిషయం మరిచిపోయాడు. జేబులోనుంచి ఒక పాకెట్‌తీసి ఇచ్చాడు. ఫ్రాన్సిస్ బిల్లుల్లో ఇదికూడా చేర్చడం మరిచిపోడు. నానా తలకట్టు అలంకరింపచేసుకుంటూ, ఒక్కోపప్పు తినసాగింది. గంట మాత్రం మళ్ళీ మళ్ళీ మ్రోగుతూనే ఉంది. గతరాత్రి నాటకం చూచిన జనం మూగుతున్నట్టున్నారు.

'ఫ్రాన్సిస్, ఒకమాట. నీదగ్గర 5 లూయీలు దొరుకుతాయా?' అంది నానా. ఫ్రాన్సిస్ ఒకఅడుగు వెనక్కువేసి, తలకట్టు పరీక్షించి ప్రశాంతంగా, 'దొరుకుతాయి కానీ....' అన్నాడు.

'తాకట్టుకావాలన్నమాట' అన్నది నానా.

నానా వాక్యం పూర్తిచెయ్యకుండానే ప్రక్కగదులవంక తల

చూపుతూ చూసింది. ఫ్రాన్సిస్ 5 లూయీలు అప్పిచ్చాడు. 'జో' అమ్మగారి టాయ్‌లెట్‌కు అన్నీ సిద్ధంచేసింది. బైట జనంగోల ఎక్కువగా వుంది.

'తలుపులు పగులగొట్టరుకదా!' అన్నది నానా. జో ఎలాగైతేనేం లాబోర్డెటీని ప్రవేశపెట్టింది. నానా 'అమ్మయ్య!' అని నిట్టూర్చింది.

లాబోర్డెటీ సరిగా సమయానికివచ్చాడు. అతనికి కోరికలేమీలేవు: ఊరికే స్త్రీలతో స్నేహంచేస్తూ వారివిషయాల్లో జోక్యంకలిగించుకుంటూ ఉంటాడు.

'ఇహ బయలుదేరుదాం' అన్నది నానా పూర్తిగా ముస్తాబై.

"జో" ఎగరొప్పుతూవచ్చి, 'జనం తోసుకువస్తున్నారమ్మా!' అన్నది.

దువ్వెనలు ఒకవైపునవుంచుతూ ఫ్రాన్సిస్‌కూడా నవ్వాడు. నానా లాబోర్డెటీ రెక్కపుచ్చుకుని వంటింట్లోకి లాక్కుపోయింది.

వెనకవైపు మెట్లగుండా వెళ్ళిపోయారు.

"నువు మళ్ళీ నన్ను ఇంటివద్ద వదలిపెట్టాలి. రాత్రంతా— ఒక్కతెనే నిద్రపోవాలనుకుంటున్నాను. అంతే— అదో ఊహ!" అన్నది నానా.

# 3

క్లౌంటెస్ సెబైన్ (గత సంవత్సరం చనిపోయిన కౌంట్ తల్లిగారి పేరునుంచి ప్రత్యేకంగా ఉండడకోసం మేడం ముఫత్ డి బెవిలీని ఇలా పిలుస్తారు.) రూ-డి-మిరో మెసనిలోని తనభవనంలో ప్రతిమంగళవారం అతిథులను స్వీకరిస్తుంది. ఆ భవనం పెద్దది. చదరంగా గంభీరంగా ఉంటుంది. వందసంవత్సరాలనుంచి ముఫత్‌లకుటుంబం ఆ భవనంలో నివసిస్తోంది. వీధిలోకి తొంగిచూస్తున్న భవనపురోభాగం ఉన్నతంగా, చీకటిగా ఉండడంవల్ల ఎప్పుడూమూసివుండే కిటికీలతో కాన్వెంట్‌లాగా నిశ్శబ్దంగా, విషాదగంభీరంగా కనుపిస్తూంటుంది. తోటలో వృక్షాలు సూర్యరశ్మిని వెదకుతూ ఎంతో పొడుగ్గా పెరిగాయి. వాటి కొమ్మలు గోడపైకికూడా పెరిగి వచ్చాయి. ముఖ్యంగా ఈ మంగళవారంనాటిరాత్రి పదిగంటలయ్యేసరికి డ్రాయింగ్‌రూమ్‌లో సమావేశమైనవారు డజన్‌మందికంటె ఎక్కువలేరు.

అతిసన్నిహితులైన మిత్రులుమాత్రమే వస్తారనుకోవడంవల్ల ఆగదిలో ఏర్పాటుచేసింది. అక్కడయితే హాయిగా ఉంటుంది. మంటచుట్టూచేరి వెచ్చగా కూచుని, చక్కగా కబుర్లుచెప్పుకోవచ్చు. అదీగాక డ్రాయింగు రూమ్ విశాలంగానూ, ఎత్తుగానూ ఉంది. తోటవైపున నాలుగు కిటికీ లున్నాయి. జల్లులుపడే ఏప్రిల్‌లో సాయంత్రం మరీ చల్లగా ఉంటుంది. లోపల ఎంతపెద్దమంటవేసినా చలిగానే ఉంటుంది. ఒక్కసూర్యకిరణమైనా సోకదు. పగలు ఒకవిధమైన ఆకుపచ్చనికాంతి అస్పష్టంగా వ్యాపిస్తుంది. రాత్రి దీపాలు వెలిగించినప్పుడు, గంభీరంగా కనుపిస్తుంది. గదిలో ప్రవే శిస్తే గతయుగానికి, ఆచారాలకు సంబంధించిన ఓవిధమైన ఉదాత్తత, నిశ్చల గంభీరమైన వాతావరణం కనుపిస్తుంది. కౌంట్‌తల్లి దేహాన్ని చాలిం చిన కుర్చీకి ఎదురుగా మంటకు కొద్దిదూరంలో, మెత్తని కుర్చీలో కౌంటెస్ సెబైన్ విశ్రాంతి తీసుకుంటూ కూచునిఉంది. ఆ పరుపుకుర్చీ ఒకటే ఆగదిలోకంతటికీ అధునాతనంగా కనుపిస్తోంది—చుట్టూవున్న పవిత్రవాతా వరణాన్ని మలినపరుస్తున్నట్టుగా.

'అయితే పర్షియాదేశపు షాకూడా వస్తాడన్నమాట' అంటోంది ఆ యువతి.

ప్రదర్శనంకోసం పారిస్‌కురానున్న గొప్పవ్యక్తులనుగురించి వాళ్ళు సంభాషించుకుంటున్నారు. మంటచుట్టూ ఎందరో స్త్రీలు అర్ధవర్తులాకా రంలో కూచుని ఉన్నారు. మేడమ్ డు జాన్‌కాయ్ - ప్రాచ్యదేశాల్లో ఒక రాయబారాన్ని ముగించుకునివచ్చిన ఆమె సోదరుడు ఒక రాజకీయవేత్త- కొన్ని వివరాలు చెబుతున్నది.

కౌంటెస్ కొద్దిగా కంపించడంచూచి మేడం ఛాన్‌తెరె, 'ఏం అలా ఉన్నావు? ఒంట్లో సరిగాలేదా?' అని అడిగింది.

'అబ్బే, ఏమీలేదు. కొంచెం చలివేసింది. అంతే. ఈగది వెచ్చబడా లంటే ఎంతోకాలం పడుతుంది' అన్నది కౌంటెస్ చిరునవ్వుతో. ఇలా అంటూ గది నలుమూలలా కలయచూచింది. ఆమె కూతురు ఈస్టలీ స్టూల్ మీదనుంచి లేచివచ్చి ప్రశాంతంగా ఒకకర్రముక్కను మంటలోకితోసింది. సెబైన్ కాన్వెంట్ స్నేహితురాలు మేడం డి ఛెజ్‌లీ, 'ఇలాంటిడ్రాయింగ్ రూం నాకూ ఒకటిఉండాలని కోరుకుంటాను. ఈరోజుల్లో కట్టేఇళ్ళల్లో

గదులు పెట్టెలంతైనా ఉండవు. నాకుగనక ఇలాంటి డ్రాయింగుహూం ఉంటే.........' అన్నది.

కుర్చీలు, సోఫాలు మారుస్తానని, సరోవిధంగా అలంకరిస్తానని, పారిస్‌నంతా ఆహ్వానిస్తానని, ఇంకా అనాలోచితంగా మాట్లాడింది. ఆమె భర్త — జడ్జీ ఆమె చెప్పేదంతా గంభీరవదనంతో వింటూకూచున్నాడు. ఆమె అతన్ని మోసగించిందని వినికిడి బహిరంగంగాకూడా మోసగించిందట. కాని అందరూ ఆమెనుక్షమించారు స్వీకరిస్తారు. ఆమెను పిచ్చిఅంటారు.

'ఓలియవైడ్' గొణుగుతూఅన్నది కౌంటెస్ సెబైన్. పదిహేడుసంవత్సరాలనుంచీ ఆగదిలో నివసిస్తూవున్నప్పటికీ. ఆగదిని మార్పుచెయ్యాలనే అభిప్రాయం కలుగలేదు. ఇవాళనచ్చిన కొత్తేమిటి? ఆమెఅత్తగారు జీవించివున్నరోజుల్లో ఎలావుండాలని కోరిందో అలావుండడమే ఉచితం.

మళ్ళీ సంభాషణకు ఉపక్రమిస్తూ, 'ప్రష్యారాజు, రష్యాచక్రవర్తి వస్తాడన్నారు, నిజమేనా?' అన్నది.

'అవును. ఎవరో ప్రముఖులు వచ్చేస్తారని ప్రకటింపబడింది' అన్నది మేడం డు జాన్‌కాయ్.

ఇటీవలే ఈ గృహానికి పరిచయంచెయ్యబడిన స్టీనర్ కిటికీదగ్గర ఒక సోఫాలోకూచుని సంభాషిస్తున్నారు. నలుగురైదుగురు యువకులు తలుపు దగ్గరచేరి కౌంట్ జెవియర్‌-డి-వాండెవ్రె ఏదో సాహసకృత్యాన్నిగూర్చి చెబుతుంటే వింటున్నారు. వాళ్ళు బలవంతంగా నవ్వాపుకోటానికిచేస్తున్న యత్నంచూస్తే, అది చాలా అసందర్భమైనదని నిస్సంశయంగా ఊహించవచ్చు. గదిమధ్యలో దేశీయమంత్రివర్గంలో ఒకశాఖాధిపతి అయిన ఒక లావుపాటివ్యక్తి ఒంటరిగా కూచుని కళ్ళుతెరుచుకునే నిద్రపోతున్నాడు.

వాండెవ్రెకథను సంశయించిన ఒక యువకుడు, 'నువ్వు చాలా సంశయాత్మగా కనిపిస్తున్నావు. సుఖాన్నంతా నాశనం చేసుకుంటావు' అన్నాడు.

ఇలా అంటూ నవ్వుతూ స్త్రీలుకూచున్నవైపుకు వెళ్ళాడు. ఆ యువకుడు తన ఆస్తిపాస్తులను తీరనివ్యామోహంతోఆహూతిచేసుకుంటున్నాడు అతని పందెపు గుర్రాలశాల పారిస్‌లో ప్రఖ్యాతివహించింది. దానికోసం ఎంతో ఖర్చుచేశాడు. ఇంపీరియల్‌క్లబ్‌లో ప్రతినెలా కొన్ని వేలు దహనంచేస్తాడు.

ప్రతిసంవత్సరం పికార్డీలోఉన్న అతని భూస్థితిలో కొన్ని యకరాలు ఉంపుడుకత్తెలకోసం బొక్కపడుతుంటాయి.

"ఇతరులను సంశయాత్ములంటావు. నీకే ఎందులోనూ నమ్మకం లేదు" అన్నది లియనైడ్ తనప్రక్కన అతనికి చోటుచేస్తూ 'నీసుఖాలను నీవే పాడుచేసుకుంటావు'.

'అవును. నా అనుభవాలు ఇతరులకు లాభించాలనుకుంటాను' అన్నాడు అతను.

అతను వీనట్‌ను పూషిస్తూ అంతటితో ఆగిపోవలసి వచ్చింది. ఇంతలో కొందరుస్త్రీలు కదిలి ఈవలకు వచ్చారు. ఒక సోఫాలో ఒక అరవై ఏళ్ళవ్యక్తి దొంగనవ్వుతోకూచునిఉన్నాడు. తనవిషయంకాదన్నట్టు అతను ఒక చిన్న భంగిమద్వారా తెలియజేశాడు. వాండెవ్రె గంభీరంగా. 'నేను నమ్మవలసింది నమ్ముతానని వీనట్‌కు బాగా తెలుసు' అన్నాడు.

కొన్ని క్షణాలు మంటవంక నిశ్చలంగాచూచి కౌంటెస్ సెబైన్ మళ్లీ సంభాషణకు ఉపక్రమించింది.

'నిరుడు, బాడెన్‌లో ప్రష్యారాజును చూచాను. అతని వయస్సుకు ఇంకా హుషారుగానే ఉన్నాడు' అన్నది.

'అతనితో కౌంట్ బిస్మార్క్‌కూడా వస్తాడు' అన్నది మేడమ్ డూ-జూన్‌కాయ్.

'కౌంట్‌బిస్మార్క్ తెలుసానీకు? మాఅన్నయ్యగారింట్లో విందులో చూచాను. అలాంటిమనిషి అంత ఉచ్ఛదశకు రావడం ఆశ్చర్యమే?'

'ఎందువల్ల?' అనడిగింది మేడమ్ చాన్తెరె.

'నాకు ఎలాచెప్పాలో తెలియడంలేదు. అతనంటే నాకెందుకో ఇష్టం లేదు. అనాగరికంగా కనుపిస్తాడు. పైగా మెదడు తక్కువనుకుంటాను' అన్నది మేడమ్ జూన్‌కాయ్,

తరువాత అందరూ కౌంట్ బిస్మార్క్‌నుగురించి మాట్లాడారు. అందులో ఎన్నో అభిప్రాయభేదాలు వచ్చాయి. వాండెవ్రె అతన్నెరుగు. బాగా తాగుతాడని, మంచి ఆటగాడని చెప్పాడు. చర్చ మహాజోరులో ఉండగా తలుపు తెరుచుకొని హెక్టర్ డి లాఫలాసీ ప్రత్యక్షమైనాడు. అతనితోపాటు ఫాష్‌రెకూడా వచ్చాడు. ఫాష్‌రె కౌంటెస్‌దగ్గరికివెళ్ళి

నమస్కరించి, 'మీ ఆహ్వానాన్ని మేము మరచిపోలేము' అన్నాడు.

ఆమె అతన్ని చిరునవ్వుతో అభినందించింది. కౌంట్‌తో కర స్పర్శచేసి, ఆ అపరిచితవ్యక్తులమధ్య ఫాషరె నీటినుంచి బైటపడ్డ చేపలాగా ఏం చెయ్యడానికీ తోచక నిల్చున్నాడు.

వారందరిలో స్టీనర్‌నుమాత్రం గుర్తించగలిగారు. వాండెవ్రె అతన్ని అభినందించాడు, ఫాషరె అతన్ని ప్రక్కకుతీసుకెళ్ళి నెమ్మదిగా 'రేపు వెడుతున్నావా?' అని అడిగాడు.

"తప్పకుండా వెడుతున్నాను".

"అర్ధరాత్రి ఆమె ఇంట్లో—"

"అవును, బ్లాంసీతో వెడుతున్నాను".

మళ్లీ కౌంట్ బిస్మార్క్‌ను గూర్చిన చర్చలో పాల్గొనడానికి అతను వెళ్ళబోయాడు. కాని, ఫాషరె అతన్ని వెళ్ళనీయలేదు.

"ఆమె నన్ను ఎలాంటి ఆహ్వానాన్ని అందచెయ్యమన్నదో నీవు ఊహించనైనాలేవు" అన్నాడు.

ఇలా అంటూ కౌంట్‌ముఫత్‌ను చూపుతూ కొంచెం తలఊపాడు. కౌంట్ ముఫత్ స్టీనర్‌తో, డెప్యూటీతో బడ్జెట్‌నుగూర్చి చర్చిస్తున్నాడు.

"అసంభవం" అన్నాడు వాండెవ్రె ఆశ్చర్యచకితుడై - కొంచెం సంతోషం వెలిబుచ్చుతూ.

ఇద్దరూ నవ్వుకున్నారు. వాండెవ్రె మళ్లీ స్త్రీల చర్చలో కలవడానికి వెళ్ళి, 'మీ రనుకుంటున్నది కేవలం తప్పు. కౌంట్ బిస్మార్క్ చాలా చమత్కారి. ఒకరాత్రి నేను వింటూండగా ఒక గొప్ప చమత్కృతిని చెప్పాడు—' అన్నాడు.

లాఫలాసి ఇరువురూ మాటాడుకునేమాటల్లో కొన్నివిని, ఫాషరె వంకచూచాడు—ఫాషరె ఏమంటాడోనని, కాని ఫాషరె ఏమీచెప్పలేదు. వాళ్లు మాట్లాడుకుంటున్నది ఎవరినిగురించి? మరునాటి అర్ధరాత్రి ఏం జరుగనున్నది? అతను ఫాషరెను అంటిపెట్టుకుని తిరగడం మొదలెట్టాడు. ఫాషరె వెళ్ళి కూచున్నాడు. ముఖ్యంగా కౌంటెస్ సెబైన్ అతన్నెంతో ఆకర్షించింది. అతను ఎందరితోనో మాట్లాడుతూండగా ఆమె ప్రస్తావన వచ్చింది. ఆమెకు పదిహేడవ సంవత్సరంలోనే వివాహ

మైనదని అతనికి తెలుసు. ఇప్పుడు 34 సంవత్సరాలుంటాయి. పునర్వివాహమైనప్పటినుంచీ భర్తతో, అత్తవారితో ఒకవిధంగా దూరంగా వుంటూ, వివిక్తంగా జీవితాన్ని గడుపుతోంది. సంఘంలో కొందరు ఆమెను భక్తురాలివంటిదని చెప్పుకుంటారు. మరికొందరు ఈ పురాతన భవనంలో బంధితురాలు కాకపూర్వం కిలకిలలాడే ఆమె నవ్వునూ, కళకళలాడే ఆమె విశాల నయనాలను జ్ఞప్తికి తెచ్చుకుని, జాలిపడతారు. ఫాష్‌రె ఆమెను పరిశీలించి కొంచెం తహతహలాడాడు. ఫాష్‌రెమిత్రుడు ఒక కెప్టెన్ ఇటీవల మెక్సికోలో యుద్ధంలో చనిపోయాడు. అతను యుద్ధానికి వెళ్ళే క్రితంరాత్రి డిన్నర్ తరువాత ఒక ఘోర రహస్యం చెప్పాడు. ఫాష్‌రెకు అదంతా అస్పష్టంగా జ్ఞాపకంఉంది. నల్లని దుస్తుల్లో ముస్తాబై, ప్రశాంతంగా నవ్వుతూ ఆ పురాతన మందిరంలో కూచునిఉన్న కౌంటెస్‌ను చూస్తోంటే అతనికి ఏవేవోఅనుమానాలు కలుగ సాగాయి. దీపకాంతిలో ఆమెముఖం అదో వింత సోయగంతో కనుపిస్తూ కొంచెం మందంగాఉన్న పెదవుల్లో ఒకవిధమైన రాజసంతో కూడుకున్న లౌల్యం గోచరిస్తోంది.

"ఏమిటీ బిస్మార్క్ గొడవ?" అన్నాడు లాఫలాసి.

"ఇక్కడేమీ తోచడంలేదు" హఠాత్తుగా ఫాష్‌రె, కౌంటెస్‌కు ఎవరైనా ప్రియుడున్నాడా?" అన్నాడు.

"అబ్బే అదేంలేదోయ్" అన్నాడు అస్పష్టంగా– 'లేదుకాని నాకు, స్పష్టంగా ఏమీ తెలీదు. ఆ పోకర్ మంచ్ మాత్రం ఎప్పుడూ ఇక్కడే కనుపిస్తూంటాడు. ఇంకా ఏవేవో విచిత్రవిషయాలు అనేకం జరిగాయట, నామట్టుకునేను ఏమీపట్టించుకోను. ఏమైనా కౌంటెస్ అలాంటిదై ఉన్నట్టయితే చాలా ఖిలాడీ అనే చెప్పాల్సి ఉంటుంది. ఎందుకంటే ఇంతవరకూ ఆమెనుగురించి అలాంటిపనికిడి ఏమీలేదు" అన్నాడు.

తరువాత ముఫత్‌లనుగురించి తనకుతెలిసినవిషయాలన్నీ ఏకరువు పెట్టాడు. చక్కగా ముస్తాబైనవారు ఈవిషయాలు ప్రసంగించడంచూస్తే చూసేవారికి వారేదో ప్రముఖవిషయాన్ని చర్చిస్తున్నట్టుగా కనుపిస్తుంది. 'మమ్మా ముఫత్'ను లాఫలాసి అతి సన్నిహితంగా ఎరుగును. ఆమె ఎప్పుడూ ప్రీస్టులతో ఉంటుంది. ముఫత్ అంత హుషారుగా ఉండేవాడు.

కాదు. కాని చాలా మంచివాడనీ, నమ్మదగినవ్యక్తి అనీ పేరు. పరలో కాన్ని విశ్వసించేవాడు. దర్బారులో తనపదవినిగూర్చి గొప్పఅభిప్రాయం ఉండేది. తన సుగుణాలనుగూర్చి, ధర్మనిరతినిగూర్చి ఎంతో గొప్పగా చెప్పుకునేవాడు. అతనిగురించి ఇదంతా చెబుతూ చివరిమాటగా లాఫలాసి ఫాష్‌రె చెవిలో ఒక మాట ఊదాడు.

"అసంభవం" అన్నాడు ఫాషరె. 'కాదు నాకు గట్టిగా తెలుసు. పెళ్ళినాటికే ఉన్నదట' అన్నాడు లాఫలాసి.

కౌంట్‌వంక చూచి ఫాషరె నవ్వాడు. కౌంట్ స్టీనర్‌తో బడ్జెట్ చర్చలో మునిగి తేలుతూ, చాలా విచిత్రంగా కనుపిస్తున్నాడు.

"అలాగే కనుపిస్తున్నాడు. భార్యకు భలే బహుమతి ఇచ్చాడు. ఆమె ఎంత విసుకెత్తిపోయిఉంటుందో! ఆమె కేమీ తెలీదనుకుంటాను" అన్నాడు ఫాషరె.

అదే సమయంలో కౌంటెస్ సెబైన్ అతనితో మాట్లాడింది. కాని అతను, ఆ విషయాన్నిగురించే ఆలోచిస్తూ ఆమె అడిగినదాన్ని సరిగా వినలేదు. ఆమె మళ్ళీ అడిగింది. 'ఫాషరె, నీవు కౌంట్ బిస్మార్క్‌ను గురించి ఒక వ్యాసం వ్రాశావుకదూ? అతనితో మాట్లాడావుకూడానా?'

తక్షణం తనకుర్చీసుంచిలేచి, స్త్రీలుఉన్నచోటికివెళ్ళి, 'అవునమ్మా జర్మనీలో ప్రచురించిన కొన్ని జీవితచరిత్రలను అనుసరించి ఆ వ్యాసం వ్రాశాను. కాని నే నెన్నడూ కౌంట్ బిస్మార్కును చూడలేదు' అన్నాడు. కౌంటెస్ ప్రక్కనేవుండి, ఆమెతో సంభాషిస్తూ, ఆమెను పరిశీలించడం మొదలెట్టాడు. ఆమె తనవయస్సుకంటె చిన్నదిగా కనుపిస్తోంది. మహావుంటే 28 ఏళ్ళకంటె ఎక్కువ వుండదనిపిస్తుంది. ముఖ్యంగా ఆమెకళ్ళలో ఇంకా యౌవ్వనదీప్తి కనుపిస్తూనేఉంది. విశాలమైన ఆమె కళ్ళల్లో ఏదో అవ్యక్తమైన నీలిఛాయ గోచరిస్తోంది. విడిగా జీవించే తల్లిదండ్రుల పెంపకంలో పెరిగి, ఒకనెల మార్క్విస్ డి-చౌవార్డ్‌తోను ఒకనెల తల్లితోను గడుపుతూవచ్చేది. తల్లి చనిపోయిన తరువాత చాలా చిన్నతనంలోనే వివాహం జరిగింది. ఆ వివాహం తండ్రి ఇచ్ఛానుసారంగా జరిగింది. ఆయన మహాఘోరమైనవ్యక్తి. ఎంత పవిత్రుడుగా కనిపించినా ఆయన్నుగురించి ఎన్నోకథలు వ్యాప్తిలోఉన్నాయి.

ఈనాడు ఆయన్నుసందర్శించేభాగ్యం కలుగుతుందాఅని అడిగాడుఫాషరె. "ఆయన కొంచెం ఆలస్యంగా వస్తాడు. ఎన్నో పనులు చూచుకోవాలి" అన్నది కౌంటెస్. వద్దుడు సాయంత్రాలు ఎక్కడగడుపుతాడో తెలిసిన జర్నలిస్టు గంభీరంగా ఊరుకున్నాడు.కాని కౌంటెస్ ఎడమబుగ్గమీద పెదవులదగ్గరగా కనుపించిన ఒకగుర్తు ఆతన్నెంతో ఆశ్చర్యచకితుణ్ణిచేసింది. నానాకు సరిగ్గా ఇలాంటి గుర్తేఉంది. విచిత్రంకదూ; ఆగుర్తుమీద సన్నని చిన్నచిన్న వెంద్రుకలున్నాయి. నానాకు కొంచెం పల్చగాఉంటే, ఈమెకు నల్లగాఉన్నాయి. అయితేనేం, ఈమెకుమాత్రం ప్రియుడు ఉండిఉండడు.

"క్వీన్ అగస్టాను చూడాలని నాకెన్నాళ్ళనుంచో ఓ కోరికఉంది. చాలా ఉత్తమురాలనీ, పవిత్రురాలనీ విన్నాను. ఆమె రాజుతో కలసి వస్తుందా?" అని అడిగింది కౌంటెస్.

"రాదన్నారమ్మా" అన్నాడు ఫాషరె.

ఆమెకు ప్రియుడెవరూలేడు. ఇందులో ఎంతమాత్రం సందేహం లేదు. సమాధిలావున్న ఆ డ్రాయింగ్‌రూమ్‌ను చూస్తే, చర్చి వాతావరణంలా ఉన్న ఆ గృహ వాతావరణాన్ని పరిశీలిస్తే, ఆమె ఎలాంటి కఠోరశిక్షలో జీవితం వెళ్ళబుచ్చిందో తేటతెల్లమవుతుంది. ఆ పురాతన భవనంలో ఆమెకు తనదనేదేమీలేదు. ఆ భవనాన్ని తన ఉపవాసాలతో, తపశ్చర్యలతో పరిపాలించేది ముఫత్. స్త్రీలకువెనకాల ఈజీఛైర్‌లోకూచుని, నవ్వుతున్న వ్యక్తిని చూస్తే ఫాషరె అనుమానం బలపడుతోంది. ఫాషరె అతన్నెరుగును. అతనిపేరు ది యెషైర్ వీనట్. బాగాసంపాదించి రిటైరై ఇప్పుడు అతి విచిత్రంగా జీవిస్తున్నాడు. అతన్ని ప్రతిచోటా ఆహ్వానించి మహాగౌరవంతో చూస్తారు. కొంచెం భయపడతారుకూడా అతని వద్ద ఏదో మాయాశక్తి ఉన్నట్టు. అదీగాక, ఆతను గొప్ప విధేయత కనుపరుస్తాడు. కౌంటెస్ తప్పేమీ ఉండిఉండదు.

"ఇక్కడేమీ తోచడంలేదు. ఇహ వెళ్ళిపోదాం"అన్నాడు ఫాషరె హెక్టర్‌తో. ఆడవాళ్ళనుంచి ఎలాగో తప్పించుకుని.

కాని స్టీనర్ అతనివైపుకుమహాకోపంగా ఒళ్ళంతాచెమటకక్కుతూ వచ్చాడు. 'వాళ్ళఇష్టంవచ్చినట్టు ఏడ్చుకోనీ, వివరాలన్నీ వారిదగ్గరేఉంచుకోనీ, నాకు చెప్పేవాళ్ళు లక్షలమంది ఉన్నారు' అంటూ గొణుక్కుంటూ

వచ్చాడు. జర్నలిస్ట్‌ను ఒకమూలకు తీసుకెళ్ళి 'రేపుకదూ? నేను అక్కడ కలుసుకుంటాలే' అన్నాడు.

ఫాష్‌రె ఆశ్చర్యచకితుడైనాడు.

"నీకు తెలీదు. ఇంటిదగ్గర ఆమెను కలుసుకునేప్పటికి నా కూతలు దిగివచ్చారు. అదీగాక మినాన్ నన్నంటిపెట్టుకుని ఉండి వదల్లేదు"

"కాని వారు వెడుతూనే ఉన్నారు. మినాన్, ఆమె భర్త" అన్నాడు ఫాష్‌రె.

"అవును, అలా అని నాకుచెప్పింది. తరువాత నన్ను ఆహ్వానించింది. సరిగా అర్ధరాత్రి, థియేటర్‌నుంచి వచ్చినతరువాత' అన్నాడు బ్యాంకర్.

తరువాత కన్నుగీటి ప్రతిపదానికి విచిత్రార్థాన్ని స్ఫురింపచేస్తూ, 'అయితే నీకు - అన్నీ అమరినట్టేనా?' అన్నాడు.

"అదేంమాట?" అన్నాడు ఫాషరె అర్థంకానట్టు నటిస్తూ. 'నా వ్యాసాన్ని అభినందించడంకోసం నన్నుకల్సుకోడానికి వచ్చింది' అన్నాడు.

"అవును. మీరు ఎలాగైనా అదృష్టవంతులు. సరేకాని, రేపు ఖర్చెవరిది?' అన్నాడు బ్యాంకర్. ఈలోగా వాండెవ్రె స్టీనర్‌ను పిలిచాడు. మేడం జాన్‌కాయ్, 'అతన్నిగురించి నాకంత మంచిఅభిప్రాయం కలుగలేదు. కళ్ళాపడిలా కనుపిస్తాడు. చమత్కారి అని ఒప్పుకుంటాను. అదే అతని విజయానికి కారణం' అన్నది కౌంట్ బిస్మార్క్‌ను గురించి.

ఈలోగా లాఫలాసి ఎలాగైనా ధైర్యం కూడగట్టుకుని ఫాషరె వద్దకు వచ్చి, అతని చెవిలో, అయితే రేపురాత్రి ఎవరో స్త్రీ ఇంట్లో విందు ఉన్నదన్నమాట, ఎక్కడ, చెప్పవూ?' అన్నాడు.

ఎవరో వింటున్నారని ఫాషరె అతనికి సైగచేశాడు. కొన్ని మర్యాదలు పాటించాలికదా!

ఈలోగా తలుపు తెరుచుకుని ఒక వృద్ధస్త్రీ ప్రవేశించింది. ఆ ప్రక్కనే నాటకంరోజున నానా నటిస్తోంటే, 'అమృతంగావుంది' అన్న కుర్రవాడు వున్నాడు. వృద్ధస్త్రీప్రవేశం గదిలో సంచలనాన్ని కలిగించింది. కౌంటెస్ సెబైన్ కుర్చీలోనుంచి త్వరగాలేచి ఆమెను కలుసుకోడానికి వెళ్ళింది. లాఫలాసి ఫాషరెతో ఈ దృశ్యాన్ని వివరిస్తూ, హూగన్ ఒక ప్రముఖుని భార్య అనీ, ఇప్పుడు విధవరాలైనదనీ, ఆమె కుటుంబానికి

చెందిన లెఫ్టినెంటెటీఎస్టేటుకురిటైరై విశ్రాంతతీసుకుంటున్నదనీచెప్పాడు.

ఆమెకు పారిస్‌లోకూడా ఒక గృహం వుంది. చిన్నకొడుకును 'లా' చదివించడంకోసం ఏర్పాట్లుచేస్తూ, ఇక్కడుంది. కౌంటెస్‌కు ఆమెకు బాగా స్నేహం.

"జార్జిని నీకుచూపించేందుకు తీసుకొచ్చాను. బాగాపెరిగాడుకదూ" అంటోంది ఆమె సెబైన్‌తో.

ఆడపిల్లకు మగవేషంవేసినట్టున్న ఆ కుర్రవాడు కౌంటెస్‌ను అభినందించాడు.

"ఫిలిప్ పారిస్‌లో లేడా?" అని అడిగాడు కౌంట్‌ముఫత్. 'లే' డన్నది వృద్ధాంగన.

ఆమె ఆసీనురాలై పెద్దకొడుకునుగురించి సగర్వంగాచెప్పసాగింది. అతను రిక్రూటై ఇప్పుడు లెఫ్టినెంట్ అయినాడు. స్త్రీలంతా గౌరవంతో ఆమెచుట్టూ చేరారు. మేడం హూగన్‌ను—మాతృత్వం ఉట్టిపడే ఆమె వదనాన్ని, ఆమె చల్లని చిరునవ్వునూ చూచి కౌంటెస్‌ను సెబైన్‌ను క్షణమాత్రమైనాఅనుమానించడం హాస్యాస్పదమనుకున్నాడుఫాశిరె.

అయినా పెద్దసోఫాలో కూచున్న కౌంటెస్ సెబైన్ అత న్నాక ర్షించింది. అలా కూచున్న ఆమెనుగురించి ఆలోచిస్తూంటే, అతని స్మృతులు వెనక్కుమళ్ళి, హోటల్లో ప్రైవేట్‌రూమ్‌లో అతనికి చెప్పిన కథ జ్ఞాపకానికి వచ్చింది. అతను ముఫత్ కుటుంబంతో పరిచయం ఏర్పరచుకోడానికి ఓవిధమైన కామోద్దీపనే కారణం కావచ్చు. అయినా ఆవిషయం అతన్నెంతో కలవరపరిచింది. అతనిలో నిగూఢమై ఉన్న మాలిన్యమంతా ఉద్దీప్తమైంది.

"సరే, ఇహ వెడదామా!" అని అడిగాడు లాఫలాసి, బైటికివెళ్ళి విందుచేసే స్త్రీపేరు తెలుసుకుందామనే ఉద్దేశంతో, 'వెళ్ళిపోదాం. ఒక్కనిమిషం' అని జవాబిచ్చాడు ఫాషెరె. కాని కదలలేదు.

స్త్రీలందరూ ఇటీవల సన్యాసినిగా మారిన ఒక యువతిని గురించి మాట్లాడుకుంటున్నారు. ఆమె సన్యాసినిగా మారుతూంటే హృదయాలు ద్రవించిపోయాయి. మూడు రోజులపాటు పారిస్‌లోని నాగరికసంఘా న్నంతా ఈ సంఘటన కలవరపరిచింది.

ఆయువతి బారనెస్ డి ఫొగెరె ప్రథమకుమార్తె. ఒక అవ్యక్త మైన పిలుపు విని, సన్యాసినిగా మారింది. మారకుండా ఉండలేక పోయింది. బారనెస్ మరునాడే మంచంపట్టిందట, పాపం!

"మేడం హుక్ ఆతల్లిపై ఎంతో జాలి వెలిబుచ్చింది. 'ఆతల్లికి నిజంగా ఎంత కడుపుకోత!' అన్నది—'నన్నుకూడా భక్తురాలినని నింది స్తూండేవారు. కాని ఇలాంటి ఆత్మహనన మార్గానికి ఒడిగట్టే బాలికలు చాలా క్రూరులనే నే ననుకుంటాను" అన్నది.

"అవును చాలా ఘోరమే!" అన్నది కౌంటెస్ కుర్చీలో కొంచెం ముడుచుకుని.

తరువాత స్త్రీలందరూ ఆ విషయాన్నిగూర్చి పెద్దచర్చలోకి దిగారు. రానురాను వాళ్ళగొంతులు దిగిపోయాయి. అప్పుడప్పుడుమాత్రం ఒక చిన్న నవ్వు వినవస్తోంది. గులాబీరంగు అద్దాల్లో అమర్చబడిన దీపాలు వారిపై మాపుగా కాంతిని విరజిమ్ముతున్నాయి. దూరదూరంగా పెట్టాడు దీపాలు మాత్రమే ఉండడంవల్ల గదినంతా ఒక అందమైన ఛాయ ఆవ రించింది. స్టీనర్‌కు విసుగెత్తుతోంది.

అతను ఫొషరెకు లియనైడు సాహసకృత్యాన్ని వివరించి చెబు తున్నాడు. 'మహా రసికురాలు' అంటున్నాడు తగ్గుగొంతుకతో. ఫొషరె ఆమెను పరిశీలించాడు. ఆమె పల్చని బ్లూ సాటిన్ డ్రెస్ వేసుకుని, చిన్న కుర్రాడిలా కనుపిస్తోంది. ఈ 'పారిస్ ప్రపంచం' ఎంత విచిత్ర మైంది. అతి పవిత్రమైన డ్రాయింగు రూమ్సులోకూడా ఈ బల్సా యువతుల దండయాత్ర సాగుతూనే వుంది.

"మరోసారి ఇలా జరిగింది.లియనైడు మొంటబెక్‌వద్దకు వస్తూం డేది,అక్కడికి రెండులీగులదూరంలో వుంటూ, రోజూ అతన్ని చూడ డానికిహోటల్-డు-లియన్-డి-ఆర్‌కి వస్తూండేది. అతను ఆ హోటల్లో నివసిస్తూవుండేవాడు. బండి వాకిట్లో వుండేది. ఆమె హోటల్లో కొన్ని గంటలకాలం గడిపేది. బైట బండివద్ద జనం చేరి గుర్రాలను చూస్తూ నిల్చునేవారు." అని చెప్పాడు స్టీనర్.

సంభాషణ ఆగింది. గదిలోనా స్తనిశ్శబ్దమైంది. ఇరువురుయువకులు కాసేపు గుసగుసలాడి మానేశారు. కౌంట్ముఫత్ అడుగులచప్పుడు తప్ప

మరేమీ వినబడడంలేదు. దీపాలు తగ్గిపోతున్నాయి. మంట దిగిపోతోంది. ఒకపెద్దనీడ నలభై సంవత్సరాలనుంచి ఆకుటుంబం కూచుంటున్న ఆసనాలలో కూచున్నవారిని ఆచ్ఛాదించింది. ఈలోగా ఒకక్షణంలో కౌంట్ తల్లి గంభీరంగా నిశ్చలంగా ప్రవేశించింది. కౌంటెస్ సెబైన్ మళ్ళీ సంభాషణకు ఉపక్రమించింది.

"ఏమైనా అలాంటివార్త వచ్చింది. ఆ యువకుడు చనిపోయాడట. అందుకనే ఆ పిల్ల సన్యాసినిగామారిందట. ఫొగెరె వివాహానికి అంగీకరించలేదటకూడాను" అన్నది.

"ఇంకా ఎన్నో విషయాలున్నాయి" అన్నది మందంగా లియనైడు.

ఇలాఅంటూ నవ్వింది, వివరాలుచెప్పడానికి ఒప్పుకోకుండానే. సెబైన్కూడా నవ్వువచ్చి, చేతిరుమాలు నోటికడ్డంపెట్టుకుంది. ఈ నవ్వు ఆ గంభీరవాతావరణంలో ఫాష్రెకు విచిత్రంగాకనుపించింది. గ్లాసు పగులగొట్టినట్టుగావుంది. ఏదో నిజంగానే పగిలింది. స్త్రీలందరూ మళ్ళీ హఠాత్తుగా మాట్లాడనారంభించారు. మేడం జాన్కాయ్ ప్రతిఘటించింది. వివాహం చేద్దామనుకున్నారని మేడమ్ ఛాన్తెరెకు తెలుసు. అంతకుమించి మరేమీ తెలీదు. పురుషులుకూడా తమ అభిప్రాయాలివ్వసాగారు.

కొన్ని నిమిషాలు ఈఅభిప్రాయాలు, వాదనలతో గదిఅంతా గందరగోళమైపోయింది. అందరూకలిసి ఒకేసారి మాట్లాడడం మొదలెట్టారు. ఈస్టలీ మంటలోకి మరికొన్నికట్టెలు తీసుకరావడానికి వెళ్ళింది. ఫాష్రె నిశ్చింతగా నవ్వుతున్నాడు.

"అవును, తప్పేమిటి? ప్రేమించిన యువకుని వివాహం చేసుకోడానికి వీలులేనప్పుడు ఈశ్వరుణ్ని వివాహంచేసుకుంటారు". అన్నాడు వాండెవ్రె చర్చతో విసుకెత్తిపోయి. ఇలా అంటూ ఫాష్రెను సమీపించాడు. 'ఒక ప్రేమించిన యువతి సన్యాసినికావడం ఎప్పుడైనా చూచావటోయ్?' అన్నాడు. ఫాష్రెను జవాబు చెప్పనివ్వకుండానే, 'అయితే రేపు మనం ఎంతమందిమి వెడుతున్నాం? మినాన్ భార్యాభర్తలు, స్టీనర్, బ్లాంసీ, నీవూ నేనూ—యింకెవరు వస్తున్నారేమిటి?' అన్నాడు.

"కారొలైన్, సైమన్, నానాకూడా తప్పకుండా వస్తారు. ఇలాంటి

సందర్భాలలో ఖచ్చితంగా యింతమంది వస్తారని చెప్పలేం. మొత్తంమీద ఇరవై ముప్పైమంది రావచ్చు" అన్నాడు ఫాషరె.

స్త్రీలవైపుచూస్తున్న వాండెవ్రె మరోవిషయం ప్రారంభించాడు 'పదిహేనుసంవత్సరాలక్రితం మేడమ్ జాన్‌కాయ్ అందంగావుండివుండేది మళ్ళీ విందువిషయమెత్తి 'ఇలాంటివాటిల్లో వచ్చే గొడవేమిటంటే యెప్పుడూ ఒకేరకం స్త్రీలను చూడాల్సివస్తుంది. కొత్తవాళ్ళంటూ ఒక్కరూ వుండరు. ఒకర్నిచూపించు చూద్దాం. ఉండవయ్యా. ఒక మంచి ఊహ తట్టింది. ఆ లావుపాటి ఆయన్ను, నిన్న సాయంత్రం వెరైటీ థియేటర్‌వద్ద తను సరసమాడుతున్న పిల్లను తీసుకురమ్మంటాను' అన్నాడు.

ఆ లావుపాటి ఆయన గదిమధ్యలో తూగుతూ కూచుని ఉన్నాడు. ఫాషరె దూరాన్నుంచే వారు మాట్లాడడం చూస్తూ ఆనందిస్తున్నాడు. వాండెవ్రె లావుపాటి ఆయన ప్రక్కన కూచున్నాడు. లావుపాటిమనిషి మరీ గాంభీర్యం వహించాడు. వారిద్దరూ కొంచెంసేపు 'ఒకయువతి సన్యాసినిగా మారడానికి అసలు కారణాన్నిగురించి తీవ్రంగా చర్చిస్తున్నట్టు కనుపించారు. తరువాత కౌంట్ ఇలాఅన్నాడు 'అలా వీల్లేదు. ఆమె చాలా పవిత్రురాలని అతను ప్రమాణంచేసి చెప్పాడు. నేను లారె ఇంటివద్ద ఆమెను చూచాను'.

"మీరు లారె ఇంటికి వెడతారా?" అన్నాడు ఫాషరె చిరునవ్వుతో.

"తమలాంటి గొప్పవారుకూడా అలాంటిచోట్లకు వెడుతూంటారన్న మాట? మాలాంటి అల్పులే ననుకుంటున్నాను' అన్నాడు.

"అదికాదోయ్, అన్నీ చూడాలి" అన్నా డతను. ఇలా అనగానే ఇద్దరూ నవ్వుకున్నారు. 'రూడిమార్టియర్స్' లోని భోజనశాలను గూర్చిన వివరాలు మాట్లాడుతూంటే ఇరువురికండ్లూ జిగేలుమన్నాయి. అదోఅసహ్యమైన గుహ! స్త్రీలు లారెను ముద్దాడేవారు. ఇంతలో కౌంటెస్ వారివైపు చూడగానే అక్కడినుంచి జరిగి వెళ్ళారు. వారి ప్రక్కనే నిల్చి, ఇదంతా వింటున్న జార్జి హ్యూగన్‌ను వారు గమనించలేదు. అతను ఇదంతావింటూ సిగ్గుతో ఎర్రబారిపోయాడు. ఒకవైపున సిగ్గు, మరోవైపున ఆనందం ఆ కుర్రవాణ్ణి కలచివేశాయి.

"నిన్న రాత్రి జార్జ్ నన్ను థియేటర్‌కు తీసుకెళ్ళాడు. వెరైటీ థియేటర్‌కు నేను వెళ్ళి పదిసంవత్సరాలైనా కావస్తోంది. కుర్రాడు సంగీతమంటే చెవి కోసుకుంటాడు. నా కంతగా రుచించలేదు. కాని, వాడుమాత్రం మహా ఆనందించాడు. ఈ రోజుల్లో భలే గమ్మత్తైన పాటలు పాడుతున్నారు! నామట్టుకు నాకు సంగీతంలో అంతగా అభిరుచి లేదు" అంటోంది మేడమ్ హూగన్.

"ఏమిటండీ! మీకు సంగీతమంటే ఇష్టంలేదూ? సంగీతమంటే ఇష్టం లేనివా ళ్ళుంటారా?" అన్నది మేడమ్ జాన్‌కాయ్.

స్త్రీలందరూ ఆమాటే అన్నారు. వెరైటీ థియేటర్‌లో సంగీతాన్ని గూర్చి ఎవరూ ఒక మాటైనా చెప్పలేదు. గొప్ప సంగీతశాస్త్రజ్ఞులనుగురించి మాట్లాడడం మొదలెట్టారు. రానురాను స్త్రీల గొంతుకలు మెత్తనై, దీర్ఘం కాసాగాయి. మంట చుట్టూ చేరిన స్త్రీలను చూస్తే ఒక చిన్న చర్చిలో సమావేశమై భక్తిగీతం ఆలపిస్తున్న సమ్మేళనలా ఉంది.

"ఎలాగైనా రేపటివిందుకు ఒకకొత్తస్త్రీని సంపాదించాలి. స్టీనర్‌ను అడుగుదాం పద" అన్నాడు వాండెవ్రె ఫాష్‌రెతో.

"పారిస్ అంతా గాలించి గాని, స్టీనర్ ఆ స్త్రీని పట్టడు" అన్నాడు ఫాష్‌రె.

ఒకమాటు అటూ ఇటూ చూచి వాండెవ్రె 'నిన్న ఫోకర్‌మంట్ ప్రక్కన ఓ మిటారిని చూశాను. దాన్ని తీసుకురమ్మనిచెబుతాను' అన్నాడు.

ఇలాఅని ఫోకర్‌మంట్‌ను పిలిచాడు. వారిద్దరూ ఏదో మాట్లాడుకున్నారు. ఏదో చిక్కు వచ్చినట్టుంది. అందుచే స్త్రీలగుంపులోనుంచి సందు చేసుకుని నెమ్మదిగా వెళ్ళి ఒక యువకుణ్ణి కలుసుకుని, అతనితో సంభాషణ సాగించారు. ఫాష్‌రె వెళ్ళి వాళ్ళతో కలుద్దామనుకున్నాడు. వెబర్ సంగీతం వింటోంటే కొలనులూ, నదులూ, అరణ్యాలూ, పర్వతాలూ, సూర్యోదయ సౌందర్యం కన్పిస్తాయని మేడమ్ జాన్‌కాయ్ చెబుతోంది. ఎవరో ఫాష్‌రె భుజాన్ని తాకి, 'ఇది నీకు తగదు' అన్నారు.

"ఏమిటి?" అన్నాడు ఫాష్‌రె వెనక్కు తిరిగి, లాఫలాసిని గుర్తిస్తూ.

"రేపురాత్రివిందు. నన్నుకూడా పిలిచిఉండవలసింది" అన్నాడతను.

ఫాష్‌రె జవాబుచెప్పబోతూండగా వాండెవ్రె తిరిగివచ్చి, 'ఆపిల్లకూ అతనికీ సంబంధమేమీలేదట. ఆ అమ్మాయి రాదట. ఏంగొంతవవచ్చి పడింది! ఎలాగైనా అతన్ని పడేశాను. పాలెస్ రాయల్ థియేటరుకు చెందిన టాయిస్‌ను తీసుకొస్తా' నన్నాడు.

"వాగ్నర్ సంగీతం ఆదివారాలు పాడతారుకదూ!" అని అడిగింది మేడమ్ చాన్తెరె.

"ఓ! ఘోరంగా" అన్నాడు వాండెవ్రె. తరువాత వెడుతూ ఫాష్‌రె చెవిలో, 'నేను వెళ్ళి మళ్ళీ చెప్పిచూస్తాను. ఈ కుర్రవాళ్ళ కందరికీ ఆడపిల్లల్ని రుచిచూపించాలి' అన్నాడు.

తరువాత కులాసాగా నవ్వుతూ ఇతరుల దగ్గరికి వెళ్ళాడు. గదిలో నలుమూలలా కలయతిరిగి అందరితో మాట్లాడాడు. పదిచోట్ల పదిమాటలు పడేసి, కనుగిట్లలో ఇవతలికి వచ్చాడు. ఏదో గొప్ప రహస్యాన్ని చెప్పి వస్తున్నట్టు. అతనిమాట ఒకనోటినుంచి మరోనోటికి ప్రయాణం చేసింది. స్త్రీలు సంగీతాన్నిగురించి చేస్తున్నచర్చ దీన్నంతా ముంచేసింది.

"మీజర్మన్లనుగురించి చెప్పకు. పాటఅంటే అలా అలా తేలిపోతూ ఉండాలి. 'పత్తి-ఇన్-ఇల్-బార్ బియర్' విన్నావా?" అన్నది మేడమ్ చాన్తెరె.

"తీయగా ఉంటుంది ఆ పాట" అన్నది లియనైడ్. లియనైడ్‌కు హార్మోనీసంగీతంకూడా సరిగా తెలీదు.

కౌంటెస్ సెబైన్ టీ కోసం ఆర్డరిచ్చింది. ఒక సేవకుడు ఒకచిన్న టేబిల్‌ను శుభ్రపరిచాడు. కౌంట్ డి వాండెవ్రె తనవద్దకు రాగానే ఏమిటో ప్లాన్‌వేస్తున్నావే?" అన్నది.

"ఏమీ లేదమ్మా, ఏమీ ప్లాన్‌వెయ్యడంలేదు" అన్నాడు వాండెవ్రె ప్రశాంతంగా.

"ఏదో చాలా పనిమీద ఉన్నట్టున్నావు. ఒక చిన్నపని చేసిపెట్టు" అన్నది కౌంటెస్.

ఒకఆల్బం అతని చేతుల్లో ఉంచి, పియానోమీద పెట్టిరమ్మన్నది. అతనికి ఫాష్‌రెతో. అందరిలోను చక్కని భుజాలు, మెడ గల టాటన్‌నెనె.

మేరియా బ్లాండుకూడా విందుకువస్తారని చెప్పడానికి అవకాశం కలిగింది. లాఫలాసి ఆహ్వానంకోసం అడుగడునా అద్భుతగలడం మొదలెట్టాడు. చివరకు వాండెవ్రె అతన్ని ఆహ్వానించాడు.

విందుచేసే యజమానురాలిపేరు తెలుసుకోవాలని లాఫలాసి ఎంతో తహతహలాడాడు. ఈలోగా వాండెవ్రెను కౌంటెస్ పిలిచి, ఇంగ్లండులో టీ ఎలా తయారుచేస్తారని అడిగింది. అతను అనేకసార్లు తన గుర్రాలతో ఇంగ్లండు వెళ్ళాడు. అతని ఉద్దేశంలో రష్యన్లకు తప్ప మరెవరికీ టీ చెయ్యడం తెలీదు. ఉండిఉండి వాండెవ్రె, 'మరచిపోయాను, మార్కిస్ ఇవాళ రావడం లేదా?' అన్నాడు.

"ఎందుకురావడంలేదు? మానాన్నగారు తప్పకుండా వస్తానన్నారు." అన్నది కౌంటెస్—'ఏమీ తోచడంలేదు. పనుల ఒత్తిడివల్ల ఆలస్యమై ఉంటుంది.'

వాండెవ్రె అదోవిధంగా నవ్వాడు. మార్కిస్ డి ఛౌవార్డ్ పనులను గురించి అతనికి సంశయం ఉన్నట్టుంది. మార్కిస్ అప్పుడప్పుడు గ్రామ పరిసరాలకు తీసుకెళ్ళే ఒక చక్కనిచుక్క అతనికి జ్ఞాపకంవచ్చింది. కౌంట్ ముఫత్‌కు ఆహ్వానం అందచెయ్యవలసిన సమయం ఆసన్నమైవదని ఫాష్‌రె అనుకున్నాడు. ఆలస్యమైపోతోంది.

"నిజంగా అందచెయ్యా లనుకుంటున్నావా?" అని అడిగాడు వాండెవ్రె ఫాష్‌రె పరిహాసానికి అన్నాడనుకుని.

"నిజంగానే. అందచెయ్యకపోతే నా డొక్కచీల్చేస్తుంది. దానికి అదో సరదా!" అన్నాడు ఫాష్‌రె.

గడియారం పదకొండు గంటలు కొట్టింది. కౌంటెస్, ఆమెకూతురు టీ అందించారు అతిధులందరికి. అందరూ సన్నిహితులే కావడంవల్ల అందించుకోవడంలో ఒకరికొకరు సహాయపడ్డారు. స్త్రీలు మంట ప్రక్కన కుర్చీల్లోకూచుని టీ తాగుతూ, బిస్కట్లు చప్పరిస్తున్నారు. సంగీతంచర్చ వ్యాపారంమీదికి మళ్ళింది. కొంతసేపటికి చర్చ పల్చబడింది. అందరినీ అలుపు ఆవరించింది.

స్టీనర్ డెపూ్యటీపై మళ్ళీ దండయాత్ర మొదలెట్టాడు. వీనట్ ఎలుకలా చప్పుడుచేస్తూ పెద్దపెద్ద కేక్స్ తింటున్నాడు.

కౌంటెస్ ఒకఅతిథివద్దనుంచి మరో అతిథివద్దకు వెడుతూంది. ఒక్కొక్క అతిథివద్ద నిశ్శబ్దంగా నిల్చుని, ప్రశ్నార్థకంగా చూచి, మరో అతిథివద్దకు వెడుతూంది. మంటవేడి ఆమెముఖానికి అదోవిధమైనకాంతి నిచ్చింది. ఆ కాంతివల్ల తనకుమార్తెకు సోదరిలా కనుపిస్తోంది. ఆమె దగ్గరికివచ్చేసరికి మాట్లాడుకుంటున్న ఫాషరె, వాండెవ్రె, ఆమెభర్త సంభాషణ ఆపేశారు. ఆమె జార్జ్‌హూగన్‌వద్దకు వెళ్ళి, తనచేతిలోఉన్న టీ కప్పు అందించింది.

"తమర్ని ఒక స్త్రీ విందుకు ఆహ్వానిస్తోంది" అన్నాడు జర్నలిస్టు కౌంట్ ముఫత్‌తో. కౌంట్ ముఫత్ ఆశ్చర్యచకితుడైనాడు. ఎవరై ఉంటుంది ఆ స్త్రీ.

"ఎవరేమిటి? నానా!" అన్నాడు వాండెవ్రె కుండ బద్దలుకొట్టినట్టు. ఈమాట వినేసరికి కౌంట్ మరీ గంభీరుడైపోయాడు. కళ్ళార్పకుండా చూస్తూ, ఆ స్త్రీని నే నెరుగను' అన్నాడు.

"అలా చెప్పండి! మీరు వెళ్ళి ఆమెను కలుసుకున్నారు" అన్నాడు వాండెవ్రె.

"ఆ! ఏమిటీ? నేను కలుసుకున్నానా?-అవును-మరచిపోయాను. దారిద్ర్యనివారణకమిటీ తరఫున - మరచిపోయానుసుమా. ఏమైనా ఆమెను నే నెరుగను. నేను అంగీకరించను." అన్నాడు కౌంట్.

ఇలా అంటూ గంభీరముద్రవహించాడు — తనలాంటివాడు అలాంటి స్త్రీప్రక్కన విందులో కూచోడమా అన్నట్టు. వాండెవ్రె ప్రతిఘటించాడు 'ఒక అభినేత్రి యిస్తున్న విందు. అందులో తప్పేమిటి? ప్రతిభచూడాలి కాని, మరేమీ చూడకూడదు' అన్నాడు.

ఒక విందులో పాటకచ్చేరీలుచేసే ఒక అమ్మాయిప్రక్కన కూచున్న ఓ రాకుమారుని విషయం చెప్పాడు ఫాషరె. కాని కౌంట్ ససేమిరా అన్నాడు.

జార్జ్, లాఫలాసి వీ రనుకుంటున్న కొన్నిమాటలు విన్నారు.

'అయితే నానా అన్నమాట. నాకు తెలిస్తే ఎంతబావుండేది' అన్నాడు లాఫలాసి.

జార్జ్ ఏమీ మాట్లాడలేదు. అతనిముఖం ఎర్రబారింది. జుట్టు రేగిపోయింది. కళ్ళు ఒత్తుల్లా కాలిపోతున్నాయి. కొన్నాళ్ళనుంచి అతన్ని చుట్టుకున్న ఆకర్షణ అతన్ని కాల్చి పీల్చేస్తోంది. లాఫలాసి 'నాకు ఆ చిరునామా తెలిసివచ్చింది కాదు' అన్నాడు.

జార్జ్ ఒక్కగుక్కలో చిరునామా చెప్పేశాడు. లాఫలాసి కళ్ళింత చేసుకుని చూస్తూండగా, 'నేను వెడుతున్నాను. నన్ని ఉదయం ఆహ్వానించింది' అన్నాడు ముఖం ఎరుపు చేసుకొని.

ఇదే సమయంలో గదిలో పెద్ద సంచలనం బయల్దేరింది. వాండెవ్రె, ఫాషెరె కౌంట్‌ను ఎంత వత్తిడిచేసినా లాభంలేకపోయింది.

మార్కిస్ వచ్చాడు. అతన్ని కలుసుకుని అభినందించడానికి అందరూ త్వరత్వరగా లేచివెళ్ళారు. ఆయన కాళ్ళీడ్చుకుంటూ వచ్చి గదిమధ్య విల్చున్నాడు. ముఖం బాగా పాలిపోయి ఉంది. కళ్ళు అల్లారుస్తున్నాడు. చీకటిలోనుంచి ఇప్పుడే వెల్తురులోకి వచ్చి, దీపాలు చూడలేనట్టు,

"మీరు వస్తారనుకోలేదు నాన్నగారూ, ఒకనిమిషమైనా తోచింది కాదు" అన్నది కౌంటెస్.

ఆమెవంక ఏమీ అర్థంకానట్టుగా చూచాడు. ఆయన ముక్కు పెద్దబండలా ఉంది. క్రింది పెదవి జారుతోంది. అలాంటి స్థితిలో ఉన్న ఆయన్ను చూచి మేడమ్ హూగన్ జాలితో, 'ఎందు కంత పనిచేస్తారు? మీరు విశ్రాంతి తీసుకోవాలి. మనవయసువారు పనిని చిన్నవాళ్ళకు వదలిపెట్టాలి' అన్నది.

"పని, పని. ఎప్పుడూ పనే" అని కాస్త సమాళించుకుని జుట్టు సర్దుకున్నాడు.

"ఇంతసేపు పనిచేస్తారేమండీ? ఆర్థికమంత్రి ఏర్పర్చిన ఆహ్వానంలో మీరూ ఉన్నారనుకున్నాను?" కౌంటెస్ జోక్యం కలిగించుకుని 'మానాన్నగారు ఏదో పార్లమెంటరీబిల్ పరిశీలించవలసివచ్చింది' అన్నది.

"అవును, పార్లమెంటరీబిల్లు పరిశీలించవలసివచ్చింది. అందుకనే

తలుపులు మూసుకుని కూచున్నాను. ఫాక్టరీలకు సంబంధించినబిల్లు. ఆది వారాలు మూసెయ్యాలంటాను నేను. ప్రభుత్వం ఈ విషయంలో ఎక్కువ శ్రద్ధచూపకపోవడం అవమానకరం. చర్చిలకు ఎవరూ వెళ్ళడంలేదు. అంతా ఏదో పెద్ద విపత్తులో ముగుస్తుంది' అన్నాడు మార్కిస్.

వాండెవ్రె ఫాషరెవంక చూచాడు. వారిరువురూ మార్కిస్ వెన కాల ఉన్నారు. ఆయన గ్రామపరిసరాలకు తీసుకువెళ్ళే చక్కనిచుక్కను గూర్చి అడుగుదామని వాండెవ్రె ముందుకువచ్చేసరికి ఆయన ఆశ్చర్య పూరితుడైనాడు.

వారు బహుశా ఆయన్ను బారనెస్ డెకెర్‌తో చూచిఉంటవచ్చు. వాండెవ్రె కషికొద్ది హఠాత్తుగా, 'ఎక్కడెక్కడి కెళ్ళారేమిటి, గుడ్డల మీద బూజుపడింది?' అన్నాడు.

"అవును, ఎలానో అతుక్కుని ఉంటుంది" అన్నాడు ఆయన గొణుగుతూ.

చాలమంది వెళ్ళిపోతున్నారు. అర్ధరాత్రి కావస్తోంది. ఇద్దరు సేవ కులు నిశ్శబ్దంగా కప్పులూ, పేట్లు తీసివేశారు.

స్త్రీలు ఇంకా మంటచుట్టూ కూచుని, మాట్లాడుకుంటున్నారు. గదికేదో మత్తు ఆవరించినట్టుగాఉంది. గోడలమీద పెద్ద పెద్ద బరువైన నీడ లాడుతున్నాయి. ఫాషరె ఇకా ఇంటికి వెడదామన్నాడు. మళ్ళీ ఒక మాటు కౌంటెస్ సెబైన్ వైపుకు మరలాయి అతనికళ్ళు. అతిథిమర్యాద ముగించి, ఆమె తన యథాస్థానంలో కూచునిఉంది. మంటలో కాలిపోతున్న ఒక కట్టెవంక తదేకంగా చూస్తోంది.

ఆమెముఖం ధవళతరంగా అతిగంభీరంగా కనుపిస్తోంది. ఫాషరెకు మరల అనుమానాలు కలుగసాగాయి. పెదవిదగ్గర మచ్చపై వెంట్రుకలు మంటకాంతికి బంగారువర్ణంలో కనుపిస్తున్నాయి. సరిగా నానాకు ఇలాగే ఉన్నాయి. ఈ విషయం వాండెవ్రెతో చెప్పకుండా ఉండలేకపోయాడు. నిజమే. ఇదివరకు అతడు ఈ విషయం గమనించలేదు. నానాకు, కౌంటెస్‌కు పోలికలు ఆలోచించసాగారు. నోటిదగ్గర, గడ్డంవద్ద కొద్ది పోలికలు అస్ప ష్టంగా కనుపించాయి. కళ్ళుమాత్రం ఒకలా లేవు. నానా చాలా వయగల

దానిలా కమపిస్తోంది. కాని కౌంటెస్‌మాత్రం అలాలేదు. గోళ్ళు ముడుచుకుని, విద్రిస్తున్న పిల్లిలా ఉంది. ఏదో బాధతో ఆ గోళ్ళు వణుకుతున్నట్టువున్నాయి.

"ఏమైనా మహా యోగ్యురాలే" అన్నాడు ఫాష్‌రె.

వాండెవ్రె ఆమెను బట్టలువిడుస్తున్నట్టుగా చూచి, 'అవును. కాని, ఆమెతొడలనుగురించి నాకు చాలా పెద్ద సందేహాలున్నాయి' అన్నాడు.

ఈఁస్ట్లీని చూచి సంభాషణ ఆపమన్నాడు. ప్రక్కనే పీటపై కూచున్న ఆమె వారి సంభాషణ వినివుండవచ్చు.

ఈ సమయంలో మంటచుట్టూ కూర్చున్న స్త్రీలు గొంతుకలు పెద్దవి చేశారు. మేడమ్ జాన్‌కాయ్, 'కౌంట్ బిస్మార్క్‌కు చమత్కారం ఉండవచ్చు. కాని ఆయన మహా మేధావి అంటే—' అంటున్నది.

"మళ్ళీ బిస్మార్క్ గొడవ వచ్చిందే. అయితే ఇహ వెళ్ళిపోవాలి" అన్నాడు ఫాష్‌రె.

"ఒక్కనిమిషం ఆగు. చివరిసారి కౌంట్‌చేత లేదనిపించుకుందాం" అని ఆపాడు వాండెవ్రె.

కౌంట్ ముఫత్ మామగారితో మాట్లాడుతున్నాడు. వాండెవ్రె అతన్ని ప్రక్కకుతీసుకెళ్ళి మళ్ళీ మరోమాటు ఒత్తిడిచేశాడు. తనుకూడా విందుకు వెడుతున్నానన్నాడు. పురుషుడు పోరానిచోటు లేదన్నాడు.

కౌంట్ ఈ మాటలన్నీ నేలకేసిచూస్తూ, నిశ్శబ్దంగా విన్నాడు. కొంచెం తటాపటాయిస్తున్నాడని వాండెవ్రె గ్రహించాడు. మార్కిస్ ప్రశ్నార్థకంగాచూస్తూ వారివద్దకు వచ్చాడు. ఈ చర్య ఆయనకూడా పరిచితంచెయ్యబడింది. ఫాష్‌రె ఆయన్నుకూడా ఆహ్వానించగా, ఆయన కౌంట్ ముఫత్‌వైపు తీక్షణంగా చూచాడు.

'వీల్లేదు' అన్నాడు కౌంట్ ఇక చెప్పవలసిందేమీ లేదన్నట్టు.

మార్కిస్‌కూడా నిరాకరించాడు. నీతినిగురించి ఉపన్యసించాడు. పైతరగతులవారు ఆదర్శయుతంగా ఉండాలన్నాడు. ఫాష్‌రె చిరునవ్వు నవ్వాడు. వాండెవ్రెతో కరస్పర్శజేసి త్వరగా, ఆఫీసులో పనిఉండడంవల్ల వెళ్ళిపోయాడు.

'నానా ఇంటివద్ద—అర్ధరాత్రి—మరచిపోవద్దు' అన్నాడు.

లాఫలాసికూడా సెలవు తీసుకుంటున్నాడు. స్టీనర్ అప్పుడే కౌంటెస్ వద్ద సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు. అందరూ వెళ్ళిపోతున్నారు. అందరి నోళ్ళలో అదేమాట—'నానా ఇంటివద్ద—అర్ధరాత్రికి' అని. వెళ్ళిపోతూ ఫాష్‌రె ఒక్కమాటు నలుమూలలా చూచాడు. మళ్ళీ ఒక్కసారి కౌంటెస్ సెబైన్‌వంకచూచి తలుపుమూసి వెళ్ళిపోయాడు. ఆమె లావుపాటివ్యక్తితో చర్చిస్తోంది. ఫాష్‌రె బహుశా పొరబడివుండవచ్చు. ఆమె పవిత్రురాలే అయివుండవచ్చు పాపం! 'వస్తున్నావా?' అన్నాడు లాఫలాసి బైట పేవ్‌మెంటుమీద సెలవుతీసుకుంటూ.

'నానా ఇంటివద్ద—అర్ధరాత్రికి' అనుకున్నారు ఇరువురూ.

# 4

ఉదయంనుంచీ, బ్రెబాంట్‌వద్దనుంచివచ్చిన ఒకవ్యక్తి, తనపరివార సహితంగా నివసించడంకోసం 'జో' గదులన్నీ ఖాళీచేసియిచ్చింది. బల్లలు కుర్చీలు, రాత్రిభోజనం అన్నీ బ్రెబాంట్ సప్లయిచెయ్యాలి. నానా విందు నిమిత్తం తనఇంటినే ఒక పెద్దహోటల్‌గా మార్చేసింది. తన మహత్తరవిజయానికి సూచకంగా ఒక విందుచేసి అందరి ప్రస్తుతినీ అందుకుందామనుకుంది. డైనింగ్ రూం చాలా చిన్నదికావడంవల్ల డ్రాయింగ్ రూంలో ఏర్పర్చారు. టేబిల్‌మీద 25 మందికి ఏర్పరచారు.

అర్ధరాత్రి ఇంటికితిరిగివచ్చి, 'అంతాసిద్ధమేనా?' అనడిగింది నానా.

'ఏమోనమ్మా అదంతా నాకుతెలీదు' అన్నది జో. జో ఎంచేతనో చిరాగ్గావుంది. 'నాకేమీ తెలీదు. వంటగదిలో అన్నీ చిందరవందర చేసేస్తున్నారు. మళ్ళీ ఆ ఇద్దరూ వచ్చారు. బైటికి గెంటేశాను' అన్నది.

జో ఈ మాటలను ఇంతకుపూర్వం నానాకు సంబంధించిన ఇద్దరు పెద్దమనుష్యులనుగురించి చెప్పింది. నానా వీళ్ళిద్దరికీ ఉద్వాసన చెబుదామని నిశ్చయించుకుంది. ఇహ భవిష్యత్తుకేమీ లోటులేదని—జీవితంలో కొత్త అధ్యాయం ప్రారంభిద్దామనుకున్నదట.

'వెధవగొడవ! ఈమాటు వస్తే పోలీసుకమీషనర్‌ను పిలిపిస్తామని చెప్పు'

తరువాత డానెట్‌ను, జార్జిని పిలిపించింది. పాసేజ్ డి పెనోరమ వద్ద వాళ్ళను కలుసుకుని తనతో తీసుకొచ్చింది. అప్పటి కింకా ఎవరూ రాకపోవడంవల్ల వాళ్ళను డ్రెసింగ్‌రూమ్‌లోకే రమ్మన్నది. జో తనకు ముస్తాబుచేస్తోంది. త్వరత్వరగా ముస్తాబు పూర్తిచేసుకొని రెండురోజాపూలు తలలో అలంకరించుకుంది. డ్రాయింగ్‌రూమ్ సామాన్లన్నీ డ్రెసింగ్ రూమ్ లోనే ఉన్నాయి. రౌండుటేబిళ్ళ, చిన్నటేబిల్, కుర్చీలు, సోఫాలు అన్నీ ఒకదానిమీద ఒకటి పేర్చి ఉన్నాయి. తీరా ముస్తాబు పూర్తికాగానే ఆమె గౌను ఒకదానికి తగులుకొని కొంచెం చినిగింది. నానా భగ్గున మండిపడి ఆ సామాన్లన్నింటినీ తిట్టింది. కోపంతో గౌనును లాగిపారేసింది. అది చక్కని మెత్తని తెల్లని సిల్కుగౌను. నానా ఒంటికి అంటుకుని మహా శోభగాఉంది. తనకునచ్చిన మరోడ్రెస్ కనుపించక, మళ్ళీ దాన్నే తొడుక్కుంది—ఏడుస్తూ—బిచ్చగత్తెలా ఉంటానని తనను తాను నిందించుకుంటూ. డానెట్, జార్జి చిరుగును పిన్నులతో కుట్టేశారు. జో మళ్ళీ తల కట్టు సర్దింది. ముగ్గురూ చుట్టూచేరి పనికల్పించుకున్నారు. ముఖ్యంగా కుర్రాడు మోకాళ్ళపై కూచుని గౌను సర్దాడు. డానెట్ ఇంకా అర్ధరాత్రి దాటలేదని చెప్పినతరువాత నానా కాస్త చల్లబడింది. 'బ్లాండీవీనస్' చివరి రంగం పోర్షన్ వదిలేస్తూ త్వరగా ముగించింది.

'ఆ వెధలకు ఆమాత్రం చాల్లే. ఇవాళరాత్రి మరీ గొర్రెలమందలా ఉన్నారు. అమ్మాయ్, జో, నువ్విక్కడే వేచిఉండాలి. నిద్రపోతేకాదు. ఎవరో వస్తున్నట్టున్నారు' అంటూ నానా వెళ్ళింది. జార్జ్‌ని అక్కడే వదిలేసి. డానెట్ తనను గమనించడంచూసి జార్జ్ సిగ్గుపడ్డాడు. ఏమైనా వారిద్దరిమధ్యా కాస్త సాన్నిహిత్యం, అనురాగం ఏర్పడినై. నిలువుటద్దంలో చూచి, నెక్‌టైలు సర్దుకుని, నానా గౌను సర్దడంవల్ల ఒంటిమీదపడిన పౌడర్‌ను తుడిచెయ్యడానికి ఒకసారి బ్రష్ చేసుకున్నారు.

'పంచదారలా ఉంది' అన్నాడు జార్జ్ పసివాడిలా నవ్వుతూ.

ఆ రాత్రికోసం కుదిరిన ఒకసేవకుడు అతిథులను లోపలికి ప్రవేశ పెట్టాడు. ఆ చిన్నగదిలో నాలుగు ఈజీచైర్లుమాత్రమే ఉన్నాయి—ఇతరు

లకు చోటు ఉంచడం కోసం. ప్రక్కనుంచి కప్పులూ, ప్లేట్లు సర్దుతున్న చప్పుడు వినిపిస్తున్నది. తలుపు ప్రక్కగా ఒక పెద్ద దీపం వెలుగుతోంది. నానా ఆ గదిలో ప్రవేశించగానే లాఫలాసీతో కలిసివచ్చిన క్లారిసీ బెసనస్ కనుపించింది.

'అరె! నీ వేననన్నమాట మొదలు!' అన్నది నానా. తమ విజయం పొందినప్పటినుంచి ఆమెతో పరిచయంగా ఉంటోంది.

'అదంతా ఇతనితప్పే. ఎప్పుడూ ఆలస్యమైపోతుందని భయపడ తాడు. ఇతనిమాట విన్నట్టయితే ముఖాన రంగుకూడా అలాగే వుంచుకో వలసివచ్చేది' అన్నది క్లారిసీ.

మొట్టమొదటిసారిగా నానాను కలుసుకున్న ఆ యువకుడు ఆమెకు నమస్కరించి, తన అభినందనలు తెలిపాడు. తనసోదరుణ్ణిగూర్చి చెప్పాడు. తన గాభరానంతా అతి మర్యాదచాటున దాచుకోడానికి యత్నించాడు. నానా అతను చెబుతున్నది వినకుండానే, ఆతనెవరో తెలీకుండానే అతనితో కరస్పర్శచేసి రోజ్ మిన్యాన్ వద్దకు వెళ్ళింది. రోజ్ వద్దకు వెళ్ళగానే గాంభీర్యం వహించింది.

'మా మీద ఎంతో దయచూపారు. మాతో మీరు కలిసివుండాలని ఎంతో వాంఛించాను'.

'అలా వాంఛించింది నేనే' అన్నది రోజ్.

'కూచోండి దయచేసి. ఏమైనా తెప్పించనా?' అన్నది నానా.

'పరవాలేదు. విసనకర్ర మరిచిపోయాను. చూడు స్టీనర్, కుడి జేబులో ఉంది' అంది రోజ్

స్టీనర్, మిన్యాన్ రోజ్ వెనకాలే వచ్చారు. స్టీనర్ బైటికివెళ్ళి విసనకర్ర తీసుకొచ్చాడు. మిన్యాన్ నానాను సహోదర భావంతో కౌగలించు కున్నాడు. రోజ్ ముద్దాడింది. అందరూ నాటకకుటుంబానికి చెందినవారేగదా! స్టీనర్ ను ఉత్సాహపరుస్తూ కన్నుగిలిపాడు. కాని రోజ్ అచేసనిగా చూస్తూండడంవల్ల నానాహస్తాన్ని ముద్దాడటం తప్ప మరి దేనికీ సాహసించలేకపోయాడు. ఆ సమయంలోనే కౌంట్ డి వాండెవ్రె, బ్లాన్సీ సహితంగా వచ్చాడు. నమస్కారాల ప్రత్యుత్థానాలసందడి

హెచ్చయింది. నానా మహాడంబరంతో బ్లాంసీని ఒక కుర్చీపై ఆసీనురాలిని చేసింది. ఈలోగా సేవకుడు తలుపుతెరవగా, లూసీస్టీవార్టు స్మితవదనంతో విచ్చేసి, తననామధేయాన్ని తనేచెప్పుకుంది నానా హస్తయుగళాన్ని పట్టుకుని, చూచీచూడగానే తనకు నానాపై అత్యంతానురాగబంధం ఏర్పడిందనీ, నానా అసామాన్య ప్రతిభావంతురాలనీ ప్రసశంసలు కురిపించింది. గృహ యజమానురాలి హోదాలో సగర్వంగా నానా తన అభివందనాలు గొణుగుతూ చెప్పింది. ఫాష్‌రెరాక ఆమెమనస్సును కించిదాందోళితంచేసింది. అతన్ని సమీపించగానే కొంచెం తగ్గుస్వరంలో, 'అతను వస్తున్నాడా' అని ప్రశ్నించింది.

కౌంట్ ముఫత్ రాడని వివరించడానికి ఎంతో చెప్పాలని తయారై ఉన్నప్పటికీ, 'రానన్నాడు. రావడానికి తిరస్కరించాడు' అని సూటిగా, ఖచ్చితంగా చెప్పేశాడు ఫాష్‌రె. నానా వదనం వివర్ణంకావడం చూచి, ఎందు కలా చెప్పానా అనుకుని, ఆయన రావడానికి వీలుపడకపోయింది. స్వదేశ మంత్రివర్గశాఖలో జరిగే 'బాల్'కు కౌంటెస్‌ను తీసుకెళ్ళవలసి వచ్చింది' అని సర్దేశాడు.

'సరే, మంచిది. నీపని చెబుతాలే ఉండబ్బాయ్' అన్నది నానా.

ఫాష్‌రె కోపంతో, 'ఈ మాటలన్నీ నాదగ్గరకాదు. లాబోర్డెటీ దగ్గర ప్రయోగించు' అన్నాడు.

ఇద్దరూ కోపంతో ఒకరిముఖాలొకరు చూసుకోకుండా వెళ్ళిపోయారు. ఈ సందర్భంలో మినాన్ స్టీనర్‌ను ముందుకు తోశాడు. ఆమె ఒంటరిగా ఉన్నప్పుడు అతను నెమ్మదిగా, 'చూచావూ, అతను నీమీద ప్రేమతో పడిచస్తున్నాడు. నా భార్యంటే కాస్త భయపడుతున్నాడు. అతన్ని కాస్త రక్షిస్తావుకదూ' అన్నాడు.

నానా ఏమీఅర్థంకానట్టు నటించింది. నవ్వి ముగ్గురివంకా చూసింది. తరువాత స్టీనర్‌తో, 'స్టీనర్, నువు నాపక్కన కూచుందువుగాని' అన్నది.

ప్రక్కగదిలోనుంచి నవ్వులూ, గుసగుసలూ, అందరూకలిసి ఒకేసారి మాటాడుతున్న గందరగోళం వినవస్తున్నాయి. హఠాత్తుగా అయిదుగురు స్త్రీలతో లాబోర్డెటీ ప్రత్యక్షమయ్యాడు. బ్లూడ్రెస్‌వేసుకొని గాగా

గంభీరంగాఉంది. నల్లనిసిల్కు ధరించింది కారోలైన్. టాటన్‌సీనిస్థనాలు పాలిచ్చే దాదిస్థనాల్లా వున్నాయి. మేరియా బ్లాండ్‌కూడా వచ్చింది. లాబో ర్డెటీ వీరందరినీ ఒకేబండిలో తీసుకునివచ్చాడు. బండిలో ఇరుక్కుని ఎలా సతమతమైనారో జ్ఞాపకంతెచ్చుకుని నవ్వుకుంటున్నారు.

నవ్వులాపుకుని, కరస్పర్శచేసి కాస్త సమాళించుకున్నారు.

'బోర్డ్‌నెవ్ ఏడీ?' అని ప్రశ్నించాడు ఫాష్‌రె.

'చాలా ఘోరం సుమా! పాపం అతను రావడానికి వీల్లేదు' అన్నది నానా.

'అవును. తలుపుసందున పడి అతని కాలికి దెబ్బతగిలింది' అన్నది రోజ్.

అందరూ విచారం వెలిబుచ్చారు. బోర్డ్‌నెవ్ లేకపోతే విందుకు అందమే లేదు. ఏమైనా అతనులేకపోవడం ఎలాగూ తప్పదు. వారు దేన్ని గురించో పెద్దగా మాటాడుతుండగా, మధ్యలో ఓ పెద్దగొంతుక విని పించింది 'తరువాత ఏమైంది, తరువాత ఏమైంది? నన్నిలా విస్మరించి తగలెట్టారన్నమాట!' అని.

పెద్దకేక. అందరూ అటుకేసిచూచారు. అతను బోర్డ్‌నెవ్. సైమన్ బుజంపై వాలి, రొజుతూ రొప్పుతూ కళేబరాన్ని ఈడ్చుకుంటూ వస్తు న్నాడు. తత్కాలానికి సైమన్‌మీదనే అతని ప్రేమానురాగాలు. సైమన్ బాగా చదువుకుంది. పియానోవాయిస్తుంది. ఇంగ్లీష్ నేర్చుకుందికూడాను. చూడముచ్చటగాఉంటుంది. నవ్వుతూ వినయంగా కనుపిస్తున్నా, ఆ చిన్నది బోర్డ్‌నెవ్ భుజపర్వతాలక్రింద అణిగిపోతోంది. బోర్డ్‌నెవ్ ఒక్కనిమిషం ఆగి వారందరినీ కలయచూచాడు.

'ఏమిటీ అంటున్నారు? చూడండి, మీరంటే నేనెలా పడివస్తు న్నానో' అన్నాడు.

సైమన్ ఒకఅడుగు కాస్త వడిగావెయ్యడంవల్ల అతనికాలుకొంచెం నేలకంటింది. సైమన్‌నుతిట్టి ఊపేశాడు. కాని ఆమెమాత్రం అలాగే చిరు నవ్వుతో, కొడతారేమోనని భయపడేజంతువులా తన చిన్నముఖాన్ని వంచు కొని, తన శక్తినంతా ఉపయోగించి అతన్నిమోసింది. ఇతరులుకూడా సహా

యానికి వచ్చారు. నానా, రోజ్‌లు ఒకపడకకుర్చీని ముందుకుతోశారు. బోర్డెనెవ్ అందులో కూలబడ్డాడు. అక్కడున్న అభినేత్రులందరూ వచ్చి అతన్నిముద్దాడారు.

ఇంకా ఎందరో అతిధులు వచ్చారు. గది కిటకిటలాడుతోంది. ప్లేట్లచప్పుడూ కప్పులచప్పుడూ ఆగింది. డ్రాయింగ్‌రూమ్‌నుంచి ఒకతగాదా వినవస్తోంది. హెడ్‌వెయిటరు పెద్దగొంతుకతో ఎవరిపైనో అరుస్తున్నాడు. నానాకు అసహనం ఎక్కువవుతూంది, ఇంకా విందు సిద్ధంకాలేదని. వెయిటర్లు ఏంచేస్తున్నారో చూడమని జార్జ్‌ని పంపింది. ఈలోగా మరికొందరు స్త్రీలు, పురుషులు గదిలో ప్రవేశించారు, వీరెవరోకూడా నానాకు తెలీదు. ఏంచెయ్యాలో తోచక బోర్డ్‌నెవ్‌ను, మినాన్‌ను, లాబోర్డెటీని అడిగింది. వారుకూడా తెలీదన్నారు. కౌంట్ వాండెవ్రెను అడగ్గా, ఆయన జ్ఞాపకం తెచ్చుకుని, కౌంట్‌ముఫత్ ఇంట్లో కలుసుకున్న యువకులనిచెప్పాడు. నానా అతన్ని అభినందించింది. సరే, మంచిదే. కొంచెం ఇరుక్కునికూచోవలసి వస్తుంది అంతే. మరో ఏడుకుర్చీలు ఏర్పాటుచెయ్యమని లాబోర్డెటీతో చెప్పింది. అతను గదిలోనుంచి వెళ్ళాడోలేదో సేవకుడు మరిముగ్గురినిప్రవేశ పెట్టాడు. ఈ మాటు పెద్దచిక్కేవచ్చిపడింది. గాభరాపడిపోతున్న నానా 'ఇదిన్యాయంకా'దన్నది తన సహజ గంభీరధోరణిలో. ఇంకా ఇద్దరురావడం చూచి పకాలుననవ్వింది—అంతా హాస్యాస్పదంగాతోచి. గాగా, రోజ్ తప్ప అందరూ నిల్చునేఉన్నారు. బోర్డ్‌నెవ్ నాలుగుకుర్చీలు తనే ఆక్రమించుకున్నాడు. మాటలు, ఆవులింతలు వినిపిస్తున్నాయి.

'ఏం అమ్మాయ్, ఇహ విందుకులేద్దామా? అందరూ వచ్చినట్టేగా?' అన్నాడు బోర్డ్‌నెవ్.

'ఆ! అందరూ వచ్చినట్టే' అన్నది నానా నవ్వుతూ.

తనచుట్టూ కలయచూచింది. కాని, అక్కడ ఎవరూ లేకపోవడం చూచి, ఆశ్చర్యపడినట్టుగా హఠాత్తుగా గభీరురాలైంది. ఒకఅతిథి కనుపించడంలేదు. అతన్నిగురించి ఆమె ఏమీమాట్లాడలేదు. వాళ్ళింకా వేచివుండాలి. కొంతసేపైనతరువాత వారు ఒకవ్యక్తిని గమనించారు. అతను పొడుగ్గాఉన్నాడు. అతనిముఖం గంభీరంగావుంది. విచిత్రం ఏమిటంటే అతను గదిలోప్రవేశించడం ఎవరూ చూడలేదు. పడకగదిలోనుంచి వచ్చి

వుండాలి. ఎవరో గుసగుసలాట్టం కాస్త నిశ్శబ్దాన్ని భేదించింది. కౌంట్ డి వాండెవ్రెకు తప్పకుండా అతను పరిచితుడై ఉంటాడు. ఎందుకనంటే వారిద్దరూ చాటుగా కరస్పర్శచేసుకున్నారు. అతను ఆ ప్రశ్నలకు చిరునవ్వుతో మాత్రమే సమాధానమిచ్చాడు అతను లండన్‌కు వివాహార్థంవెడుతున్న ఎవరో జమీందారని కార్‌లైన్ సవాల్‌చేసింది చాటుగా. ఆమె అతన్ని యెరుగును. ఆ తెలియడం బాగానేతెలుసు. ఈకథ స్త్రీలందరిలోను అల్లుకుంది. మేరియాబ్లాండు అత నొక జర్మన్ రాయబారి అన్నది పురుషులు అతన్నిగురించి ఏవేవో నిర్ణయాలుచెప్పారు. చూస్తే శ్రీమంతుడిలాకనుపిస్తున్నాడు. బహూశా ఈ విందుఖర్చు అతనే భరించి ఉండవచ్చు. చూస్తే అలాగే అనిపిస్తోంది. విందు కమ్మగాఉంటే ఎవరుభరిస్తేనేమిటి? అందరినీ ఏదో సందేహం బాధించసాగింది. ఈలోగా హెడ్‌వెయిటరు తలుపు తెరుచుకునివచ్చి, అమ్మా! అంతా సిద్ధమైంది' అన్నాడు.

నానా స్టీనర్ చెయ్యిపుచ్చుకుని లోనికి దారితీసింది. ఆ పెద్దమనిషి ఆమెవెనకాలే వెళ్ళాడు. అదీగాక జంటలుగా వెళ్ళడానికి అసలుకీల్లేదు. ఎలగైతేనేం స్త్రీ-పురుషులందరూ ఛలోక్తులాడుకుంటూ వచ్చారు. గదిలో ఆ కొననుంచి ఈ కొనవరకూ ఒకపెద్దటేబిల్ అమర్చబడిఉంది అయినా ఈ టేబిల్‌కూడా చిన్నదే. పళ్ళాలు ఒకదాన్నిఒకటి అంటుతున్నాయి. నాలుగు దీపస్థంభాలు గదినంతా దేదీప్యమానం చేస్తున్నాయి. పండ్లు ఫలాలు, కేకులు అన్నీ అమర్చబడ్డాయి.

'మీరందరూ మీ ఇష్టంవచ్చినట్టు కూర్చోండి' అన్నది నానా.

టేబిల్‌మధ్యగా ఆమె నిల్చునిఉంది. ఎవరికీతెలీని ఆ ముసలివ్యక్తి, స్టీనర్ ఆమె కిరుప్రక్కలా ఉన్నారు. అతిథులుకొందరు ఆసీనులవుతూండగా బైటనుంచి ఎవరో తిట్లవర్షం కురిపిస్తున్నారు. బోర్దునెవ్‌ను మరచిపోయారు. పెద్దగా అరుస్తూ అతికష్టంమీద కుర్చీలమీదనుంచి లేచి, సైమన్‌ను కేకలేస్తూవెళ్లాడు. స్త్రీలందరూ జాలిపడి అతినివద్దకు వెళ్లారు. కార్‌లైన్, క్లారిసీ, మేరియా అందరూ అతన్ని మోసుకొచ్చి కూచోపెట్టేసరికి బ్రహ్మాండమైపోయింది.

'నానాకు ఎదురుగా టేబిల్‌మధ్యగా కూచోపెట్టండి. బోర్దునెవ్ అధ్యక్షత వహిస్తాడు' అని అందరూ అరిచారు.

స్త్రీలందరూ అతన్ని అక్కడే కూచోబెట్టారు. ఇద్దరు స్త్రీలు గాయపడిన అతనికాలిని మరోకుర్చీమీద ఉంచారు. అలా కాలు ఉంచుతూంటే అతను మూలుగుతూ, 'అమ్మాయిలూ, మీరు తండ్రిని సరిగ్గాచూడాలి' అన్నాడు.

అతనికుడిప్రక్కన రోజ్, ఎడమప్రక్కన లూసీ స్టీవార్ట్ కూచున్నారు. అతన్ని జాగ్రత్తగా చూచేబాధ్యత వారిద్దరూ తీసుకున్నారు. ఇతరులందరూ ఎవరిస్థానాల్లో వారు ఆసీసులైనారు. కౌంట్ డి వాండెవ్రె లూసీకి, క్లారిసీకి మధ్యగా కూర్చున్నాడు. ఫాషెరె రోజ్‌కు కార్‌లైన్‌కు మధ్యకూచున్నాడు. టేబిల్‌కు మరోప్రక్కన హెక్టర్ డి లాఫలాసి గాగా ప్రక్కగా చోటుచేసుకున్నాడు. సైమన్, మేరియా బ్లాండ్ వగైరా గుంపుగా కూచున్నారు.

జార్జి, డానెట్ నానాను చిరునవ్వుతోచూస్తూ ఒక పైనౌకరు సానుభూతిచూపుకున్నారు. గదిలో అందరినీ కూరినట్టయింది.

వెయిటర్లు వడ్డన మొదలెట్టారు. బోర్డునెవ్ అందరికీ పులుసు వడ్డించుకోమని సలహా ఇస్తున్నాడు. ఈ సందర్భంలో తలపుతెరుచుకుని ఒక స్త్రీ, ఇరువురు పురుషులు ప్రవేశించారు. నానా కుర్చీలోనుంచి లేవకుండానే వాలుగా అటుచూచింది. ఆ స్త్రీ లూయీ వాయిలైన్. కాని ఆ పురుషులెవరో నానాకు తెలీదు.

వాండెవ్రె 'ఈయన ఫాకర్‌మాంట్—నా స్నేహితుడు. నౌకాశాఖలో ఆఫీసరు. నా ఆహ్వానంతో వచ్చాడు' అన్నాడు.

ఫాకర్‌మాంట్ నమస్కరించి, 'నేను నా స్నేహితుణ్ని ఒకతన్ని కూడా తీసుకొచ్చాను' అన్నాడు.

'మంచిది, దయచేసి కూచోండి. క్లారిసీ, కొంచెం జరుగమ్మా. దయచేసి అలాకూచోండి' అంటూ నానా మర్యాదచేసింది.

అందరూ ఒత్తుగా కూచున్నారు. కొత్తఅతిథులు చోటుచేసుకున్నారు. వెయిటర్లు పులుసుపళ్ళాలు ఖాళీచేసి, మరోపదార్థం వడ్డించసాగారు.

ఫ్రూలెరీ, ఫాంటన్‌లనుకూడా తీసుకురావాలనుకున్నానని బోర్డునెవ్ చెప్పాడు. నానా హఠాత్తుగా గంభీరురాలై వారికి రుచించనివిధంగా

వారిని ఆహ్వానించిఉండేదాన్నని చెప్పింది. పిలవదలుచుకుంటే తనే పిలిచే దాన్నంది. ముసలి బాస్కు వట్టితాగుబోతు. ఫ్రాలెరీ సుచ్చితం వెలిబుచ్చు తుంటాడు. షాంటన్‌కు సంఘంలో ఎలామెలగాలో తెలీదు. పెద్దమనుషుల్లో ఉండడానికి ఏవిధంగాను అర్హులుకారు.

'అవునవును' అన్నది మినాన్.

చక్కని సూట్లు వేసుకుని, టేబిల్‌చుట్టూ కూచున్న ఈ పెద్దమనుష లందరూ చాలా నాగరికంగా కనుపిస్తున్నారు. అదోవిధంగా తయారు చెయ్య బడ్డ మనుషుల్లా ఉన్నారు.

ముసలి పెద్దమనిషి పద్ధతి నేర్చుకున్నట్టుగా ఉంది రాజకీయ వేత్తల సభలో అధ్యక్షత వహిస్తున్నట్టుగా గంభీరంగా నవ్వుతున్నాడు. కౌంటెస్ ముఫత్ గృహంలోలాగా వాండెవ్రె మహామర్యాదగా సంచరిస్తు న్నాడు. ఇంతకంటె పెద్దమనుషులుండరని ఆ ఉదయమే నానా తన పిన తల్లితో చెప్పింది.

అందరూ చక్కగా ముస్తాబై ఫాషన్‌బుల్‌గా ఉన్నారు.

ఎవరూ ఎక్కువగా సంభాషించుకోడం లేదు. ఒకరికొకరు తెలియక పోవడంవల్ల పురుషులు ఒకర్ని ఒకరు కొత్తగాచూస్తున్నారు. స్త్రీలు నిశ్శ బ్దంగా ఉన్నారు.

జార్జికి వాళ్లు చాలా మందకొడిగా ఉన్నట్టు కన్పించింది.

వడ్డన సాగుతూండగా బ్లాంసీ బిగ్గరగా 'లూసీ, మాటు, నేను మీ ఆలివర్‌ను ఆదివారంనాడు కలుసుకున్నాను. ఎంత పెరిగాడనుకున్నావ్' అన్నది.

"అవును. పద్దెనిమిదేళ్ళువస్తే ఇంకా పెరక్కుండాఉంటాడా? నిన్న మళ్ళీ స్కూలుకు వెళ్ళిపోయాడు. వాడు పెరిగితే నేను చిన్నదాన్ని కాబోయినానా ఏమిటి?" అన్నది లూసీ.

లూసీ సగర్వంగా ఇంకా ఇలా చెప్పింది. ఆమె కొడుకు ఆలివర్ నౌకావిద్యాలయంలో చదువుతున్నాడట. తరువాత వాళ్ళు పిల్లల్ని గురించి మాట్లాడ సాగారు.

ఈ సంభాషణలో దిగగానే స్త్రీలందరూ మెత్తబడ్డారు. నానా తన పిల్లనుగురించి చెప్పింది. తనకెంతో సుఖంగాఉన్న దిప్పుడు. చిన్నారాయీ

తన పినతల్లితో ఉంటోంది. ఆమె ప్రతిరోజూ పిల్లను తీసుకొచ్చి తనకు చూపిస్తుంది.

నానా తనపక్కలో పడుకోబెట్టుకుని, ఆడించి ఆనందిస్తుంది. పసిపిల్లలు పక్కలో దూరడం చూస్తే ఎంతో ముచ్చటేస్తుంది. లూయీ మరీ చిలిపిపిల్ల అయిపోయింది.

రోజ్ తనపిల్లలసంగతి చెప్పింది, "నిన్న భలేతమాషాజరిగింది. నేను ఛార్లెస్‌ను, హెన్రీని చూడడానికి స్కూలుకు వెళ్ళాను. థియేటర్‌కు వస్తామని మారాంపెట్టారు. సరేనసగానే ఇహ వాళ్ళ సంతోషం చెప్పడానికి వీల్లేకపోయింది.

"చిన్నిచేతుల్తో చప్పట్లు చరుస్తూ, అమ్మ నటిస్తుంది. మనంచూడాలి అన్నారు."

రోజ్ ఇలాచెబుతూంటే పితృహృదయం ద్రవించి, సజలనేత్రుడై మినాన్ సంతృప్తిగా నవ్వాడు. 'నాటకం జరుగుతూంటే కళ్ళు ఇంతంత చేసుకుని వాళ్ళమ్మను చూడసాగారు. అమ్మకాళ్ళమీద చీరలేదేమని అడిగారు నన్ను' అన్నాడు.

అందరూ పకాలుననవ్వారు. మినాన్ విజయోత్సాహంతోనవ్వాడు. మినాన్‌కు వాళ్ళంటే ప్రాణం. అతని ఆశల్లా వాళ్ళకోసం ఎలాగో ఒకలా థియేటర్‌లోనో మరెక్కడనో రోజ్ సంపాదించిన సంపాదనంతా జాగ్రత్తగా కాపాడుతూ వాళ్ళకోసం నిలవచెయ్యాలి, మ్యూజిక్ హాల్‌లో బ్యాండులీడర్‌గా ఉన్న దినాల్లో అతను రోజ్‌ను వివాహంచేసుకున్నాడు.

రోజ్ పాడడానికి వచ్చేది, ఇద్దరూ గాఢంగా ప్రేమించుకొన్నారు. ఇప్పటికీ స్నేహంచెడకుండాఉంది. అన్నీ తమకుతామే ఏర్పరచుకున్నారు, రోజ్ తనశక్తిని, సౌందర్యాన్ని ధారపోసి శ్రమించింది. అతను ఆమె అభినేత్రిగా, ప్రఖ్యాతస్త్రీగా అభివృద్ధిచెందడంకోసమై తన ఫిడేల్‌వాయిద్యాన్ని వదలాల్సివచ్చింది. దంపతులు అన్యోన్యంగా ఉంటారు.

"పెద్దవాడి వయస్సెంత?" అని అడిగాడు వాండెవ్రె.

"హెన్రీకి తొమ్మిదేళ్ళు. కాని, బడితెలా పెరిగాడు" అన్నాడు మినాన్.

తరువాత స్టీనర్‌ను గురించి చెబుతూ, స్టీనర్‌కు పిల్లలుండి ఉన్నట్లయితే అలా ఆస్తిని పాడుచేసేవాడు కాదన్నాడు.

ఇలా మాట్లాడుతూనే ఒక్కపక్కగా అతన్ని చూడసాగాడు, నానాతో ఎలా ప్రవర్తిస్తాడో అని. కాని రోజ్, ఫాషరె ఒకరితో ఒకరు అతి చనువుగా మాట్లాడుకోవడం అతన్ని కాస్త కలవరపరిచింది.

రోజ్ ఇలాంటి పిచ్చివేషాలువేసి, కాలంవృథాపరచదని అతని విశ్వాసం. అలాచేస్తే తప్పకుండా దానికి అవరోధం కల్పిస్తాడు. ఇంకా పిల్లల్నిగురించిన సంభాషణ సాగుతూనే ఉంది. లాఫలాసి గాగాను ఆమె కుమార్తెను గురించి అడిగాడు. ఆపిల్లను వెరైటీథియేటర్‌లో చూచాడు. లిలీ బాగానే ఉంది. కాని ఇంకా పిల్లతనం పోలేదు. లిలీకి పంధొమ్మిదేళ్ళని చెప్పేసరికి అతను నిజంగా ఆశ్చర్యపోయాడు.

తనతోపాటు లిలీని ఎందుకుతీసుకురాలేదని ప్రశ్నించగా, గాగా ఉద్రిక్తురాలై, 'దాన్ని ఎక్కడికీ తీసుకురాను. మూడునెలల్రకితమే అది స్కూలు విడిచిపెట్టింది. వెంటనే పెళ్ళిచేసేద్దామనుకున్నాను కాని అది నన్నువిడిచి ఒక్కనిమిషమైనా ఉండలేదు. అందుకని నాదగ్గరే ఉంచుకున్నాను. అలా ఉంచుకోడం నా కేమాత్రం ఇష్టంలేదుసుమా' అన్నది.

ఈ విషయం చెబుతూ గాగా తననీలికళ్ళను అల్లార్చింది.

ఈ వయస్సులో గాగా నానాయాతనలూ పడుతున్నదంటే అహర్నిశలూ పనిచేస్తూ, పు ుషులకులొంగుతూ, ముఖ్యంగా తనకు మనుమలుకాదగిన చిన్నవాళ్ళకుకూడా లొంగుతూన్నదంటే - ఆ వివాహంకోసమే. ఇలా అంటూ లాఫలాసివైపుకు కొద్దిగా వంగింది. ఆమెభుజభాగం తగిలేసరికి అతను కాస్త ఎర్రబారాడు.

"అది ఏదైనా తప్పుచేస్తే అది మాత్రం నా బాధ్యత కాదు చిన్నతనంలో ఆడపిల్లలు చాలా విచిత్రంగా ఉంటారుసుమా!" అన్నది.

లూసీస్టివార్ట్ ఇంగ్లీషుకుటుంబానికి చెందిన పోర్టర్‌కూతురు. అతను రైల్వేలో పనిచేస్తున్నాడు. లూసీకి ముప్పయేళ్లుంటాయి. గుర్రం తలకాయ అయినా పోప్పులకు బాగానేఉంటుంది. క్షయతో గింజుకుంటుంది. కాని, చావదు. ఇప్పటికి ముగ్గురు రాకుమారులు, ఒక డ్యూక్ దానివల్లో

వద్దారు. కార్‌లైన్ ఒక పేదగుమాస్తాకూతురు. అతను అవమానం భరించ లేక మరణించాడు.

కార్‌లైన్ అదృష్టంకొద్దీ ఆమెతల్లిమాత్రం మంచి దిట్టమైన మనస్సుగలది. ఒక సంవత్సరంపాటు కూతుర్ని ఊరికే తిట్టిపోస్తుండేది. కాని మళ్ళీ కూతుర్ని యథాస్థానంలో ఉంచింది. పాతికేళ్ళకూతురు మార్కెట్‌లో మహాఅందగత్తెఅని పేరు సంపాదించుకుంది. రేటు మారేదికాదు. తల్లి చాలా ఖచ్చితమైన మనిషి కావడంవల్ల లెఖ్కలపుస్తకాలన్నీ పద్ధతిలో ఉంచేది. బ్లాంసీ అసలుపేరు జాక్లైన్. ఆమెది ఎమియన్స్‌వద్ద ఒక గ్రామం.

చక్కగా తీర్చిదిద్దినట్టు ఉంటుంది. కాని తెలివిలేటలు శూన్యం. శుద్ధ అబద్ధాలకోరు.

క్లారిసీ పారిస్‌కు పనిమనిషిగా వచ్చింది. ఆ సందర్భంలో ఆమె భర్తతో వ్యభిచరించడం తటస్థించింది. అతనిద్వారానే కొత్తవృత్తిలో ప్రవేశించింది.

మేరియా బ్లాండు, లూయీ వాయెలిన్, లీడీహారన్, అంతా ఇరవై యేళ్ళవరకు గొల్లనుకాచి బజారునపడినవారే. డావెట్ వీళ్ళచరిత్రలన్నీ బట్టబయలుచేస్తోంటే జార్జ్ అచేతనుడై నిర్దాక్షిణ్యంగా విన్నాడు.

కాండిల్స్‌వల్ల వాతావరణం బరువవుతోంది. టేబిల్‌చుట్టూ క్రిక్కిరిసి కూచున్న ముప్ఫైఎనిమిదిమందికి ఊపిరాడటంలేదు. వెయిటర్లలోకూడా ఓ విధమైన అశ్రద్ధ కలుగసాగింది. స్త్రీలు ఆహారాన్ని సగానికిసగం ప్లేట్లలో విడిచేశారు. నెనెమాత్రం అవురావురంటూ అన్నీ తినేసింది. ఎవరికీఆకలిగా లేదు. ఊరికే రుచికోసం తిన్నారు నానాప్రక్కనకూచున్న ముసలివ్యక్తి ఒక్కటీ ముట్టలేదు.

ఊరికే దిక్కులుచూస్తూ కూచున్నాడు. చాటుచాటుగా ఆవులింతలు ఎక్కువైనాయి. అప్పుడే కొందరికి కళ్లుమూతలుపడిపోతున్నాయి. కొందరి ముఖాలు అలిసిపోయినట్లుగా కన్పిస్తున్నాయి. ఒకవిధమైన మాంద్యం వ్యాపించింది. విందుల్లోకనుపించే కులాసా కనుపించడంలేదు. బోర్డ్‌నెవ్ అరుపులూ, కేకలూ లేకపోయినట్టయితే అందరూ హాయిగా నిద్రపోయేవారే.

లూసీ, రోజ్ అతన్నివిచారిస్తూ ప్రక్కనే కూచున్నారు. అతని ప్లేటు ఖాళీకాకుండా చూస్తున్నారు. అయినా అతను అరపదంమాత్రం మానలేదు. 'నాకు మాంసంముక్కలు ఎవరు కోసిస్తారు? టేబిల్ మైలు దూరాన ఉంది' అన్నాడు. సైమన్ మాంసంముక్కలుకోసి అతనికి అందిస్తూనేఉంది.

అతనితిండిచూసి స్త్రీలందరూ ఆశ్చర్యపోతున్నారు. వెయిటర్లను మళ్ళీమళ్ళీ పిలిచి, అతని ప్లేట్లు నింపిస్తున్నారు. సైమన్ అతనిమూతి కడిగింది. రోజ్, లూసీ అతనిప్లేట్లు మార్చారు. వీళ్ళసేవకు సంతోషించి, అతను ఆనందభరితుడై 'మంచిబాలికమ్మాయ్: ఆడవాళ్ళిందుకే పుట్టారు' అన్నాడు.

అందరిలో మళ్ళీ కొంచెం కదలిక రాసాగింది. మళ్ళీ సంభాషణ ప్రారంభమైంది. వెయిటర్లు నారింజరసం తీసుకొచ్చారు. అతిథులందరూ మందకొడిగా ఉండడం చూచి నానా బిగరగా మాట్లాడనారంభించింది.

'పారిస్ ప్రదర్శనానికి వస్తున్న స్కాట్లండ్‌రాకుమారుడు బ్లాండీ వీనస్ నాటకానికి బుక్‌చేశాడు. తెలుసా?' అన్నది.

"రాకుమారులందరువచ్చిచూస్తారనుకుంటాను" అన్నాడు బోర్డ్‌నెవ్.

"పర్షియారాజు షా ఆరిపాశంనాడు వస్తాడట" అన్నది లూసీ.

తరువాత రోజ్ షాయొక్క వజ్రాలనుగూర్చి మాట్లాడింది. అతను కొన్నిలక్షల విలువచేసే వజ్రాలుపొదిగిన గౌను వేసుకుంటాడు. ప్రదర్శనానికివచ్చే ఇతరరాకుమారులనుగురించి చెబుతోంటే స్త్రీలందరూ మెడలు నిక్కించి ఎర్రబడినకనులతో చూస్తూ ఆప్యాయంగా విన్నారు. అందరూ లోలోపల ఎవరో ఒకరాకుమారుని గాఢాలింగనం వాంఛించారు. ఒక్క రాత్రిలో రాణులమైపోవాలనుకున్నారు.

"అయితే రష్యాచక్రవర్తి వయస్సెంత?" అని అడిగింది కారొలైన్ వాండెవ్రేను.

అతను నవ్వుతూ, 'తగినఈడు కాదులే. ఏమీలాభంలేదు' అన్నాడు.

నానా తనకు చాలా కష్టంకలిగినట్టుగా నటించింది. సంభాషణ ముదిరిపోతోంది. కొందరు నిరసనగా వారిలోవారు గొణుక్కుంటున్నారు. ఇటలీ రాజునుగురించి బ్లాంసీ కొన్నివివరాలు చెప్పసాగింది. అతన్ని ఒకసారి

మిలాన్‌లో కలుసుకుంది. అంత అందగాడు కాదు. కాని, అంతమాత్రంచే సరసుడు కాకపోలేదు. విక్టర్ — ఎమాన్యుయల్ రావడంలేదని ఫాష్‌రె చెప్పేసరికి ఆమె చాలా నిరాశాపూరితురాలైంది. లూయీకి ఆస్ట్రియా చక్రవర్తి నచ్చాడు. హఠాత్తుగా మేరియాబ్లాండీ. 'ప్రష్యారాజు వృద్ధుడు. చెక్కపేడులా ఉంటాడు. నేను బేడెన్‌లో ఉండగా కౌంట్ బిస్మార్కుతో చూచేదాన్ని రోజూ' అన్నది.

"కౌంట్ బిస్మార్క్! ఆయన్ను నే నెరుగుదును. భలే మజామనిషి" అన్నది సైమన్.

"అదే నేనూ నిన్న చెప్పాను. ఎవరూ విన్నారుకారు" అన్నాడు వాండెవ్రె.

కౌంటెస్ సెబైన్ గృహంలోలాగానే చాలా సేపు కౌంట్‌బిస్మార్క్‌ను గూర్చి మాట్లాడుకున్నారు. వాండెవ్రె అవేమాటలు మళ్ళీ చెప్పాడు.

ఆ గది ఒకనిమిషంపాటు కౌంటెస్‌సెబైన్ డ్రాయింగ్ రూములా అయింది. అలాగే కాస్సేపు సంగీతాన్నిగురించి చర్చించుకున్నారు. తరువాత పారిస్‌లో అందరూ చెప్పుకుంటున్న సన్యాసినికానున్న యువతి విషయం వచ్చింది. ఆ విషయంలో నానా చాలా ఆసక్తిచూపింది. అతి శ్రద్ధతో ఆ కథంతా చెప్పించుకుని విన్నది.

ఆ యువతి సజీవసమాధిలోకి ప్రవేశించడంచూస్తే ఎవరిమనస్సు చలించదు? స్త్రీలందరూ ఈ కథ విని, కరిగిపోయారు. విన్నమాటలే విని, విసుగెత్తిపోయిన జార్జి, డానెట్‌ను నానాయొక్క వ్యక్తిగత అలవాట్లను గురించి చెప్పమని అడిగాడు. మళ్ళీ సంభాషణ కౌంట్ బిస్మార్క్‌వైపుకు మళ్ళింది.

నెనె లాబోర్డెటీని రహస్యంగా కౌంట్ బిస్మార్క్ ఎవరని అడిగింది.

లాబోర్డెటీ చల్లగా ఎవరూ కనివిని ఎరుగని అబద్ధమాడాడు. బిస్మార్క్ అపక్వమాంసం తింటాడట. స్త్రీ చిక్కితే ఎత్తుకుపోతాడట. అతనికి 42 ఏళ్ళయినా, అప్పుడే 32 మంది పిల్లలున్నారట.

"నలభై ఏళ్ళు! ముప్ఫయియిద్దరుపిల్లలు!" అన్నది నెనె ఇంత నోరు చేసుకుని—'అయితే చాలా వాడిపోయి ఉంటాడు.'

అందరూ పకాలుననవ్వగా, అది తననుగురించేనని తెలుసుకుని 'ఎంత పిచ్చిదాన్ని! అయినా ఏమి టీ సరసాలు!' అన్నది.

గాగా ప్రదర్శనాన్నిగురించి మాట్లాడడం మానలేదు. ఇతర స్త్రీ లందరిలాగానే ఆమెకూడా ప్రదర్శనానికి తయారవుతోంది. ప్రదర్శనం రోజుల్లో పారిస్ మహావైభవంగా ఉంటుంది. ఎందరో విదేశీయులు పారిస్ నగరానికి తండోపతండాలుగా వస్తారు. ప్రదర్శనం ముగిసినతరువాత అన్నీ సక్రమంగా సాగినట్టయితే ఆమె జూనిసిలోని తన చిన్న బంగాళాకువెళ్ళి, విశ్రాంతి తీసుకోవచ్చు.

లాఫలాసిమోకాలు కొద్దిగా తన మోకాలికి తగిలి గాగా కొంచెం మెత్తబడింది. అతనిముఖం ఎర్రబారింది. ఆమె అతనిపై నిశితదృక్కులు ప్రసారించసాగింది. కుర్రాడు అంత శ్రీమంతుడుకాడు. అయినా పరవా లేదు. లాఫలాసి ఆమె ఎడ్రస్ తీసుకున్నాడు.

"అటుచూడు, గాగా నీ హెక్టర్‌ను దోచేస్తోంది" అన్నాడు వాం డెవ్రె క్లారిసీతో.

"ఏడ్చిందిలే. అత నో వెర్రివాడు. ఇదివరకు మూడుసార్లు అతన్ని వెళ్ళగొట్టాను. అయినా. కుర్రాళ్ళు ముసలిముండలకోసం ప్రాకులాట్టం చూస్తే, నాకు చెడ్డచిరాకేస్తుంది" అన్నది ఆ అభినేత్రి.

ఇలా అంటూ బ్లాంసీవంకచూస్తూ తల ఊపింది. విందు ప్రారంభమై నప్పటినుంచీ తన నగ్నభుజాలు ఆ ముసలివ్యక్తికి కనుపించేట్టు చెయ్యాలని మహా అవస్థపడుతోంది.

"నీపనికూడా అయిపోతోంది బాబూ" అన్నది క్లారిసీ వాండెవ్రెతో.

వాండెవ్రె ఏమీ లెక్క చెయ్యనట్టు ఒక చిన్న చిరునవ్వు విసిరే శాడు. బ్లాంసీ విజయయాత్రకు అతను అడ్డురాదలుచుకోలేదు. స్టీనర్ స్వయంప్రదర్శనం అతన్ని ఎక్కువగా ఆకర్షిస్తోంది. ప్రణయకలాపాలకు అతను పెట్టిందిపేరు. వ్యాపారంలో తిమ్మినిబ్రహ్మిచేసి, వేలుగడించిన ఆ జర్మన్ జ్యూ వణిజుడు, ఆడది కనుపిస్తే చాలు, పిల్లిలా అయిపోతాడు. థియేటర్‌కు కొత్తపిల్లలంటూ వస్తేసరి - ఎంతఖరీదైనా దాన్ని పట్టితీరా ల్సిందే. భీకరమైన ఈ ఆకలి అతన్ని ఇంతవరకు రెండుసార్లుదివాలాతీయిం చింది. మళ్ళీ ఎలాగో కోలుకున్నాడు. ఇప్పుడు నానా వన్నెచిన్నెలకు

అతను మురిసిపోతున్నాడు. మళ్ళీ స్టీనర్ వల్లోపడ్డాడు. నానా ప్రక్కన స్తబ్ధుడైకూచుని, ఆకలిలేకపోయినా తదేకధ్యానంతో భోంచేస్తున్నాడు. నానా ఇంకా రేటు చెప్పలేదు. అతన్ని రాచుకుంటూ, అతనిచెవిలో చిన్న చిన్న రహస్యపునవ్వులు ఊదుతూ, ఛలోక్తులాడుతూ అతనితో ఆడుకుంటోంది.

వాండెవ్రె లూసీస్టివార్ట్‌ను కొంచెం కదిపాడు. ఆ సాయంత్రం మినాన్ ప్రవర్తన ఆమెకు విసుగెత్తించింది.

'అతను ఎలాంటి పనికైనా సిద్ధమవుతాడు' అన్నది కౌంట్‌తో. జాంకియర్ విషయంలో చేసినట్టుగానే ఇక్కడకూడా చేదామనుకుంటున్నాడు. జాంకియర్ కొన్నాళ్ళు రోజ్‌తో కాలక్షేపంచేశాడు. తరువాత అతనికి లారెమీద కన్నుపడింది. మినాన్ వెళ్ళి, వాళ్ళిద్దరికీ అన్ని ఏర్పాట్లు చేసివచ్చి, మళ్ళీ చెయ్యిపుచ్చుకుని రోజ్ వద్దకు తీసుకొచ్చాడు. కాని ఇప్పుడుమాత్రం అలాంటివేమీ సాగవు - నానా చేతిలో చిక్కిన మనుష్యలను వదిలిపెట్టదు.

"మినాన్‌భార్యవంక ఎందు కలా కోపంగా చూస్తున్నాడు?" అని అడిగాడు వాండెవ్రె.

రోజ్ ఫాషరెను తీయతీయగా మచ్చికచేసుకుంటోంది. వాండెవ్రెకు లూసీ ఎందుకలా మాట్లాడిందో ఇప్పు డర్థమైంది. నవ్వుతూ, 'నీకు అసూయ కదూ?' అన్నాడు.

"అసూయ!" అన్నదిలూసీ కోపంతో. 'కావాలంటేరోజ్‌కు లియన్‌ను ఇచ్చేస్తాను. ఆత నెవరికొక్కావాలి? వారానికి ఓ పూలగుత్తి ఇస్తాడో ఇవ్వడో మహా! ఈ థియేటర్ తారలందరూ ఒకటే. నానామీద వ్యాసం చదివినప్పుడు రోజ్ ఏడ్చింది. నాకు తెలుసు. నేనైతే ఇట్లాంటివాటికి లెఖ్ఖచేసేదాన్నికాదు, వెళ్ళగొట్టేదాన్ని. ఏమైనా అదంటే నా కసహ్యం. నేనే మొగుణ్నయి ఉన్నట్టయితే దానిపనిపట్టించేదాన్ని. దానికీకూడా ఫాషరె సంగతి తెలీదు. వాడు ప్రపంచంలో పైకిరావడంకోసం ఎవరో ఒకఆడదాన్ని పట్టుకుని వ్రేలాడుతూంటాడు. అందరూ అందరే' అన్నది,

వాండెవ్రే ఆమెను చల్లబరచడానికి యమయత్నంచేశాడు. లూసీ,

రోజ్‌లు పరిత్యజించడంవల్ల బోర్డ్‌నెవ్, తను ఆకలితో, దాహంతో చస్తూంటే అందరూ చూస్తూకూచున్నారని కేకలెయ్యడం మొదలెట్టాడు. ఈకేకలు అతిథులలో ఒకవిధమైనకులాసా రేకెత్తించాయి. విందుముగిసే టట్టు కనుపించడంలేదు. అందరూ తినడంమానేసి, షాంపేన్ సేవించడం మొదలెట్టారు. షాంపేన్ అందరినరాలలో మత్తురేకెత్తిస్తోంది. వాళ్ళ ప్రవర్తన స్వేచ్ఛగా మారసాగింది. స్త్రీలందరూ టేబిల్‌మీదికి వంగికూచు న్నారు. పురుషులు హాయిగా గాలిపీల్చుకోడానికి కుర్చీల్లో వాలారు. సూట్లు వివిధ రకాలైన డ్రెస్సులు, స్త్రీలనగ్నభుజాలు - గదంతా మిలమిలలాడుతోంది. వాతావరణం వెచ్చనవుతోంది. దీపకాంతి పచ్చగా మారుతోంది. ఉంగరాల రాళ్ళు తళతళమెరుస్తున్నాయి. అందరిని ఉత్సాహాతిశయాలు ఆవరించాయి. నవ్వు కళ్ళనలంకరించింది. చిరునవ్వు పువ్వులుపూశాయి. దీపకాంతిలో షాంపేన్ గ్లాసులు మిలమిల్లాడిపోతున్నాయి. బిగ్గరగా విసురుళ్ళూ, ఛలో క్తులూ ప్రారంభమైనాయి. అందరూ అభినయం ప్రారంభించారు.

'అమ్మాయిల్లారా! రేపురాత్రికి నాటకముంది - మరిచిపోయేరు. షాంపేన్ కాస్త తగ్గించితాగండి' అంటూ కేకవేశాడు బోర్డ్‌నెవ్.

'ప్రపంచంలో అన్నిరకాల పానీయాలూ చవిచూచాను. విషంలాం టివికూడా పుచ్చుకున్నాను. ఎన్నడూ అవి నన్నేమీ చెయ్యలేదు. నాకెప్పుడూ స్మృతిపోదు, ఎప్పుడూపోదు' అంటూ ఫోకర్‌మాంట్ చల్లగా కుర్చీలో కూచుని తాగసాగాడు.

'కావచ్చు. కానీ, ఇహ తాగకు. ఇప్పటికే చాలాఎక్కువైంది. రాత్రంతా నిన్నుసాకేసరికి నా దుంపతెగుతుంది' అన్నది లూయీవాయ్‌లిన్.

లూసీస్టివార్ట్ కపోలాలు త్రాగినమత్తుతో కొంచెం ఎర్రబారాయి. రోజ్ కళ్ళు చెమ్మగిలి కరుణకలిగిస్తున్నాయి, నెనె బాగా తిని, తాగి తన చాదస్తానికి తనలో తానే నవ్వుకుంటోంది. బ్లాంసీ, కార్‌లైన్, సైమన్ మేరియా, అందరూ గుంపుగా కూచుని తమఆంతరంగిక వ్యవహారాలు ఒకరి కొకరు చెప్పేసుకుంటున్నారు. ఒక జట్కావాడితో తగాదా, ఏదో దేశా నికి ప్రయాణం, దొంగిలింపబడి, మళ్ళీ చిక్కిన ప్రేమికులు-ఏవో ఇలాంటి విషయాలే. ఒకకుర్రాడు లీ-డీ-హారన్‌ను ముద్దాడబోయి, చిన్న లెంపకాయ తిన్నాడు. 'వెళ్లు అవతలికి' అని గదిమిం దామె. బాగాతాగి నానా సాన్ని

ధ్యంలో ఉండడంవల్ల కైపెక్కిన జార్జ్, తనమనస్సులో ఉన్న ఒక ఆలో చనను అచరణలో పెట్టడానికి పస్తాయిస్తున్నాడు. టేబిల్‌కిందదూరి కుక్క లాగా నానా కాళ్ళదగ్గర పడుకోవాలని ఆ ఆలోచన. అలా చేసిఉన్నా అతన్నెవరూ చూడగలిగిఉండేవారుకాదు. అతనుకూడా కిక్కురు మన కుండా ఉండేవాడు. లెంపకాయతిన్న కుర్రాడికి సరిగ్గా ప్రవర్తించమని డానెట్ చిన్నసీతిబోధచేశాడు. జార్జి ఎందువల్లనో తననునిందిస్తున్నట్టు బాధపడ్డాడు. అతని కేమీ తోచడంలేదు. అంతా భారంగా బాధగా ఉంది. బ్రతుకే వృధా అనిపిస్తోంది. డానెట్ అతనితో చిన్న పరాచకమాడి ఒక గ్లాసు మంచినీళ్ళుతాగించి, ఒంటరిగా ఆడదిదగ్గరుంటే ఏంచేస్తావని ప్రశ్నిం చాడు. మూడుగ్లాసుల షాంపేన్‌కే అతను తల్లకిందులైపోయాడు.

ఫాకర్‌మాంట్ మళ్ళీ ప్రారంభించాడు, 'ఉదాహరణకు చూడండి. హవానాలో అడవిమూలికలనుంచి ఓవిధమైన సారాయి తయారుచేస్తారు. అది తాగితే నిప్పులుతాగినట్టే. చూచారూ, ఒకరాత్రి దాన్ని రెండు 'పింట్లు' తాగాను. కాని ఏమీ చలనంలేదు. మరోసారి కారమాండల్ తీరాన అడవిజాతులవాళ్ళు ఏదోసారాయి తీసుకొచ్చి ఇచ్చారు. అప్పుడూ అంతే. నా కెప్పుడూ మత్తురాదు' అన్నాడు.

కొంతసేపటివరకు ఎదురుగాకూచున్న లాఫలాసి అంటే ఎందుకో ఆదోవిధమైన నిరసనభావం వహించాడు. హేళనచెయ్యసాగాడు, లాఫ లాసి ఊరికే అటూఇటూ తిరగడం మొదలెట్టాడు, గాగాకు దూరమై పోకుండా, కాని ఒక పెద్దఅందోళన అతన్ని ఆవహించసాగింది. అతనిచేతి రుమాలు ఎవరో తీసుకున్నారు. తాగినవాడిలాగా మొండిగా ఎవరుతీసు కున్నారని పదేపదే అడగసాగాడు. కుర్చీలకింద వెదికాడు. గాగా అతన్ని శాంతింపచేయడానికి యత్నించగా, 'లాభంలేదు. దానిమీద నాపేరు రాసి ఉంది' అన్నాడు.

'ఏమని రాసి ఉంది? ఫలమోసి అని రాసి ఉందా? మఫలాసి అని రాసి ఉందా?' అన్నాడు ఫాకర్‌మంట్ అతనిపేరును వికృతంచెయ్యడానికి యత్నిస్తూ.

లాఫలాసి కోపోద్దీపితుడైనాడు. తన తాతలతరాలన్నీ ఏకరువు పెట్టాడు. వాండెగ్రైవ్ జోక్యంకలిగించుకుని ఊరికే తమాషాకన్నాడని సర్ది

చెప్పవలసివచ్చింది అందరూ నవ్వకుండా ఉండలేకపోయారు. లాఫలాసి చల్లబడి, పిల్లాడిలాగా నిశ్శబ్దంగా కూచున్నాడు. గాగా మళ్ళీ అతనిచేరువగా కూచుంది. మళ్ళీ ఫాకర్మంట్ లాబోర్డెటీమీద విరుచుకుపడ్డాడు. లూయీ అతన్ని శాంతింపచెయ్యాల్సివచ్చింది. అతను ఎప్పుడు తగాదాలోకి దిగినా తన ప్రాణంమీదికి వస్తుందన్నది లూయీ. లాబోర్డెటీని 'అమ్మగారూ' అని స్త్రీవాచకంతో పిలిచాడు. ఇలాపిలవడం అతన్నెంతో సంతోషపెట్టింది. లాబోర్డెటీ 'ఊరుకో అబ్బాయ్, పిచ్చోత్తేను' అన్నాడు.

అతనుమాత్రం అనడం మానలేదు. లాబోర్డెటీ వాండెవ్రెతో, 'నీ స్నేహితుడు ఊరుకునేట్టుచెయ్యి. నాకు కోపంతెప్పించుకోడం ఇష్టంలేదు' అన్నాడు.

అతను ఇంతవరకు రెండుద్వంద్వయుద్ధాల్లో పాల్గొన్నాడు. అందరూ అతనికి ఎదురుగా తిరిగారు. లాబోర్డెటీ పురుషత్వం పునరుద్ధరించేబాధ్యత వాండెవ్రెపై పడింది. మిగ్నాన్, స్టైనర్, బోర్డ్‌నెవ్ అంగయూ కేకలేస్తూ ఈ విచిత్రకల్లోలంలో జోక్యంకలిగించుకున్నారు. నానాప్రక్కనఉన్న ముసలాయనమాత్రం నిశ్చలంగా ఈ కల్లోలాన్నంతా పరిశీలిస్తూ నిల్చున్నాడు,

'కాఫీకూడా ఇక్కడికేతెప్పిస్తే బావుంటుంది' అన్నాడు బోర్డ్‌నెవ్.

నానా వెంటనే సమాధానం చెప్పలేదు. విందు ఆరంభమైనది మొదలు ఆమె ఆదోలా ఉంది. తన ఇంట్లో తానున్నట్టుగాలేదు. ఈ జనసందోహంలో, వీళ్ళకేకలలో, అరుపుల్లో ఆమెను ఒకవిధమైన అచేతనత్వం పట్టుకుంది. వాళ్ళందరూ హోటల్లోలాగానే కులాసాగా హాయిగా స్వేచ్ఛగా ఉన్నారు. ఆమెకూడా గృహయజమానురాలుగా తన బాధ్యతలను విస్మరించింది.

స్టీనర్ పక్కన కూచుని, ప్రధానంగా అతనివిషయమే పట్టించుకుంది. అతని పక్కన కూచుని, విలాసినిలా నవ్వుతూ, అతను చెప్పేవన్నీ విన్నది. షాంపేన్ ఆమె గులాబిరంగును మరీ ఎక్కువ చేసింది. పెదవులు తడిగా ఉన్నాయి. కళ్ళల్లో కొత్తమెరుపు ఏర్పడింది. భుజాల కదలికకూ, కామోద్దీపకమైన ఆమె మెడతిప్పుటకూ అతను విచలితుడైపోతున్నాడు. ఆమె చెవిదగ్గర ఒక చిన్న మచ్చ కనపడింది. అతను ఇంచుమించుగా పిచ్చివాడైపోయాడు. అప్పుడప్పుడు నానా తనఅతిథులను స్మృతికితెచ్చుకుని తనకు

కూడా అతిథిసత్కారం చెయ్యడం చాతనవునన్నట్లు నటించసాగింది. విందు ముగింపుకువచ్చేసరికి ఆమెకు కొంచెం మత్తు కలిగింది. ఇది ఆమెకు చిరాకు కలిగించింది. షాంపేన్ తాగితే సరి ఆమెకు తక్షణం మత్తెక్కుతుంది. తరు వాత ఆమెకు ఒక ఆలోచనవచ్చి చాలా అలుపు కలిగించింది. తన గదిలో అసభ్యంగా ప్రవర్తిస్తూ స్త్రీలందరూ నీచమైన గమ్మత్తు చేస్తున్నారు.

నానా అది బాగా గమనించింది. లాబోర్డెటీపై ఫాకర్‌మంట్‌ను ఉసికొల్పుతూ లూసీ కన్నుగీటుతోంది. రోజ్, కార్‌లైన్, ఇతర స్త్రీలందరూ పురుషులను రెచ్చగొడుతున్నారు. తనగదులన్నీ కల్లుంగడిలాచేశారు. ఆమె కాస్త మత్తుగాఉన్నా, అందరిలోకీ నిగ్రహంగా ప్రవర్తిస్తోంది.

"అమ్మాయ్, కాఫీ ఇక్కడికే తెప్పించు నేను లేవలేను" అంటు న్నాడు బోర్డ్‌నెవ్.

నానా కుర్చీలోనుంచి తోకతొక్కినతాచులా లేచింది. స్టీనర్, ముసలాయన ఆశ్చర్యచకితులైనారు. 'మంచిది ఇహ ఇలాంటివాళ్ళను ఎప్పుడూ పిలవగూడదని తెలిసివచ్చింది' అన్నది. డైనింగ్‌రూమ్‌చూపుతూ, 'కాఫీ కావలసిఉంటే అక్కడుంది' అన్నది.

అందరూ లేచి డైనింగ్‌రూమ్‌వైపు వెళ్ళారు. నానా కోపాన్ని గమనించకుండానే బోర్డ్‌నెవ్ గోడలుపట్టుకుని పాకుతూవెళ్ళాడు-దిట్టంగా తిని, తన్ను వదిలివేసివెళ్ళిన స్త్రీలను నానా శాపనార్థాలు పెడుతూ. వెయి టర్లు బల్లలు ఖాళీచేసివేస్తున్నారు.

"అమ్మయ్య! ఇక్కడ అంత వెచ్చగాలేదు" అన్నది గాగా డైనింగ్ రూమ్‌లో ప్రవేశిస్తూ.

తలుపు తెరిచేఉంచబడింది. రెండుదీపాలు వెలుగుతున్నాయి. టేబిల్ మీద కాఫీ, కొన్నిపానీయాలు తయారుగాఉన్నాయి. కుర్చీలు లేవు. అందరూ నిల్చునే కాఫీసేవించారు. పక్కగదిలో వెయిటర్ల గొడవ ఎక్కు వయింది. నానామాత్రం అదృశ్యురాలైంది. ఏవరూ ఆ విషయం పట్టించుకో లేదు. ఆమె లేకపోయినా, ఎవరికివారు సహాయభూతులవుతూ ఎవరిపనులు వారు ముగించుకున్నారు. అనేకగుంపులు తయారైనాయి. నవ్వులు కేరింతలు, సైగలూ-అన్నీను.

"ఫాష్‌రెను ఒకరోజున మనయింటికి భోజనానికి పిలవాలి" అన్నది రోజ్,

మినాన్ ఒకసారి జర్నలిస్టుపై తీక్షదృక్కులు ప్రసారించాడు. రోజ్‌కు పిచ్చెత్తినట్టున్నదనుకున్నాడు. అతను ఇలాంటివాటికై వృధాగా డబ్బుపారబోయడానికి ఒప్పుకోడు. ఒకవ్యాపారానికయితే సరేసరి; మరి, తరువాతమాత్రం వీలుపడదు. అయినా, తనభార్య ఒక్కొక్కసారి ఎవరిమాటా పట్టించుకోదనీ, తనపోవన తను పోతుందనీ అతనికితెలుసు. అందుచేత అతను అప్పుడప్పుడూ ఆమెను ఆమె ఇష్టంవచ్చినట్టుగానే చెయ్యనిస్తుంటాడు. 'తప్పకుండా. నాకెంతో సంతోషం. రేపే ఎందుకురాకూడదు? ఏమంటావు మిస్టర్ ఫాష్‌రె?' అన్నాడు.

లూసీ ఈ ఆహ్వానాన్ని పరోక్షంగా విన్నది. బొంకర్‌తో మెల్లగా, 'అందరికీ ఇదేపిచ్చి. ఒకదు నా పపీనికూడా కాజేశారు. నిజంచెప్పు, ఇప్పుడు నువు ఆమెనువదలిపెట్టావంటే అది నా తప్పా?' అన్నది.

రోజ్ తలతిప్పి ఈ మాటలు విన్నది. స్టీనర్‌వైపు ఏకాగ్రంగా చూస్తుంటే ఆమెముఖం వివర్ణమైపోయింది. ఆమెత్యజించబడిందన్న క్రోధం పెల్లుబికి, ఆమెకండ్లు అరుణిమవహించాయి. మినాన్‌కంటె చక్కగా ఆమె ఈ విషయాన్ని గ్రహించింది. జాంకియర్ విషయంలో జరిగినట్టు మళ్ళీ జరక్కూడదు. ఆమె ఫాష్‌రెను పొందితీరుతుంది. ఎందుకు మొదలెట్టినప్పటి నుంచీ అతనంటే ఆమెకు అపోవిధమైన ఆకర్షణ బయల్దేరింది.

"నీవు పోట్లాటవేసుకోవు కదా?" అన్నాడు వాండెవ్రె లూసీతో.

"ఏమీభయంలేదు. మరేంలేదుకాని, ఆమె ఊరుకుంటే బావుంటుంది" అన్నదీ లూసీ. ఇలాఅని గంభీరమైన సగర్వస్వరంతో ఫాష్‌రెను పిలిచి, 'యువకుడా. నీ చెప్పులు నా ఇంట్లో ఉన్నాయి. రేపు పంపిస్తాను' అన్నది.

ఫాష్‌రె ఒక చిన్నవిసురు విసురుదామనుకున్నాడు. కాని ఆమె రాణీలా కదలివెళ్ళింది. క్లారిసీ ఇదంతాచూస్తూ నిల్చుంది. పురుషుడు కనిపిస్తే స్త్రీలెంత గొడవచేస్తారు! తను తలచుకున్నట్టయితే నాగాగుడ్లు పీకేసి ఉండేది. కాని తను ఏమీ లెక్కచెయ్యలేదు. బాఫలాసి తనదగ్గరకు రాగా,

'మీరు వాళ్ళు పచ్చగా ఉండడంచూస్తూ ఊరుకోలేరు. వాళ్ళు నశించిపోవ డమే మీకిష్టం' అన్నది.

లాఫలాసి చాలా అలిసిపోయినట్టుగా కనిపిస్తున్నాడు. క్లారిసీ వింది స్తోంచే అనుమానిస్తూ, 'నువ్వే నా రుమాలు తీసుకున్నావ్, ఇచ్చెయ్' అన్నాడు.

"ఏం రుమాలు గొడవ వచ్చిందయ్యా! అబ్బాయ్. నీ రుమాలు నే నెందుకు తీసుకుంటాను చెప్పు' అన్నది క్లారిసీ.

'ఎందుకేమిటి' నా బంధువులకు పంపించడానికి. వాళ్ళకు నాకూ రాజీకుదర్చడానికి' అన్నా డతను.

ఈలోగా ఫాకర్‌మంట్ బాగా తాగేస్తున్నాడు. స్త్రీలమధ్య కూచుని కాఫీతాగుతున్న లాబోర్డెటీని హేళనచెయ్యడంమానలేదు. పిచ్చి పిచ్చిగా ఏదో తాగుతున్నాడు. 'ఒకగుర్రాలవాడికొడుకు - వాడికి ఒక జమీందారిణికి పుట్టాడనేవారు - వట్టి బికారి - కాని ఎప్పుడూ జేబులో వందరూపాయలు లేకుండా ఉండేవాడుకాదు - ఎప్పుడూ ఆడపిల్లలకు చాకిరీ చేస్తుండేవాడు - ఎప్పుడూ వాళ్ళతో పడుకునేవాడుకాదు.' - ఇలాగా, ఇలా మాట్లాడి మాట్లాడి, ఒకగ్లాసు విసిరికొట్టాడు. లాబోర్డెటీవైపు నడుస్తూ, హఠాత్తుగా కూలబడిపోయాడు. స్పృహ పూర్తిగా తప్పిపోయేటట్టు తాగాడు. లూయిసీ వాయిలిన్ చాలా గాభరాపడింది. గాగా ధైర్యం చెప్పింది. అతన్ని అను భవంగల స్త్రీలాగా పరిశీలించి ఏమీ ప్రమాదంలేదని హామీయిచ్చింది. పడు కోపెడితే పది పదిహేనుగంటలు ఢోకాలేకుండా నిద్రపోతాడన్నది. అతన్ని అక్కడనుంచి తీసుకెళ్ళారు.

'నానా ఎక్కడికెళ్ళింది?' అని అడిగాడు వాండెవ్రె.

విందుముగిసినప్పటినుంచీ నానా కనుపించడంలేదు. ఇప్పటికి అంద రికి ఆమె జ్ఞాపకంవచ్చింది. అందరూ అడగడం మొదలెట్టారు.

స్టీనరుకు గాభరా ఎక్కువైంది, వాండెవ్రెను అడిగాడు. ముసలి వ్యక్తికూడా కనుపించడంలేదు. కౌంట్ నెమ్మదిగా అతనిభయంతీర్చాడు. ఆ ముసలివ్యక్తి చాలా గొప్ప విదేశీయుడు. అతనిపేరు చెప్పడం అనవ సరం. చాలా శ్రీమంతుడు. విందుఖర్చులు భరించడం అతనికి సరదా. అందరూ మళ్ళీ నానాను మరిచారు. తలుపుదగ్గరనిల్చుని డానెట్ వాండెవ్రెను

రమ్మని పైగ చేశాడు.... అతడు పడకగదిలోకి వెళ్ళేసరికి నానా అక్కడ కూచునిఉన్నది. ఆమె పెదవులు తెల్లగా పాలిపోయిఉన్నాయి. జానెట్, జార్జ్ ఆజ్ఞాబద్ధుల్లాగా నిల్చునిఉన్నారు.

"ఏమి టిలా వున్నావు?" అన్నాడు వాండెవ్రె ఆశ్చర్యంతో. ఆమె సమాధానం చెప్పలేదు. అతనివంక చూడనుకూడా చూడలేదు. మళ్ళీ అతను అదే ప్రశ్న వేశాడు.

"నాయింట్లోనే పరిహాసంపాలుకావడం నాఉద్దేశం కాదు. అదీ సంగతి" అన్నది నానా సూటిగా.

తరువాత నోటి కేదివస్తే అదల్లా మాటాడింది. తనకు ఆమాత్రం జ్ఞానంలేకపోలేదు, తను అన్నీ గమనిస్తూనేఉంది. విందుసమయంలో అందరూ తనను హాస్యాస్పదంచేశారు. ఘోరమైనమాటలు అనేశారు, తాననేది ఒకటె ఉన్నదన్నైనా గమనించకుండా తన బూట్లు పాలిష్‌చెయ్య డానికిగూడా పనికిరాని వట్టి లంజలు! ఇహ చాలు, ఇంతటితో బుద్ధివచ్చింది. ఈదఫాతోసరి. వాళ్ళను ఎందువల్లనో వెళ్ళగొట్టలేదు. నానా కోపంతో ఉడుకెత్తి వెక్కి-వెక్కి ఏడ్చింది.

"ఊరుకో పిచ్చిపిల్లా! తాగివున్నావు. కాస్త నిగ్రహం వహించాలి" అన్నాడు వాండెవ్రె.

"తాగితే తాగిఉండొచ్చు. కాని నేను గౌరవాన్ని ఆశిస్తాను" అన్నది నానా.

పావుగంటకుపైగా డానెట్, జార్జ్ ఆమెను డైనింగ్‌రూమ్‌లోకి రమ్మని ప్రార్థిస్తున్నారు. కాని ఆమె మొండికేసి కూచుంది. మళ్ళీ అలాంటి నీచులైన అతిథుల మొహాలు చూడాలంటే ఆమెకు అసహ్యంవేస్తోంది. తనను కండలకింద కోసినా వాళ్ళ మొహం చూడదు.

"నాకు తెలుసు. ఆ లంజ రోజ్ ఈ కుట్రంతా పన్నింది. నేను ఆహ్వానించిన ఆ గౌరవనీయురాలైన స్త్రీ రాకుండా ఆ ముండే చేసింది" అని కసురుకుంది నానా.

ఆ గౌరవనీయురాలైన స్త్రీ మేడమ్ రాబర్. ఆమె తనంతటతనే రాలేదని వాండెవ్రె చెప్పాడు. అతను నానా చెప్పేదంతా ప్రశాంతంగా

విన్నాడు. అతనికి ఇలాంటిగొడవలు అలవాటే. ఆ స్థితిలో ఆడవాళ్ళతో ఎలాప్రవర్తించాలో అతనికి బాగా తెలుసు. నానానులేపి, తీసుకెళ్ళడానికి ఆమెచేతులుపట్టుకోగానే ఆమె మరీ కోపోద్దీపితురాలైంది. కౌంట్‌ముఫత్‌ను రాకుండాచేసింది ఫాషరె కాదని ఈ స్థితిలో ఆమె నెవ్వరూ నమ్మించలేరు. ఫాషరె పాములాంటివాడు. వట్టి అసూయాపరుడు. ఒక స్త్రీ ఆనందాన్ని పూర్తిగా నాశనంచేసేవరకు దాన్నిపట్టుకుని వదిలిపెట్టడు. కౌంట్ ఆమెపై మోజుపడ్డాడు. ఆ విషయం ఆమెకు స్పష్టంగా తెలుసు. ఫాషరె అడ్డుపడకుండావుంటే తప్పకుండా వచ్చేవాడు.

"ఆయనా? - ఎన్నటికీ రాడు" అన్నాడు వాండెవ్రె నవ్వుతూ.

"ఎందుచేత?" అని అడిగింది నానా గంభీరంగా.

"ఎందుకంటావా? ఆయన ఛాందసుడు. ఇవాళ నీ చీరకొంగు తగిలితే రేపు చర్చికివెళ్ళి ఆవిషయం విన్నవించుకోవాలి. ఒక చిన్న సలహా ఇస్తాను విను: ఇతన్ని పోగొట్టుకోకుండా చూడు" అన్నాడు వాండెవ్రె.

ఒక్కనిమిషం నానా మౌనంవహించి ఆలోచించింది. తరువాత లేచి వెళ్ళి ముఖం కడుక్కుంది. కాని మళ్ళీ వారు డ్రైవింగ్‌రూమ్‌కు తీసుకెళ్ళడానికి ప్రయత్నించగా నిరాకరించింది. వాండెవ్రె ఇంక బలవంతపెట్టక నవ్వుతూ వెళ్ళిపోయాడు. అతను వెళ్ళాడో లేదో ఆమెకు ఓ విధమైన మృదుల తన్మయత్వం కలిగి డానెట్ కౌగిట్లోచేరి, 'ప్రియా! నీలాంటివాడు ఒక్కడూ లేడు. నీవే నా ప్రాణానివి. మనం ఎప్పటికీ ఇలాగేకలిసివుంటే ఎంత బావుంటుంది! అబ్బ! ఆడవాళ్ళెంత నిర్భాగ్యజీవులు?' అని దుఃఖం వెళ్ళబోసింది.

తరువాత తాముకౌగలించుకోవడం చూచి, సిగ్గుతో ఎర్రబారిన జార్జిని గమనించి, అతన్నికూడా ముద్దాడింది. డానెట్‌కు జార్జిలాంటి కుర్రాడంటే అసూయ ఉండదు. డానెట్, జార్జి ఎప్పుడూ అన్యోన్యంగా ఉండాలని ఆమె వాంఛ. ఎందుకంటే వారు ముగ్గురూ ఒకరినొకరు అవగాహనచేసుకుంటూ ఎంతో ప్రేమగా ఉండవచ్చు. అలా ఉంటే ఎంతో సుఖంగానూ, హాయిగాను ఉంటుంది. ఇలా ఉండగా ఒక విచిత్రమైనధ్వని వారిని కలవరపరిచింది. గదిలో ఎవరో గురకపెడుతున్నారు. చూస్తే, అతను బోర్డ్‌నెవ్. కాఫీ ముగించుకుని అక్కడ విశ్రమించాడు. రెండుకుర్చీలమీద

పడుకుని సుప్తుడై ఉన్నాడు. నానాకు అతన్నిచూసేసరికి నవ్వువచ్చింది. డానెట్, జార్జి వెంటరాగా పెద్దగానవ్వుతూ డ్రాయింగ్‌రూమ్‌లోకి వెళ్ళింది.

రోజ్‌ను ఇంచుమించుగా కౌగలించుకుని, "ఇలా వచ్చి చూడవే" అన్నది.

స్త్రీలందరినీ చేతులుపుచ్చుకుని తీసుకెళ్ళింది. ఎందుకో తెలీకుండానే ముందుగానే వాళ్ళు నవ్వడం మొదలెట్టారు. ఒక నిమిషంతరువాత రోజు కుంటూ రొప్పుకుంటూ వచ్చారు.

నాలుగు గంటలు కావస్తోంది. పేకాటలకు బల్లవేశారు. వాండెవ్రె, స్టీనర్, మినాన్, లారెర్డ్‌టీ చప్పున వెళ్ళికూచున్నారు. లూసీ, కార్‌లైన్ పందాలువేస్తూ వారివెనకాల నిల్చున్నారు. బాంసీ చాలా అలిసిపోయి ఎప్పుడు వెడదామని వాండెవ్రెను అడగసాగింది. మిగతావారు డ్రాయింగ్ రూమ్‌లో డాన్స్ ప్రారంభించబోతున్నారు. డానెట్ పియానోవద్దకూచు న్నాడు. కాని, డాన్సు సరిగా సాగడంలేదు. స్త్రీలందరూ అలసిసొలసి సోఫాలపైకూచుని మాట్లాడుకుంటున్నారు. హఠాత్తుగా పెద్దధ్వని యేదో విన్పించింది. ప్రక్కగదిలో పదకొండుమంది యువకులు పెద్దగానవ్వుతూ వస్తున్నారు. వారు స్వదేశ మంత్రివర్గశాఖలో జరిగిన 'బాల్'నుంచి వస్తు న్నారు. నానా వెయిటర్లను పిలిచి వాళ్ళను పంపివెయ్యమని చెప్పింది. వాళ్ళెవరో తనకు తెలీదన్నది. ఫాషరె, లాబోర్డెటీ, డానెట్ ఆమె గౌరవం కాపాడడంకోసం అక్కడికి వెళ్ళారు. ఒక చిన్నకొట్లాట జరిగేదే. కాని, వారిలో ఒకడు ముందుకువచ్చి, 'నానా, నువ్వు ఆరాత్రి పీటర్ గృహంలో మమ్మల్ని ఆహ్వానించావు' అన్నాడు.

ఆమెకు జ్ఞాపకంలేదు. ఆరాత్రి అంటే ఏరాత్రి? అతను బుధవార మని చెప్పగా, బుధవారంనాడు పీటర్‌గృహంలో భోజనానికి వెళ్ళాలని ఆమెకు జ్ఞప్తికొచ్చింది. కాని ఆమె ఎవరినీ ఆహ్వానించలేదు.

"ఒకవేళ ఆహ్వానించావేమో" అన్నాడు లాబోర్డెటీ.

నానా నవ్వింది. ఆహ్వానిస్తే ఆహ్వానించి ఉండవచ్చు. అయినా పెద్దమనుషులు వచ్చినప్పుడు వెళ్ళమనకూడదు. వాళ్ళను లోపికితీసుకుని వెళ్ళింది. వారి కెందరో స్నేహితులు కనుపించి, కరస్పర్శ చేసుకున్నారు.

వారి తరువాత, వాటికి సంబంధించినవా రెందరో వచ్చారు. అందరూ స్వదేశమంత్రివర్గ శాఖనుంచి వచ్చినవారే.

ఫాష్‌రె హాస్యానికి 'మంత్రిగారుకూడా రారుకదా' అన్నాడు. మంత్రి తనలాంటి మంచివాళ్ళ ఇండ్లకు రాదన్నది నానా. ఆమె ఒక్క విషయాన్నిమాత్రం చెప్పలేదు, కౌంట్‌ముపత్ వస్తాడనే ఆశ తనకున్నదని.

అయిదుగంటలైంది. డాన్సింగ్ ఆగింది. పేకాటమాత్రంసాగుతూనే ఉంది. వృధాచెయ్యబడిన రాత్రితాలూకు ఒకవిధమైనభావం గదినంతా ఆవరించివుంది. స్త్రీలు తమఆత్మగాధలు వినిపించే విచిత్ర మానసికావస్థ లోకి వచ్చారు. బ్లాంసీ తనతాతగారిని గురించి మాట్లాడసాగింది. క్లారిసీ తన పినతండ్రిగృహంలో, తనకు ఒకడ్యూక్‌తో జరిగిన ప్రణయకలాపాన్ని గురించి చెప్పింది. లూసీమాత్రం తనసామాన్య జననాన్నిగురించి చెప్పింది.

హఠాత్తుగా మేరియా, 'మాయింటికెదురుగా ఒకరష్యన్ ఉన్నాడు. నిన్న ఒక పెద్ద పండ్లబుట్ట పంపాడు. పండ్లమధ్య వెయ్యిఫ్రాంకుల నోట్లున్నాయి. అన్నీ రష్యన్ నోట్లు. త్రిప్పిపంపేశాను' అన్నది.

తెల్లవారవస్తోంది. నానా పూర్తిగా నిరాశచెందింది. అందరికీ బాగా విసుగెత్తింది రోజ్ పాటమానేసి, సోఫామీదకూచుని, ఫాష్‌రెతో గుసగుసలాడుతోంది.

ఎవరికీ ఏమీతోచడంలేదు. యువకులు మళ్ళీ తాగడం ప్రారంభించారు. అందరినీ ఏడిపించేటంత బరువూ, నిరాశ ఆవరించాయి. కొత్తగా వచ్చిన యువకుడు షాంపేన్‌బాటిలు పగులకొట్టి, పియానోమీద ఒలికిస్తున్నాడు.

"అదేమిటి?" అదేమిటి?" అన్నది నెనె.

"షాంపేన్ పోస్తే పియానోగొంతు చక్కబడుతుం దమ్మాయ్" అన్నాడు లాబోర్డెటీ.

"నిజంగానా?" అన్నది నెనె.

నానామాత్రం ఇవేమీ గమనించడంలేదు; స్టీనర్‌పక్కన కూచుని ఉంది. తెల్లని సిల్కుగౌను వేసుకున్నది, తాగడంవల్ల ఆమెముఖం పాలిపోయిఉంది. కళ్లు బరువుగా వాలిపోయాయి. తనకుతాను సమర్పించుకున్నట్టుగా కనుపిస్తూంది. ఆమెతలలో గులాబీలు వాడిపోయాయి. ఆమెపైనుంచి

హఠాత్తుగా స్టీనర్ చెయ్యితీసెయ్యగా. పిన్నులుగుచ్చుకుని రెండు నెత్తురు బొట్లు రాలాయి.

"ఇప్పుడు సంతకంచేసినట్టే" అన్నది నానా గంభీరంగా.

తెల్లవారింది. ఒకవిధమైన విషాదకరమైన కాంతి గదిలో ప్రవేశించింది. అందరూ సెలవుతీసుకోనారంభించారు కార్లైన్ రాత్రంతా వృథా చేసినందుకు పశ్చాత్తాపంచెందినట్టుగా కనుపించింది. రోజ్ మొహం పెద్ద మనిషితరహాగా పెట్టింది. ఎప్పుడూ వీళ్ళంతే. ఎలాప్రవర్తించాలో వీళ్ళకు తెలీదు మినాన్ పేకాటలో బాగా డబ్బుగడించి, భార్యతోకలిసి వెళ్ళిపోయాడు. మళ్ళీ ఒకమాటు ఫాషరెను ఆహ్వానించారు. లూసీ బిగ్గరగా 'పోవయ్యా, నీ పాడు నాట్యకత్తెతో' అన్నది.

ఈ మాటవిని, రోజ్ వెనక్కు తిరిగి 'పాడుముండ' అనిగొణుక్కుంది. ఆడవాళ్ళ తగాదాల్లో బాగా అనుభవమున్న మినాన్ భార్యను చెయ్యి పుచ్చుకుని లాక్కెళ్ళాడు వారివెనుక లూసీ ఒంటరిగా రాణిలా మెట్లు దిగి వెళ్ళింది. పిల్లవాడిలా ఏడుస్తున్న లాఫలాసిని గాగా నడిపించుకొని తీసుకెళ్ళింది. సైమన్ కూడా అదృశ్యమైంది.

"నాకు నిద్రరావడంలేదు. ఏదైనా చేద్దాం" అంటూ నానా కిటికీ గుండా ఆకాశంవంక చూచింది.

ఆకాశం స్వచ్ఛంగాఉంది. చిరుమబ్బులు తేలాడుతూఉన్నాయి. ఆరు గంటలు. ఎదురుగా ఇళ్ళల్లో ఇంకా అందరూ నిద్రపోతున్నారు. అప్పుడే పాకీవాళ్ళగుంపొకటి చెక్కచెప్పులు టకటకలాడించుకుంటూ నడిచిపోతోంది. ఒకమహోత్సాహపూరితమైన నగరంయొక్క ఈ విషాదమయ ప్రభాతసమయంలో నానాను ఒక విచిత్రమైన ఆవేశం ఆవరించింది. ఎక్కడికైనా ప్రశాంత గ్రామసరిసరాలకు వెళ్ళిపోదామని, ఏదో శాంతిని, పావిత్ర్యాన్నీ, అవ్యక్తమైన ఏకాంతాన్ని ఆమె అభిలషించింది.

స్టీనర్ వద్దకు వెళ్ళి, 'పాలకోసం వెడదాం' అన్నది.

చిన్నపిల్లలా చప్పట్లు చరుస్తూ బూర్నీసు కప్పుకోడానికి వెళ్ళింది. స్టీనర్ అంగీకరించాడు.

చివరకువచ్చిన యువకులు షాంపేను పూర్తిగా పియానోలో ఒలికించి వెళ్ళిపోయారు.

నానా 'జో' ను మేల్కొల్పింది. జో నిద్రలేచి, వణుకుతున్న చేతులతో తన యజమానురాలికి దుస్తులు ధరింపజేసింది.

అంతా అయినట్టే. నువు కోరినట్టేచేశాను' అన్నది నానా.

దాసీదానికి ఇంకా మత్తువదల్లేదు. ఈ నిర్ణయానికి అమ్మగారు మొదటిరాత్రే వస్తే బావుండేదని గొణిగింది. పడకగదిలోకి వెళ్ళిచూస్తే బోర్డ్‌నెవ్ ఇంకా గురకపెట్టడం మానలేదు. జార్జ్ దిండుమీదతలపెట్టి, ెశ్శబ్దంగా నిద్రపోతున్నాడు. వారిని నిద్రపోనివ్వమన్నది నానా. డానె గదిలోకివచ్చాడు. అతన్ని చూసేసరికి మళ్ళీ నానా ఆర్ద్రిరాలైంది. అతను చాలా విషాదంగా కనుపిస్తున్నాడు.

"రా బాబూ" అంటూ అతన్ని చేతుల్లోకి తీసుకుంది. అతన్ని అనేక విధాల లాలిస్తూ, 'ఏమీ మారిపోలేదు. నాకు నా బాబే కావాలి మరెవ్వరూ అక్కర్లేదు. నా బాబును ఒక్కణ్ణే నేను ఆరాధిస్తాను. ఇంకామే మెంతో సుఖంగా ఉంటాము. రేపువస్తావుకదూ. మనం రోజూకలుసుకునేసమయం నిర్ణయించుకుందాం. ఏదీ, ఒక్కసారి ముద్దుపెట్టుకో. బాగా ఇంకాబాగా....'అంటూ అతన్ని తప్పించుకుని స్టీనర్‌తో కలిసివెళ్ళింది.

వాండెవ్రె గదిలో ఒంటరిగాకూచుని పేకాట ఆడుతున్నాడు. తెల్లగా తెల్లవారిందనికూడా వారు గమనించలేదు. బ్లాంసీ నిద్రించడానికి యత్నిస్తోంది.

"బ్లాంసీ నువుకూడా రా. కొంచెం పాలు తాగి వద్దాం" అన్నది నానా.

బ్లాంసీ మెల్లిగా లేచింది. తనకు బ్లాంసీ ఆటంకమవుతుందన్న గాభరాతో స్టీనర్‌ముఖం పాలిపోయింది. కాని. ఇరువురూ అతనికంటె ముందుగాపోతూ 'పితికినపాలు తాగాలి' అంటున్నారు.

# 5

వెరైటీథియేటర్‌లో 'బ్లాండీ వీనస్' నాటకం ముప్ఫయినాల్గవసారి ప్రదర్శించుతున్నారు. మొదటి అంకం అప్పుడే ముగిసింది. చాకలిదాని వేషంలోవున్న సైమన్ గ్రీన్‌రూంతో అద్దంముందు నిల్చునివుంది. ఒంట

రిగా అద్దంముందు నిల్చుని, ఇరువంకలా వెలుగుతున్న గాస్‌లైట్లకాంతిలో కనుబొమలు తీరుస్తూ, తన వేషం దిద్దుకుంటోంది.

దీర్ఘమైన ఖడ్గంతో, ఎత్తయిన బూట్లతో పెద్ద ఫించంతో స్విస్ సేనానాయకుని దుస్తులు ధరించి ప్రవేశించిన ఫ్రూలెరీ, 'అతను వచ్చినట్టు ఏమైనా తెలిసిందా?' అని అడిగాడు.

పెదవులు సరిచూచుకోడానికి చిరునవ్వు నవ్వుతూ ఎంతమాత్రం చలించకుండా 'ఎవ రతను?' అన్నది సైమన్.

"రాకుమారుడు"

"నాకు తెలీదు. నేను కిందికి వెడుతున్నాను. అయితే అతను వస్తున్నాడన్నమాట. ఇవాళ వచ్చాడంటే, రోజూ వచ్చాడన్నమాటే" అన్నది సైమన్.

ఫ్రూలెరీ అద్దానికి ఎదురువున్న మంటదగ్గరికి వెళ్ళాడు. అద్దానికి ఇరువంకలా రెండు గాస్‌లైట్లు వెలుగుతున్నాయి, అతను గడియారంవంక చూచి, పెద్దసింహాసనంలావున్న కుర్చీలో కూలబడ్డాడు. ఆ కుర్చీలో పట్టు పరుపు నాలుగుతరాలనటకులు కూర్చోవడం వల్ల మాసి మలినమైఉంది. అక్కడక్కడా రంగుపోయి పసుపుపచ్చగా కనుపిస్తోంది, సాధారణంగా రంగాలమధ్య అలసిపోయిన నటకులు ఒకవిధమైన ఉదాసీనంగా కూర్చుంటారు. అత నలా ఆ కుర్చీలో కూర్చుని శూన్యంవంక చూచాడు. ముసలి బాస్క్ అప్పుడే వచ్చాడు దగ్గుతూ ఒక పాత పసుపుపచ్చనికోటు వేసుకుని. కోటు ఒక భుజంమీదుగా క్రిందికి జారుతోంది. ఆ కోటు డగోబార్ట్ రాజావారు ధరించినదట! ఒక నిమిషంపాటు కిరీటాన్ని పియానోమీద పెట్టి, ఒక్కమాటయినా మాట్లాడకుండా విసుగ్గా కాళ్ళు నేలకేసి కొట్టాడు. కొద్దిగా తాగుడుమోతాదు ఎక్కువై, అతని వేళ్ళు వణుకుతున్నాయి. తెల్లని గడ్డం అతనిముఖానికి అదో నిండు నిచ్చింది. ఈలోగా వానరావడం ప్రారంభించి ఆ నిశ్శబ్దతకు భంగంకలిగించింది. ఈ వాన చప్పుడు అతనికి విసుగు కలుగచేసింది.

"అబ్బ! పాడుగాలి" అని కసురుకున్నాడు.

సైమన్, ఫ్రూలెరీ కదలకుండా కూచున్నారు. నాలుగైదుచిత్రాలు, వెర్నెట్ అనే నటకునిచిత్రం గోడలకు తగిలించి ఉన్నాయి. గాస్‌వేడికి చిత్రాలు క్రమక్రమంగా పసువువర్ణానికి తిరుగుతున్నాయి. వెరైటీథియేటర్ పురాతనమహావ్యక్తుల్లో ఒకడైన పోషియర్ విగ్రహం శూన్యనయనాలతో చూస్తోంది. హఠాత్తుగా ఏదో గొంతు వినిపించింది. అది ఫాంటన్‌గొంతు. పచ్చనిబట్టల్లో, చక్కని యువకునిలాగా ముస్తాబై, రెండోరంగం దుస్తుల్లో ఉన్నాడు.

"తెలుసా మీకు? ఇవాళ నాకు పండుగ" అన్నాడు చేతులుతిప్పుతూ.

"నిజంగా?" అంటూ చిరునవ్వుతో సైమన్ అతనిదగ్గరికి వెళ్ళింది అతని వేషభాషలకు ఆకర్షితురాలైనట్టు.

"రెండోరంగం ముగియగానే, మేడమ్ బ్రాన్‌తో షాంపేన్‌తెమ్మని చెప్పబోతున్నాను" అన్నాడు.

బయట గంటమ్రోగుతోంది. దీర్ఘమైన ఆ గంటచప్పుడు తగ్గి, మళ్ళీ హెచ్చయింది.గంటచప్పుడు ఆగిపోగానే మెట్లపైనుంచి ఒకఅరుపు వినిపించింది-'రెండవ అంకం ప్రారంభమయింది! రెండవ అంకం!' అన్న కేక క్రమంగా గ్రీన్ రూమ్‌దగ్గరకు వచ్చింది. ఒకవ్యక్తి ఈ కేకవేస్తూ అలా వెళ్ళిపోయాడు.

ఈ కేక వినకుండానే ఫ్రూలెరీ షాంపేన్‌గురించి మాట్లాడుతున్నాడు.

"నేనైతే 'కేఫ్' నుంచి తెప్పించేవాణ్ణి" అన్నాడు ముసలి బాస్క్.

మేడమ్ బ్రాన్ ఏమాత్రపులాభాన్నైనా మరువకూడదన్నది. సైమన్ ఫాంటన్‌ను తనకళ్ళతో తాగేస్తూ, ఆనందాతిరేకంచే గంతులేసింది. 'ఫాంటన్‌లాంటివాడు ప్రపంచంలో లేనేలే'దన్నది.

డ్రెసింగ్ గదులకు వెళ్ళే త్రోవలో ఉన్నతలుపులు బార్లగా తెరచి ఉన్నాయి. గాస్‌లైట్ కాంతిపడుతున్న గోడమీద వస్తూపోతూఉన్న వ్యక్తుల నీడ లాడుతున్నాయి. అర్ధనగ్నంగాఉన్న స్త్రీలు, శాలువాలు కప్పుకుని రెండవరంగపు స్వరమేళకోసం వెడుతున్నారు. క్లారిసీ త్వరగా వెడుతూంటే సైమన్ పిలిచింది. ఒక్కనిమిషంలో వచ్చేస్తానని క్లారిసీ వెళ్ళిపోయింది. కాని, కొంచెం ఆలస్యంగావచ్చి, 'చలిగాఉంది. డ్రెసింగ్

రూమ్‌లో ఉన్నిగౌను మర్చిపోయాను' అన్నది. గుంటదగ్గర నిల్చుని 'రాకుమారుడు వచ్చాడు' అని చెప్పింది.

'ఆ!' అని ఆశ్చర్యపోయారు అందరూ. 'అవును నిజం. నేనూచూడ డానికి వెళ్ళాను. స్టేజ్‌బాక్సులో కూచుని ఉన్నాడు. ఇది మూడోసారి అతను రావడం. నానా అదృష్టవంతురాలుకదూ!' అన్నది క్లారిసీ.

సైమన్ ఏదో అనబోయింది. కాని, ఇంతలో గ్రీన్‌రూం సమీ పంలో ఒక అరుపు వినిపించింది. 'తెరలేస్తోంది' తెరలేస్తోంది' అని అరుస్తూ ఒక కుర్రాడు వెళ్ళిపోయాడు.

'మూడోసారి రావడం! చాలా విచిత్రంగా ఉంది. అతను దాని ఇంటికి వెళ్ళడనుకుంటాను. తనబసకే దాన్ని తీసుకెళతాడు. చాలాఖర్చు. ఊరికేపోదు సుమా!' అన్నది సైమన్.

"ఖర్చు తప్పుతుందా ఏమిటి ? అనుభవం తేరగావస్తుందా ఏం ? ఆనందం కావాలనుకున్నప్పుడు దానికి తగినరేటు ఇవ్వాలి" అన్నాడు ఫ్రూలెరీ తన విగ్రహాన్ని అద్దంలో చూచుకుంటూ.

మళ్ళీదూరంగా 'తెరలేస్తోంది, తెరలేస్తోంది ' అనేకేక విన్పించింది.

నానాకు రాకుమారునికి ప్రథమసమాగమం ఎలాజరిగిందో తెలిసిన ఫాంటన్ ఆ కథంతా చెప్పసాగాడు. అతను కొన్నివివరాలు చెబుతూంటే, వారు నవ్వాపుకోలేకపోయారు. ముసలిబాస్కే మాత్రం నిశ్చలంగా వింటూ కూచున్నాడు. ఇలాంటి కథలంటే ఆతని కంత ఉత్సుకతలేదు. సోఫామీద పడుకుని నిద్రపోతున్న ఒకపిల్లిని దువ్వుతూ కూచున్నాడు. ఆ పిల్లి కి దువ్వటం ఎక్కువయ్యేసరికి విసుగెత్తి, అక్కడనుంచి లేచివెళ్ళి, మరో చోటపడుకున్నది. బాస్కేమాత్రం తన ధోరణి మానలేదు.

ఫాంటన్ కథ సమాప్తిచెయ్యగానే, 'ఏమైనాసరే నేడు హోటల్ నుంచి షాంపేన్ తెప్పించేవాణ్ణి అక్కడిదే బావుంటుంది' అన్నాడు బాస్కే.

'తెరలేస్తుంది' అని మళ్ళీ కుర్రాడికేక విన్పించింది

తర్వాత ఎవరివో దగ్గరికివస్తున్న అడుగులచప్పుడు వినిపించింది. తలుపు తెరువబడి సంగీతం విన్పించింది. మళ్ళీ దభేల్‌మని తలుపుమూసు కున్నది. దూరాన్నుంచి ఏదో రొద విన్పిస్తోంది. మళ్ళీ కాస్సేపు గదిలో

విశ్శబ్దంగావుంది. రొదచేస్తున్న జనసందోహానికి వెయ్యిమైళ్ళదూరంలో ఉన్నట్టుంది ఆ గది. సైమన్, క్లారిసీ ఇంకా నానానుగురించే మాట్లాడు తున్నారు. ఒక పొడుపాటిపిల్ల గదిలోకి తొంగిచూడడం చూచి, వాళ్లు మాట్లాడడం ఆపేశారు. ఆ అమ్మాయి పొరపాటుపడ్డానని గుర్తించి అక్కడ నుంచి వెళ్ళిపోయింది. ఆ పిల్లపేరు సాటిన్. పెద్దమనిషితరహాగా అలంక రించుకుని వచ్చింది. ఒకసంవత్సరంనుంచి ఆ పిల్లను కేఫ్ డి వెరైటీలో చూస్తున్న ఫ్రూలెరీ, 'భలే మంచి చౌకబేరము!' అన్నాడు.

అప్పుడే ప్రవేశించిన ఫాషరె, మినాన్లతో కరస్పర్శచేస్తూ ఫాంటన్ వాళ్ళను అభినందించాడు.

ఆడవాళ్ళిద్దరూ మినాన్ను కౌగలించుకున్నారు.

"ఇవాళ జనం బాగా వచ్చారా?" అని అడిగాడు ఫాషరె.

"ఓ, బ్రహ్మాండంగా వచ్చారు" అన్నాడు ఫ్రూలెరీ.

"అమ్మాయిలూ, మీకు టైమైనట్టుంది" అన్నాడు మినాన్.

"అవును, కావస్తోంది" అన్నారు. ఒక్క బాస్క్‌మాత్రమే వెళ్ళ డానికి లేచాడు. మళ్ళీ కుర్రాడు తలుపుదగ్గరికివచ్చి 'మిస్టర్ బాస్క్! మేడం సైమన్' అని అరిచాడు.

సైమను త్వరగా లేచివెళ్ళింది. బాస్క్ కిరీటాన్ని ధరించి నింపాదిగా బయల్దేరాడు—నెమ్మదిగా అడుగులువేస్తూ, ఏదో పనివున్నవాడు పనిచెడ గొట్టుకొని, మరోపనిమీద వెడుతున్నట్టు.

"మీ వ్యాసంలో ఎన్నో అమూల్యవిషయాలుచెప్పారు. హాస్యనటులు అనవసరమన్నారు, ఎందువల్ల?" అని ఫాంటన్ ఫాషరెను అడిగాడు.

"అవును, ఎందుకని?" అన్నాడు మినానుకూడా బరువైన తనచేతులు ఫాషరె భుజంమీదవేసి. ఆ బరువుకు ఫాషరె కుంగిపోయాడు.

ఫ్రూలెరి, క్లారిసీ ఎంతో కష్టంమీద నవ్వాపుకున్నారు. కొంత సేపటినుంచి చాటుగా జరుగుతున్న ఈ హాస్యం వారిని తబ్బిబ్బుచేస్తోంది. తన భార్య ఫాషరెపట్ల కొంచెం ఉత్సుకంగా ఉండడం గమనించి, మినాన్ అసలే మండిపోతున్నాడు. అదీ కాక తాము పెట్టినఖర్చుకు తగినంత పబ్లి సిటీ ఫాషరె ఇవ్వలేదు. ఈ కారణాలవల్ల, అతిస్నేహాన్ని ప్రకటించడం ద్వారా మినాన్ ఫాషరెపై ప్రతీకారంతీర్చుకోదలుచుకున్నాడు. ప్రతి

సాయంత్రం రంగాలమధ్య కలుసుకున్నప్పుడు అతి ప్రేమ కురిపిస్తున్నట్లుగా నటించి దెబ్బకొట్టేవాడు. ఈ బకాసురుడిముందు పిల్లలావుండే ఫాషరె, నిగ్రహించుకుని, నవ్వుతూ, రోజ్‌భర్తతో పోట్లాట ఎంతకని భరించేవాడు.

"అయితే ఫాంటన్‌ను పరాభవిస్తావన్నమాట" అంటూ మళ్ళీ తన నాటకం ప్రారంభించాడు మినాన్. "అయితే, సిద్ధంగా ఉండు. ఒకటి-రెండు-మూడు-

ఫాషరెను ఒక్కదెబ్బ కొట్టాడు. ఫాషరె స్తబ్ధుడైపోయాడు. కాని క్లారిసీ కనుసైగతో తలుపుదగ్గర నిల్చున్న రోజ్‌ను సూచించింది. రోజ్ తలుపుదగ్గర నిల్చుని, ఇదంతా చూస్తూనేఉంది. తనభర్త అక్కడఉన్నాడని తెలియనట్టుగా నరాసరి జర్నలిస్టుదగ్గరికి వెళ్ళి పసిపిల్లలా తన ఫాలభాగాన్ని అందించింది.

అతను పరిచితంగా ముద్దాడి ఆమెను అభినందించాడు,

మినాన్ వారి ఆలింగనాన్ని చూడనట్టుగా నటించాడు. థియేటర్‌లో ప్రతివారూ అతనిభార్యను ముద్దాడుతారు, ఫాషరె ముద్దాడుతూంటే అతను నవ్వి ఊరుకున్నాడు. ఫలితం అనుభవించకతప్పదు. ఈలోగా తలుపు తెరచుకుని మళ్ళీ మూసుకున్నది. సైమను తనదృశ్యాన్ని పూర్తిచేసుకుని వచ్చింది.

"బాస్క్ భలేగా నటించాడు. రాకుమారుడు విరగబడి నవ్వుతున్నాడు. రాకుమారుని ప్రక్కనకూచున్న ఆ పొడుగుపాటివ్యక్తి ఎవరో తెలుసా మీకు? చాలా అందంగా, గంభీరంగా ఉన్నాడు" అన్నది సైమన్.

"ఆయన కౌంట్‌మఫత్. రాకుమారుడు ఆయన్ను విందుకుపిల్చాడు. ఆయనతోకలసి వచ్చివుంటాడు" అన్నాడు ఫాషరె.

"కౌంట్‌మఫత్! ఆయనమామగారు నాకుతెలుసు. పేరు మార్కిస్ డి ఛౌర్ద్. ఆయనగారిఇంటికి పాడడానికి వెళ్ళాను. ఇవాళరాత్రి ఆయన కూడా వచ్చారు" అన్నది సైమన్.

ఈలోగా ఫ్రూలెరీ ఆమెనుపిలిచాడు. ఆమె వెళ్ళిపోయింది.

ఈ సమయంలో థియేటర్ ద్వారపాలకురాలు మేడమ్ బ్రాన్ ఒక పెద్దపూగుత్తి తీసుకుని అటువెళ్లింది. సైమను పరిహాసానికి, "నాకేనా?" అన్నది. ఆమె నానా గది చూపించింది. నానా! అందరూ దాన్నే శాలల్లో

ముంచెత్తుతారు. మేడం బ్రాన్ తిరిగివస్తూ క్లారిసీకి ఒక చిన్నలేఖ అందించింది. మళ్లీ అతనే! లాఫలాసి. తనను ఒంటరిగావదిలేట్టులేడు! 'అంకం ముగియగానే వస్తానని చెప్పు. అబ్బ!' అన్నది క్లారిసీ.

"మేడం బ్రాన్! ఒక్కమాట. అంకం పూర్తికాగానే ఆరుసీసాలు షాంపేన్ తెప్పించు" అన్నాడు ఫాంటన్.

"అందరూ రావాలి! అందరూ స్టేజిమీదికి రావాలి" అని అరుస్తూ కుర్రాడొచ్చాడు.

"వస్తున్నాను, పదవోయ్" అన్నాడు ఫాంటన్ మేడం బ్రాన్ వెంట పరిగెత్తుతూ, 'అర్ధమైందా? ఆరుసీసాలు' అన్నాడు.

సైమన్, క్లారిసీ వెళ్లిపోయారు. తలుపు మళ్లీ మూసుకున్నది. ఒక చిన్నవానజల్లు గ్రీనురూము కిటికీ తలుపుమీద పడి, చప్పుడుచేస్తోంది. ఇంకా నానా వెళ్లలేదు, ఆమెఇష్టం ఆమెదే, జరిమానాలు లెక్కచెయ్యదు.

బెస్తపిల్లడ్రెస్‌లో నానా తలుపుదగ్గర ప్రత్యక్షమైంది. గ్రీన్ రూంలో ప్రవేశించకుండా, మినాన్, ఫాషరెలతో 'కులాసా?' అని పలకరించింది.

మినాన్ మాత్రం కరస్పర్శచేశాడు. నానా రాణిలా నడుస్తూ, తన డ్రెస్సర్ అనుసరించగా వెళ్ళిపోయింది. వెనకాల సాటిన్ వచ్చింది.

"స్టీనర్ ఏడీ?" అని అడిగాడు మినాన్.

స్టీనర్ నిన్న లాయిరెట్ వెళ్లాడు. అక్కడ గ్రామపరిసరాల్లో ఇల్లు కొంటాడట" అన్నాడు సేవకుడు.

"నానాకు ఎస్టేట్ అన్నమాట" అన్నాడు మినాన్.

మినాన్ ఇలా అని గంభీరుడైనాడు. ఈ స్టీనర్ ఒకప్పుడు రోజ్‌కు ఒకభవనం కొనిస్తానని వాగ్దానంచేశాడు. ఇప్పుడు ఎవరిని నిందించీ లాభం లేదు. అవకాశం చెయ్యిదాటిపోయింది. మళ్ళీ ఎలాగైనా సాధించితీరాలి. ఇలా ఆలోచిస్తూ అవనతవదనుడై మినాన్ అటూ ఇటూ తిరుగ నారంభించాడు. గ్రీన్‌రూంలో అతనూ, ఫాషరె మాత్రమే ఉన్నారు. జర్నలిస్టు అలిసిపోయి కుర్చీలో పడుకున్నాడు — ప్రశాంతంగా అరమూతపడిన కండ్లతో.

కాస్త విశ్రాంతి దొరికినందుకు సంతృప్తుడై ఫాన్షెరె హాయిగా కాళ్లు బారచాచుకుని పడుకున్నాడు. మినాస్ కాసేపు అటూ ఇటూ తిరగడం మానేసి, పోషియర్ విగ్రహంవద్ద ఒకక్షణం నిల్చుని అక్కడినుంచి వెళ్ళి కిటికీ తెరిచాడు. వాన వెలిసింది. ప్రకృతి ప్రశాంతంగా ఉంది. స్టేజ్ నుంచి కూడా ఏమీ వినరావడంలేదు. మెట్లమీద, వాకిళ్ళదగ్గర చడీ-చప్పుడులేదు. అంతా సమాధిలా గంభీర నిశ్శబ్దంగా ఉన్నది. అంకం సమాప్తిలో ఉండే నిశ్శబ్దత అది.

"అబ్బ : లంజలు చంపేస్తున్నారు" అని అరిచాడు బోర్డ్‌నెవ్ హఠాత్తుగా రూక్షస్వరంతో.

అతను అప్పుడే వచ్చాడు. మినాన్‌ను, ఫాన్షెరెను చూడగానే వాళ్లను పిలిచాడు. నానాను అభినందించడంకోసం అనుజ్ఞ ఇవ్వవలసినదిగా రాకుమారుడు కోరాడు. స్టేజ్ మానేజరు అటు వెడుతున్నాడు. అతనితో, ఫెరాన్‌డె, మేరియా ఉన్నారు. 'చూచావూ - వాళ్లకు ఫైన్ వెయ్యి' అన్నాడు కోపంతో. మళ్లీ తక్షణం కోపం తగ్గించుకుని, ఒక పితామహుని లాగాగాంభీర్యాన్నివహించి నేనువెళ్లి ప్రభువువారిని తీసుకొస్తాను'అన్నాడు,

పిక్కటిల్లే కరతాళధ్వనుల్లో తెర జారింది వెంటనే నీడగాఉన్న సేజ్‌పై జనం అటూ ఇటూ తిరుగుతున్నసందడి ఎక్కువైంది. నటులందరూ త్వరత్వరగా డ్రెసింగ్‌గదులవైపుకు పోతున్నారు. సేవకులు సీనరీలు మార్చేస్తున్నారు. సైమన్, క్లారిసీలు స్టేజివెనకాల నిల్చుని, ఏదో గుసగుసలాడుతున్నారు. గతరంగంలో మధ్య సందు దొరకగా, వారొక చిన్న వ్యవహారం ఏర్పాటుచేసుకున్నారు

క్లారిసీ లాఫలాసిని ఇహ చూడకుండాఉండడానికి నిశ్చయించుకుంది. అంతగా ఒకస్త్రీని అంటిపెట్టుకునిఉండడం సమంజసంకాదని సైమన్ అతనికి నెమ్మదిగా చెప్పివేస్తే బాగుంటుంది అనుకున్నారు. అతనిదారి అతనికి చూపడమన్నమాట.

తరువాత సైమన్ చాకలిదానివేషంలో ఇరుకుగాఉన్న మెట్లు దిగి వెళ్లింది. మెట్లు మురికిగాఉన్నాయి. గోడలు తడిగాఉన్నాయి. సైమన్ ద్వారపాలకురాలి గదికేసి వెళ్లింది.

రెండు మెట్లవరసలకుమధ్యగాఉన్న ఈగది ఒకపెద్దదీపంలా ఉంది. గదిలో రెండు గాస్‌లైట్లు వెలుగుతున్నాయి. ఉత్తరాలు, వార్తాపత్రికలూ ఒకవైపున చిందరవందరగా పడేసిఉన్నాయి. టేబిల్‌మీద ఎన్నోపూల గుత్తులు, మురికిగాఉన్నప్లేట్లు ఉన్నాయి. గందరగోళంగావున్న ఈ గదిలో కొందరు పెద్దమనుషులు చక్కగా ముస్తాబై కూచుని, ఎందుకోసమో వేచి వున్నట్టుగా ఉన్నారు. మేడం బ్రాన్ మధ్యమధ్య వచ్చి, వారికేవో కబుర్లు నందిస్తోంది. ఆమె అప్పుడే వచ్చి, వారిలో ఒకయువకునికి చిన్న చీటీ అందించింది. అతను గాస్‌లైట్‌కాంతిలో దాన్ని తెరచి చదువుకున్నాడు.

ఆలేఖలో ఒక చిన్నమాట చదివేసరికి, అతనిని కొంచెం చెమటలు పట్టాయి. 'ఇవాళ రాత్రికి కాదు ప్రియుడా! పనిమీద ఉన్నాను' అని ఉంది. అతను అనేకపర్యాయాలు ఇదేమాట చదివాడు. లాఫలాసి ఆగదిలో ఒకమూల కూర్చీలో కూచుని ఉన్నాడు.

"మీరు ఇక్కడఉన్నారా అమ్మా! మీకేంకావాలి?" అన్నది ద్వార పాలకురాలు సైమన్‌తో.

లాఫలాసిని పంపమని కోరింది. సైమన్. కాని, బ్రాన్ ఈ పని వెంటనే చెయ్యలేకపోయింది ఎవరికో మద్యం ఇవ్వవలసి వెళ్ళింది.

వాళ్ళ కిచ్చివచ్చిన తరువాత, 'అక్కడున్న ఆ నల్లటిఅబ్బాయితో కదూ మీరు మాట్లాడాలనుకున్నది' అని అడిగింది.

"ఎబ్బె! ఛీ! ఆ చివరకూచున్న సన్నటిఅబ్బాయి" అన్నది సైమన్.

తరువాత లాఫలాసిని హాల్లోకి తీసుకొచ్చింది. పెద్దమనుషులు యథా తథంగా కూచునిఉన్నారు. పైన బోర్డ్‌నెవ్ ఇంకా సీనరీమార్చలేదని కేక లేస్తున్నాడు.

చివరకు అన్నిటికీ వెనకాలఉండే డ్రాప్ తీసేశారు. స్టేజ్ ఖాళీ అయింది.

"రాకుమారుడు, రాకుమారుడు" అని గుసగుసలు వినిపించాయి. అందరూ అటువైపు చూచారు. బోర్డ్‌నెవ్ వందనాలుచేస్తూ రాకుమారుణ్ని తీసుకెడుతున్నాడు. రాకుమారుడు పొడుగ్గా బలంగా అందంగా ఉన్నాడు. చక్కని చిన్నిగడ్డం. గులాబిరంగుచాయ బిగుతైనకోటు తొడుక్కున్నాడు. శరీరం ఒంపులుతీరి అందంగా కనుపిస్తోంది. ఆయనవెంట కౌంట్‌ముఫత్,

మార్కిస్ డి చౌర్డ్‌లు వస్తున్నారు. థియేటర్ చివర సీటర్లో వారు మాయమై పోయారు. ఈ రాకుమారునితో - భవిష్యచ్ఛక్రవర్తితో సంభాషించడం కోసం బోర్డ్‌నెవ్, సింహాలను మాలిమిచేసుకొనేవానిలా మాట్లాడసాగాడు. మాటిమాటికి కృత్రిమ ఆవేశంతో అతనిగొంతు కంపించసాగినది.

"ప్రభువువారు ఇటు దయచెయ్యాలి. ఇలా.... ఇలా.... దయచేసి ... జాగ్రత్త....' అంటూ అతి వినయవిధేయతలతో బోర్డ్‌నెవ్ రాకుమారునికి దారిచూపుతున్నాడు.

రాకుమారుడు ఎంతమాత్రం తొందరపడటంలేదు. పైగా నింపాదిగా నిల్చుని, సీనరీమారుస్తుంటే అవలోకిస్తున్నాడు. ముఫత్ ఎన్నడూ స్టేజి లోపలిభాగం చూడలేదు. అందుకని మరీ ఆశ్చర్యచకితుడై అవలోకిస్తున్నాడు. అతనిలో అసహ్యమూ, భయమూ కలిసిన ఒక విచిత్రమైనభావం కలుగసాగింది. ఆయన పైకి చూచాడు. గ్యాస్‌లైట్లు నక్షత్రగోళాల్లా కనుపిస్తున్నాయి.

"ఇక వెడదాం" అన్నాడు హఠాత్తుగా సీస్లుమారేచ్ సేనకుడు.

రాకుమారుడు స్వయంగా తనేకౌంట్‌ను హెచ్చరించవలసివచ్చింది. ఒక డ్రాప్‌సీను కిందికి దించుతున్నారు. మూడోఅంకానికి సంబంధించిన సీనరీ ఏర్పాటుచేస్తున్నారు. మౌంట్ఎట్నారో ఉండే గుహ అది. స్టేజిపెనకాల ఎన్నో ఎర్రనిదీపాలు వెలిగిస్తున్నారు—అంతా గందరగోళంగాఉంది. ప్రాంప్టరు అటూ ఇటూ తిరుగుతున్నాడు.

"తమరిరాక ...." బోర్డ్‌నెవ్ ఇంకా వందనాలు చేస్తూ అన్నాడు— 'థియేటర్ అంత పెద్దదికాదు. మాకు చేతనైనంతవరకు.... ప్రభువువారు ఇలా దయచేస్తే—" అంటున్నాడు.

కౌంట్ ముఫత్ అప్పుడే డ్రెసింగ్‌గదులవైపు వెడుతున్నాడు. అలా వెడుతూన్న అయన్ను ఒక చిన్న సంఘటన ఆపింది. మూడోఅంకానికి తయారై ఉన్న ఇద్దరు ఆడవాళ్ళు దారిలో మాట్లాడుకుంటున్నారు. అందులో ఒకతె 'అడుగో అతనే. పట్టి చపటలాఉన్నాడు' అంటోంది. బోర్డునెవ్ సిగ్గుతో కుంగిపోయాడు. దాన్ని వెనకాలగా ఒకచాపు తన్నకుండా ఉండడానికి ఎంతో నిగ్రహించుకోవలసివచ్చింది. కాని, ఈ మాటలు విని పించి, రాకుమారుడు చిరునవ్వునవ్వాడు. మృదువుగా ఆ పిల్లదానివంక

చూచాడు. అదిమాత్రం రాకుమారుడంటె లెక్కచేసినట్టు కనుపించలేదు. నిర్లిప్తంగా సగర్వంగా నవ్వింది. బోర్డెనెవ్ రాకుమారుణ్ణి లోనికి వెడదాం రమ్మని అర్థించాడు. కౌంట్ముఫత్కు ముచ్చెమటలుపోశాయి. హాట్ తీసే శాడు, ఇరుకుగాఉన్న ఆ వాతావరణం అతన్నెంతో కల్లోలపరిచింది. వాతా వరణం చాలా వేడెక్కి భారంగాఉంది. వాతావరణంలో భారమైనపరిమళం తేలాడుతోంది. ద్వారంలో ప్రవేశించేసరికి ఈ వాసన మరీఎక్కువై పోయింది. మురికి నీటివాసన, సెంట్, సబ్బుళపరిమళం, నిశ్వాసాలు- ఇవన్నీకలసి ఒక విచిత్రపరిమళం బయల్దేరింది. కౌంట్ శీఘ్రదృష్టితో మెట్లపై కి చూచాడు. ఒకపెద్దకాంతి వచ్చిపడుతోంది. పై నుంచిగుడ్డలుతుకు తున్నవారి నవ్వులు, మాటలు, పిలుపులు, తలుపులు మూసితెరుస్తున్న శబ్దాలు, స్త్రీలవసనాల ఘుమాయింపులు, తలల్లోపోసిన స్వేదబిందువుల వాసనలు వస్తున్నాయి. అతను అటూఇటూ చూడకుండా ఇంతవరకూ తను చూడని ఒక ప్రపంచాన్ని చూడడంచేత, ఉత్సుకుడై త్వరత్వరగా వడ వడం మొదలెట్టాడు.

"థియేటర్ చాలా విచిత్రమైనస్థలం!" అన్నాడు మార్కిస్.

బోర్డునెవ్ నానా డ్రెసింగ్రూమ్వద్దకు వెళ్లాడు. తలుపుదగ్గర నిల్చుని 'ప్రభువువారు ఇటు దయచేయండి" అన్నాడు.

హఠాత్సంభవంవల్ల చకితురాలైన ఒక స్త్రీకేక వినిపించింది. అర్ధ నగ్నంగా ఉన్న నానా పరుగెత్తి, తెరచాటున దాక్కుంది. ఆమె డ్రెసర్ ఒకతువాలు చేత్తో పుచ్చుకుని నిల్చుని ఉన్నాడు.

నానా తెరచాటునదాక్కుని, 'ఏంపను లివి? ఎప్పుడంటే అప్పుడు రావడమే! లోపలికి రాకండి, కనపట్టంలేదూ!' అన్నది.

ఈ సిగ్గుచూచి కొంచెం చల్లారిన బోర్డ్నెవ్, 'అలా పరుగెత్త కమ్మాయ్! ఏంపరవాలేరు. ప్రభువువారు ఇక్కడే ఉన్నారు. రా, బయ టికిరా; వట్టివెర్రిపిల్లపుకావొద్దు' అన్నాడు, ఆమెవచ్చేందుకు ఇంకా నిరాక రించగా ఓవిధమైన పితృప్రేమ ఉట్టిపడేస్వరంతో, 'వీరికి ఆడవాళ్లంటే ఎలా ఉంటారో ఆమాత్రం తెలుసులే. నిన్నేమీ తినెయ్యరు' అన్నాడు.

"ఏమో! అదెలా చెప్పగలం?" అన్నాడు రాకుమారుడు గంభీరంగా.

అందరూ పెద్దగా నవ్వారు. రాకుమారుడు మహా చక్కని విసురు విసిరాడు.

నానా మరి సమాధానం చెప్పలేదు. తెర కొంచెం కంపించింది. నానా బయటికి రావడానికి నిశ్చయించుకుంటోందన్నమాట. కౌంట్ ముఫత్ ఎర్రబారినముఖంతో గదిలో కలయచూచాడు. గది చిన్నది. ఇరుకుగా ఉంది. గదిని మధ్యకు చీలుస్తూ ఒకతెర కట్టివుంది. రెండు పెద్దకిటికీలు ఉన్నాయి. కిటికీల్లోగుండా థియేటర్ దొడ్డిగోడ కనుపిస్తోంది. దొడ్డిగోడమీద చదరాలుగాపడిన వెలుతురు కనుపిస్తోంది. గదిలో అనేకరకాలైన సెంట్లు, తలనూనెలు, ఫేస్‌పౌడర్లు, మేకప్‌సామాన్లు ఉన్నాయి. అద్దంలో తనప్రతిబింబాన్ని చూచుకున్నాడు కౌంట్. ముఖం ఎర్రగావుంది. చెమటబిందువులు నుదుటిమీద నిల్చివున్నాయి. కళ్లుదించుకుని డ్రెసింగ్ టేబిల్ దగ్గరికి వెళ్లాడు బేసినులో సబ్బునీళ్లు. స్పాంజ్‌లు వున్నాయి. నానాను ప్రథమంగా కలుసుకున్నప్పుడు అతన్ని మంచులా ఆవరించినభావమే మళ్లీ యిప్పుడతన్ని ఆవరించింది. భూమిబ్రద్దలై తనకు తెలియని ఏ పాతాళం లోనికో దిగిపోతున్నట్టనిపించింది. దీపాలు పామునాలికల్లా కనుపిస్తున్నాయి. ఒక నిమిషం ఆ స్త్రీలపరిమళతీవ్రతకు స్మృతితప్పినట్టయింది. నెమ్మదిగా వెళ్ళి సోఫామీద కూచున్నాడు. మళ్లీ వెంటనే లేచి, డ్రెసింగ్‌టేబిలు వద్దకు వెళ్ళాడు. అతనికళ్ళలో అదోవిధమైన అవ్యక్తభావం వుంది. ఎన్నాళ్ళక్రితమో వాళ్ళగదిలో వాడిపోయిన కాడగులాబీలను గురించి ఆలోచిస్తున్నాడు. వాటిపరిమళం అతన్ని చంపేసేదంటే నమ్మవచ్చు. కాడగులాబీలు వాడిపోయేసమయంలో మానవశరీరాన్నుంచివచ్చే పరిమళాన్నే విరజిమ్ముతాయి.

"త్వరగా కానీ, ఊ" అన్నాడు బోర్డెనెవ్ తెరలోనుండా తలదూర్చి.

ఈలోగా మార్క్విస్ డ్రెసింగ్ టేబులోమీదవున్న ఒక కుందేటి కాలుతీసి చూపిస్తూ నటకులు దానితో పౌడరు ఎలా అద్దుకుంటారో రాకుమారునికి వివరించి చెబుతున్నాడు. సాటిన్ ఒకమూలగా కూర్చునివుంది.

ఆ అమ్మాయిముఖం కన్నెపడుచుముఖంలా ఉంది. నిర్విణ్ణురాలై ఆ పెద్దమనుషుల ముఖాలవంక చూస్తోంది. డ్రెస్సరు పినస్‌మస్తులు పట్టు

కుని నిల్చునివుంది. దానివయస్సు కనిపెట్టడం మహాకష్టం. దాని ముఖం చక్కపేడులా అచంచలంగావుంది ఎప్పుడూ యౌవ్వనం అనుభవించకుం డానే వృద్ధాప్యం వచ్చిన కన్యలా వుంది. మాసిపోయిన నల్లటిగౌను వేసు కున్నది వక్షస్థలం చదునుచేసినట్టుంది.

"మహాశయులారా ! నన్ను క్షమించాలి !" అంటూ నానా తెర తొల గించింది.

అందరికళ్ళూ అటుతిరిగాయి. నానా ఏమాత్రం డ్రెస్‌వేసుకోలేదు. ఒక సిల్క్‌బాడీమాత్రం తొడిగింది. అదైనా ఆమె వక్షోజాలను పూర్తిగా మూయలేదు. నగ్నభుజాలతో, పొడుచుకువస్తున్న చనుమొనలతో, ఒక చెత్తో తెరపట్టుకుని నిల్చున్నది — తక్షణం తెరమూసెయ్యడానికి సన్నద్ధు రాలై వున్నట్టుగా. తొడలూ, ఒళ్లూ మిలమిలలాడుతూ వేడెక్కిస్తున్నాయి.

"మీరు హఠాత్తుగా వచ్చేసరికి భయపడిపోయాను" అన్నది లజ్జా వనతవదనంతో.

"ఏం పరవాలేదు. ఇలాగే బాగున్నావు" అన్నాడు బోర్డునెవ్.

"ప్రభువువారు నన్నెంతో గౌరవించినవారైనారు. ఇలాటిస్థితిలో వారిని స్వీకరించినందుకు క్షమించాలి" అన్నది.

"అయాచితంగా వచ్చింది నేనే నమ్మా! నిన్ను అభినందించాలన్న కోరికను నిగ్రహించుకోలేకపోయాను" అన్నాడు రాకుమారుడు. తరువాత డ్రెసింగ్ టేబిల్‌వద్దకు వెళ్ళడానికి వాళ్ళమధ్యగుండా వెళ్ళింది నానా. ఆమె డ్రాయర్ బెలూనులా ఉంది. లోపల తొడలు పరిపుష్టంగాకన్పిస్తున్నాయి. తొమ్మువిరుచుకుంటూ విలాసప్రాయమైన చిరునవ్వుతో అందరినీ అభినందిం చింది. హఠాత్తుగా వారిలో కౌంట్ ముఫత్‌ను గుర్తించింది. స్నేహితునితోలా అతనితో కరస్పర్శచేసింది. విందుకు రానందుకు ఎత్తిపొడిచింది. అప్పుడే నీళ్ళతో కడుక్కుని వస్తున్నట్టుగా చల్లగావున్న నానాచేతివేళ్ళు తనచేతికి తగిలేసరికి కౌంట్‌ముఫత్ వణికిపోయాడు. కౌంట్ రాకుమారునితోపాటు కడుపార విందారగించాడు. రాకుమారుడు బాగా తిని త్రాగగలడు. ఇద్దరూ కొంచెం కైపెక్కి వున్నారు. కాని, పైకిమాత్రం తెలియనివ్వడంలేదు. తన గాభరాను కప్పిపుచ్చుకోడానికై ముఫత్ గదిలో వుక్కమగురించి 'ఈగది

లో ఎంత వెచ్చగా వుంది. ఇంత వెచ్చని గదిలో ఎలా వుండగలుగుతా వమ్మా!' అన్నాడు.

ఈలోగా తలుపుదగ్గర పెద్దగా మాటలు వినిపించాయి. ఫాంటన్, ఫ్రూలెరి, బాస్కా ముగ్గురూ షాంపేనుసీసాలు, గ్లాసులు పట్టుకొచ్చారు. 'ఈవాళ నాకు పండుగ. ఇష్టంవచ్చినట్టు తాగేస్తాను' అంటూ వచ్చాడు ఫాంటన్. నానా 'ఏమంటారు?' అన్నట్టుగా రాకుమారునివంక చూచింది. ఆయన కేమాత్రం అభ్యంతరంలేదు. పైగా ఆయనకు ఆనందంకూడాను. కాని అనుమతి పొందకుండానే ఫాంటన్ గదిలో ప్రవేశించి, 'నే నేం తక్కువవాణ్ణనుకున్నారా? నేను షాంపేన్ హాయిగా పుచ్చుకోగలను' అన్నాడు. ఇలా అంటూ హఠాతుగా రాకుమారుణ్ని గుర్తించాడు. రాకుమారుడు అక్కడవున్నాడని అంతకుముందు అతనికి తెలియదు. రాకుమారుణ్ని చూడగానే టక్కున సంభాషణఆపి, గంభీరుడై, 'బయట డగోబర్టురాజుగారు వున్నారు. ప్రభువారితోకలిసి మద్యంసేవించాలని వాంఛిస్తున్నారు' అన్నాడు.

రాకుమారుడు చిరునవ్వునవ్వాడు, అందరికీ అదో గమ్మత్తుగా కను పించింది. డ్రెసింగ్ రూము వీరందరికీ చాలిందికాదు. అందరూ క్రిక్కిరిసి పోయారు. సాటిన్, మేడమ్ జూలి గదిచివర వున్నారు. పెద్దమనుషు లందరూ నానాను చుట్టివున్నారు. నటకులుముగ్గురూ ఇంకా రెండో అంకం దుస్తుల్లోనేవున్నారు. ఫ్రూలెరీ తన స్విస్‌సేనానిహాట్ తీసివేశాడు. బాస్కా ఒక మహారాజు మరోదేశపురాజును అభినందించినట్టుగా రాకుమారుణ్ని అభినందించాడు. అందరూ గ్లాసుల్లో మద్యంనింపుకున్నారు.

రాకుమారుడు నింపాదిగా ఒక్కగుటకలో మద్యమంతా తాగేశాడు. కౌంట్‌ముఫత్‌కూడా అలాగే పీల్చేశాడు. అందరూ మద్యంనిషాలోకి జారారు. నాటకజగత్తు వారిని వాస్తవజగత్తును మరిపించేలా చేస్తోంది. నానా వీనస్ రాజ్ఞిలా అభినయిస్తోంది. ప్రతిమాటకు ముందుగా, 'తమరు మహారాజులుంగారు' అంటోంది. బాస్కాను, ఫ్రూలెరీని మహారాజ్ఞిలా ఆజ్ఞా పిస్తోంది. అసలు నిజంగా యువరాజైన ఒకయువకుడు, భావిచక్రవర్తి ఈనటకులతో, ఈదేవతావేషధారులతో, ఈవేశ్యాంగనలతో కలిసిమెలిసి మద్యం సేవించడం చూస్తే, చాలా అబ్బురంగా వుంది.

నానాకు కొద్దికొద్దిగా విస్మృతికలుగుతోంది. ఫాంటన్ గంభీరవదనం ఆమెను ఆకర్షిస్తోంది. ఆమె గర్భవతిలా తదేకదీక్షతో అతనివంక చూస్తూ, అతన్ని రాచుకుంటూ తిరుగుతోంది. అతనివంక చూచి 'హొయ్యవోయ్ అబ్బాయ్!' అంది.

ఫాంటన్ గ్లాసులు నింపాడు. నానా గ్లాసుపైకెత్తి ఫాంటన్ పేరు ఉచ్చరిస్తూ తాగేసింది. ఆమె ఫాంటన్‌ను కళ్ళతో తాగెయ్యడం చూచి రాకుమారుడు వినమ్రుడైనాడు. 'ఫాంటన్! నీ విజయానికి సూచకంగా నేను తాగుతున్నాను' అన్నాడు మర్యాదగా.

రాకుమారుని ఓవర్‌కోటు మార్బిల్ డ్రెసింగ్ టేబిల్‌కు రాచుకుని మాసిపోతోంది, గదిలో ఒక పెద్దగుహలో వున్నట్టుగా వుంది. షాంపేను వాసన సెంటువాసన కలిసి, అదోరకమైన మత్తుకలిగిస్తున్నాయి. గది ఇరుకుగా వుండడంవల్ల, నానా కౌంట్ముఫత్‌కు రాకుమారునికి మధ్యగా ఉండడంవల్ల కదిలినప్పుడు ఆమె వక్షోజాలు, తొడలూ తగలకుండా చేతులు జాగ్రత్తగా పెట్టుకోవలసివచ్చింది. మేడం జూలి ఒక స్తంభంలా అచంచలంగా నిల్చునివుంది. సాటిన్ ఎంత పతితురాలైనా రాకుమారుడు, కౌంట్‌లాంటి పెద్దమనుషులు ఒక నగ్నవనితవెంటపడడంచూచి, ఆశ్చర్య పడకుండా వుండలేకపోయింది. పెద్దమనుషులు పేరుకే పెద్దమనుషు లనుకున్నది. ముసలికౌంట్ గంటమోగిస్తూ ద్వారందగ్గరికి వచ్చాడు. నటకులు ఇంకా రెండో అంకం దుస్తుల్లో ఉండడం చూచి స్తంభీభూతుడై 'గంట మోగింది. త్వరగా కానీండి' అన్నాడు.

"పరవాలేదులే, ప్రేక్షకులు వేచివుంటారు" అన్నాడు బోర్డ్‌నెవ్ మెల్లగా.

అయినా, సీసాలు ఖాళీకావడంచూచి, నటకులు డ్రెస్‌వేసుకోడానికి వెళ్ళారు.

రాకుమారుడు, కౌంట్, మార్కిస్ ఇంకా నానాదగ్గరేఉన్నారు. బోర్డ్‌నెవ్ బారిలట్‌తో వెళ్ళిపోయాడు.

మూడో అంకంలో నగ్నసౌందర్య ప్రదర్శనకు అతిజాగ్రత్తగా ముస్తాబుచేసుకుంటూ 'పెద్దలు క్షమించాలి' అన్నది నానా. రాకుమారుడు సోఫాలో కూచున్నాడు. ఒక్క కౌంట్‌మాత్రం నిల్చునివున్నాడు. ఇరుకు

గావున్న ఆ వాతావరణంలో షాంపేన్ సేవించడంమూలంగా వారు కొంచెం మత్తుగా ఉన్నారు. సాటిన్ చల్లగా గదిలోనుంచి జారుకుని, ఏం చెయ్యడానికీ తోచక ఏదో ఆలోచిస్తూ కూచుంది.

"మీరు గీతాన్ని చాలా అద్భుతంగా పాడారు" అన్నాడు రాకుమారుడు.

సంభాషణ ప్రారంభమైంది. ఏవో కొన్ని చిన్నచిన్నమాటలు. నానా ప్రతిమాటకూ సమాధానం చెప్పలేదు. ముఖానికి క్రీమ్‌రాచుకుని, టవల్‌తో ఏదో రంగువేసుకున్నది. ఒకనిమిషం అద్దంలో చూసుకోవడం మానేసి, రాకుమారునివంకచూచి చిరునవ్వు నవ్వింది.

"ప్రభువువారు నన్నుపాడుచేస్తున్నారు" అన్నది.

మార్కిస్ ఆమె అలంకరణను అతిశ్రద్ధగా పరిశీలిస్తున్నాడు, 'ఆర్కెస్ట్రా కొంచెం తగ్గించకూడదూ? నీ స్వరాన్ని ముంచేస్తోంది.' అన్నాడు.

ఈమాటు నానా తిరిగిచూడలేదు. ముఖాన్ని అద్దుకుంటోంది. ముసలాయనమాట విన్నట్టుగా కొంచెం పిక్కలు కదిపింది. ఒకక్షణం నిశ్శబ్దం. ఆమె లండన్ విచ్చేసి, పాటకచేరీచేస్తే లండన్‌నగరం పొంగిపొర్లిపోతుందని రాకుమారు డన్నాడు. ఆ మాటకు నానా నవ్వుతూ తిరిగిచూచింది. పౌడర్‌తో ఆమెబుగ్గలు తెల్లగా ఉన్నై.

ఒకక్షణం గంభీరంగావుంది. మళ్ళీ అద్దంలో చూసుకుని కనుబొమలు దిద్దుకుంది. అప్పుడు గౌరవపురస్సరమైన నిశ్శబ్దం గదిని ఆవరించింది.

ఇంతసేపూ కౌంట్‌ముఫత్ ఒక్కమాటకూడా మాట్లాడలేదు. తన యౌవనకాలాన్ని గురించి యోచిస్తూ కూచున్నాడు. తను చిన్నతనంలో నివసించినగది చాలా చల్లగా ఉండేది. పదహారు సంవత్సరాలు వచ్చినతరువాత ప్రతిరాత్రీ తనతల్లిని ముద్దాడి పడుకునేవాడు. నిద్రలోకూడా మంచులా చల్లనైన ఆమెకౌగిలి జ్ఞప్తికివచ్చేది. ఒకరోజున సగం మూసిన తలుపుగుండా స్నానంచేస్తున్న ఒక యువతిని చూశాడు. అది ఒక దాసి. వివాహమయ్యేవరకూ ఆ స్మృతి అతన్ని కలతపెడుతూనేవుంది. వివాహానంతరం భార్యతో ఎంతో నియమబద్ధంగా జీవితం గడిపాడు. శారీరక వాంఛలను దూరంగా కఠోరదీక్షలతో, నియమాలతో పెరిగి పెద్దవాడై

పోయాడు. వృద్ధాప్యంకూడా వచ్చింది. ఇప్పుడు హఠాత్తుగా, నగ్నసౌంద ర్యాన్ని విరజిమ్ముతున్న ఈ అభినేత్రిగదిలో చిక్కుకున్నాడు. ఎప్పుడూ భార్య అలంకరించుకోవడంకూడా కన్నెత్తిచూడనివాడు, ఈ అభినేత్రి వివిధాలంకారాలను, వాటివిచిత్రతరహాలను చూస్తూ కూచున్నాడు.

ఏవో అవ్యక్తపరిమళాలు అతన్ని ముంచెత్తుతున్నాయి. అతనిస్వభా వానికి ఇదంతా అసహ్యంగాతోచింది. కొంతసేపటినుంచి నెమ్మదీ నెమ్మ దిగా నానా త న్నావహించడం అతని కెంతో భయాన్ని కలిగించింది. చిన్న తనంలో అతను విన్న దయ్యాలుపట్టేకథలు జ్ఞాపకంవచ్చాయి. అతనికి దయ్యాలంటే పెద్దనమ్మకం. అతని ప్రస్తుతమానసికస్థితిలో, తననవ్వులతో, దురాచారాల పుట్టలాంటిదేహంతో కన్పిస్తున్న నానా నిజంగా మూర్తీభవిం చిన దయ్యమే! కాని, అతను తన్నుతాను రక్షించుకోలేకపోడు.

"అయితే అంగీకరించినట్టే నన్నమాట. వచ్చేసంవత్సరం లండన్‌కు రావాలి. అక్కడ ప్రజ లిచ్చే మహత్తరస్వాగతంచూస్తే మళ్లీ ఫ్రాన్స్‌కు రావా లనుకోవు. కౌంట్! మీకు మీదేశంలోని అందగత్తెలను ఎలా గౌర వించి, ఆదరించాలో తెలీదు. అందరినీ మాదేశం తీసుకుపోతాము" అన్నాడు రాకుమారుడు.

"కౌంట్ ధర్మమూర్తిలెండి" అన్నాడు మార్కిస్.

కౌంట్ ధార్మికప్రసక్తిరాగానే నానా కౌంట్‌వంక అదోవిధంగా చూచింది. ఆ చూపుకు కౌంట్‌లో తనకు తెలియని కలవరం బయల్దేరింది. ఆ అమ్మాయిసన్నిధానంలో తను గుణసంపన్నుడనేవిషయం తనకే పెద్ద బరువుగా ఎందుకు తోచాలి? తనమీద తనకే కోపంవచ్చింది.

నానా హెయిర్‌పిన్ తీసుకోబోయి కిందపడేసింది. దాన్ని తీసుకో బోగా అతను తీయబోయాడు. ఇద్దరిశ్వాసలూ కలిశాయి. ఆమె బంగారు ముంగురులు అతని హస్తాలపై వాలాయి. అది ఒక విచిత్రమైన ఆనందం! బాధతోకూడిన ఆనందం! పాపంలోఉన్న కాథలిక్‌లను ఎప్పుడూ నరక భయం వెన్నాడినట్టు. అదో విచిత్రమైన ఆనందం!

ఇంతలో బయటినుంచి బారిలట్‌గొంతు వినిపించింది. 'అమ్మా' సిగ్నల్ ఇవ్వనా? ప్రేక్షకులు రెచ్చిపోతున్నారు' అన్నాడు.

'క్షణం' అన్నది నానా తొందర లేకుండానే.

ముందు నల్లసిరాతో కనుబొమలు తీర్చుకుంది. ముఫత్ పక్కనే నిలబడి చూస్తున్నాడు. అద్దంలో ఆమె ప్రతిబింబాన్ని చూచాడు.

నగ్నంగాఉన్న భుజాలు పరిపుష్టంగా బలిసి, మిలమిలలాడు తున్నాయి. మెడ గులాబిరంగుగాఉంది. ముఖం తీరనికోరికలకూ, ఆరని కామవాంఛలకూ కట్టిన ఆలయంలా ఉంది. కుడికన్నుమూసి, ఎడమకను బొమ్మ దిద్దుకుంటున్న నానాను చూస్తే తా నామెకు దాసానుదాసు డని పించింది.

'అమ్మగారూ, త్వరగా రండి. జనం గల్లంతుచేస్తున్నారు, కుర్చీలు విరగ్గొట్టేస్తారు' అన్నాడు సేవకుడు మళ్ళీ.

'చావనీ' అంది నానా కోపంగా-'సిగ్నల్ ఇస్తే ఇవ్వు. నా ఇష్టం వచ్చినప్పుడు వస్తాను. నాకోసం వాళ్ళే పడివుంటారు' అన్నది. ఇలాఅని రాకుమారుడు, కౌంట్‌లవంక చూచి 'అబ్బ! ఒక్కనిమిషం తీరిగ్గామాట్లాడు దామన్నా వీల్లేదు' అన్నది.

నానా తనచేతులూ, ముఖం అలంకరించుకోవడం ముగిసింది. పెదవు లకు రంగువేసుకుంది. అలంకరించుకున్న ఆమెనుచూస్తే కౌంట్ ముఫత్‌కు మరీ మైకంకమ్మింది. పెదవులు మరీ ఎర్రగా ఉన్నాయి. ముఖం పౌడరు పులమడంవల్ల తెల్లగాఉంది. నేత్రాలు పెద్దవైనట్లు కనుపిస్తున్నాయి. కళ్ళల్లో అపూర్వప్రణయవాంఛ వెలుగుతోంది, వీనస్‌దుస్తులు ధరించడానికి తెరమరుగుకు వెళ్ళింది. నగ్నంగా ఏమాత్రం లజ్జలేకుండా బాహువులను డ్రెసర్ చేతి కందిచ్చింది.

'త్వరగా డ్రెస్‌చేస్తాను. ఒకటే గందరగోళంచేస్తున్నారు' అన్నది ముసలిది.

రాకుమారుడు అర్ధనిమీలితనేత్రుడై ఆమె వక్షువచనుకట్టునూ, కనులనూ, నిర్లిప్తుడైన రసపిపాసిలా పరికిస్తున్నాడు. ముఫత్ తలవాల్చుకుని తివాసీచూస్తూ నిల్చున్నాడు. వీనస్ తయారైంది. నానా ధరించినది ఉల్లి పొరలాంటి వసనం ఒక్కటే. నానా ప్రక్కన ముసలి జూలె చెక్క బొమ్మలాఉంది. ఆమె కళ్ళల్లో ఎలాంటిభావమూలేదు. గాజుకళ్ళు. మాటి మాటికి పిన్నులుతీసి, వీనస్ దుస్తులకు గుచ్చుతోంది. బొమికల్లావున్న ఆమె చేతులు పరిపుష్టంగాఉన్న నానా బాహువులకు తగలినప్పుడు ఆమె కెలాంటి

భావమూ కలగడంలేదు. ఏ పురాస్మృతీ ఆమెలో ఉద్దీప్తం కావడంలేదు. ఆమె మనస్సూ ముఖమూ అచేతనంగా ఉన్నవి.

అలంకరణ పూర్తయింది. నానా చివరిసారి అద్దంలో చూచుకుంది.

బోర్డ్‌నెవ్ మూడో అంకం ప్రారంభమైందంటూ ఆదుర్దాగా వచ్చాడు.

'ఓ, తయారుగాఉన్నాను. అబ్బ! ఒకటేగొడవ!' అంది నానా.

వచ్చిన పెద్దమనుషులందరూ డ్రెసింగ్‌రూమ్‌లోనుంచి వెళ్ళారు. రాకుమారుకు 'వింగ్స్'లో నుంచి మూడోఅంకం చూడాలని అభిలషించాడు. ఒంటరిగా వున్న నానా ఆశ్చర్యంగా అటూఇటూ చూచింది.

'ఎక్కడికి వెళ్ళిఉంటుంది!' అనుకున్నది.

ఆమె సాటిన్‌కోసం వెదకుతున్నది. వెతకగా సాటిన్ తెరవెనకాల ఒకపెట్టెమీద కూచునివుంది. సాటిన్ ప్రశాంతంగా, 'నీకు అడ్డుగా ఉండ దలుచుకోక ఇక్కడికి వచ్చికూచున్నాను' అన్నది. ఇక వెళ్ళిపోతానన్నది. కాని నానా ఆపింది. అలా అనుకోవడం పొరబాటుఅన్నది. బోర్డ్‌నెవ్ ఏర్పరుస్తానని అంగీకరించాడుగా! ప్రదర్శనం పూర్తికాగానే అన్ని విష యాలూ చూచుకోవచ్చునన్నది. సాటిన్‌కొంచెం తటపటాయించింది. ఆమె కీ ప్రదేశం కొత్తగా కనుపించింది. ఇదివర కెన్నడూ ఇలాంటిప్రదే శంలో నివసించలేదు. ఏమైనా సరేనని ఉండిపోయింది.

రాకుమారుడు ఇరుకైనమెట్లు దిగగానే అతనికి జనం కొట్లాడు కుంటున్నరొద వినిపించింది. మినాన్, ఫాష్‌రెల సరసం విరసంగామారింది. ఇద్దరిచేతులుచేతులు కలిశాయి. అనరానిమాట లనుకుంటూ ఇద్దరూ దౌర్జన్యం మొదలెట్టారు.

"బోర్డ్‌నెవ్! బోర్డ్‌నెవ్! అంటూ" కేకలేస్తున్నాడు స్టేజ్ మానేజర్.

బోర్డ్‌నెవ్ అతనివెంట వెళ్ళాడు. ఫాష్‌రె. మినాన్‌ల పరిస్థితిని చూచి అతనికళ్ళు చెదిరిపోయాయి. అతని గాభరాకుతోడు రోజ్ మినాన్ కూడా ఎగరొప్పుతో అక్కడికి వచ్చిచేరింది. తనభర్తా, తనప్రియుడు తన కాళ్ళదగ్గరే కుక్కల్లా కొట్లాడుకోవడం చూచి, ఆమె స్తబ్ధురాలై పోయింది.

"త్వరగా వెళ్ళు. పైమైంది" అంటూ కేకవేశాడు బోర్డనెవ్.

అతను ఒక్క త్రోపుతో సేసరికి రోజ్ పోయి స్టేజిలో పడింది. వాళ్లు ఎందుకు పోట్లాడుకుంటున్నారో రోజ్‌కు ఇప్పటికీ అర్థంకాలేదు. శరీరమంతా వణికిపోతూ దయానావేషంలో శృంగారమయదరస్మితవదనంతో ముందుకువెళ్ళి అగాధస్వరంతో ఒక్కచరణం పలికేసరికి ప్రేక్షకులు ముగ్ధులై పోయారు లోపల ఇంకా వారు పోట్లాడుకుంటూనే ఉన్నారు.

"పాడుగొడవ! ఆ పోట్లాడుకుని చచ్చేదేదో మరెక్కడైనా చావరాదూ. ఇహ మీ రిక్కడ ఒక్కనిముషం ఉండటానికి వీల్లేదు. ఇహ రోజ్‌ను మీ ఇద్దరినీ థియేటర్‌కు తీసుకురానివ్వను" అంటూ కేకలేశాడు బోర్డనెవ్ వారిద్దరినీ విడిదీస్తూ.

రాకుమారుడు తిరిగివచ్చిన తరువాత, 'ఏమిటీగొడవ' అన్నాడు. ఏమీలేదని గొణిగాడు బోర్డనెవ్.

నానా ఉన్నికోటు వేసుకుని పెద్దవారితో మాట్లాడుతూ నిల్చుని ఉంది. ఆమె ఇంకా స్టేజ్‌పైకి వెళ్ళనేలేదు. కౌంట్ ముఫత్‌తో చప్పుడు కాకుండా నడవమని చెప్పాడు స్టేజ్ మానేజరు పైన అంతా నిశ్శబ్దంగా ఉంది. ప్రేక్షకసమూహమంతా ఊపిరిబిగబట్టినట్టుగా ఉన్నది.

"ఏదో తెరచినట్టుగావుంది. వెళ్ళి చూడు బారిలట్! ఎవరో కిటికీ తెరచినట్టున్నారు. పీళ్ళతో చచ్చిపోతున్నాను!" అన్నది నానా.

తలుపులన్నీ మూసేశానని ఒట్టేసి చెప్పాడు బారిలట్. ఎక్కడైనా తలుపుకు సందు ఉందేమో!

'నానా కోపం మరింత రెచ్చిపోతోంది' అన్నాడు బోర్డనెవ్.

స్టేజిమీద రోజ్ నటనకు ప్రేక్షకులు ముగ్ధులైచేసిన కరతాళధ్వనుల్లో ఆర్కెస్ట్రా సంగీతం మునిగిపోయింది. నానా మాట్లాడడం మానేసి గంభీరముద్ర వహించింది. కౌంట్ వింగుల్లోగుండా ఇంకా ముందుకు వస్తుంటే బారిలట్ ఆపాడు—ప్రేక్షకులకు కన్పించవద్దని, అతనికి దృశ్యం ఓరగా కనుపిస్తోంది.

ఈలోగా ఒక చిన్న గందరగోళం బయల్దేరింది.

క్లారిసీ ఏదో కథచెబుతూంటే వింటున్న పైమన్ 'అదుగో ముసలి ట్రికాన్' అన్నది.

నిజంగా ఆమె ముసలిత్రికానే. వానాను చూడగానే సరాసరి నానా దగ్గరకు వెళ్ళింది.

వారిద్దరూ ఏదో మాట్లాడుకున్నారు త్వరత్వరగా. 'వీల్లేదు, ఈసారి కాదు' అంటున్నది నానా.

ముసలిది చాలా గంభీరంగా కనుపించింది. ఫ్రూలెరి ఆమె వెడుతున్నప్పుడు ఆమెతో కరస్పర్శచేశాడు. ఇద్దరు కోరస్‌పిల్లలు ఆమెవంక ఆశ్చర్యంగా చూచారు. ఒకనిమిషం ఆమె తటపటాయించినట్టు కనుపించింది. తరువాత సైమన్‌ను పిలిచింది. మళ్ళీ వారిద్దరిమధ్య ఏవో మాటలుజరిగాయి.

"సరే, ఒక అరగంటలో" అన్నది సైమన్.

ఆమె డ్రెసింగ్‌రూమ్‌కు వెళ్ళేసరికి ఏవో ఉత్తరాలు పంచుతూన్న బ్రాన్ ఆమెకు ఒక ఉత్తరాన్ని ఇచ్చింది. ముసలిత్రికాన్‌ను థియేటర్‌లో ప్రవేశపెట్టినందుకు బోర్డునెవ్ గేట్‌కీపర్‌ను మెల్లగా తిడుతున్నాడు.

రాకుమారునిసన్నిధిలో ఈ స్త్రీ: ఛీ! ఛీ! రోతపుట్టిస్తోంది. ముప్ఫయి సంవత్సరాలు థియేటర్‌లో పనిచేసిన మేడమ్ బ్రాన్ నెమ్మదిగా సమాధానం చెప్పింది. ఆమె కెలా తెలుస్తుంది? త్రికాన్ స్త్రీలందరితోను బేరసారాలు సాగిస్తూంటుంది. బోర్డునెవ్ ఆమె అక్కడికిరావడం ఎన్నోసార్లు చూచాడు. కాని, ఒక్క మాటకూడా అని ఎరుగడు. మానేజర్ నాలుగు కేకలు వెయ్యగానే త్రికాన్ ప్రశాంతంగా రాకుమారుణ్ణి పరిశీలించి చూచింది. ఒక్క చూపులో మగవాడి అంతుకనుక్కునే స్త్రీలాగా పసుపు రంగుగావున్న ఆమెముఖాన చిన్నిచిరునవ్వువెలిగించింది. తరువాత యువతులందరూ సగౌరవంగా దారియివ్వగా అక్కడినుంచి నెమ్మదిగా నిష్క్రమించింది.

వెడుతూ, 'త్వరగా రా; మరిచిపోకు' అన్నది సైమన్‌తో.

సైమన్ చాలా బాధపడుతున్నట్టుగా కనుపిస్తోంది. ఆ జాబు ఒక యువకుడిదగ్గరనుంచి వచ్చింది. ఆ సాయంత్రం అతన్ని కలుసుకుంటానని మాటయిచ్చింది. ఒక చిన్న కాగితంముక్కమీద, 'ఇవాళకాదు, డియర్! పనిమీద వున్నాను' అని వ్రాసియిచ్చింది. కాని, ఆమె గాభరా తగ్గలేదు. ఆయువకుడు తనకోసం వేచివుండవచ్చు. మూడో అంకంలో తనకు పోర్షను లేకపోవడంవల్ల తక్షణం వెళ్ళిపోదామనుకున్నది. క్లారిసీని వెళ్ళి చూచిరమ్మ

న్నది. ప్రదర్శనం పూర్తయ్యేవరకూ ఇహ క్లారిసీకి పనేమీలేదు. అంచేత ఆమె క్రిందికివెళ్ళింది. ఈలోగా సైమన్ తామిద్దరూ వాడుకునే డ్రెసింగ్ రూమ్‌కు వెళ్ళింది. క్రింద ఎవరూలేరు. క్లారిసీ జాగ్రత్తగా అడుగులో అడుగువేసుకుంటూ వెళ్ళింది. మెట్లమలుపులో మెడనిక్కించి గదిలోకి చూచింది.

లాఫలాసి ఇంకా అక్కడే అదేకుర్చీలో కూచుని వుండడం చూచి, ఆమెకు వుత్సుకత కలిగింది. సైమన్ మాట్లాడగానే వెళ్ళినట్టువెళ్ళి మళ్ళీ వెంటనే తిరిగి వచ్చాడు. ఇంకా ఆ గదిలో ఇదివరకటి పెద్దమనుషులు కూచునే వున్నారు. అందరూ ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటూ వేచి వున్నారు. టేబిల్‌మీద ఎంగిలిప్లేట్లు ఇంకా అలాగే వున్నాయి.

మేడం బ్రాన్ సైమన్ వుత్తరాన్ని యువకుని కివ్వడం క్లారిసీ చూచింది. అతను గాస్‌లైట్‌కింద జాబును చదివి, వెళ్ళిపోయాడు.

అతనికి ఎలా ప్రవర్తించాలో తెలుసు. ఇతరులలాగా ఎంతకూ కదలకుండా అక్కడే పడివుండలేదు. మగవాళ్లు పశువుల్లాంటివారు క్లారిసీ తిరిగి పైకివెళ్ళింది. ఆమెకు ఈ మగవాళ్ళనుచూస్తే అసహ్యం వేసింది. యువకుడు వెళ్ళిపోయాడని సైమన్‌కు చెప్పడానికి పైకివెళ్ళింది. రాకుమారుడు నానాను ఒకపక్కకుపిలిచి మాట్లాడుతున్నాడు. ఆమె మాట్లాడుతున్నంతసేపు అర్ధ నిమిలితనేత్రాలతో ఆమెవంకే చూస్తున్నాడు.

ఆమెమాత్రం రాకుమారునివంక చూడకుండా తల వంచుకొని చిరునవ్వుతో, 'సరే' నన్నది. ప్రక్కన జోర్డునెవ్‌తో ఏదోమాట్లాడుతున్న కౌంట్‌ముఫత్ హఠాత్తుగా వచ్చి వారిలో కలిశాడు. నానా రాకుమారుణ్ణి చూచినట్టుగానే అతనివంకచూచి చిరునవ్వు నవ్వింది.

"మీరాడోరంగం చిన్నదనుకుంటాను" అన్నాడు రాకుమారుడు. కౌంట్ సాన్నిధ్యం అతనికి కొంచెం అసంబంధంగా తోచింది.

నానా సమాధానం చెప్పలేదు. ఆమె స్టేజీ పైకి వెళ్ళే ఆలోచనలో వుంది. త్వరగా వున్నికోటు వదిలేసింది. పాదంజాలె తన్ని అంటుకున్నవి. ఒక్కమాటు వ్రేళ్ళతో తలకట్టుసవరించుకుని రంగస్థలంలో ప్రవేశించింది. ఇంచుమించు నగ్నంగావుంది. 'ఇశ్' అన్నాడు జోర్డునెవ్.

కౌంట్, రాకుమారుడు ఆశ్చర్యస్తబ్ధులై నిలబడిపోయాడు. ఆ స్తబ్ధ నిశ్శబ్దాన్ని చీల్చుకుని, అనంతమైన ప్రేక్షకసమూహం విడిచిన ఒక సుదీర్ఘ నిశ్వాసం వినిపించింది. దేవతాస్త్రీలాగా నగ్నసౌందర్యాన్ని విరజిమ్ముతూ వీనస్ ప్రవేశించినప్పుడు ప్రతిరాత్రీ ఇలాంటి ప్రతిచలనమేకలుగుతుంది. చూడాలనే కుతూహలంతో ముఫత్ ఒకసందులోగుండా రంగస్థలాన్ని చూచాడు. ప్రేక్షకసమూహాన్ని ఎర్రని పొగమబ్బు ఆవరించి, అచేతనం చేసినట్టుగా వున్నది. ఈ అనంతప్రేక్షక సమూహంముందు నానా అతీతంగా నిల్చునివుంది. చాచిన ఆమెబాహువులు, వంచిన శిరస్సూ కన్పిస్తున్నాయి. ఆమె గీతంపాడుతూ మెడదగ్గర ఒక విచిత్రమైనకదలికను కలుగజేస్తోంది. ఆ కదలిక మెడదగ్గర ప్రారంభమై, ఆమెశరీరాన్నంతా వ్యాపిస్తున్నట్టుగా వుంది. ఆమెగీతం అంతిమస్థాయిని అందుకున్నప్పుడు కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. ఆమెధరించిన సన్నని వుల్లిపొరలాంటి పటాంచలం ఎగురులాడింది. జుట్టు పిక్కలవరకూ వ్రేలాడింది. ఆమె రొమ్ముల విరుపులూ, కనుల మెరుపులూ గమనిస్తున్న కౌంట్ ముఖం వివర్ణమైపోయింది.

ఈలోగా ఫాష్‌రె వచ్చి కౌంట్‌ను డ్రెసింగ్‌రూములు చూపడానికి తీసుకెళ్ళాడు. నానా స్వర్గానికి దూరంగా వెడుతూంటే కౌంట్‌లో ఒక విధమైన శాంతీ, అశాంతీ రెండూ కలిగాయి. ఫాష్‌రె అప్పటికే మెట్లెక్కిపోతున్నాడు. కౌంట్ అతన్ని అనుసరించకుండా వుండలేకపోయాడు. సామాన్యంగా 'పేదాని కొంపలు' అనబడేవాటిల్లో అలాంటి మెట్లవరుస కనుపిస్తుంది. కౌంట్ ముఫత్ దారిద్ర్యనివారణ సంఘనిధి వసూలు చెయ్యడానికి వెళ్ళినప్పుడు అలాంటికొంపలు ఎన్నోపర్యాయాలు చూచాడు, చవుడుపట్టి, బెడ్డలూడిపడుతున్న గోడలు, నిరంతరం అడుగులరాపిడివల్ల అరిగిన మెట్లవరుసలు, ఏదో అర్థంకాని విషాదాన్ని కలిగిస్తుంటాయి. కిటికీలు జైళ్ళకిటికీల్లా వుంటాయి. ఈ కశ్మల వాతావరణాన్నంతా మసకమసకగా వెలిగించే మసిదీపాలు.

మెట్లవరుసదగ్గరకు వెళ్ళగానే కౌంట్‌కు మళ్ళీ ఏదో స్త్రీలకు సంబంధించిన పరిమళం వేసింది. ఒక్కొక్కమెట్టు ఎక్కుతూంటే పౌడర్ల వాసనలు, సెంట్లఘుమాయింపులు అతన్ని ముంచెత్తి స్తబ్ధుణ్ణిచేశాయి.

నంబర్లు వేసిన ఎన్నో తలుపులు! అనుమానాస్పదమైన ఒక పెద్దహోటల్ వలెవుంది. కౌంట్ ఒకగదిలోకి చూచేసరికి ఆగది ఒక మురికికొంపలా కనుపించింది. ఒకలావుపాటి వ్యక్తి శరీరమంతా చెమటపట్టగా, బట్టలు మార్చుకుంటున్నాడు. మరోగదిలో ఒకస్త్రీ తలకట్టు సవరించుకుంటోంది. ఫాష్రె కౌంట్‌ను పిలిచాడు.

కౌంట్ రెండవ అంతస్తు చేరేసరికి ఎవరివో తిట్లు విన్పించాయి. మాదిర్లై సబ్బునీళ్ళ బేసిన్ దొర్లించింది, సబ్బునీళ్ళు క్రిందికి జారిపడ్డాయి. ఒకతలుపు ఠపీమని మూసుకుంది. ఎవరివో పెద్దనవ్వులు— మళ్ళీ పోట్లాడుకుంటున్న చప్పుడు— తరువాత ఏదోపాట— ఏవో విభిన్నధ్వనులు. పాట ఆరంభమై వెంటనే ఆగిపోయింది. గోడలసందుల్లోగుండా నగ్నస్త్రీల పూలలాంటి శరీరాలు కన్పిస్తున్నాయి. ఇద్దరు విలాసినులు ఒకరికొకరు తమ శరీరాలపై ఉన్న గుర్తులు చూపుకుంటున్నారు.

ఒక స్త్రీ పూర్తిగా బట్టవిడిచి, డ్రాయర్ కుట్టుకుంటోంది. డ్రెసరు వీరిద్దరినీ చూచి తెరలులాగేశాడు.

ప్రదర్శనం తుదిని చాలా గందరగోళంగావుంది. అందరూ రంగులు కడుక్కుంటున్నారు. తలుపులు మూసివేస్తున్న చప్పుడు. మూడో అంతస్తు చేరేసరికి ముషత్‌కు బాగా కైపు హెచ్చింది. డ్రెసింగ్‌రూమ్‌లో ఇరవైమంది స్త్రీలు గుట్టగా ఉన్నారు. సబ్బులూ, లెవెండర్ నీళ్ళు— అంతా ఖచాడుగా ఉంది. మూరుమూలల్లో ఉండే భోగంకొంపలా ఉంది చివరి అంతస్తులోకి వెడుతూ ఒక తలుపు సందులోగుండా చూచాడు కౌంట్. గది ఖాళీగా ఉంది. మరేంలేదు. గుడ్డలు కుప్పగా పడివున్నాయి. చివరి అంతస్తులో మరీ ఊపిరిసలపడంలేదు. రకరకాల వాసనలూ, వెచ్చదనం అక్కడికి వచ్చిపడ్డట్టుగా ఉంది. మూరు పొగమూరి ఉంది. ఒక గాస్ లైటు మసకగా వెలుగుతోంది. కౌంట్ ఒక్క నిమిషం ఇనుపకమ్మి పట్టుకుని నిల్చుని, ఒక నిట్టూర్పు విడిచాడు. తనకు ఇంకా అపరిచితంగా ఉన్న స్త్రీమోహాగ్నంతా గాలిద్వారా పీల్చినట్టుగా ఉంది ఆ నిట్టూర్పు. అతన్ని ఆ వాతావరణం బాగా ఆచ్ఛాదించింది.

ఒకక్షణంక్రితం అదృశ్యుడైన ఫాష్రె తిరిగివచ్చి, 'రండి వెళదాం, మిమ్మల్నెవరో పిలుస్తున్నారు' అన్నాడు.

అతను క్లారిసీ, సైమన్ల డ్రెసింగ్ రూమ్‌లోకి వెళ్ళాడు. 'రండి. క్లారిసీ మిమ్మల్ని ముద్దాడాలనుకుంటోంది' అన్నాడు ఫాష్‌రె.

ముఫత్ కాస్త సందేహించుతూనే గదిలో ప్రవేశించాడు. గదిలో మార్కిస్‌ను చూచేసరికి ఆయనకు ఆశ్చర్యం కలిగింది. మార్కిస్ రెండు డ్రెసింగ్ టేబిళ్ళమధ్య కుర్చీలో ఆసీనుడైవున్నాడు.

"నువు ముసలాడితో వెడతావా ఏమిటి?" అని అడిగింది సైమన్, క్లారిసీని.

"ఎబ్బే!" అన్నది క్లారిసీ బిగ్గరగా.

సైమన్‌డ్రెసరు ఈమాట విని పకాలున నవ్వింది.

"రా, క్లారిసీ ఈమహాశయుణ్ణి ముద్దెట్టుకో" అన్నాడు ఫాష్‌రె.

కాని, క్లారిసీ ఇలాంటిమగాళ్ళను చాలామందిని చూచింది. క్రింద వేచియున్న పురుషులనుగురించి చాలా నిరసనగా మాట్లాడింది. ఫాష్‌రె తలుపుదగ్గరనుంచి తొలగకపోయేసరికి ముఫత్‌మీసాలు ముద్దెట్టుకుని, 'నీవని ముద్దెట్టుకోడంలేదు తెలుసా? ఫాష్‌రె గొడవచేస్తున్నాడని' అంటూ విస విసా వెళ్ళిపోయింది.

మామగారి సన్నిధిలో కౌంట్‌కు ఒళ్ళంతా జెర్రులుపాకినట్టయింది. ముఖం ఎర్రబడింది. నానాగదిలోకూడా ఇలాంటి అనుభవం కలుగలేదు. మార్కిస్ సైమన్‌చెవిలో ఏదో గుసగుసలాడుతూ ఆమెతోకలిసివెళ్ళాడు. ఫాష్‌రె నవ్వుతూ వారి ననుసరించాడు. కౌంట్ ఒంటరిగా మిగిలిపోయాడు. ఏమీతోచక మెట్లుదిగాడు. కాళ్ళు వణుకుతున్నాయి. తనబరువు తానే మోయలేకపోతున్నాడు.

నాటకం ముగిసింది. తెర అప్పుడే జారింది. నటకులు జట్లుజట్లుగా పైకివచ్చేస్తున్నారు. కౌంట్ మెట్లచివరకు వచ్చేసరికి నానా, రాకుమారుడు నెమ్మదిగా నడిచివెడుతున్నారు. నానా హఠాత్తుగా ఆగి, 'సరే, ఒక్క నిమిషంలో వస్తాను' అన్నది.

రాకుమారుడు రంగస్థలంమీదికి వెళ్ళాడు. బోర్డ్‌నెవ్ ఆయనతో ఉన్నాడు. నానా ఒక్కతే వెళ్తూండడంచూచి ముఫత్ తీవ్రవాంఛాప్రేరితుడై త్వరత్వరగా ఆమె వెనుక వెళ్ళాడు.

నానా డ్రెసింగ్‌రూమ్‌కు చేరగానే, ఆమె మెడమీద గట్టిగా ముద్దెట్టు కున్నాడు — పైన తనను పెట్టుకున్నముద్దుకు ప్రతికృతి చేసినట్టు నానా కోపంతో చెయ్యెత్తబోయింది. కాని, తిరిగిచూచేసరికి కౌంట్ కనుపించాడు. చిరునవ్వునవ్వి. 'నన్ను భయపెట్టేశారు సుమా!' అన్నది.

ఆ నవ్వుచూస్తే తనముద్దు నామె కోరినట్టుగా తోచింది. కాని, ఆమె తిరిగి ముద్దెట్టుకోలేదు. ఆ క్షణంకోసం వేచివుండాలి. ఆమె కొంచెం మాగి ఇలా ప్రారంభించింది....

"మీకు తెలుసో లేదో, ఇప్పుడు నే నొక జమీందారిణిని. నే నొక చిన్న ఎస్టేట్ కొన్నాను. మీరుకూడా అప్పుడప్పుడు అక్కడికి వెడుతూంటారని జార్జ్ చెప్పాడు. మీరు జార్జ్‌ని ఎరుగుదురుకదూ? సన్నక్కడ కలుసుకోండి' అన్నది.

తనతొందరకు తనే సిగ్గుపడిన కౌంట్ అతివినయంతో వందనం చేసి 'అలాగే' అన్నాడు కలలోలాగా. అక్కడినుంచి రాకుమారుణ్ణి కలుసుకోడానికి వెళ్ళిపోయాడు.

వెడుతుండగా, 'నీవు వట్టిరాక్షసుడివి. నన్ను వదలిపెట్టు' అన్న మాటలు విన్పించాయి, ఆ స్వరం సాటిన్‌ది. మార్కిస్ సాటిన్‌నుపట్టుకున్నాడు. సాటిన్ ఇలాంటివారితో ఇదివరకే విసుగెత్తివుంది. అది మరో వ్యక్తికోసం వేచిఉంది. మార్కిస్ ఈలోగా తన్నుపట్టుకోగా 'ఇప్పుడే నా భర్త వస్తాడు, చూస్తువులే' అంది.

నటకులు ఒక్కొక్కరే రంగులు కడుక్కొని వెళ్ళిపోతున్నారు. జనం గుంపులుగుంపులుగా తూలుతూ సోలుతూ పోతున్నారు. రాకుమారుడు నానాకోసం వేచిఉన్నాడు. ఆయనకు మరోదారి సిద్ధంచేసిఉంచాడు బోర్డ్‌నెవ్.

"ప్రభువువారు ఇలా దయచెయ్యండి" అని దారిచూపాడు బోర్డ్‌నెవ్. రాకుమారుడు నానాతో వెళ్ళాడు. తరువాత కౌంట్, మార్కిస్ వచ్చారు. వారిసందరినీ సాగనంపిన తరువాత బోర్డ్‌నెవ్ ఒక్కడే మిగిలిపోయాడు. రాకుమారుణ్ణిగురించి తనఅభిప్రాయాన్ని తాత్వికుడులా వెల్లడిస్తూ, 'ఏమైనా, కొంచెం చవట!' అన్నాడు.

రోజ్ ఫాష్‌రెను తన ఇంటికి తీసుకువెడుతోంది, మళ్ళీ తన భర్తతో రాజీపరచాలని.

కౌంట్ ఒంటరిగా పేవ్‌మెంట్‌పైకి వచ్చాడు, రాకుమారుడు నానాను తనబండిలో ఎక్కించుకొని వెళ్ళిపోయాడు. మార్కిస్ సాటిన్‌ను అనుసరించాడు-ఆమె ఏమైనా అనుగ్రహిస్తుందేమోనని. కౌంట్ బుర్ర ఉడికిపోతోంది, కాలినడకనే ఇంటికి వెడదామనుకున్నాడు. అతనిలో సంఘర్షణంతా ఆగిపోయింది. ఒకకొత్తజీవనోదయం అతని నలభై సంవత్స రాల జీవితానుభవాలను విశ్వాసాలను ముంచేసింది. ఎక్కడవిన్నా నానా పేరే విన్పిస్తున్నట్టుగా ఉంది. నానాసుకుమారబాహువులు, తెల్లనిభుజాలు కళ్ళముందు నృత్యంచేస్తున్నాయి. తను పూర్తిగా ఆమెకు వశుడైపోయాడు. ఆ రాత్రి ఒక్కగంటసేపు ఆమె తనకౌగిట్లోఉంటే, ఆమెకొరకు తా నేమైనా త్యాగంచేసేవాడే. తనసంపదంతా అమ్మేయడానికి వెనుదీసేవాడు కాదు ఆయనలో యౌవనం నెమ్మదిగా మేల్కొంటున్నది. ఆయన నియమనిష్ఠలనూ, నడివయస్సులోని గాంభీర్యాన్నీ భేదించుకుని యౌవన జ్వాల వెలికి వస్తోంది!

# 6

క్రౌంట్‌ముఫత్ సతీ-సుతలతో లెఫాండెట్‌కు వచ్చాడు. మేడమ్ హూగన్ తనకుమారుడు జార్జితో అక్కడ ఏకాంతంగా నివసిస్తోంది, అక్కడికివచ్చి, ఒకవారంరోజులు గడిపిపోవలసిందని కౌంట్‌ను ఆహ్వానిం చింది. వారునివసించేభవనం పదిహేడవశతాబ్దపు చివరిరోజుల్లో నిర్మించబడి నది, చుట్టూ చదరంగాఉన్న పెద్ద ఆవరణ. భవనం అతి నిరాలంకారంగా ఉంది. తోటలోమాత్రం కొన్ని మిన్నంటే బ్రహ్మాండమైనవృక్షాలు. సరో వరాలు ఉన్నాయి. కనుచూపుమేర పచ్చనిపైరు కన్పిస్తూవుంటుంది. ఆర్లి యన్స్‌నుంచి పారిస్‌కువెళ్ళే రోడ్డుమీదనుంచి ఆ భవనాన్ని పరిశీలిస్తే, వృక్షాలతోకూర్చిన ఓ పెద్ద పూగుత్తిలా అగుపిస్తుంది.

పదకొండుగంటలైంది. రెండోగంట మ్రోగింది. అందరూ 'లంచ్' టేబిల్‌చుట్టూ పోగైనారు. మేడమ్ హూగన్ మాతృత్వం ఉట్టిపడే చిరు

నవ్వుతో సెబైన్‌ను ముద్దాడి, 'పల్లెల్లో ఉన్నప్పుడు ఇలా ముద్దాడడం నాకు అలవాటమ్మా. నీ రాకవల్ల నాకు మళ్ళీ చిన్నతనం వచ్చినట్టుంది. రాత్రి బాగా నిద్రపట్టిందా?' అన్నది ఆప్యాయంగా. వెంటనే ఈస్టలీవంక తిరిగి, 'ఈపిల్లకూడా బాగా నిద్రపోయిందా?' అని 'రా తల్లి, ఒకముద్దివ్వు' అన్నది.

భోజనాలగది చాలా విశాలంగాఉంది. కిటికీలలోగుండా ప్రఫుల్లమైనవనం కనుపిస్తోంది. వారందరూ కలిసిఉండడంకోసం బల్లచివర కూచున్నారు. సెబైన్ చాలా హుషారుగా ఉంది. తన చిన్ననాటిసంగతులెన్నో జ్ఞాపకానికివస్తున్నాయి. లెఫాండెటీలో ఎన్నోనెలలు గడిచిపోయాయి. సాయంత్రం షికారువెళ్ళేవారు. వేసవిసాయంత్రాల్లో పరోవరస్నానాలు, మరెన్నో వినోదాలు, విలాసాలతో గడిచాయి రోజులు. కొన్ని నెలలనుంచి కౌంటెస్‌నుచూడని జార్జికి ఆమెలో ఏదో కొత్తదనం కన్పించింది. ఆమెవదనంలో ఏదో మార్పు కనుపిస్తోంది. మేడమ్ హూగన్ విందారగిస్తూ మాంసందరలు హెచ్చిపోయాయని కసాయివాళ్ళని తిట్టిపోస్తోంది. అన్నీ అర్లియన్స్‌నుంచి తెప్పించాలి. కావలసినది. ఒక్కటీ పంపరు.

"జూలైనుంచి మీరు వస్తారనుకుంటున్నాను. కాని, సెప్టెంబర్ మధ్యలో వచ్చారు. ఈ రోజుల్లో ప్రకృతి అంత బావుండదు" అన్నది.

ఇలాఅని చెట్లకేసి చూసింది. ఆకులు పండిపోతున్నాయి. ఆనాడు మబ్బుపట్టి మసాబుగాఉంది. ఒకవిధమైన నీలహిమం ప్రకృతినంతా ఆచ్ఛాదించి, అవ్యక్త విషాద ప్రశాంతిని వెళ్ళదోస్తున్నది. దిక్చక్రాన్ని కన్పించకుండా చేస్తున్నది.

"మరికొందరు అతిథులు వస్తారనుకుంటున్నాను. వారుకూడా వస్తే ఎంతో కులాసాగా ఉంటుంది".

జార్జి తనమిత్రులను ఫాషరె, డానెట్‌లను ఆహ్వానించాడు. మీకు వారితో పరిచయంఉందనుకుంటాను. వాండెవైకూడా ఐదు సంవత్సరాలనుంచి వస్తానని వాగ్దానంచేస్తున్నాడు. బహుశా ఈసారి తప్పక రావచ్చు" అన్నది మేడం హూగన్.

"వాండెవ్రె చాలా పనుల్లో ఉన్నాడు" అన్నది కౌంటెస్.

"మరి ఫిలిప్?" అన్నాడు కౌంట్.

అందరూ కాఫీసేవిస్తూ పారిస్‌నుగూర్చి మాట్లాడుకోసాగారు.

స్టీనర్ ప్రసక్తివచ్చింది. స్టీనర్ పేరు వినగానే మేడం హూగన్ ఒక చిన్న కేకపెట్టింది.

"అతను కదూ, స్టీనర్ అంటే లావుపాటిమనిషి? మీ ఇంట్లో ఒక నాడు కలుసుకున్నాను. బ్యాంకర్ అనుకుంటాను. చాలా గడుసరిసుమా! ఇక్కడికి దగ్గరలో ఒక వేషాలేసే పిల్లకోసం చిన్నజమీ కొన్నాడు. అందరి నోటా అదేమాట. మీకు తెలీదా ఏమిటి?" అన్నది.

"అబ్బే! నా కేమీ తెలియదు. అయితే స్టీనర్ ఇక్కడ ఒకఎస్టేటు కొన్నాడన్నమాట?" అన్నాడు ముఫత్.

ముఫత్ ఈమాట అనగానే జార్జి అతనివంక చూచాడు. ముఫత్ ఎందు కలా నిస్సంకోచంగా అబద్ధమాడాడు? ముఫత్‌కూడా జార్జిని గమనించకపోలేదు. అనుమానంగా అతనివంక చూచాడు. మేడం హూగన్ ఇంకా ఏవో వివరాలు చెప్పింది. ఎస్టేట్ పేరు లామినాట్.

"అయితే ఆ అధినేత్రి పేరేమిటి?" అని అడిగింది కౌంటెస్.

"ఏదో చెప్పారు. తోటమాలి చెబుతున్నప్పుడు నువ్వున్నావు కదూ జార్జి?" అన్నది మేడం హూగన్.

జార్జి జ్ఞాపకంతెచ్చుకుంటున్నట్టు నటించాడు. ముఫత్ వ్రేళ్ళమధ్య టీస్పూను తిప్పుతూ కూచున్నాడు. కౌంటెస్ ముఫత్‌వైపు చూచి- 'స్టీనర్ వెరైటీ థియేటర్ గాయకురాలు నానాతో. నివసిస్తున్నాడు కదూ?' అన్నది.

"నానా! అవును. అదే దాని పేరు. ఇందాకటినుంచీ జ్ఞాపకంరాలేదు. వట్టి భ్రష్టురాలట! ఇవాళ సాయంత్రం లెమినాట్‌కు వస్తుందటకూడాను." అన్నది హూగన్ ఒకవిధమైన జుగుప్సతో.

కౌంట్ కొంచెం ఆశ్చర్యచకితుడైనాడు. జార్జి వెంటనే, 'కాదమ్మా, ఎల్లుండివరకూ ఎవరూ రారట' అన్నాడు.

అతను చాలాసహజంగా మాట్లాడడానికే ప్రయత్నించాడు. ముఫత్ ముఖంలోవచ్చే మార్పులు ఒకకంట కనిపెడుతూనే ఉన్నాడు. ముఫత్ నిశ్చలదృక్కులతో చేతిలో స్పూన్ తిప్పుతున్నాడు. కౌంటెస్ దిక్చక్రం వంక అవ్యక్తంగా చూస్తూ సంభాషణకు ఎంతో దూరంగా ఉన్నట్టుంది. ఆమె పెదవులమీద చిరునవ్వు నీడలాప్రాకి, ఆమెలో హఠాత్తుగా ఒక

రహస్యభావం జాగరితమైంది. ఈస్టలీ తన కన్యావదనంలో ఏమాత్రం మార్పులేకుండా నానానుగురించి ఈ సంభాషఅంతా విన్నది.

'సరే, కోపంతెచ్చుకోవడం నాతప్పు. ప్రతివారూ బ్రతకాల్సిందే. ఎప్పుడైనా ఆమెకనుపిస్తే గుర్తించకుండా ఉండడమే మనం చెయ్యాదగిన పని' అన్నది మేడమ్ హూగన్.

టేబిల్‌దగ్గరనుంచి లేస్తూ 'కౌంటెస్ సెబైన్ చాలా రోజులకు వచ్చి నందుకు మళ్ళీ కొంచెం కోపగించుకుంది. అంతా తన భర్త తప్పేనన్నది కౌంటెస్. రెండుసార్లు పెట్టెలన్నీ సర్దుకుని ప్రయాణమైతే, ప్రయాణం ఆపేశాడు, అత్యవసరంగా పారిస్ వెళ్ళాలనిచెప్పి. జార్జికూడా వస్తావని చెప్పి రెండుసార్లు రాలేదు. చివరకు ఎలాగైతేనేం వచ్చాడు' అన్నది మేడం హూగన్. అందరూ తోటలోకి వెళ్ళారు. స్త్రీల సంభాషణ వింటూ పురుషులు ఇరువంకలా నడుస్తున్నారు.

"జార్జ్, ఎన్నాళ్ళకు వచ్చావు నాయనా! ఎప్పుడూ నన్ను మరిచిపోవుకదూ!' అన్నది మేడమ్ హూగన్ ఆప్యాయంగా.

మధ్యాహ్నమయ్యేసరికి ఆమెకు ఆందోళన హెచ్చింది. భోజనం పూర్తికాగానే కొంచెం తలనొప్పిగా ఉన్నదన్నాడు జార్జ్. రానురాను తలనొప్పి విపరీతమైనట్లు కనుపించింది. నాలుగుగంటలు కాగానే పైకివెళ్ళి పడుకుంటానన్నాడు. అంతకుమించి అతనికి మరో నివారణోపాయం కనుపించలేదు. తెల్లవారేవరకూ బాగా నిద్రపోతే తగ్గవచ్చు. తల్లి స్వయంగా వచ్చి అతన్ని పడుకోబెట్టింది. తల్లివెళ్ళిపోగానే అతను పరుగెత్తుకొనివెళ్ళి తలుపు గడియ బిగించాడు. ఎవరూ మధ్యలో నిద్రాభంగం చెయ్యకుండా ఉండడానికి అలాచేస్తున్నానన్నాడు. కాని అతను పడుకోలేదు. చప్పుడు కాకుండా చక్కగా డ్రెస్‌చేసుకుని కూచున్నాడు. డిన్నర్‌గంట మ్రోగిన వెంటనే కౌంట్‌ముఫత్ డ్రాయింగ్‌రూంలో ప్రవేశించడం చూచాడు. పది నిమిషాలు కాగానే ఎవరికీ కనుపించకుండా మెల్లిగా కిటికీగుండా క్రిందికి జారుకున్నాడు. నెమ్మదిగా బైటికివెళ్ళి, పొలాల్లో కాలిదారిపట్టాడు. చీకటి పడుతూంది. సన్నగా వానజల్లు పడసాగింది.

ఆ సాయంత్రమే లామినాట్‌కి నానా రావలసివుంది. స్టీనర్ ఆ ఎస్టేటు కొన్నప్పటినుంచీ ఎప్పు డక్కడికివెళ్ళి నివసిద్దామా అని ఉవ్వి

ఖ్ఖారుతూ ఉంది నానా. కాని బోర్డునెవ్ సెలవు ఇచ్చాడుకాదు. సెప్టెంబర్ వరకు ఎలాగో ఒకలా ఉండిపొమ్మన్నాడు. ఎగ్జిబిషన్ సమయంలో ముఖ్యంగా ఆ పాత్ర మరొకరిచేత వేయించడానికి వీల్లేదన్నాడు. ఆగష్టు వచ్చేసరికి అక్టోబరువరకు వాయిదా పొడిగించాడు. నానా భగ్గునమండిపడి సెప్టెంబర్ 15న తప్పకుండా అక్కడికి వెళ్ళితీరుతానంది. ముఫత్‌తోకూడా ఈమాటే చెప్పింది. పన్నెండోతేదీ వచ్చేసరికి వెళ్ళాలనే ఉత్సాహాన్ని నిజంగా ఆమె ఆపుకోలేకపోయింది.

'జోను' తీసుకెళ్ళాలని నిశ్చయించుకుంది. బోర్డునెవ్‌కు ఈ ప్రయాణ సన్నాహంతెలిస్తే ఏదైనా అడ్డుపుల్ల వెయ్యవచ్చు. డాక్టర్ సర్టిఫికెట్ పంపి అతనికి చెప్పకుండానే వెడదామనుకుంది. జోను త్వరగా పెట్టెలు సర్దమని చెప్పి, తను వెళ్ళి బండిలోకూచుంది. రైల్వేస్టేషన్ చేరినతరువాత కాని, తనప్రయాణం సంగతిని స్టీనర్‌కు తెలియజేయాలని ఆమెకుజ్ఞాపకంరాలేదు. చిన్నిలూయీని తీసుకురమ్మని పినతల్లికి ఒకవుత్తరంవ్రాసింది. చిన్నిలూయీ వస్తే ఎంతబావుంటుంది! ఇద్దరూకలిసి చెట్లనీడల్లో హాయిగా ఆడుకోవచ్చు. పారిస్‌నుంచి అర్లియన్స్‌చేరేవరకూ చెమ్మగిలినకళ్ళతో ఆనందపరవశురాలై అలాగే కూర్చుండిపోయింది. పూలూ, పక్షులూ, శిశువు—అన్నీ ఆమె మాతృహృదయాన్ని వుద్విగ్నంచేశాయి.

అర్లియన్స్‌నుంచి లెమినాట్ మూడులీగులదూరంకన్న ఎక్కువే వుంది. నానాకు బండి దొరికేసరికి ఒకగంట ఆలస్యమైంది. బండీ చాలా పాతది. వెడుతుంటే ఇనపకీళ్ళ చప్పుడవుతోంది. నానా బండి పోయినంత సేపూ బండివాడిపై ప్రశ్నలవర్షంకురిపించింది. 'లెమినాట్ ఎప్పుడైనా వెళ్ళావా? ఆ కొండలచాటున వున్నదేకదూ అది? అక్కడ కావలసినన్ని చెట్లుంటాయికదూ? ఇల్లు దూరానికి కన్పిస్తుందా?'—ఇలా ఎన్నో ప్రశ్న లడిగింది. బండివాడు చాలా ముసలివాడు. గొణుగుతూ ఏవేమో సమాధానాలు చెప్పాడు.

హఠాత్తుగా బండి ఆగితే, 'ఇదేనా ఇల్లు?' అన్నది నానా ఆతృతగా. బండివాడు సమాధానంగా గుఱ్ఱాన్ని చర్నకోలతో ఒకదెబ్బతీశాడు. బండి భారంగా ఒక చిన్నకొండగుట్ట ఎక్కసాగింది. విశాల ప్రకృతి సౌందర్యాన్ని వీక్షించి, నానాహృదయం విప్పారింది,

"చూడు, జో! ఆ పచ్చనిపైరు ఎంతచక్కగావుంది!" అంది నానా.

"అమ్మగారు ఎన్నడూ పల్లెలు చూడలేదు" అన్నది జో....

బండి చెట్లనీడల్లోగుండా పోతున్నది. ఒక చిన్నకుక్కపిల్లలా నానా చెట్లఆకుల్ని వాసనచూచింది. బండి మలుపు తిరుగుతుండగా చెట్లమధ్య ఒకఇల్లు కనుపించి, 'ఇదేనా మనయిల్లు' అని అడిగింది నానా. బండివాడు తలతిప్పుతూ, 'కా'దన్నాడు. కొండదిగుతూండగా చర్నకోలతో చూపుతూ 'అదే ఇల్లు' అన్నాడు. నానా బండిలోనుంచి ఎగిరిదూకి, 'ఏది, ఏదీ' అన్నది. ఆమెకళ్ళకు ఏదో తెరకమ్మినట్లయింది. నెమ్మదినెమ్మదిగా ఆమె కొంక గోడ కనుపించింది. ఒక గొప్ప ఆవేశానికి వశ్యురాలైన స్త్రీలాగా ఆడుతూ పాడింది.

"చూడవే జో, చూడు! ఎంచక్కగా ఉందో!" అన్నది.

బండి ఇనపగేటువద్ద ఆగింది. బండిచప్పుడు విని తోటమాలి బైటికి వచ్చి నిల్చున్నాడు. నానా గంభీరంగా కన్పించడానికి ప్రయత్నించింది. ఇదివరకే బండివాడు పెదవులు బిగబట్టుకుని నవ్వడం గమనించింది. అంచేత వెంటనే ఇంట్లోకి వెళ్ళక, తోటమాలి చెప్పేదంతా విన్నది. నానా వ్రాసిన లేఖ ఆ ఉదయాన్నే చేరడంవల్ల అతను ఇల్లు పూర్తిగా సర్ది, సరిగా ఉంచ లేకపోయినందుకు క్షమించ గోరాడు. నానా ఎంత ప్రయత్నించినా తన నడక వేగాన్ని తగ్గించుకోలేకపోయింది. జో ఆమెను అందుకోలేకపోయింది. సరాసరి ఇంట్లో ప్రవేశించి ఇల్లంతాతిరిగి, ఇంటిచివర నిల్చుని పరికించింది. ఇటాలియన్‌పద్ధతిలో కట్టిన పెద్ద యిల్లది. నేపిల్స్‌లో రెండు సంవత్సరాలు నివసించిన ఒక ఇంగ్లీష్‌వాడు ఆ భవనాన్ని కట్టాడు.

"అమ్మగారికి ఇల్లంతా చూపిస్తాను" అన్నాడు తోటమాలి.

ముందు వెడుతున్న నానా అవసరంలేదులే అన్నది. అంతా స్వయంగా తనే చూచుకుంటానంది చకచకా వెళ్ళి గదులన్నీచూచింది. జోకు ప్రతి గదినిగూర్చి తనఅభిప్రాయం చెప్పింది. నవ్వుతూ, చప్పట్లుచరుస్తూ ఇల్లంతా కలయతిరిగింది. ఎన్నాళ్ళనుంచో ఎవరూకాపురంలేనందున ఆ భవనంలో పేరుకున్న నీరసత ఆమె కిలకిల — గలగలలతో భగ్నమైనట్లయింది. మొదట విశాలమైనహాలు. దానివెనక డ్రాయింగ్‌రూము పెద్దపెద్ద కిటికీలతో అందంగాఉన్నది భోజనాలగది అన్నిటికంటే అద్భుతంగాఉంది. పారిస్‌లో

ఇలాంటి భోజనశాలఉంటే, ఎంత పెద్దవిందులైనా చెయ్యొవచ్చుకదా అనుకున్నది నానా. తరువాత నానా మేడమీదికివెళ్ళి, పడకగదిని చూచింది. పడకగది ఆమెను ఆనందంలోముంచేసింది. ఆ గది ఇంద్రభవనంలాఉంది. అతిథులకోసం ఇంకా నాలుగైదు గదులున్నాయి. నానా మేడపైకివెళ్ళి, 'జో! ఏమేవ్! ఇటురావే! ఇదేదో స్వర్గలోకంలా ఉంది' అంటూకేకేసింది. జో గొణుగుతూ పైకివెళ్ళింది. నానా పైననిలబడి అనంతంలోకలిసిపోతున్న అగాధమైనలోయను చూస్తోంది. అనంతమైనదిక్చక్రం విశాలంగా కన్పిస్తోంది. మంచు దిక్చక్రాన్ని కొద్దిగా కమ్ముతోంది. ఉండిఉండి, ఒక గాలివీచి తుపరపడుతోంది, నానా గౌనుకొసలు జండాల్లా టపటపకొట్టుకుంటున్నాయి.

"ఇదేమిటమ్మాయిగారూ, ఇక్కడున్నారు! త్వరగా వచ్చెయ్యండి, గాలి విపరీతంగా ఉంది' అన్నది జో.

అమ్మగారికి ఈ మాటలు వినపడలేదు. అవనతవదనయై విశాలప్రకృతిని అవలోకిస్తోంది. ఏడెనిమిదెకరాలనేల పచ్చగాపరుచుకుని రమణీయంగా వుంది. పెరట్లో కాబేజీలు దిట్టంగానే కాసివున్నాయి. నానా గుమ్మడిపండ్లలావున్న కాబేజీగడ్డలుచూచి ఉద్విగ్నురాలై, రావే, రావే' అంటూ అటు వెళ్ళింది. వాన ఎక్కువైనా లెక్కచెయ్యలేదు.

"అమ్మగారూ, వానలో తడవకండి. జ్వరంవస్తుంది" అంటోంది జో. కాని అమ్మగారు ఆగలేదు. తోటంతా తిరిగి, పరవశురాలవుతోంది.

కదలకుండా మెదలకుండా వరండాలో నిల్చుని ఇదంతా పరికిస్తోంది జో. వాన మరీ ఎక్కువైంది. కుండపోత పోస్తున్నది. నానాబట్టలు తడిసి నీళ్ళోడుతున్నాయి. నానాకు పిచ్చెత్తిందనుకొన్నది జో.

కాని నానాకు ఇదంతా పట్టినట్టులేదు. వానలో తడుస్తూనే తోటంతా తిరిగిచూసింది. తోటలో లతలూ, పూలూ, పండ్లూ చూస్తుంటే ఆమెకు మళ్ళీ శైశవంవచ్చినట్టుగావుంది ఒకపూలగుబురువద్దకు వచ్చేటప్పటికి ఆమెకేదో కదలినట్లు కనుపించి కేకేసింది. ఆమె ఆశ్చర్యభయాలను విభగ్నంచేస్తూ ఆ పొదలోనుంచి ఒక మానవవ్యక్తి ఉదయించాడు. ఆమె అతన్ని గుర్తించింది.

"ఓసేవ్, అబ్బాయి ఇక్కడున్నాడే-ఇక్కడేం చేస్తున్నావోయ్?" అన్నది నానా.

"వచ్చాను" అన్నాడు జార్జ్. ఆమె ఆశ్చర్యచకితురాలైంది. 'అరె ఇలా తడిసి ముద్దయినా వేమిటి?' అన్నది.

"దారిలో నీళ్ళగుంటలో పడ్డాను" అన్నాడు జార్జ్.

నానా స్నిగ్ధహృదయం అనుకంపతో ఆర్ద్రమైంది. వెంటనే అతని చెయ్యిపట్టుకుని ఇంట్లోకి తీసుకెళ్ళింది.

"ఎందుకు నాకుళ్ళని ఉన్నానో తెలుసా? పారిస్‌లోలాగా చీవాట్లేస్తా వనుకున్నాను" అన్నాడు జార్జ్.

నానా సమాధానంచెప్పక, పెద్దగా నవ్వుతూ అతనిఫాలభాగాన్ని ముద్దాడింది. ఆరోజువరకూ ఆమె అతన్ని చిన్నకుర్రాణ్ణి చూసినట్టే చూచింది. అతనిమాటలు అంతగా ఖాతరుచేసేదికాదు. ఆట్టేపట్టించుకోవల సిన అవసరంలేని చిన్నకుర్రాడితో పరాచకమాడినట్టు ఆడుతూండేది. ఇప్పు డతనికోసం ఎంతో ప్రయాసపడింది. పడకగదిలో అతనికోసం పెద్ద మంట చేయించింది. జార్జి కనుపించడం జోకు అంతగా ఆశ్చర్యంకలిగించలేదు. తోటమాలిమాత్రం హఠాత్తుగా తడిసి నీరు ఒడుస్తున్న అతన్ని చూచేసరికి స్తబ్దుడైపోయాడు. నానా అతన్ని పంపేసింది. గదిలో దీపం వెలుగుతోంది. మంట పెద్దదయింది. జార్జి గజగజవణుకుతున్నాడు చలికి. 'జలుబుచేస్తుంది; అయ్యో!' అన్నది నానా.

ఇంట్లో మరో చొక్కా లాగూలేన్ను తోటమాలిని పిలుద్దామను కుంది. కాని ఈలోగా ఆమె కేదో తట్టింది. డ్రెసింగ్‌రూమ్‌లో పెట్టెలు సర్దుతున్న జో అమ్మగారికోసం కొన్ని కొత్తగౌన్లు పట్టుకొచ్చింది.

'ఓ! చక్కగా ఉన్నాయి. జీజీ ఇవి కట్టుకుంటాడు నావివేసుకో డానికి సంశయించకేం నీ గుడ్డలు ఆరగానే అవి కట్టుకోవచ్చు. త్వరగా కట్టుకో. నేనూ బట్టలుమార్చు కొస్తాను" అని నానా డ్రెసింగ్‌రూమ్‌కు వెళ్ళింది.

తిరిగివచ్చి చూచేసరికి ఆమెను ఆశ్చర్యానందాలు ముంచెత్తాయి. 'అతడానిదుస్తుల్లో ఎంతచక్కగా ఉన్నాడు!' అన్నది.

రాత్రులందు స్త్రీలు ధరించే సిల్క్‌గౌను వేసుకున్నాడు జార్జి. ఆ దుస్తుల్లో అందమైన ఆడపిల్లలా మెరిసిపోతున్నాడు.

"అచ్చం నాలాగే ఉన్నాడు సుమా! నాజూగ్గా ఎలా ఉన్నాడో చూడు. ఒసేవ్! జో, వచ్చి చూడవే. దుస్తులు సరిగ్గా అతికినట్టున్నాయి. ఒక్కరొమ్ముమాత్రం పిచ్చిజార్జికి నాలా లేదు. పాపం!' అన్నది నానా.

'అక్కడే కాస్త తేడా' అన్నాడు జార్జి చిరునవ్వునవ్వుతూ.

అందరూ నవ్వుకున్నారు. నానా జార్జిగౌనుకు గుండీలన్నీ అమర్చింది. ఒకబొమ్మను ఆడించినట్టుగా అతన్ని చేతుల్లో అటూ ఇటూ ఆడించింది.

"ఎలా ఉందబ్బాయ్? వెచ్చగా ఉందా?" అని అడిగింది. అతను ఓ! చాలా వెచ్చగా ఉందన్నాడు. గౌనుకన్న వెచ్చని దుస్తులు మరేం ఉంటాయి? ఆ దుస్తులు అతని శరీరాన్ని తాకినప్పుడు అతని కో విచిత్ర మైన ఆనందం కలిగింది. నానా శరీరపరిమళం ఆ దుస్తులకు అంటిపెట్టుకుని ఉన్నట్టుంది. జో అతని దుస్తులు ఆరబెట్టడానికి తీసుకెళ్లింది. జార్జి పడక కుర్చీమీద వాలి, 'తినడానికేమైనా ఉందా, బాగాఆకలేస్తోంది' అన్నాడు,

నానాకు కోపంవచ్చింది. ఖాళీ పొట్టతో ఇంట్లోనుంచి తప్పించు కొచ్చి, వానలోతడవడం ఎందుకో; కాని, ఆమెకూకొంచెం ఆకలేసినట్టుగా ఉంది. జో భోజనం సిద్ధంచేసింది. ఇద్దరూ కలిసికూచుని భోంచేశారు. నానా జార్జ్‌ని, 'ప్రియమైనజార్జ్' అని పిలవసాగింది. 'అబ్బ! ఇంత యిష్టంగా భోంచేసి పదిసంవత్సరాలు కావస్తోంది' అన్నది నానా.

నానాకళ్ళపైకి కూరుకువస్తోంది. ప్రయాణబడలికతో అలసిపోయి ఉందిగదూ. రాత్రి నిశ్శబ్దంగా ప్రశాంతంగాఉంది. మంట నెమ్మదినెమ్మ దిగా తగ్గిపోతోంది. నానా కిటికీతలుపుతెరచి, 'చూడు, జార్జి! రాత్రి ఎంత అందంగా ఉన్నదో!' అన్నది.

జార్జికూడా కిటికీవద్దకు వెళ్ళాడు. ఆమెనడుముచుట్టూ చెయ్యివేసి, తల భుజంపై ఆనించి నిశ్శబ్దనిబిడాంధకారంలోకి అవలోకించాడు. గాలి మందగించింది. మబ్బులు విడిపోయాయి, ఆకాశం నిర్మలంగాఉంది. నక్ష త్రాలు మినుకుమినుకుమంటున్నాయి. పూర్ణచంద్రుడు స్వచ్ఛమైన హేమదుకూలాన్ని అవనిమీద పరిచినట్టుగాఉన్నది వెన్నెల. ఒకదివ్య శీతలకాంతి ప్రపంచాన్నంతా ఆవరించినట్టుగాఉంది. లోయ విశాలంగా

అనంతంలోకి సాగిపోతోంది. చెట్లనీడలు వెలుగుకొలనులోవెలసిన చిన్న దిబ్బల్లాగాఉన్నాయి. నానాఅంతరాత్మలో మళ్ళీ ఒక అవ్యక్తసంచలనం బయలుదేరింది, మళ్ళీ పసితనం వచ్చినట్లుగా భావించిం దామె. ఇలాంటి రాత్రులనుగూర్చి ఎన్నడో కలలుకనేది. ఆవయస్సూ, ఆ రోజులూ గతించి చాలారోజులైంది. ఈ ప్రాకృతికసౌందర్యమంతా చూచి. తాను పారిస్ వదలివచ్చి పదిసంవత్సరాలైనట్లుగా భావించింది. "నిన్న" ఆమెకు ఎన్నాళ్ళ కిందటో జరిగిపోయినట్టూ దూరమైనటూ అనిపించింది. ఇలా భావసమాధిలో నిలిచిపోయింది నానా. జార్జి ఇంతసేపూ ఆమె మెడను ముద్దాడుతున్నాడు. ఆమె కంపితహస్తంలో, శిశువుముద్దులతో విసుకెత్తినతల్లిలా, అతన్ని వారిస్తూవచ్చింది. ఇంటికివెళ్లాల్సిన సమయమైన దన్నది. దూరంగా ఒకపిట్ట సన్ననిస్వరంతో పాడసాగింది. కాని, అంతలోనే ఆగిపోయింది.

"ఒక్కనిమిషం ఉండు. దీపంవెలుతురుచూచి ఆ పిట్ట భయపడు తోంది. వెళ్లి ఆర్పేసివస్తాను" అని జార్జి దీపంఆర్పేసి వచ్చాడు.

పక్షి మళ్లీ పాడనారంభించింది. జార్జి నానాను దగ్గరగా ఒత్తు కుంటున్నాడు. నానాకు వ్యక్తావ్యక్తంలోనుంచి ఏవో పురాస్మృతులు ఉదయిస్తున్నాయి. గతించినరోజుల్లో - ఇలా పూర్ణచంద్రుడు ప్రకాశి స్తూంటే, కోకిల ఆలాపిస్తూఉంటే, ప్రక్కన ప్రాణాన్నైనాఇచ్చే ప్రేమికు డుంటే ఎంత సంకోచించిఉండేది! జార్జిసాహసం కాస్త ముదరసాగింది.

"ఊరుకో అబ్బాయ్! అబ్బె! నీ ఈడులో ఇలాంటివి పనికిరావు. నా మాట వినవూ? నీకు నాఈడుది తల్లి కావచ్చు" అంది నానా.

నానాకు సిగ్గుముంచేసింది. ఆమెముఖం ఎర్రగులాబీలా మారింది, కాని ఎవరికీ కనుపించదు. గదినిండా చీకటి. ఎంతమేరచూచినా ఒకే నిశ్శబ్దం, అంధకారం, నిశ్చలమైన ఏకాంతం. నానాకు ఇలాంటిసిగ్గు ఎన్నడూ కలుగలేదు. ఆమె ఎంతనిగ్రహించుకోవాలని ప్రయత్నించినా ఆమెశక్తి క్రమక్రమంగా తగ్గిపోతున్నట్టుంది. స్త్రీ దుస్తుల్లోఉన్న జార్జిని చూస్తే ఆమె ఇంకా నవ్వాపుకోలేకుండా వున్నది. ఆమె కొక పిల్లస్నేహితురాలు ఊరికే గొడవపెడుతున్నట్టుగాఉంది.

ఒక్కసారి తుదిప్రయత్నంచేసి, 'అబ్బ! తప్పు! తప్పు!' అన్నది.

ఇలాఅని ఆ సుందరనిశీధిలో కన్యవలె అతనికౌగిట్లో ఒరిగిపోయింది. నిశ్చ లంగా నీరవంగావుంది అంతా.

తెల్లవారింది. లెఫాండెటీలో లంచ్ గంటమోగింది.ఫాష్‌రె, డానెట్ వచ్చారు. ఐండికి కొంచెం ఆలస్యంగా వాండ్రెవె వచ్చాడు. ఆఖరున జార్జి వచ్చాడు. అతనికళ్లు బరువుగాఉన్నాయి. ముఖం పాలిపోయింది. తల్లి దగ్గరకు తీసుకోబోగా తప్పుకున్నాడు.

భోజనంముందు కూచున్నతరువాత వాండ్రెవె ౯ సంవత్సరాలనుంచి వస్తానంటూ రాకుండా గడిపాడని వాండ్రెవెను చీవాట్లేసింది.

"చివరకు ఎలావచ్చావు. ఎలావచ్చావో చెప్పు!" అన్నది.

వాండ్రెవె దీన్ని వినోదంగా భావించాడు. గతసాయంత్రం క్లబ్బులో చాలా డబ్బు పోగొట్టుకున్నాననీ, గ్రామపరిసరాలలో వుండిపోదామని వచ్చాననీ చెప్పాడు.

ముసలావిడ డానెట్‌ను, ఫాష్‌రెను అభినందించింది. ఈలోగా మార్కిస్ డి ఛార్డ్ కూడా వచ్చాడు వృద్ధురాలు ఇందరు అతిథులు ఒక్క మాటుగా రావడం చూచి ఎంతో పొంగిపోయింది. అందరూ ఆసీను లైనారు. ఫాష్‌రె కౌంటెస్ సెబైన్ ప్రక్కన కూచున్నాడు. ఆమె ఎంతో వుత్సాహంగావుంది. ఆమెభవనంలోలాగా గంభీరంగా లేదు. డానెట్ ఈస్టలీకి పక్కగా కూచున్నాడు వాండ్రెవె, 'ఏ శ్రీమంతురాలో దొరి కితే వివాహంచేసుకుంటా' నన్నాడు వినోదంగా.

'ఇక్కడికి అనతిదూరంలోనే ఒక స్త్రీవుంది' అని మేడమ్ హూగన్ నానా పేరు చెప్పింది.

వాండ్రెవె ఆశ్చర్యాన్వితుడై, 'ఏమిటీ! నానా గ్రామీణ నివాసం ఇక్కడికి దగ్గర్లోనే వుందన్నమాట' అన్నాడు.

ఫాష్‌రె, డానెట్‌లుకూడా ఆశ్చర్యాన్ని అభినయించారు.

"అవును, చాలా దగ్గరే. నిన్నరాత్రే ఆమె వచ్చిందని తోటమాలి చెప్పనుకూడ చెప్పాడు" అన్నది మేడం హూగన్.

అందరూ ఆశ్చర్యంతో పైకిచూచారు. ఏమిటీ! నానా ఇక్కడున్నదా అప్పుడే వచ్చేసిందా? తామే ముందుగా వచ్చామనుకున్నారే! జార్జి ఒక్కడు మాత్రం కళ్ళెత్తకుండా గ్లాసువంక బరువుగా చూస్తూ కూచున్నాడు.

భోజనం ప్రారంభంనుంచి కళ్ళు తెరుచుకునే నిమరిస్తున్నట్టున్నాడు. ఒక అవ్యక్తమందహాసం అతని లేతపెదవులపై తాండవిస్తోంది.

"ఇంకా తలనొప్పి తగ్గలేదా నాయనా" అన్నది తల్లి.

అతను కొంచెం వులికిపడి, సిగ్గుతో ఎర్రబారాడు. రాత్రంతా నృత్యంచేసిన స్త్రీలా వున్నాడు.

"ఏమిటి నాయనా, మెడమీద అలా ఎర్రగావుంది?" అన్నది ఖేదం హఠాత్తుగా.

అతను గాభరాపడ్డాడు. జవాబుగా ఏదో గొణిగాడు. కొంచెం తమాయించుకుని, 'ఏం లేదమ్మా, ఏదో పురుగుకుట్టింది' అన్నాడు.

ముఫత్ జార్జివంక చూచాడు. భోజనం పూర్తికావస్తోంది. కౌంటెస్ సెబైన్ నడకతీరు ఫాష్‌రెను ఎంతో ఆకర్షించింది. అతనొకపండునామెకు అందివ్వబోయేసరికి ఇద్దరిచేతులూ తగిలాయి. ఆమె ఒక్కక్షణం అతనిపై కొంక నిశితదృష్టిని బరపినది. ఫాష్‌రెలో మళ్ళీ అనుమానాలు రేకెత్త సాగాయి.

ఆమెలో ఏదో నిగూఢ రహస్యం వుంది.

అందరూ ఎక్కడికైనా విహారానికి వెడదామనుకున్నారు. కాని, ఆనాడు వెళ్ళలేకపోయారు. ఇంకా వానజల్లు పడుతూనేవుంది. జార్జి త్వరగా వెళ్ళి తనగదిలో తలుపువేసుకుని కూచున్నాడు. అందరూ ఎందు కక్కడ సమావేశమైనారో తెలిసినా ఒకరికొకరు ఎక్కడికివెళ్ళాలో చెప్పుకోడంలేదు. క్లబ్బులో చాలా డబ్బుపోగొట్టుకున్న హాండ్రె కొన్నాళ్ళపాటు గ్రామపరిసరాల్లో గడుపుదామనుకున్నాడు. ఫాష్‌రె నానాతో మరోవ్యాసరచనావిషయమై ఒకఒప్పందానికి వద్దామనుకున్నాడు. వీనస్‌ను చేసేదోవలో ప్రయాణిస్తున్న ఈ యాంత్రికులందరిలోను ఒక్క ముఫత్ విషయంమాత్రం మరీ విషమంగావుంది. అతన్ని ఏవో అపరిచిత వాంఛలూ, భయాలూ కలవరపరుస్తున్నాయి. అతను నానాతో తప్పక వస్తానని వాగ్దానంచేశాడు. నానా ఎదురుచూస్తూవుంది, ఆరాత్రే అతను లామినాట్‌కి వెళదామనుకున్నాడు.

ఆసాయంత్రం కౌంట్ బైటికివెళ్ళగానే జార్జి అతనివెంటపడ్డాడు. మధ్యలో పిలి; పరుగెత్తుకుంటూ నానావద్దకు వెళ్ళాడు. అతనికళ్ల

క్రోధంతో ఎర్రబారివున్నాయి. కన్నీరు కారుస్తున్నాడు. అతనికి తెలుసు ఆ ముసలాడు వెడుతున్నది నానావద్దకేనని.

ఈ అసూయ కనిపెట్టి నానా ఆశ్చర్యపోయింది. అతనిచుట్టూ చేతులు వేసి, అతన్ని ఓదార్చింది. చాలా పొరబడ్డావు. నే నెవరికోసమూ వేచి వుండలేదు. ఆయనవస్తే అది ఆయనతప్పుకాని, నాతప్పుకాదన్నది. జార్జిని తప్ప మరెవ్వరినీ ప్రేమించడంలేదని, తనపిల్లమీద ఒట్టేసిచెప్పింది. అతన్ని ముద్దాడి అతని కళ్ళనీళ్లు తుడిచింది.

"చూడు అంతా నీకోసంకాక మరెవరికోసం చెప్పు?" అన్నది. అతను కాస్త వుపశమించిన తరువాత "స్టీనర్ వచ్చాడు, పైన వున్నాడు. అతన్ని ఎలా పంపెయ్యను చెప్పు' అన్నది బతిమాలుతూ.

"త్వరగా వెళ్ళి, నాగదిలో వుండు" అన్నది.

జార్జి చప్పున లేచి ఆమెచుట్టూ చేతులువేశాడు. ఆమె ద్రవించిపోయింది. మళ్ళీ నిన్నటిలాగానే సంభవించవచ్చు. దీపం ఆరిపోతుంది. తెల్లవారేవరకూ వారు అలాగే వుంటారు. గంట వినిపించి అతను త్వరగా వెళ్ళిపోయాడు.

కౌంట్ముఫత్ను చూడగానే నానాకు అదోలా అనిపించింది. జార్జితో ఇంత నాటకం ఆడినా ఆమె కింకా స్వస్థత చేకూరలేదు. ఆమె కౌంట్కు వాగ్దానంచేసిన మాట నిజమే. ఆ వాగ్దానాన్ని నిలబెట్టుకోవడం కూడా ఆమెకిష్టమే కౌంట్ వట్టి వ్యాపారస్వభావంగల మనిషని ఆమెకు తెలుసు. కాని, నిన్న ఎంతచక్కగావుంది! కలలా గడచిపోయింది. ప్రయాణం, అపరిచితమైన నూతన గృహప్రవేశము, తడిసి ముద్దయివచ్చిన కుర్రాడు — అంతా అదో అద్భుత స్వప్నంలావుంది. ఆ స్వప్నభంగం కాకుండా అలాగేవుంటే ఎంత బావుండేది!

కౌంట్ముఫత్ గంభీరంగా కూచున్నాడు. ఆయనవేళ్లుమాత్రం కొద్దిగా వణుకుతున్నాయి. ఆయనవాంఛ తుపానులా రేగుతోంది. అంత గంభీరమైనవ్యక్తి తల్లక్రిందులైపోతున్నాడు. నానాకు ఆగనకూ కొద్ది మాటలు జరిగాయోలేదో నానాను కౌగలించుకోబోయాడు.

"వద్దు వద్దు. ఏంపని చెప్పండి" అన్నది నానా చిరునవ్వునవ్వుతూ,

పళ్లు గట్టిగా బిగబట్టుకుని, నానాను గట్టిగాపట్టుకున్నాడు. ఆమె కౌగిలివదలించుకోబోగా సూటిగా తను ఎందుకోసం వచ్చాడో తెలియ జేశాడు.

"ఉండండి. ఇప్పుడుకాదు. పైన స్టీనర్ వున్నాడు" అన్నది నానా.

కాని, అతనికి పిచ్చి తినట్టయింది. ఇలాంటిమనిషిని నానా ఎప్పుడూ చూడలేదు. నానాకు భయంవేసింది. స్టీనర్ మేడమెట్లు దిగివస్తున్నాడు. ఆమెపరిస్థితి చాలా ప్రమాదకరంగావుంది. స్టీనర్ గదిలో ప్రవేశించగానే నానా పడకకుర్చీలో పడుకొనివుండడం చూశాడు. 'నామట్టుకునాకు గ్రామపరిసరాలంటే ఎంతో ఇష్టం' అంటోంది. అతనురాగానే కౌంట్ ముఫల్‌ను పరిచయంచేసింది. 'ఈదారిని వెడుతూ మనఇంట్లోదీపాలుచూచి ఇలా వచ్చారు' అని చెప్పింది.

ఇద్దరూ కరచాలనంచేసుకున్నారు. పారిస్‌నుగురించి ఏవోవిషయాలు మాట్లాడుకున్నారు. ఏవో వ్యాపారవిషయాలు చర్చించారు. ఒకఅరగంట ఆగి ముఫల్ సెలవుతీసుకున్నాడు. మళ్లీ సాయంకాలం వస్తాననిచెప్పి వెళ్లాడు. స్టీనర్ వెళ్ళిపడుకున్నాడు. ముసలిపీనుగ లిద్దరిపీడ వదిలిపోయింది. నానా మళ్లీ జార్జ్‌నిచూడడానికి వెళ్ళింది. జార్జ్ ఇంకా కనిపెట్టుకుని వున్నాడు. గదినిండా చీకటి. చెయ్యిపట్టుకుని నానాను కిందికిలాగాడు. ఇద్దరూ పసిపిల్లలలా పొర్లుతూ, మాట్లాడుతూ ఆడుకున్నారు. దూరంగా కౌంట్‌ముఫల్ నడచిపోతున్నాడు.

తరువాత కొన్నిరోజులు కలలాగడిచిపోయాయి. ఆ కుర్రాడిముందు నానా మళ్లీ పదిహేనేళ్ళ పిల్లలాఅయింది. మళ్లీ ఆమెలో ప్రేమకుసుమం వికసించింది. పురుషస్వభావం ఆమెకు పూర్తిగా అవగతమై, పురుషునిపై ఆమెకు హీనభావం ఏర్పడినా, ఆమెలో ప్రేమ వాడిపోలేదు. ఆమెలో ఎన్నడూలేనిసిగ్గు ఏర్పడింది. ఏడవాలని, నవ్వాలని కోరిక. కన్యాలక్షణా లన్నీ పునరుద్భవించాయి. ఇలాంటివిచిత్రానుభవం ఆమెకు ముందెన్నడూ కలుగలేదు. గ్రామీణవాతావరణం ఆమెలోని మార్దవాన్ని యినుమడింప జేసింది. చిన్నతనంలో ఒకమేకపిల్లతో పచ్చికబయళ్ళలో నివసించాలని కోరుకునేది. ఈనాడు ఈగ్రామీణసౌందర్యమంతా ఆమెలో అపూర్వ పారవశ్యాన్ని కలిగించి, ఆమెకల ఫలించినట్టుగా తోచింది. మళ్లీ ఆమెకు

శైశవంవచ్చినట్టుగావుంది. పగలంతా తోటలో గడిపేది. తోటలో పూల పరిమళం ఆమె మనస్సులో ఒకవిధమైన కైపును విడిచిపెట్టేది. రాత్రి కాగానే జార్జ్‌ని కలుసుకోడానికి పైకివెళ్ళేది. జీవితం కలలాఉంది. సెలవు లకు ఇంటికివచ్చిన విద్యార్థినిజీవితంలా వుంది. తప్పకుండా పెళ్ళాడబోతున్న ప్రియునికి చిన్న ప్రేమగీతం వినిపిస్తున్నట్టుగావుంది, ఏ చిన్నచప్పుడైనా తల్లిదండ్రులు పట్టుకుంటారేమోనని చిన్నపిల్లలు భయపడ్డట్టు భయపడేది. ప్రథమ తప్పుచేసిన స్త్రీ పొందే విచిత్ర శృంగారమయమైన భయాలన్ని టిని ఆమె చవిచూచింది.

నానా ఒక ప్రేమికురాలివలె మారిపోయింది. గంటలతరబడి చంద్ర బింబాన్ని అవలోకించేది.

ఒకనాటిరాత్రి అందరూ నిద్రపోతున్నారు. జార్జ్‌ని బలవంతంగా తోటలోకి తీసుకెళ్ళింది. చాలాసేపు తోటలో అటూ ఇటూ పచార్లు చేశారు, గడ్డిమీద పడుకున్నారు. మంచులో పూర్తిగా తడిశారు. పడకగది లోకి వచ్చిన తరువాత కొంతసేపటికి నానా అతని భుజంమీద తలవాల్చి, వెక్కివెక్కి ఏడ్చింది. చనిపోతానేమోనని భయంగాఉన్నది. ఒక ప్రేమ గీతం ఆలాపిస్తూ మధ్యలో కంఠం రుద్ధమై వెక్కివెక్కిఏడుస్తూ జార్జ్ బాహు వుల్లో వాలిపోయేది. జార్జిని హఠాత్తుగా ఆలింగనంచేసుకునేది. జార్జి ప్రేమాలాపములతో ఆమెను ఓదార్చేవాడు. ఇద్దరూ ఒకరినొకరు ఓదార్చు కుని, పక్కమీద కూర్చుని, సిగరెట్లు కాల్చుకుంటూ ఏవేవో కబుర్లు చెప్పు కునేవారు.

అన్నిటికంటె ఆమెహృదయాన్ని పూర్తిగా కదిపివేసినది లూయీ రాక. ఆమె మాతృప్రేమ పిచ్చిగా మారింది. తన చిన్నకుమారుణ్ణి ఎండ పొడలోకి తీసుకెళ్ళేది. అతను ఆడుకుంటూంటే చూచి పొంగిపోయేది. అదీకాక వాడు జార్జితో తన ప్రేమకలాపానికి అడ్డురాలేదు. తనకు ఇద్దరు కొడుకు లున్నారనేది. ఇద్దరినీ ఒకేవిధమైన ప్రేమతో చూచుకునేది. రాత్రివేళ జార్జివద్దనుంచి వెళ్ళి లూయీ ఎలా నిద్రిస్తున్నాడో చూచేది. లూయీని చూచివచ్చి, ఆ మాతృప్రేమలోనే జార్జిని కౌగలించుకునేది. తల్లిలా మెల్లగా జోకొట్టి అతన్ని నిద్రపుచ్చేది. అతను అలాగే హాయిగా నిద్రపోయేవాడు. నానా అతన్ని ఎన్నడూ ఈ గ్రామాన్ని విడిచి వెళ్ళ

వద్దన్నది. అందరినీ పంపించేస్తారు. తనూ, అతనూ, పిల్లవాడు - ముగ్గురు మాత్రమే ఉంటారు. ఇలా తెల్లవారేవరకూ ఎన్నెన్నో గాలిమేడలు కట్టుకున్నారు.

ఇలా ఒకవారం గడిచిపోయింది. కౌంట్ ముఫత్ ప్రతిరాత్రి వచ్చి జ్వరంవచ్చినట్టయి తిరిగివెళ్ళేవాడు. ఒకరాత్రి అతన్ని రానివ్వలేదు. అమ్మగారికి ఒంట్లో సరిగాలేదని చెప్పారు. జార్జికి అవిధేయతగా ప్రవర్తించడం తలచుకుంటే నానాకు ఎంతో అసహ్యంవేసేది. అంత అమాయకుణ్ణి, పసివాణ్ణి, తనలో అంతవిశ్వాసం ఉంచినవాణ్ణి ఎలా అన్యాయంచేస్తుంది! అంతకంటె స్త్రీచెయ్యగలపాపం ఇంకేదీ లేదనుకొన్నది నానా. అమ్మగారికి మనస్సు పాడైనదనుకున్నది జో.

ఇలా ఆరురోజులు గడిచాయి. ఆరోజున హఠాత్తుగా కొందరు అతిథులువచ్చి, ఈ నిశ్చలవాతావరణాన్ని కలవరపరిచారు. ఇంటిముందు ఒక బస్సునిండా జనంరావడం చూచి, నానా ఆశ్చర్యపడింది.

"మేమే"నంటూ మొట్టమొదట మినాన్ దిగాడు, అతనివెంట అతని పిల్లలిద్దరూ దిగారు. లాబోర్డెటీ, లూసీ స్టివార్ట్, కారొలైన్, మేరియా బ్లాండ్ అందరూ వచ్చారు. లాఫలాసి, గాగా, ఆమెకూతురు - ఎమిలీ కూడా వచ్చారు. వీరందరినీ చూచేసరికి నానాకు గాభరాఎత్తింది ఈ జనాభాకంతా ఏర్పాట్లు ఎలాచెయ్యాలో తోచలేదు. అతిథులకోసం అయిదు గదులున్నాయి. ఒకదానిలో లూయీతో మేడమ్‌కౌంట్ ఉంది. గాగాకు లాఫలాసికుటుంబానికి పెద్దపడకగది ఇచ్చారు వీళ్ళందరికీ ఏర్పాటుచేసిన తరువాత తన గ్రామీణగృహంలో చక్కని ఆతిథ్యం ఇచ్చానుకదా అని నానాకు ఒకవిధమైన ఆనందం కలిగింది. అందరూ చాలా సంతోషించారు. బోర్డ్‌నెవ్ నానా హఠాత్తుగా వెళ్ళిపోవడం తెలిసి, పెద్దగా కేకలేస్తూ నానానుపట్టించి తెప్పిస్తానన్నాడుట. కాని, సాయంకాలమయ్యేసరికి మరెవతెతోనో ఆ పాత్రధరింపచేశాట్ట. వాయిలిన్‌కూడా ఆ పాత్ర ధరించి గొప్ప విజయం సంపాదించిందట. ఈ వార్త నానాను కొంచెం కలవరపరిచింది.

సాయంకాలం అమోఘంగా డిన్నర్ జరిగింది. అందరికీ ఆకలి మండిపోతోంది. కడుపునిండా విందారగించి, ఏవేవో ఖులాసాకబుర్లు చెబుతూ కూచున్నారు.

"అందరూ ఎల్లుండే వెళ్ళిపోతారని చాలా విచారంగా ఉంది. ఎక్కడికైనా విహారానికి వెడదాం" అన్నది నానా.

జార్జి ప్రక్కద్వారంగుండా నానా పడకగదిజేరి ఆమెకోసం కని పెట్టుకుని కూచున్నాడు. ఆమె వచ్చేసరికి అర్ధరాత్రిదాటింది. కాస్త మైకంలో ఉంది. ఆమెలో ఎప్పుడూ కనుపించని మాతృత్వం కన్పిస్తోంది. తాగినప్పుడు ఆమెలో మాతృత్వం మరీ ఉబుకుతుంది. ఆమె జార్జిని కౌగిలించుకుని, వెక్కివెక్కి ఏడుస్తూ తనతో విహారానికి రమ్మన్నది. జార్జి సరే నన్నాడు.

"అయితే, నన్ను నిజంగా ప్రేమిస్తున్నావుకదూ? నేను చనిపోతే నువు దుఃఖిస్తావూకదూ?" అన్నది.

లెఫాండెటీలో మేడమ్ హూగన్ గృహచర్చల్లో నానా ప్రధానాంశమైపోయింది. నానానుగురించి మాట్లాడుకోనిరోజులేదు. అలాంటిస్త్రీలు గొప్ప కుటుంబాలను అప్రతిష్ఠపాలుచేసి, నాశనంచేస్తారని మేడమ్ హూగన్ నానాపై దుమ్మెత్తిపోసేది.

కౌంట్‌ముఫత్ ప్రతిసాయంత్రం అదృశ్యుడైపోయేవాడు. ప్రతిరోజూ తలనొప్పిగా ఉన్నదని జార్జి చీకటిపడకుండానే పడకగదిలోకి వెళ్ళిపోయేవాడు.

ఫాషరె కౌంటెస్ సెబైన్‌తో ఉండేవాడు. వారిద్దరూ తోటలోకి వెళ్ళేవారు. ఆమెలో ఏదో ఔత్సుక్యం కనుపించేది. ఒకరి కళ్ళలోకి ఒకరు చూచుకునేవారు. ఏదోగుర్తించినట్టుగా మౌనం వహించేవారు.

అతిథులందరూ భోజనాలు కాగానే తోటలోకి వెళ్ళారు. పదిగంటలైంది. వాన వచ్చేటట్టుంది. ఆకాశంలో మబ్బుతెర కమ్మింది. మేడమ్ హూగన్ షికారువెడదామంది. అందరూ నానాగ్రామానికి వెళ్ళేత్రోవలో నడుస్తున్నారు. కొంతదూరం వెళ్ళేసరికి వారి కేవో బండ్లువస్తున్నచప్పుడు వినిపించింది. 'దానిబండ్లే, 'దానివే!' అన్నది మేడం హూగన్ కోపంగా. ఈ లోగా బండ్లు వచ్చేశాయి. అయిదుబండ్లు. బండ్ల లోనుంచి నవ్వులకిలకిలలూ గలగలలూ విన్పిస్తున్నవి.

వెళ్ళిపోతున్న బండ్లనుచూచి కౌంట్‌ముఫత్ హృదయం క్రుంగిపోయినట్టయింది. నానాకు దగ్గరగా ఒరిగిఉన్న జార్జి అతనికి కన్పించాడు.

తనకంటే చిన్నకుర్రాణ్ని నానా మక్కువగా చూచినందుకు కౌంట్ లోలోపల కుమిలిపోయాడు.

బండ్లలో కౌంటెస్‌ముఫత్ విషయం చర్చకువచ్చింది. 'నాకుతెలుసు.' ఫాష్‌రె అమె్ప్రియుడు. మా ఆడవాళ్ళకు ఆతవాళ్ళవిషయాలు బాగా తెలుస్తాయి' అన్నది నానా,

బండ్లు ఆగాయి. అక్కడ ఎడారిలాఉంది. సాయంకాలంవరకూ ఉండి తిరిగి ఇంటికి వచ్చారు. ఆ సాయంత్రమే జార్జి ఇంటికివెళ్ళిపోయాడు. నానాకు మనస్సు మనస్సులోలేదు. ఎలాగైనా తల్లిని క్షమాపణకోరమని చెప్పి, ఇంటికి పంపింది. మళ్లీ ఆ రాత్రికి రావద్దన్నది. ఎన్నో నీతులూ, నియమాలూ బోధించింది. జార్జి ఇవన్నీ విని, అవనతవదనంతో ఇంటికి చేరుకున్నాడు, అదృష్టవశాత్తు అతని అన్న ఫిలిప్ వచ్చి ఉన్నాడు. అందుచే గొడవేమీ జరుగలేదు.

అందరూ పారిస్ ప్రయాణమైనారు.

"జో, పెట్టెలన్నీ సర్దు. రేపే పారిస్ ప్రయాణం" అన్నది నానా.

# 7

మూడునెలలు గడిచినతరువాత ఒకనాటిరాత్రి కౌంట్‌ముఫత్ 'పాసేజ్ డి పెనోరమ'పద్ద అటూఇటూ తిరుగుతున్నాడు. చిన్న జల్లుపడి చల్లగా ఉంది. రోడ్డుకు ఇరుప్రక్కలా జనం క్రిక్కిరిసి ఉన్నారు.

కౌంట్‌ముఫత్ నెమ్మదిగానడుస్తూ బోలివర్డవైపు వెళ్ళాడు. పేవ్‌మెంట్‌మీద ఒక్కక్షణం ఆగి వెనుదిరిగిచూచాడు. గాస్‌లైట్లకాంతిలో కౌంట్‌ముఖం మరింత వివర్ణంగా కనుపిస్తోంది. వచ్చిపోయేజనం అతని ముఖంవంక అదోవిధంగా చూడసాగారు. కౌంటి వెళ్ళి ఒక దుకాణం దగ్గర నిల్చున్నాడు.

ఆయన కీ ప్రపంచమేమీ కన్పించడంలేదు. నానానుగురించి ఆలోచిస్తున్నాడు. నానా మళ్ళీ తనతో అబద్ధమాడింది. ఇలా ఎందుకుచేసిందా అన్నసందేహం ఆయన్ను వేధిస్తోంది ఆ ఉదయాన, సాయంకాలరావద్దని ఆయనకురాసింది. లూయీకి ఒంట్లో సరిగా లేకపోవడంవల్ల ఆరోజల్లా పినతల్లిగారింట్లోనే ఉంటానని వ్రాసింది. కాని కౌంట్‌కు అనుమానం

కలిగి, సాయంకాలం వెళ్ళి చూచాడు. అమ్మగారు థియేటర్‌కు వెళ్ళారని పనిమనిషి చెప్పింది. కౌంట్‌కు ఆశ్చర్యంకలిగింది. ఈ కొత్తనాటకంలో నానాకు ఏమీ పాత్రలేదు. మరి అబద్ధం ఎందుకుచెప్పినట్టు ? వెర్రైటీ థియేటర్‌లో ఆ సాయంత్రం ఏంచేస్తున్నట్టు ?

దుకాణందగ్గర నిల్చున్న కౌంట్‌కు ఈ ఆలోచనలన్నీ వచ్చాయి. నానాలో ఏదో మార్పుకనిపిస్తోంది. గ్రామాన్నుంచివచ్చినకొత్తలో ఎంతో ప్రేమకురిపించేది. జార్జి లెఫాండెటీలో తల్లివద్దే ఉన్నాడు. కాబట్టి అతని భయంలేదు. ఇహ ముసలి స్టీనర్ ఉన్నాడు. అతనివ్యవహారాలేమీ సరిగా లేవు. మూడునెలలునుంచీ నానాను పొందాలనే కోరిక పెద్ద సుడిగుండమై అతన్ని చుట్టేస్తున్నది కాని నానా మొదటిరోజుల్లోలాగా ఉండడంలేదు. ఆమెలో ఏదో మార్పు కానవస్తోంది. ఇదివరకటిలాగా అతనిగడ్డాన్ని ముద్దాడడంలేదు. స్త్రీల స్వభావాలు, నడవడీ సరిగ్గా అవగాహన కానివాడు కావడంవల్ల తనలోపమేమిటా అని ఆలోచించసాగాడు కౌంట్. ఆమె కోరికలన్నీ తను తీరుస్తూనే ఉన్నాడు. ఆ ఉదయం ఆమె చెప్పిన అసత్యం అతన్ని మరీ కలవరపరిచింది. ఈ ఆలోచనలతో అతని తల పగిలిపోతోంది.

తొమ్మిదిగంటలు కావస్తోంది. నానా వచ్చేవేళైంది. నిలదీసి నిజం తెలుసుకోవాలి అనుకుంటూ, అక్కడ గడపిన సాయంతాలన్నీ స్మృతికి తెచ్చుకుంటూ అటూఇటూ నడయాడసాగాడు. వానవెలిసింది. ఒక్కొక్క చినుకే పడుతోంది. రోడ్లమీద నీళ్లనిలిచి బురదగావుంది. బండ్లు బరువుగా కదిలిపోతున్నాయి.

కౌంట్ స్టేజిద్వారంవద్ద వేచివున్నాడు. అక్కడ వేచివుంటే తన్ను గుర్తించరని అతని ఉద్దేశం. మేడమ్‌బ్రాన్‌ను అడుగుదామా అనుకున్నాడు. కాని, అడిగితే నానా మరోదారిని పోతుందేమోనని అడగడం మానేశాడు.

తిరిగి ఇంటికి వెళ్ళిపోదామనుకున్నాడు. కాని ఈ ఆలోచనతట్టేసరికి అతని హృదయం కృంగిపోయింది.

పదిగంటలైంది. నానాను డ్రెసింగ్‌రూమ్‌లో చూడడం సులభమేమో నని మఫత్‌కు హఠాత్తుగా జ్ఞాపకంవచ్చింది. డ్రెసింగ్‌రూమ్ ముందరిబయలు లోకి వెళ్ళి నిల్చున్నాడు. డ్రెసింగ్‌రూమ్‌లో ఒక చిన్న దీపం వెలుగు

తోంది. కౌంట్‌కు ప్రాణంవచ్చినట్లయింది. ఆకాశంకేసిచూస్తూ అలాగే నిల్చుండిపోయాడు. గోడలవెంట ఇంకా వాననీళ్ళు జారుతున్నాయి. కిటికీ తెరుస్తున్న చప్పుడైంది. కౌంట్ అక్కడనుంచి కొంచెం తప్పుకున్నాడు.

నానా ఇప్పటికి వచ్చేస్తుండాలి. కౌంట్ స్టేజిద్వారం దగ్గర నిల్చు న్నాడు.

నానా మూడుమెట్లు దిగివచ్చింది. కౌంట్‌ను చూడగానే ఆమె స్తబ్ధురాలైంది 'ఓ! మీరా!' అని కౌంట్‌తో కరస్పర్శచేసింది.

నెమ్మదిగా నడిచివెళ్ళారు. కౌంట్ ఎన్నోప్రశ్నలు అడగాలని తయారై ఉన్నాడు. కాని, ఒక్కటీ అడగలేకపోయాడు. నానా తనంత తానే కులాసాగా మాట్లాడసాగింది. ఎనిమిదిగంటలవరకు పినతల్లిగారింట్లో ఉన్నాననీ, తరువాత లూయికి కొంచెం నిమ్మళించగానే, ఒక నిమిషం థియేటర్ చూదామని వచ్చాననీ చెప్పింది.

'ఏమైనా ప్రత్యేకమైనపని ఉందా?' అన్నాడు కౌంట్. అవును. ఒకకొత్తనాటకం ప్రారంభిస్తున్నారు. నా అభిప్రాయంకోసం పిలిపించారు.

'ఆమె అబద్ధమాడిందని అతనికి తెలుసు. కాని, ఆమెచేతిలో వెచ్చ దనం అతన్ని మౌనముద్ర వహించేటట్టు చేసింది. ఆమెకోసం అంతసేపు వానలో చలిలో వేచివుండాల్సివచ్చిందనేకోపం మటుమాయమైంది. నానాకు కౌంట్‌ను ఎలాతప్పించుకోవాలో తోచలేదు. లోలోపల ఎంతో ఘర్షణపడింది. దారిలో ఆగి, అయితే మీరుకూడా నాతో వస్తున్నారన్న మాట?' అన్నది కొంచెం నిర్లక్ష్యంగా.

'ఓ వస్తున్నాను. మీ అబ్బాయికి కాస్త నయమేగా' అన్నాడు కౌంట్.

'ఇప్పు డెలా ఉందో ఒకసారి చూచిరావాలి. అక్కడికి వెడితే బావుండును' అన్నది నానా. కౌంట్‌కూడా వస్తానన్నాడు. అందుకని ఇహ ఆ విషయాన్ని మార్చేసింది నానా. ఒక నిమిషం ఆమెలో సుడి గాలిలా కోపంరేగి బలవంతంగా అణిగిపోయింది.

'రేపటివరకు మీ భార్య రాదనుకుంటాను' అన్నది.

నానా కౌంటెస్ విషయం పరిచితంగా మాట్లాడడం చూచి, కౌంట్

కొంచెం గాభరాపడ్డాడు. నానా నెమ్మదిగానడుస్తూ మరేవేవో విషయాలు మాట్లాడడం మొదలెట్టింది, అతనిదృష్టిని మరల్చడానికి.

నానా ఆ బజార్లో షాపులనూ, వస్తువులనూ చూస్తూ ఉద్విగ్నురాలై నిల్చున్నది.

కౌంట్, 'బండిపిలవనా?' అన్నాడు. నానా అవసరంలేదన్నది. రాత్రి చల్లగా హాయిగా ఉంది. నడచి వెళ్ళడమే తనకు ఇష్టమన్నది.

'కేఫ్ అంగ్లియా' దగ్గరకు వచ్చేసరికి నానాకు ఏదైనా తినాలనిపించింది. ముఫత్ కాదనలేకపోయాడు. ఆమెతో బహిరంగంగా వెళ్ళడానికి కొంచెం జంకినప్పటికీ. ఎంతో పరిచయంవున్న ప్రదేశానికి వెళ్ళినట్లు నానా ఆహోటల్లో ప్రవేశించింది. వెయిటర్ తలుపు తెరిచాడు. పక్కగదిలో నుంచి ఒకవ్యక్తి హఠాత్తుగా ఊడిపడ్డాడు పెద్దగానవ్వుతూ. అతనుడానెట్.

కౌంట్ చప్పున గదిలోకి వెళ్ళిపోయాడు. డానెట్ కన్నుగీటి, 'పట్టేశావే' అన్నాడు.

నానా చిరునవ్వునవ్వి, అతన్ని మాట్లాడవద్దని ముక్కుమీదవేలేసుకుంది. 'ఏంచేస్తున్నా విప్పుడు?' అన్నది సస్నేహంగా.

"ఒకకొత్తఅధ్యాయం ప్రారంభించబోతున్నాను. పెళ్ళిచేసుకోవాలని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

నానా జాలిగా చూచింది. వరండాలోనిల్చుని అతనూ నానా ఏవో విషయాలు ప్రేమికుల్లాగా మాట్లాడుకున్నారు.

"సరే, ఇహ వెళ్ళు, ఆ వెర్రిమొహందగ్గరికి" అన్నాడు డానెట్ చిట్టచివరకు.

"ఏం, అతన్ని వెర్రిమొహం అంటున్నావేం ?" అన్నది నానా.

"కాబాఏమిటి ? నీకు తెలీదేమో! అతనిభార్య ఫాషరేవల్లో పడిపోయింది. బహుశా గ్రామానికి వెళ్ళినప్పుడు జరిగిఉంటుంది. ఫాషరె ఇప్పుడే వెళ్ళాడు. ఎక్కడో సంకేతం ఏర్పరుచుకున్నట్టున్నారు. ఏదో ప్రయాణంపెట్టుకున్నారనుకుంటాను" అన్నాడు డానెట్.

నానా ఈ మాటలువిని స్తబ్ధురాలై పోయింది. "నేనూ అ మానిం వానుసుమా. మొట్టమొదటిసారి ఆమెను చూచినప్పుడే అనుకున్నాను.

అంత గొప్ప కుటుంబంలో ఎంత నీచానికిపాల్పడింది!" అన్నది నానా. 'ఛీ' అని అసహ్యించుకుంది.

డానెట్ ఆమెను గదివరకూ సాగనంపి ద్వారంవద్ద ఒక నిమిషం ఆగి, 'సెలవు ప్రియురాలా!' అన్నాడు మధురస్వరంతో. నెమ్మదిగా నానా గదిలో ప్రవేశించింది. కౌంట్ వేళ్ళువణుకుతూండగా నిర్లిప్తంగా గదిలో కూచునిఉన్నాడు. నానాకు అతన్ని చూచేసరికి జాలి, అసహ్యం రెండూ కలిగాయి. దుర్మార్గురాలైన స్త్రీచే మోసగింపబడిన అతన్ని చూచే సరికి నానాకు జాలికలిగింది. అతన్ని కౌగలించుకుని ఓదార్చాలనిపించింది. వాళ్ళు హోటల్‌నుంచి ఇంటికి వెళ్ళేటప్పటికి పదకొండు గంటలైంది.

ముఫత్ పడకగదిలో ఓవర్‌కోటు తీసేస్తున్నాడు. పెద్ద చలిమంట మండుతున్నది. 'నాకింకా నిద్రరావడంలేదు' అన్నది నానా.

'సరే' నన్నాడు కౌంట్.

నానాకు అద్దంముందు బట్టలుమార్చుకోవడం ఇష్టం. అద్దంముందు నిల్చుని ఆమె తన పరిపూర్ణ ప్రతిబింబాన్ని తిలకిస్తుంది. నగ్నంగా నిల్చుని స్వస్వరూపధ్యానంలో మునిగిపోతుంది. తన శరీరమంటే ఆమె కంత ప్రీతి. మెత్తనిచర్మాన్ని చూచుకుని ఉద్విగ్నురాలై పోతుంది. తన్మయత్వంలో నిశ్చలంగా నిల్చుండిపోతుంది. ఒక్కొక్కసారి హెయిర్‌డ్రెసర్ వచ్చి ఆమె అలా ధ్యానంలో ఉన్నప్పుడు చూచి వెళ్ళిపోతాడు.

ఆ రాత్రి ఆమె దీపాలన్నీ వెలిగించింది. ఆఖరిదుస్తులను నికిచెయ్య బోతూ, ఒక చిన్న సందేహంకలిగి అలాగే నిల్చుండిపోయింది.

"ఫిగారోలో వ్యాసం చదివారా? టేబిల్‌మీద వున్నది" అన్నది.

"అది నన్నుగురించేనట" అని దుస్తులు వదిలేసి ముఫత్ సమాధానం కోసం అలాగే నిలబడింది నగ్నంగా. ముఫత్ నెమ్మదిగా చదవడం ముగించాడు. ఫాషెర్ వ్రాసిన వ్యాసంపేరు, 'బంగారుయీగ' - ఒకమ్మాయికథ. ఐదారు తరాలనుంచి త్రాగుబోతులైనవారి వంశంలో - పుట్టింది ఆ పిల్ల. ఆ పిల్లరక్తంలో ఎన్నోతరాల విషాదం, త్రాగుడు జీర్ణించి ఉన్నాయి. పేదవల్ల ఆ పిల్లనరాలు వికీర్ణమైపోయాయి. పారిస్ పేవ్‌మెంట్లమీద ఒకమూల ఆ పిల్ల జన్మించింది. చక్కగా పరిపుష్టంగా పెరిగిన ఆపిల్ల తాను జన్మించిన తిరుగుబోతుల త్రాగుబోతుల వర్గంపైనే కక్షతీర్చుకుంది. ఆ పిల్ల

తనకు తెలీకుండానే ఒక వినాశకరశక్తిగా పరిణమించి పారిస్ నగరాన్ని విచ్ఛిన్నంచేసి, భ్రష్టంచేసింది. కథ చివర బంగారురంగు ఈగతో ఆ పిల్ల పోల్చబడింది. బంగారురంగుఈగ మురికికుప్పలమీద తిరిగి ఆ విషాన్ని అంటించుకుని తనుతాకిన మనిషికల్లా ఆ విషాన్ని ంటిస్తుంది. అలాంటి ఈగ ఈ పిల్ల. ముఫత్ స్తబ్ధుడైపోయాడు. నిశ్చలంగా మంటవంక చూస్తూ ఉండిపోయాడు.

అంతా అయిన తరువాత, 'మీ ఉద్దేశం ఏమిటి?' అని అడిగింది నానా.

కాని, అతను సమాధానం చెప్పలేదు. అతనిదేహంలో నరనరంలో విద్యుచ్ఛక్తి ప్రాకినట్లయింది. అతను ఇంతకాలం కదిలించకుండా ఉంచిన అంతరాళాలను ఆ వ్యాసం కలచివేసింది.

కౌంట్ ముఫత్ కళ్ళెత్తిచూచాడు. నానా స్వస్వరూపదర్శన తన్మయత్వంలో ఉంది. ఎంతో ఆప్యాయంగా తన అంగాలన్నిటినీ చూచుకుని మురిసిపోతోంది. మెడమీద చిన్నపుట్టుమచ్చను చూస్తోంది. ఆ చిన్న పుట్టుమచ్చ నానాకు ఎంతో ముచ్చటగా కనుపించింది. ఇలా తనశరీరాన్ని తను చూచుకోవడమంటే నానాకు ఎంతో ఇష్టం. తను ప్రథమంగా సమర్త అయిన స్త్రీలాగా విచిత్రానుభూతిని పొందేది.

ముఫత్ ఆమెను తదేకంగా చూస్తున్నాడు. ఆమె నగ్నదేహాన్ని చూస్తోంటే అతనికి ఓవిధమైన భయంకలిగింది. అతనిచేతుల్లోనుంచి పత్రిక పడిపోయింది. ఆ పేపరులో వ్రాసినది నిజమే. మూడునెలలలో ఆమె తన జీవితాన్ని కలుషితంచేసుకున్నది. తనంటే తనకే ఒకవిధమైన అసహ్యాం కలిగింది. ఇలా ఆలోచిస్తూ నానావంక నిశ్చలంగాచూస్తూ ఉండిపోయాడు.

నానా కదలడంలేదు. అలాగే నిశ్చలంగా వుంది. మెడకింద ఒక చెయ్యిపెట్టుకుని రొమ్ములువిరుచుకుని ఉంది. ఆమెకళ్లు అర్ధనిమీలితాలై ఉన్నాయి. పెదవులు కొంచెం విచ్చుకునివున్నాయి. కామప్రపూరితమైన చిరునవ్వు ఆమెముఖాన్ని కప్పివున్నది. మొనలుదేరిన ఆమెచనులు కొద్దిగా ప్రకంపిస్తున్నాయి. ఆమెజుట్టు సింహపుజూలులా వ్రేలాడుతోంది. ముఫత్ ఈ సుందరవిగ్రహాన్ని చూస్తూ ఉండిపోయాడు. ఆమె ఒళ్ళు సిల్కులా మిలమిల్లాడుతోంది. ఆమెకు భయంకరమైన పురాతనకాలపు స్త్రీరాక్షసి

జ్ఞాపకంవచ్చింది. ఒంటినిండా ఒకవిధమైన ఎర్రనిపొడరు అద్దుకుంది. నిజంగా ఆమె బంగారురంగు ఈగే! తనశక్తి తనకు తెలియకపోవచ్చు కాని, మానవులందరినీ తనవిషంతో విధ్వంసంచేస్తుంది. ముఫత్ ఇంకా అలానే చూస్తున్నాడు. ఆమె అతన్ని ఆవహించినట్టుగా ఉంది. ఒక్క నిమిషం కళ్ళుతిప్పేసుకున్నాడు. ఆ చీకట్లో ఆ స్త్రీరాక్షసి మరీపెద్దదైనట్టు భయంకరమైనట్టు తోచింది. ఆ ప్రతిమ అతనిలో నిశ్చలంగా నిలిచి పోయింది.

నానాలో ఏదో అవ్యక్తమైనసంచలనం కలిగింది. ఆమెకళ్ళు చెమర్చాయి. కొంచెం కుంచించుకుంది. మెడకిందనుంచి చేతులుతీసింది. నెమ్మదిగా స్తనాలవరకూ జార్చింది. ఒకవిధమైన ఉద్రేకంతో స్తనాలను ఒత్తుకుంది-తనశరీరాన్ని తనే కౌగిట్లోకితీసుకున్నట్టు. పెదవులు ముందుకు సాగించి తనముఖాన్ని తనే ముద్దాడింది. అద్దంలో ప్రతిబింబం నవ్వింది.

ముఫత్ దీర్ఘంగా నిశ్వసించాడు. ఒక్కక్షణంలో అతనివిచక్షణా జ్ఞానం అంతరించిపోయింది. నానాను గట్టిగా కౌగలించుకుని, తివాసీపైకి విసిరాడు.

"అబ్బ! నాకు దెబ్బతగిలింది. ఏంపని?" అన్నది లేచి నిల్చుని కోపోద్దీపితురాలై.

తరువాత కొంచెం చల్లబడింది. రాత్రిగౌనువేసుకుని చలిమంట ముందు కూచుంది. మళ్ళీ ఫాషరెవ్యాసాన్నిగురించి ప్రశ్నించింది. ముఫత్ ఏవో అస్పష్టమైనజవాబు లిచ్చాడు. తరువాత ఆమె దీర్ఘమౌనందాల్చింది. కౌంట్‌నుంచి ఎలా తప్పుకోవలెనో ఆలోచిస్తూ 'అయితే' మీ భార్య రేపు ఉదయం వస్తుందనుకుంటాను' అన్నది.

కౌంట్ పడకకుర్చీలో కూర్చుని ఉన్నాడు. చాలా అలసటగా, మత్తుగా కనుపిస్తున్నాడు.

'మీకు వివాహమై ఎన్నాళ్ళయింది?' అని అడిగింది నానా మళ్ళీ.

'పందొమ్మిది సంవత్సరాలైంది.'

'మీ భార్య ఎలా ఉంటుంది? మీ రిద్దరూ సఖ్యతగా ఉంటారా?'

అతను సమాధానం చెప్పలేదు. కొంచెం విసుగ్గా, 'అలాంటి విషయాలు అడగవద్దని అనేకసార్లు చెప్పాను' అన్నాడు.

'ఏం, అడిగితే? మీభార్య అరిగిపోతుందా ఏమిటి? ఆడవాళ్ళందరూ ఒకటేనయ్యోయ్!' అని నానా కొంచెమాగి మళ్ళీ ఇలా ప్రారంభించింది. 'ఫాషరె నీమీద చేస్తున్న ప్రచారం చెప్పలేదు, మరిచిపోయాను. అతను వట్టి దుర్మార్గుడు. నా కతనంటే ద్వేషంలేదు. అతని వ్యాసం నిజమే కావచ్చు. కాని, అతనుమాత్రం పరమదుర్మార్గుడు.' ఇలా అని పెద్దగా నవ్వి కౌంట్ మోకాళ్ళకు వక్షాన్ని ఆనించి, 'మీకు వివాహమైనప్పుడు మీకేమీ తెలీదటగా? నిజమేనా?' అన్నది.

నానా అతనిముఖంవంక చూచింది. అతనిభుజంమీద చేతులుంచి, బుజాలు ఊపుతూ నిజం చెప్పమన్నది.

కొంచెమాగి గంభీరంగా 'అవును' అన్నాడు కౌంట్.

ఇలా అనగానే బిగ్గరగా నవ్వుతూ అతని దగ్గర పొర్లాడింది.

'అలా ఎవరూ ఉండరు. ఎలా జరిగింది చెప్పు' అన్నది.

ఎన్నో ప్రశ్నలు గుప్పించింది. నవ్వుతో ఆమె శరీరమంతా వణికి పోయింది. గౌను బుజాలమీదినుంచి జారింది. ఆమెశరీరం బంగారంలా మెరుస్తోంది. కౌంట్ తనవివాహంనాటిరాత్రి జరిగినదంతా నెమ్మది నెమ్మదిగా చెప్పాడు.

"మొదటిరాత్రే ఇలా జరగడం చాలా విషాదకరం" అని నానా గడ్డం కింద చెయ్యిపెట్టుకుని కూచుంది.

"ఏం?" అన్నాడు కౌంట్.

"చెప్పనా? స్త్రీలకు అమాయకులంటే అంత యిష్టం ఉండదు. సిగ్గువల్ల ఏమీ చెప్పరు. కాని, వాళ్ళకు కావలసినది దొరక్కపోతే దాని కోసం మరోచోట వెదకుతారు—నాలాగా" అన్నది.

అతనికి అర్థమైనట్టు కనిపించలేదు. నానా తల్లిలా అతని కీ ఉప దేశంచేసింది.

"నువ్వూ నీభార్యా ఒకగదిలో పడుకోరుకదూ? అవునా?" అన్నది.

కౌంట్ నెమ్మదిగా అవునని తలఊపాడు.

"ఉండు, కొంచెం చలికాచుకోవాలి" అని నానా చలిమంట దగ్గరకు వెళ్ళింది. మంటల నీడల్లో ఆమెపిక్క ఎంతో అందంగా మెరిసింది. బయట

నుంచి ఎవరివో గొంతులు వినిపించాయి. ముఫత్ ఆశ్చర్యచకితుడైనాడు. ఆమె హఠాత్తుగా గాంభీర్యం వహించింది.

"భార్యాభర్తలు ఒకరినొకరు అర్థంచేసుకోకపోతే చాలా గొడవవు తుంది" అని ఒక పండ్లవర్తకునిసంగతిచెప్పింది. అతనికీ అతని భార్యకూ ఏ మాత్రంపడేదికాదు — ఎప్పుడూ కీచులాడుకుంటూండేవారు, భర్తబుద్ధిమొద్దు స్వరూపం. భార్యకు అన్నీకావాలి. అతను ఎవరో ముండలతో తిరుగుతుండే వాడు. భార్య తన దారి తాను చూచుకున్నది. ఇదీ కథ.

ముఫత్ విస్తుపోయాడు. అతనికి కొంచెం కోపంకూడా కలిగింది. 'ప్రతిష్ఠ గల స్త్రీలనుగూర్చి మాట్లాడకు. నీకు వాళ్ళనుగురించి తెలీదు.' అన్నాడు కొంచెం కోపంగా.

ఈమాట అనగానే నానా తోకతొక్కినత్రాచై లేచింది, 'నాకు వాళ్ళనుగురించి ఏమీ తెలీదంటావా? నాకేనా తెలియంది. వాళ్ళు వట్టి మురికి ముండలు. ఒళ్ళయినా కడుక్కోరు. ఇలా నాలాగా ఒక్కదాన్ని వివస్త్రగా ఉండమను, తెలుస్తుంది' అంటూ విరుచుకుపడింది.

నానా అతనివంక కాస్సేపు నిశ్చలంగాచూచి 'నీభార్య నిన్ను దగా చేస్తుందనుకో - నువ్వేం చేస్తావు చెప్పు?' అని కొంచెమాగి, 'నేను నిన్ను దగాచేస్తాననుకో. ఏం చేస్తావో చెప్పు?' అన్నది.

"చూడబ్బాయ్. నిజం చెప్పేస్తున్నాను. నువ్విక్కడ ఎందుకుగోళ్ళు గిల్లుకుంటూ కూచున్నావో నా కర్థంకావడంలేదు. రెండు గంటలనుంచీ నా దుంపతెంచేస్తున్నావు. ఇహనైనా వెళ్ళి, నీ భార్యను కలుసుకో. ఫాషరె వద్ద ఆమె ఓదార్పు పొందుతుంది,'

ముఫత్ దెబ్బతిన్నదున్నలా లేచాడు. 'చూడు, మీ గొప్పకుటుం బాల ఆడవాళ్ళేంచేస్తున్నారో! మా ప్రియులనుకూడా మాకు దక్కనివ్వడం లేదు' అన్నది నానా మళ్ళీ.

కౌంట్ ఆమెను నిలువునా కిందికితోశాడు. నానా భయకంపితురా లైంది. కొంచెంసేపు అలాగే స్తబ్ధంగాఉండి, 'నీకు తెలుసుననుకున్నాను. లేకపోతే చెప్పేదాన్నికాదు. అదీకాక నాక్కూడా సరిగా తెలీదు, అం టూంటే వినడమే. అసలుసంగతి ఎవరికితెలుస్తుంది. ఊరికే బెంగపెట్టు కోకు. నేను పురుషుణ్నయితే ఏమాత్రం లెక్కచేసేదాన్నికాదు. ఆడవా

ళ్లన్నారు చూచావూ-గొప్పకానీ తక్కువకానీ-అందరూ ఒకటే' అని ఓదార్చింది.

నానా ఇలా ఉపన్యాసంసాగిస్తూనేఉంది. కౌంట్ వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోయినా ఆమె ఇంకా తనలోతాను ఆడవాళ్ళ దుష్ప్రవర్తనను గురించి గొణుక్కుంటూనేఉంది. ఇలా గొణుక్కుని గొణుక్కుని పక్క మీద వాలిపోయింది. జో వంటింట్లోదాగిఉన్న మరో మహనీయుణ్ని ప్రవేశపెట్టింది.

ముఫత్ చరచరా వెడుతున్నాడు. మరో వానజల్లు పడింది. కారు మేఘాలు ఆకాశంలో బరువుగా కదులుతున్నాయి. బహుశా నానా అబద్ధం చెప్పిఉండవచ్చు. అతన్నిగాభరాపెట్టడానికి ఈ కట్టుకథ కల్పించి వుండ వచ్చు. అబ్బ! ఎంత ఘోరం! ఆ నగ్నరాక్షసి నలభైసంవత్సరాలనుంచి తాను గౌరవించినదాన్నంతా ఒక్కక్షణంలో పేకమేడలా కూల్చేసిందే!

మేఘాలు విచ్చిపోతున్నాయి. ఆకాశం నిర్మలంగావుంది. వెన్నెల చక్కగా ప్రసరిస్తోంది. కౌంట్ తన విషాదాన్ని తనే భరించలేక, వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. 'ఈశ్వరుడా! అంతా అయిపోయింది. మిగిలిందేమీ లేదు' అనుకోసాగాడు.

కొందరు త్వరత్వరగా ఇళ్ళకువెడుతున్నారు. కౌంట్‌మనస్సు కుంప టిలా వుంది. నానా చెప్పినకథ అతన్ని భూతంలావెంటాడుతోంది. ఆ ఉద యాన్నే కౌంటెస్ రావలసిఉంది. మరి ఎందువల్లనో రాలేదు. లెఫాం దెటీలో జరిగిన కొన్నిసంఘటనలు కౌంట్‌కు జ్ఞాపకంరాసాగాయి. ఒకనాటి రాత్రి సెబైన్ తోటలో చెట్లనీడను పచారుచేస్తోంది. ఎందుకో కలవర పడుతున్నట్టుగా ఉంది. అత నేదో అడిగితే వెంటనే జవాబుచెప్పలేక పోయింది. అప్పు డా వ్యక్తి అక్కడేఉన్నాడు. ఆలోచించినకొద్దీ కౌంట్‌కు అనుమానం ఎక్కువకాసాగింది. లంజఇంట్లో తాను వివస్త్రుడవుతూంటే, తనభార్య ఆమెప్రియుని పడకగదిలో వివస్త్రురాలవుతూ ఉన్నదన్నమాట! అతనికళ్ళముందు ఏవో దృశ్యాలు నీడల్లా ఆడసాగాయి. నానా నగ్న విగ్రహం సెబైన్‌గా మారుతున్నటు కన్పించింది కౌంట్‌కు. ఏడుపు పొర్లి వచ్చింది. ప్రపంచంలో తా నొక్కడూ ఒక్కడైనట్టు తోచింది. నిర్జనమైన ఒక ఇరుకుసందులోకి వెళ్ళి, పసిపిల్లవాడిలా ఏడ్చాడు. ఎవరిదో అడుగుల

చప్పుడు వినపడేసరికి అక్కడినుంచి పారిపోయాడు. అతనికి ప్రపంచమంతా ఏదో అవ్యక్తఛాయల్లాగా మారినట్టనిపించింది. ఎవరో వస్తున్నారు; ఎవరో పోతున్నారు; ఒక స్త్రీనీడ కనుపించింది. సెబైన్‌లా ఉంటి ఆమె జుట్టుచూస్తే.

వానజల్లు పడుతోంది. అతను పూర్తిగా తడిసిపోయాడు. అతన్ని ఏదో బలహీనత కమ్మేస్తున్నది.

ఒంటరిగా వీధులన్నీ తిరిగాడు. అతని నీడతప్ప అతనికి మరేమీ కనుపించడంలేదు. ఎలక్ట్రిక్ స్తంభాలు దాటిపోతూంటే అతనినీడ పెద్దదై చిన్నదై మళ్లీ పెద్దదవుతోంది, తననీడను చూస్తుంటే తనకే ఎంతో విచిత్రంగావుంది. చుట్టూ అంధకారంతప్ప మరేమీ లేదు. చీకటి అంతులేని సముద్రంలా వ్యాపించి ఉంది. తను ఒక్కడే ఆ చీకటిపిడికిటిలో చిక్కుకున్నట్టుతోచింది.

అతని మనస్సు ఈశ్వరునిపైకి మళ్ళింది. అసహాయులకు ఈశ్వరుడొక్కడే సహాయం చేస్తాడనుకున్నాడు. ఇదంతా గడిచిపోయిన తరువాత ఈశ్వరుడు జ్ఞాపకం రావడం అతనికి ఆశ్చర్యాన్ని కల్గించింది. ఈ ఈశ్వరుడు బలహీనతకు లొంగకముందే ఎందుకు జ్ఞాపకంరాకూడదో।

కాళ్ళీడ్చుకుంటూ ఒక పాడుపడ్డ చర్చిలో ప్రవేశించాడు. ఆ చర్చి శిధిలమై ఉంది. కౌంట్ తడబడుతూ లోపలికి ప్రవేశించి, ఏకాంతంగా ఈశ్వరుని సహాయపడమని ప్రార్థించాడు.

తరువాత తనకు తెలీకుండానే నానాఇంటికి వెళ్ళాడు. చాలాఅలసిపోయి ఉన్నాడు. నానా అతన్ని చూసేసరికి మండిపడింది. మళ్లీ ఆమెకు జాలికలిగింది, ఇంటికిపోయి విశ్రాంతి తీసుకోమన్నది. కాని, అతను నానావైపు ప్రార్థిస్తున్నట్టుగా చూచాడు. హఠాత్తుగా తలుపు తెరుచుకొని స్టీనర్ ప్రవేశించాడు. నానా అతన్ని రావద్దని ఆదేశించింది. అతను తెచ్చిన డబ్బు అతని మొహాన విసిరికొట్టింది. 'వెళ్ళండి. నాకు మరో మిత్రుడు -న్నాడు' ఇలా అని పడకగది తలుపు తెరిచింది. పక్కమీద ఫాంటన్ కనుపించాడు. వాళ్లు స్తబ్దులైపోయారు. ఒకవారంనుంచి నానా ఫాంటన్‌పై మోజుపడుతోంది. ముఫత్, 'లంజ!' అన్నాడు.

నానా, 'నేను లంజనే, నీ భార్య?' అన్నది, ఇలా అని విసురుగా

తలుపుకొట్టి, వెళ్ళిపోయింది. ఇద్దరూ ఒకరిముఖాలొకరు చూచుకున్నారు. నిశ్శబ్దంగా నిష్క్రమించారు.

ముఫత్ ఇంటికిచేరేసరికి చాలా ఆలస్యమైంది. అప్పుడే అతనిభార్య వచ్చింది. ఇద్దరూ మెట్లమీద కలుసుకున్నారు. కౌంటెస్ బాగా నలిగిపోయి వుంది. ఆమె నిద్రతో కూలిపోతోంది.

# 8

వర్రాంట్‌మా ర్త్రిలో రూవెరాన్‌వద్ద మేడలో నాలుగో అంతస్తు. నానా, ఫాంటన్ కొందరుస్నేహితులను విందుకుపిలిచారు. వారు అక్కడ బసపెట్టి మూడురోజులైంది.

అంతా తొందరైపోయింది. కౌంట్‌ను, బ్యాంకర్‌ను పంపేసిన తరువాత నానా విషయమంతా గొడవైపోయింది. నానా ఒకసారి తన పరిస్థితిని పరిశీలించుకున్నది. అప్పులవాళ్ళు మూగి, ఇహ తన్ను బ్రతక నివ్వరు. పోట్లాటలకు కాట్లాటలకు అంతుండదు అనుకున్నది.

ఫాంటన్‌తో ప్రణయకలాపం ప్రారంభించిన తరువాత నానాకు మళ్ళీ రాజ్యంవచ్చినట్టు, జీవితంవిచ్చినట్టు అనిపించింది. అన్నీ అమ్మేసి పూర్వపుఇల్లు ఖాళీచేసింది. ఫాంటన్ మరోచోట కాపరంపెట్టేచేశాడు. మొదటిరోజులు ఎంతో హాయిగా గడిచాయి.

మేడమ్ లెరాట్ చిన్నిలూయిాని తీసుకొచ్చింది. నానా ఉద్విగ్నురాలై చేతులతో మెల్లిగా వక్షస్థలాన్ని ఒత్తుకుంటూ 'అతను చాలా మంచి వాడమ్మా' అన్నది.

మేడమ్ లెరాట్ కళ్ళు చెమ్మగిల్లాయి.

నానా ఆమెకు ఇల్లంతా చూపింది. పడకగది, వంటగది, భోజనాల గది అన్నీ. 'జో' మాత్రంలేదు. అమ్మగారు ఎప్పుడో ఒకప్పుడు డబ్బివ్వక పోదని దాని ధీమా. ఆ భయం ఎంతమాత్రం లేదు. అప్పులవాళ్ళువస్తే అమ్మగారు ఏదో పనిమీద ప్రయాణంలో వున్నారు. రాగానే ఇచ్చేస్తారని చెప్పేది. ఎవరో వెనకవుండి అప్పులవాళ్ళను వుసికొల్పుతున్నారన్నది జో. ఈ మాటలే మేడం లెరాట్ కూడా చెప్పింది.

వట్టిపెధవలు! నేనేం అమ్ముడుపోతా ననుకున్నారా? చస్తే చెయ్యను నా పని' అన్నది నానా.

"అదే నేనూ అన్నాను. నువు నీ హృదయం ఎలాచెపితే అలాగే చేస్తావన్నాను" అన్నది పినతల్లి.

కార్లయిన్‌కోసం లాదోర్రెట్, లామినాట్ ఎస్టేట్ కొన్నాడని విని, నానా ఎంతో నొచ్చుకుంది.

"ఎన్నివేషాలు వేసినా బజారులంజలే. నవ్వితే నవ్వారు కాని, నిజం చెబుతున్నాను. డబ్బున్నోళ్ళు ఎప్పుడూ సుఖంరాదు. ఏమైనా ఏమ్చుకోనీ వాళ్ళను. వాళ్ళున్నా చచ్చినా ఒకటే' అన్నది నానా ఖచ్చితంగా.

అప్పుడే మేడమ్ మాలియర్ వచ్చింది. నానా ఆమెకుకూడా ఇల్లంతా చూపింది ఈలోగా ఫాంటన్, బాస్క్, ఫ్రూలెరి వచ్చారు.

'భలే బాగుందే ఇల్లు' అన్నాడు బాస్క్.

ఇంతలో బాబూ అక్కడికి వచ్చాడు.

"ఏమిటి? చాలా పెద్దకుర్రా డున్నాడే నీకు!" అన్నాడు ఫ్రూలెరీ.

మేడం లెరాట్, మేడం మాలియర్ పగలబడినవ్వారు. నానా ఏమీ అనుకోలేదు. తనూ మృదువుగా నవ్వింది. ఫాంటన్ కుర్రాణ్ణి దగ్గరికి తీసుకున్నాడు. అందరూ ఎత్తుకుని ముద్దాడారు. తర్వాత అందరూ భోజనాలకు కూచున్నారు. కులాసాగా భోజనాలు ముగించారు.

నానా ఎంతో వుత్సాహంగా వుంది. పదహారేళ్ళ కన్నెపడుచులా మెరిసిపోతోంది. ఫాంటన్‌ను ప్రేమతో తదేకంగాచూస్తోంది. అతనిశిరస్సు మీద ముద్దులవర్షం కురిపిస్తోంది. ఎవరైనా 'ఏమిటీ విడ్డూర'మంటే, కసురుకుంటే తొలగిపోయేపిల్లిలా వెళ్ళి తనస్థానంలో కూర్చునేది.

ఫ్రూలెరీ ఈ గొడవంతా చూచి, 'వుండండి. మీ దంతా గొడవగా వుంది' అని వారిద్దరిమధ్యకు వచ్చి కూచున్నాడు.

అందరూ వెరైటీథియేటర్‌నుగురించి మాట్లాడుకున్నారు. ఆ ముసలి ముండాకొడుకు బోర్డనెవ్ ఎన్నటికీ చచ్చేటట్టులేడు. మళ్ళీ వాడి రోగాలన్నీ బయటపడ్డాయి.

మూడువారాలు ఇద్దరి జీవితం హాయిగా గడిచింది. నానా ఎక్కువగా బైటికివెళ్ళేదికాదు. ఎక్కువకాలం ఏకాంతంగా ఇంట్లోనే గడిపేది.

ఒకరోజున మార్కెట్‌కు వెళ్ళేసరికి హఠాత్తుగా హెయిర్‌డ్రెసర్ కను పించాడు. అతను ఇన్నాళ్ళూ అమ్మగారు విదేశాలకు వెళ్ళారనే భ్రాంతిలో ఉన్నాడు. ఆమెను చూచి, 'అమ్మగారూ! ఎప్పుడూ రాక? ఎన్నో హృద యాలు భగ్నంచేసి వెళ్ళారే' అన్నాడు. ఇద్దరూ ఒకమూలకు వెళ్ళి మాట్లాడుకున్నారు. అతను స్టీనర్‌విషయం, డానెట్‌ను గురించి అన్నీ పూసగుచ్చినట్లు చెప్పాడు. స్టీనర్ దివాలా తీశాడు. డానెట్ బాగానే వున్నాడు. కౌంట్ పిచ్చివాడిలా తిరుగుతున్నాడు. మినాన్ కనుపించి అతన్ని తీసుకెళ్ళాడు. ఈవిషయం వినేసరికి నానాకు కొంచెం నవ్వు వచ్చింది.

'అయితే ఇప్పుడు రోజ్‌తో కాలక్షేపం చేస్తున్నాడన్నమాట. ఎట్లాచస్తే ఎవరిక్కావాలి. ముసలిపీనుగ-స్టీనర్‌ను తనదగ్గరనుంచి లాగేశా నని ఆ ముండ నామీద పగతీర్చుకుంటోంది. అందుకే నేను తరిమేసిన వెధవను చేరదీసింది' అన్నది నానా.

'మినాన్ మరోలా చెబుతున్నాడు, కౌంట్ తనే నిన్ను తరిమే శాడట' అన్నాడు ఫ్రాంసిస్. ఈమాట వినేసరికి నానాముఖం పూర్తిగా వివర్ణమైపోయింది.

'ఏమిటీ? వాడా నన్ను తరిమేసింది? ఏడ్చాడు-వెధవ! నేనే తన్ని తరిమేశాను. వట్టి నపుంసకపు దద్దమ్మ. కౌంటెస్‌కు ఒకడుకాదు-లక్షల మంది ప్రియులు. ఆ వెధవ పాష్‌రెకూడాను. ఛీ, వెధవప్రపంచం! ఎవడూ నన్ను ఇంతవరకు తన్ని తరిమినవాడులేడు. అలాంటివాడుంటే వాడినెత్తురు కళ్ళచూచి ఉండేదాన్ని' అంటూ అక్కసు వెళ్ళకక్కింది నానా.

నెమ్మదిగా కాసేపటికి చల్లబడింది. ఆమె ఎవరినీ లెక్కచెయ్యదు. తన కాలిబురద ఎంతో వాళ్ళంత. తన అంతరాత్మే తనకుసాక్షి. ఆమె పాతగౌను వేసుకుని, అక్కడ నిల్చుని తనసంగతంతా చెబుతూంటే అతనికి జాలివేసింది. ఒక చిన్నసలహా ఇచ్చాడు - 'ఒక్క మోహంకోసమే అన్నీ వదులుకోడం మంచిదికాదమ్మా. మోహం ఎందరినో చెడగొట్టింది'అన్నాడు, నానా అతనివద్ద సెలవుతీసుకుని వెళ్ళిపోయింది. రోజంతా ఆమెకు తనను తన్ని తరిమేశాడన్న విషయం జ్ఞాపకం రాసాగింది. ఫాంటన్‌తోకూడా తను ఎవరికీ లొంగే స్త్రీనికాదని గట్టిగా చెప్పింది.

ఆ సాయంత్రం వాళ్ళిద్దరూ ఒక థియేటర్‌కు వెళ్ళారు.

అక్కడ ఒక స్త్రీనిచూచి తిరిగివచ్చారు. వారు తిరిగి వచ్చేసరికి ఒంటిగంట అయింది. ఆ సాయంత్రం హోటల్‌నుంచి భోజనం తెప్పించు కున్నారు. భోజనంముందు ఆ స్త్రీనిగురించి చర్చవచ్చింది. నానా ఆ స్త్రీ అసహ్యంగా ఉందన్నది. 'నోరుముయ్. చాలా బాగుంది' అన్నాడు ఫాంటన్. నానా మండిపడింది. ఇద్దరూ పోట్లాడుకున్నారు. నానాకు ఆరాత్రంతా నిద్రపట్టలేదు. ఫాంటన్ నానాను ఒక లెంపకాయకొట్టాడు. నానా స్తంభీభూతురాలై 'ఓ!' అని మాత్రం నిట్టూర్చింది. మరి మాట్లాడ లేదు. తల దిండులో పెట్టుకుని వెక్కి వెక్కి ఏడ్చింది. అలాగే ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లి నిద్రపోయింది. తెల్లవారేసరికి ఆమెబాహువులు ఫాంటన్ శరీ రాన్ని చుట్టుకుని ఉన్నాయి. నానాకు అతనిపై మమతలో అతని దెబ్బలు కూడా తీయగానే తోచాయి.

ఆరాత్రినుంచి వారిజీవితం ఎంతో మారింది. చిటికీమాటికీ ఫాంటన్ కొడుతుండేవాడు.

నానాకు దెబ్బలు తినడం అలవాటైపోయింది. ఎప్పుడైనా తిరుగు బాటు చేసేది. అతను గోడకునొక్కి గొంతుపిసికేస్తాననేవాడు. అంతటితో నానా నోరుమూసుకుని లొంగిపోయేది. పగలంతా ఫాంటన్ వచ్చేవాడు కాదు. నానా పూర్తిగా అతనికి లొంగిపోయింది. మారు మాట్లాడితే అ రావడంకూడా మానేస్తాడని ఎదురుమాట్లాడేదికాదు.

ఒకరోజున నానాకు ఏమీ తోచలేదు. పావురాలను కొనుక్కుం దామని బజారుకెళ్ళింది. సాటిన్ కనుపించింది. 'నీవా నానా! ఇక్కడుం టున్నావా?' అన్నది సాటిన్.

'ఇలా ఉన్నావేం? ఏం జరిగింది?' అన్నది. ఆ ప్రదేశానికి ఎందరో స్త్రీలు వస్తారు. మురికిగౌన్లు, జుట్టు చూసి ఉంటుంది. అప్పుడే రాత్రి తట స్థించిన మగవాళ్ళను ఎట్లాగో వదిలించుకుని, కాళ్ళీడ్చుకుంటూ వస్తారు. కళ్ళు నిద్రలేక బరువుగా వాలిపోతుంటాయి.

ఒక కుర్రాడు అటువస్తూ. 'గుడ్‌మార్నింగ్ డార్లింగ్' అన్నాడు సాటిన్‌నుచూచి. మూడురోజులక్రితం ఒకవీధిమూల అతను సాటిన్‌కు తట స్థించాడు. 'పగలుకూడా వీళ్ళకు బుద్ధిలేదు' అనుకున్నది సాటిన్.

కొంచెం జనసమ్మర్దానికి దూరంగా వెళ్లినతరువాత నానా ఫాంటన్‌తోడి తన ప్రణయకలాపాన్ని గురించి సాటిన్‌తో చెప్పింది. కౌంట్‌ను తరిమేసిన సంగతికూడా చెప్పింది.

సాటిన్ ఉత్సుకురాలై, 'భలేపనిచేశావ్. ముద్దిమీద ఒకతన్నుతన్ని పంపేశావన్నమాట. ఏమీ అనలేదుకదూ అతను. అవును. ఎందుకంటాడు. మగవాళ్లు వట్టి పిరికిపందలు!' అన్నది.

తరువాత ఏమీ తోచనప్పుడల్లా నానా సాటిన్‌దగ్గరకు వెడుతూం డేది. సాటిన్‌గది మురికికూపంలా ఉండేది. అదీకాక ఇంటి యజమాని ఖాళీచెయ్యమంటూండేవాడు. ఖాళీచేసే ఇల్లు ఎలాఉంటేనేం అని సాటిన్ ఊరుకునేది. సాటిన్ రోజల్లా తిరిగితిరిగి ఇంటికిరాగానే అలసిపోయి. పక్కమీదపడి మొద్దునిద్రపోయేది. సాయంకాలం కాని లేచేదికాదు. నానా ఆ చిన్నగదిలో నిరామయంగా కూచుని, తనవ్యక్తిగత విషయాలన్నీ మాట్లాడేది. మురికిపక్క, మురికినీళ్ళబేసిన్లు, కుర్చీలమీద మాసినగౌన్లు— ఆ గది అలా ఉన్నా నానాకు ఎంతో బావుండేది. సాటిన్ పక్కమీద పవళించి, నానా చెప్పేదంతా వినేది అంతులేకుండా సిగరెట్లు కాలుస్తూ. మధ్యమధ్య బాధలుమరచిపోవడానికి తాగేవారు. నానా కథలన్నీ సాటిన్ ఎంతో ఓర్పుతో వినేది. సాటిన్ నిశ్చలంగా సిగరెట్ కాల్చేది. దెబ్బల విషయం మాట్లాడుకునేవారు. సాటిన్ తన విషయంచెప్పేది. తనను ఒకరు చచ్చేట్టు బాదేవాడు. కాని సాటిన్ అత న్నెంతో ప్రేమించేది.

ఇలా రోజూ నానా సాటిన్‌లు కలుసుకునేవారు.

ఇద్దరికీ గాఢమైత్రి ఏర్పడింది.

ఇద్దరూ ఒకరోజున మేడమ్ రాబర్ట్ ఇంటికి వెళ్లారు. మరోరోజున లారె. నడుపుతున్న హోటల్‌కు వెళ్లారు. వాళ్లిద్దరూ ఒక వీధిగుండా నడుస్తు న్నారు. ఆ వీధి వివిధ రకాల మనుషులతో సమ్మర్దంగా ఉంది.

అలంకరించుకున్న స్త్రీలు మేడలకిటికీల్లోనుంచి చూస్తున్నారు. క్రింద నడుస్తున్న జనం తలలెత్తి వారివంక చూస్తున్నారు. లారె హోటల్లో మూడు గదులు ఖాళీగా ఉన్నాయి. లారెకు యాభై యేళ్లుంటాయి. ఏనుగులా ఉంటుంది మనిషి. వచ్చిపోయేస్త్రీలు ఆమెను ఎంతో చనువుగా ముద్దాడి పోతున్నారు.

అక్కడికి మేడమ్ రాబర్ట్ వచ్చింది. ఆమెరాగానే లారెనుముద్దాడి, సాటిన్‌వద్దకు వచ్చింది. వాళ్ళిద్దరూ ఏదో మాట్లాడుకున్నారు.

నానా ఇంటికి తిరిగివచ్చేసరికి చాలా ఆలస్యమైంది. వచ్చేసరికి ఫాంటన్ వచ్చిఉన్నాడు. తన ఆలస్యానికి కారణాలు చెప్పడానికి తల ప్రాణం తోకకువచ్చింది. జార్జి ఉత్తరంవ్రాశాడు. ఫాంటన్ ఆ ఉత్తరాన్ని నానాకుచూపాడు. జవాబువ్రాద్దామన్నాడు ఫాంటన్. సరేనన్నది నానా.

ఒకరోజున వారిద్దరికీ డబ్బునుగురించి పెద్దతగాదాజరిగింది. ఫాంటన్ నానాను చచ్చేట్టుకొట్టాడు. ఆరోజునుంచీ వారిజీవితం మరీ అధ్వాన్నమై పోయింది. దెబ్బలులేని రోజుండేదికాదు. నానా మళ్ళీ తన మొదటిరోజుల పతితజీవితాన్ని స్వీకరించవలసివచ్చింది. సాటిన్‌తోకలిసి పారిస్ మురికివీధు లన్నీ తిరిగేది. పూర్వం తనకు పరిచితమైన కొంపలన్నీ కనుపించేవి.

ఒకసారి పోలీసులను తప్పించుకోడానికి ఇద్దరూ పరుగెత్త వలసి వచ్చింది.

ఒక రోజున నానా ఇంటికితిరిగివచ్చేసరికి ఫాంటన్ ఎంతకూ తలుపు తెరవలేదు, నానా తలుపుగుద్దింది. ఫాంటన్ చివరకు తలుపుతీశాడు. లోపల ఒక స్త్రీ కూచునివుంది, 'వెళ్లు గొంతుపిసికేస్తాను' అన్నాడు ఫాంటన్. నానా ఏడుస్తూ వెళ్ళిపోయింది. వెంటనే సాటిన్‌వద్దకు వెళ్ళింది. సాటిన్ నానాను ఎంతో ఓదార్చింది.

నానా తన ఇంటికి వెళ్ళేసరికి, చాలా ఆలస్యమైంది. లూయీ నిద్రి స్తున్నాడు. కొడుకును చూచేసరికి నానా బాధలన్నీ మర్చిపోయింది.

## 9

వెరైటీథియేటర్‌లో 'లిటిల్‌డచెస్' రీహార్సల్ వేస్తున్నారు. మొదటి అంకం పూర్తిఅయింది. రెండో అంకం ప్రారంభంలో ఉన్నది. పుట్ లైట్లకు దాపులోవున్న రెండుకుర్చీలలో కూచుని ఫాషరె, బోర్డ్‌నెవ్‌లు వాదించుకుంటున్నాడు. ప్రామ్టర్ కోసార్డ్ ఒకప్రక్కగా కూచుని పెన్సిల్ కొరుకుతూ వ్రాతప్రతిని తిరగేస్తున్నాడు.

"ఎందు కింకా ఆలస్యం ? అన్నాడు బొర్డ్‌నెవ్ హఠాత్తుగా.

"ఇంకా బొస్కు రాలేదు. ఎక్కడికో అదృశ్యుడైపోయాడు బారిలట్. బారిలట్ అసిస్టెంట్ స్టేజ్ మానేజర్‌గా పనిచేస్తున్నాడు. తరువాత అందరూ పెద్దగా కరతాళధ్వనులుచేశారు. 'బొస్కు ఏడీ? ఏడీ?' అని అరవసాగారు. బోర్డనెవ్ శాపనార్థాలు సాగించాడు.

కొద్దిసేపటికి బొస్కు వచ్చాడు. అతను ప్రశాంతంగా ఉన్నాడు.

బొస్కు రాగానే, 'నేను ప్రవేశించేవేళ అయినట్టుందే; నాకుచెప్పలేదేం? సైమన్, ఏదీ నా డైలాగు చెప్పు' అన్నాడు. తాను ఏద్వారంగుండా ప్రవేశించాలో చెప్పమని అడిగాడు.

'ఆ ద్వారంగుండానే' అని అరిచాడు ఫాష్‌రె అసహనంతో.

"సరే, ఆ ద్వారంఏది?" అన్నాడు బొస్కు.

ఈసారి బోర్డనెవ్ బారిలట్‌ను విమర్శించసాగాడు. అతనిమీద మండిపడ్డాడు.

'ఇక్కడ ద్వారానికి సూచనగా ఒక కుర్చీ ఉంచమని చెప్పాను. రోజూ ఈ మాటే చెబుతున్నాను, బారిలట్! ఏడీ బారిలట్? ఎక్కడున్నాడు? ఏంచేస్తున్నాడు?' అని అరవసాగాడు.

ఈ తుఫానుకు బారిలట్ తలవంచక తప్పిందికాదు. మౌనంగా కుర్చీ తెచ్చి, అక్కడ ఉంచాడు. సైమన్ సేవకురాలిపాత్రను అభినయిస్తూ కుర్చీలు సవరించనారంభించింది. బోస్ మకిలపట్టినలాగు తొడుక్కున్నాడు. పెట్టీ ఓవర్‌కోటు వేసుకున్నాడు. మెడచుట్టూ మఫ్లర్ చుట్టుకున్నాడు. రిహార్సల్ జరుగుతోంది. బోర్డనెవ్ కుర్చీలో కూలబడి, అలసటతోచూస్తూ కూచున్నాడు. ఫాష్‌రె చాలా అసహనంగా ఉన్నాడు. తనవెనక ఎవరో గుసగుసలాడుకోడం అతనికి వినిపించింది.

బోర్డనెవ్ మీదికివాలుతూ 'ఆమె అక్కడ ఉన్నదా?' అని అడిగాడు. అతను తలఊపాడు. ఈనాటకంలో నానా 'గెరాల్డైన్' పాత్ర ధరించవలసిఉంది. ఆ పాత్రధరించడానికి ముందు ఆపాత్రనేకాక ఒకమాటు నాటకం రిహార్సల్స్ చూడదలుచుకున్నది నానా. విలాసిని వేషం ధరించడానికి నానా కొంచెం వెనుకంజవేసింది. ఆమెకు ఉదాత్త స్త్రీ పాత్రలో రంగస్థలంమీద కనుపించాలని ఎంతో అభిలాష. లాబోర్డెటీతోకలిసి బాక్సేసీడల్లో

దాక్కొని కూచున్నది. ఫాష్రె ఒకమాటు వెనక్కితిరిగి ఆమెవంకచూచి మళ్ళీ రిహార్సల్ చూస్తున్నాడు.

రంగస్థలం ముందుభాగంలో మాత్రమే లైట్లు వెలుగుతున్నాయి. కోసార్డ్ ఒకవైపుగా నిల్చుని, వ్రాతప్రతిని పట్టుకునిఉన్నాడు. ఫాష్రె, బోర్డ్‌నెవ్ లైట్లనీడలో కూర్చునిఉన్నారు. లైట్లకాంతిలో నటులు ఏవో అవ్యక్తస్వరూపాల్లో ఉన్నట్టు కన్పించసాగారు. కొందరునటులు రంగస్థలానికివెనుక నిల్చుని, తమలో తా మేదో చర్చించుకుంటున్నారు. పెద్దగా మాట్లాడుకోడం మొదలెట్టారు.

'ఎన్నిసార్లు చెప్పడం? ఏమి టా గల్లంతు?' అని బిగ్గరగా అరిచాడు బోర్డ్‌నెవ్. కుర్చీలోనుంచి కోపంతో సింహంలాలేచి 'నేను ఒక్కమాట కూడా వినలేను. మీరు ఏదైనా వాగదలుచుకుంటే బైటికివెళ్ళి, వాగండి. మే మిక్కడ పనిలో ఉన్నామని తెలీదాఏమిటి? ఈసారి ఒక్కమాటయినా వినిపించిందంటే అందరినీ కాల్చేస్తాను' అని గద్దించాడు.

కాస్సేపు వారు మౌనంవహించారు. ఒకబెంచీమీద గుంపుగా కూచున్నారు. ఫాంటన్, ప్రూలెరీ, రోజ్‌లు మిగ్నాన్‌తో మాట్లాడుతున్నారు. ఈలోగా ఒకగొంతు విన్పించింది—'డచెస్; సెయింట్ ఫెర్మన్' అని. ఆ పిలుపు రెండోసారి వినిపించేటంతవరకు ప్రూలెరీకు తను సెయింట్ ఫెర్మన్‌పాత్ర ధరిస్తున్నానన్నవిషయం జ్ఞప్తికిరాలేదు. రోజ్ డచెస్ హెలెన్‌పాత్ర ధరిస్తోంది. ప్రవేశంకోసం అతనికొరకై వేచివున్నది. ముసలి బాస్క్ మళ్ళీ వచ్చి, బెంచీమీద కూచున్నాడు. క్లారిసీ తనబెంచీమీద అతనికి చోటిచ్చింది.

'ఎందు కతను ఎలుగుబంటల్లే అలా అరుస్తాడు?' అన్నది బోర్డ్‌నెవ్‌ను ఉద్దేశిస్తూ.

ఫాంటన్ నెమ్మదిగా, 'ఈ నాటకం విజయవంతమయ్యేటట్టు కనుపించడంలేదు. వట్టి చచ్చునాటకంలా ఉంది' అన్నాడు. తరువాత క్లారిసీతో రోజ్‌విషయం ప్రస్తావిస్తూ, 'నువు నమ్ము. నమ్మకపో. ఒక్కొలా తికి మూడువందలఫ్రాంకులట. పంద్రప్రదర్శనాలు గ్యారంటీ ఇచ్చారుట' అన్నాడు.

'అందరూ నిశ్శబ్దంగా ఉండండి' అని గర్జించాడు బోర్డ్‌నెవ్.

తరువాత కొద్దిసేపటివరకూ ఎలాంటి శబ్దమూ వినిపించలేదు. నటకుల గొంతులుమాత్రం చెదురు చెదురుగా విన్పించాయి. నటకులు ఎంతమాత్రం అలసటకలిగించుకోకుండా మెల్లగా అభినయించారు. ప్రేక్షకులు ఎలా ఆనందిస్తున్నారో తెలుసుకోవడంకోసం అప్పుడప్పుడూ ప్రేక్షకులవంక చూచారు. ప్రేక్షకులున్నస్థలం వారికి పెద్దచీకటిగుహలా కనుపించింది. ఆ చీకటిగుహలో ఏదో అవ్యక్తమైననీడ ప్రేలాడుతున్నట్టు తోచసాగింది. నాటకశాలంతా చీకటిగాఉంది. రంగస్థలంలో మాత్రమే లైట్లువెలుగుతున్నాయి. నాటకశాలఅంతా ఒక విషాదకరమైన నిద్రలో మునిగి ఉన్నట్లుగా ఉన్నది. పై కప్పుమీద చిత్రించబడిన చిత్రాలు మసకచీకట్లో కనుపించకుండా వున్నాయి. రోజ్ డచెస్ పాత్రలో ఫుట్‌లైట్లవద్దకు వచ్చింది. చేతులెత్తి శ్మశానంలా కన్పిస్తున్న ప్రేక్షకాగారంముందు నిల్చుని అభినయించడం మొదలెట్టింది.

నానా బాక్సులోకూచుని నాటకం రిహార్సల్ చూస్తున్నది. ఆమె ఒక చక్కని శాలువా కప్పుకున్నది. రోజ్ అభినయిస్తూంటే ఆ అభినయాన్ని తన కండ్లతో తాగేస్తోంది. లాబోర్డెటీవంక తిరిగి, మెల్లిగా 'అతను తప్పకుండా వస్తాడంటావా?' అని అడిగింది.

'తప్పకుండా వస్తాడు. మినాన్‌తో కలిసి వస్తాడు. అది ఒకమిష. అంతే. అతను రాగానే నువు మాథిల్డ్ డ్రెసింగ్ గదిలోకి వెళ్లు. నేను అతన్ని అక్కడికి తీసుకొస్తాను' అన్నాడు.

వారు మాట్లాడుతున్నది కౌంట్ముఫత్‌ను గురించి. ఈ ఇంటర్వ్యూ ఏర్పాటుచేసింది లాబోర్డెటీ.

'గెరాల్డైన్‌పాత్ర ఎలావుందంటావు?' అని అడిగాడు లాబోర్డెటీ.

నానా సమాధానం చెప్పలేదు. ఆమె నిశ్చలంగా మౌనంగా ఊరుకున్నది. మొదటి అంకం ముగిసింది. ఆ అంకంలో డ్యూక్ డి బీరివేజ్ తన భార్యను మోసంచేసి, గెరాల్డైన్ అనే తారతో ప్రేమకలాపం సాగిస్తాడు. రెండవ అంకంలో హెలెన్ ఏ రహస్యమంత్రశక్తిద్వారా తారలు వుత్తమ ఇల్లాండ్ర భర్తలను తమగుప్పిట్లోకి లాక్కుంటారో తెలుసుకుందామని తారవద్దకు వెడుతుంది. రిహార్సల్ నింపాదిగా సాగుతోంది. ఫాష్‌రె హఠాత్తుగాలేచి 'అది బాగాలేదు' అన్నాడు. అభినయంలో మునిగివున్న

నటులందరూ హఠాత్తుగా ఆగిపోయారు. ఫాంటన్ ముక్కునలుపుకుంటూ హాస్యాస్పదంగా, 'ఏది బాగాలేదు?' అని అడిగాడు,

'మీరందరూ తప్పుచేస్తున్నారు. మీరు చేస్తున్నది ఏదీ సరికాదు' అన్నాడు ఫాష్రె మళ్లీ. ఇలా అంటూ రంగస్థలంపైకి వెళ్ళి, 'ఏ పాత్రాభినయంతో ఆ పాత్రకు తగినంత ఉద్రేకం స్పష్టంగా వ్యక్తీకరింపబడడం లేదు. నువు ఇలా వంగి దవెన్ను ఇలాపట్టుకోవాలి. రోజ్! నువు తరువాత కాని వెళ్ళకూడదు' అని చెప్పాడు. తరువాత గెరాల్డైన్‌తో రోజ్‌కు వినిపించేలా ముద్దెట్టుకోవాలని చెప్పాడు. ముసలి కోసార్డ్ బాక్సువంక తిరిగి పెద్దగా ముద్దెట్టుకోడం అభినయించాడు.

'అదీ, అలాముద్దెట్టుకోవాలి' అన్నాడు ఫాష్రె. తరువాత రోజ్‌తో ఆముద్దు వినగానే ఆమె చెయ్యవలసిన అభినయాన్నిగురించి చెప్పాడు.

నటులు ఆ రంగాన్ని మరోపర్యాయం అభినయించారు. ఫాంటన్ మాత్రం తనపాత్రను మనఃపూర్వకముగా అభినయించలేదు. మళ్ళీ రెండు పర్యాయములు ఫాష్రె తనసూచనల నిచ్చాడు. అందరూ అదోవిధమైన దిగులుగావున్న ముఖాలతో అతనిసూచనలు విన్నారు. ఒకరివంక ఒకరు చూచుకున్నారు. వారి దృష్టిలో అతనిసూచనలు తలతో నడవమన్నట్టుగా వున్నాయి. నటులంతా అతనిసూచనలు విన్నతరువాత తోలుబొమ్మల్లా మళ్లీ అభినయించ నారంభించారు.

'నాకు ఈ నటన ఎంతమాత్రం అర్థంకావడంలేదు' అన్నాడు ఫాంటన్ సగర్వంగా.

ఈ దృశ్యం జరుగుతున్నంతసేపూ బోర్డునెవ్ ఒక్కమాటుకూడా పెదవి విప్పలేదు. కూలిపోయిన ఏనుగులా తన కుర్చీలో కుప్పకూలి కూచున్నాడు. అతన్ని చూస్తే మేలుకునివున్నా నిద్రపోతున్నట్టు కనపించాడు. ఆ మైకంలోనుంచి హఠాత్తుగా లేచాడు బోర్డెనెవ్. 'ప్రియమిత్రమా! నువు చెబుతున్నది ఎంతమాత్రం సబబుకాదు' అన్నాడు ఫాష్రెతో మెల్లగా.

'ఎందుకు సబబుకాదు?' అన్నాడు ఫాష్రె చిన్నబోయినముఖంతో.

బోర్డ్‌నెవ్ హఠాత్తుగా కోపోద్రిక్తుడై పోయాడు. ఘాటైనపద జాలంలో తీవ్రంగా విమర్శించసాగాడు. ఫాష్రె బోర్డ్‌నెవ్‌ను 'బ్రూట్'

అన్నాడు. బోర్దునెవ్ పూర్తిగా వశంతప్పిపోయాడు. చేతికర్ర ఊపుతూ, మదపుటేనుగులాగా, మీకెవ్వరికీ దర్శకత్వం తెలీదు. నేను చెప్పినట్టు వినండి అంటూ నటులందరికీ తన ఇచ్ఛానుసారంగా సూచనలిస్తున్నాడు.

రంగం పూర్వం అభినయించినదానికంటె ఏమాత్రం బాగులేదు. కలగాపులగంగా ఉన్నది. బోర్దునెవ్ మదపుటేనుగులాగా విహరించసాగాడు. ఫాష్‌రె ఒకప్రక్కగా నిల్చుని వెక్కిరిస్తున్నాడు. రోజ్ అలిసిపోయి ఒక కుర్చీమీద కూచుంది. ఎవరికీ తామేమి చెయ్యాలో తోచటంలేదు. దీనికి తోడుగా సైమన్ తనపాత్ర ప్రవేశించడానికి సమయం కాకముందే ప్రవేశించింది. బోర్ద్‌నెవ్ మరీ కోపోద్రిక్తుడై పోయాడు.

ఫాష్‌రె హాట్ పెట్టుకుని రంగస్థలం వెనక్కు వెళ్ళి నిల్చున్నాడు. బోర్ద్‌నెవ్ ఎలుగుబంటులా రొప్పుతూ వెళ్ళి, తనకుర్చీమీద కూచున్నాడు. నాటకశాలఅంతా నిశ్శబ్దంగాఉన్నది. నటకులందరూ ఎంతోదూరప్రయాణం చేసివచ్చినవారివలె డస్సిపోయి ఉన్నారు. బోర్ద్‌నెవ్ యథాస్థానంలో కూచుని, 'సరే, ఇక కానీండి' అన్నాడు.

'మళ్ళీ మొదలెట్టండి' అన్నాడు ఫాష్‌రె.

నటకులు మళ్ళీ రిహార్సల్ ప్రారంభించారు. ఎంతో అనాసక్తంగా, తమకూ ఆపాత్రలకూ ఎలాటి సంబంధంలేనట్టు నటిస్తున్నారు. మానేజరుకు, రచయితకు వాగ్వాదం జరుగుతున్న సమయంలో ఫాంటన్, తదితరులు వెనకాల పాతకుర్చీలమీద కూచుని, ఆ తగాదాకు ఆనందించారు. వారిలో వారు నవ్వుకున్నారు.

నానా ఇంకా తన బాక్సులో కూచుని, నాటకాన్ని పరిశీలిస్తోంది. లాబోర్దెటీ రెండుమూడుసార్లు నానాతో మాట్లాడాలని యత్నించాడు. కాని, ఆమె అతనిమాటలు వినిపించుకోలేదు. రెండో అంకం ముగింపు వస్తోంది. అప్పుడు ఇద్దరు వ్యక్తులు స్టేజీవెనకాలగా రావడం కన్పించింది. వాళ్ళు శబ్దంకాకుండా మెల్లగా అడుగులువేసుకుంటూ వచ్చారు. వారు మినాన్, కౌంట్ ముఫత్‌లని నానా గుర్తించగలిగింది. 'అమ్మయ్యో! వచ్చారన్నమాట' అన్నది నానా నిశ్వసిస్తూ రోజ్ చివరి సంభాషణ చెప్పింది. బోర్ద్‌నెవ్ రెండో అంకాన్ని మళ్లీ అభినయించమన్నాడు. తరువాత లేచి వెళ్ళి, కౌంట్‌కు అతి కృత్రిమ మర్యాదతో అభివందనం చెప్పాడు.

"సరే, ఇక వెడదాం" అన్నాడు లాబోర్డెటీ నానాతో.

నానా బాక్సువదలి లేచింది. బాక్సులకు, స్టాల్స్‌కు వెళ్ళేదారిని నడిచివెళ్ళింది. బోర్డ్‌నెవ్ దారిచివరలో ఆమెను కలుసుకుని "నీకు చాలా చక్కని పాత్రఉన్నది. రేపు రిహార్సల్‌కు రా" అన్నాడు.

నానా సమాధానం చెప్పలేదు. మూడో అంకం చూడాలనుకున్నది.

"మూడో అంకం అద్భుతంగా ఉంటుంది" అంటూ మూడో అంకంలో జరిగే విషయాలను వర్ణించసాగాడు బోర్డ్‌నెవ్.

"ఆ అంకంలో గెరాల్డైన్ ఏం చెయ్యాలి?" అని అడిగింది నానా.

"గెరాల్డయిన్‌కుకూడా ఒకరంగం ఉన్నది. కాని ఆ రంగం అంత పెద్దదికాదు. రంగం చిన్నదైనా ఆమెపాత్ర అద్భుతమైనది"

రెండు నిమిషాలు అతనిముఖంవంక తదేకంగా చూచి, "అన్ని విషయాలూ తరువాత మాట్లాడుకుందాం" అన్నది నానా.

మెట్లమీద తనకోసం వేచివున్న లాబోర్డెటీని నానా కలుసుకున్నది. నాటకశాలలో అందరూ ఆమెను గుర్తుపట్టారు. తమలోతాము గుసగుసలాడుకోవడం ప్రారంభించారు. ఆమె తిరిగిరావడం ప్యూలెట్‌కి ఎంతమాత్రం యిష్టంలేదు. క్లారిసీ హృదయంలోకూడా వేదన బయలుదేరింది. ఫాంటన్ మాత్రం తనకేమీ సంబంధంలేనట్లు కన్పించసాగాడు. తను ప్రేమించిన స్త్రీని నిందించడం, అతని కేమాత్రం ఇష్టంలేదు. అతని హృదయంలో పూర్వం ఉన్న ప్రేమ ఈనాడు ద్వేషంగా పరిణమించింది. తనకు నానాపట్ల గల విపరీత భక్తివల్లనే ఒకవిధమైన విపరీతద్వేషం ఏర్పడింది.

లాబోర్డెటీ కౌంట్‌వద్దకు వెళ్ళగానే, రోజ్‌మినాన్ జాగ్రత్తపడసాగింది. ముఫత్‌అంటే మినాన్‌కు అంత ఇష్టంలేదు. సాధారణంగా తన భర్తతో అవలంబిస్తున్న మౌనాన్ని భగ్నంచేసి 'ఏం జరుగుతున్నదో చూచావా? ఈ మాటు మళ్ళీ అలాప్రవర్తించిందంటే కళ్ళుపీకేస్తాను' అన్నది.

మినాన్ తాత్వికునివలె 'నామాట విని ఊరుకో' అన్నాడు. తనకు ఏది లాభకరమో మినాన్‌కు బాగాతెలుసు. ముఫత్‌వద్దనుంచి రాబట్టవలసినదంతా రాబట్టాడు. నానా ఒకసారి కన్నుగిలిపితే కౌంట్ ఆమెకు పాదాక్రాంతు డవుతాడని అతనికితెలుసు. పురుషులమనస్తత్వం చక్కగా

గ్రహించినవాడు కావడంవల్ల తన కెంతవరకు లాభదాయకంగా ఉంటుందో అంతవరకు పూర్తిగా వినియోగించుకోవడం అతనిమతం. పరిస్థితులు ఎలా పరిణమిస్తాయో అతను పరిశీలింపసాగాడు.

"రోజ్! ఇది నీ రంగం! రెండో అంకం మళ్ళీ ప్రారంభించండి" అని బిగ్గరగా అరిచాడు బోర్డ్‌నెవ్.

తరువాత ఫాష్‌రెను ఉత్తమ నాటకం రచించినందుకు అభినందించ సాగాడు మినాన్.

బాస్కి మళ్ళీ యథాస్థానంలో కూచున్నాడు. రీహార్సల్ ప్రారంభ మైంది. లాబోర్డెటీ కౌంట్‌తో కలసి వెళ్ళాడు. నానాను మళ్ళీ చూడమనే సరికి కౌంట్‌కు వణుకుపుట్టసాగింది. వారిద్దరికీ విభేదాలు వచ్చినతరువాత ప్రపంచంలో ఎంతో ఏకాంతంగాఉన్నట్టు తలచసాగాడు కౌంట్. తనను రోజ్‌చేతుల్లోకి వదులుకున్నాడు. అతనికి జీవితం శూన్యంగా, నిరామయంగా కనుపించసాగింది. ఏంచెయ్యాలో తోచక తన అలవాట్లనుమార్చుకోడానికి ప్రయత్నించసాగాడు. అతన్ని గాఢనిద్ర ఆవరించినట్టయింది. అతనికి ఆ నిద్రలో అన్నివిషయాలనూ వాయిదావేద్దామనిపించింది. తన ఆంతరంగికమైన ఉదాత్తతే ఈ నిద్రకు కారణమనుకున్నాడు కౌంట్. కాని అతనిలో అతనికి తెలియకుండానే ఒక రహస్యశక్తి పనిచెయ్యసాగింది. నానా జ్ఞాపకంవచ్చి మళ్ళీ అతన్ని పూర్తిగా ఆక్రమించుకుంది. అతని శరీర బలహీనతను, అతనిలో పొటమరిస్తున్న కొత్తకొత్త భావాలను అనువుగా తీసుకుని, తన పూగుత్తులవంటి తన మృదుపదచరణాలను అతని మనోమందిరంలో మోపింది. అతను పూర్వం పాల్గొన్న అసహ్యకరమైన దృశ్యం రాను రాను అతని మనస్సులో మాసిపోజొచ్చింది. అతని స్మృతిపథంలో ఫాంటన్ మాసిపోయాడు. నానా తనను వెళ్ళగొట్టడం, తన భార్య దుశ్శీలాన్ని గూర్చి ప్రస్తావించడం అన్నీ మాసిపోయాయి. అతనికి ఇప్పుడు ఇవేవీ జ్ఞాపకంలేవు. అతని హృదయంలో ఏదో బాధమాత్రం మిగిలింది. ఆ బాధ అనుక్షణం సెలవేస్తోంది. ఒక్కొక్కసారి అతనిమనస్సులో పసిపిల్లలభావాల్లాంటివి మొలకెత్తేవి. తన్నుతాను నిందించుకునేవాడు. తను నిజంగా హృదయపూర్వకంగా ప్రేమించిఉన్నట్లయితే నానా తనను మోసంచేసి ఉండేదికాదనుకునేవాడు. అతనిబాధఅతనికేబరువైపోయింది.

భరింపరాని వేదన అతన్ని కుంగదీసింది. మానిపోయిన వ్రణం సెలవేస్తే ఎలాఉంటుందో అలా ఉన్నది. ప్రేమకలాపంయొక్క తొలి రోజుల్లో ఉండే మమకారంకాదు. నానా తనదగ్గర ఉండాలని, తనది కావాలని, తనసొత్తు కావాలని, తనకౌగిళ్ళలో ఆమె పూవల్లే నలిగి వాడిపోవాలని అనిపించేది. ఆమెజుట్టు, ఆమెనడుము, ఆమె చన్మొనలు, ఆమెనవ్వు,ఆమె అరుణాధరములు, ఆమె చక్కని చెక్కిళ్ళసోయగం అతన్ని భూతాల్లా వెంటాడేవి. ఆమె కిలకిల మాట్లాడడం జ్ఞాపకంవచ్చినప్పుడల్లా అతని నరాల్లో విద్యుఛ్ఛక్తి ప్రసరించినట్టయ్యేది. లోభి ధన్నాన్ని దాచుకున్నట్టు ఆమెను తనకౌగిలిలో దాచుకోవాలనిపించేది. ఈ మమత్వం, ఈ ప్రేమ అతన్ని భారమైన మేఘంలా ఆవరించింది. అందుచేతనే లాబోర్డెటీ మాట్లాడగానే తన్నుతాను నిగ్రహించుకోలేక, అతన్ని గట్టిగా కౌగలించుకున్నాడు. తరువాత తనంతహోదాగలవ్యక్తి అలానిగ్రహంలేకుండా ప్రవర్తించడ మేమిటా అనుకున్నాడు. లాబోర్డెటీకి కౌంట్ ముఫత్‌ను కీలుబొమ్మలా ఆడించే కీలకం బాగాతెలుసు. అందుచేతనే కౌంట్‌ను మేడమెట్ల మీద వదలిపెడుతూ, 'రెండో అంతస్తులో కుడివైపుకు వెళ్ళి తలుపు తెరవండి, చాలు' అని వెళ్ళిపోయాడు.

ముఫత్ ఒంటరిగా మిగిలిపోయాడు. గ్రీన్‌రూమ్‌ప్రక్కగా వెడుతూ ఉంటే ఎంతో శిధిలంగాఉన్న ఆ గది కనుపించింది అతనికి. గదిఅంతా చెదిరిపోయి మాసిఉన్నది. అతనికి అన్నిటికంటె ముఖ్యంగా ఆశ్చర్యం కలిగించినవిషయం, ఒకరాత్రి అదే మెట్లవరుసపై మసకగా కనుపిస్తున్న వెల్తురులో స్త్రీలు అటూఇటూ లేడిపిల్లల్లా తిరగడం జ్ఞాపకంవచ్చింది. ఇప్పుడు ఆవాతావరణంలో మృత్యువులాంటి ఒకప్రశాంతి వ్యాపించిఉన్నది. అతనికి ఈ ప్రశాంతిలో ఒకవిధమైన ఆనందం కనుపించింది. నెమ్మదిగా అలసట లేకుండా మెట్లెక్కడం మొదలెట్టాడు. గుండె తీవ్రంగా కొట్టుకుంటున్నది. ఒకశిశువులాగా ఏడుపులతో కన్నీటితో తనవశం తను తప్పిపోతాడేమోనని భయంపుట్టసాగింది. మొదటిఅంతస్తు చేరగానే గోడకు ఆనుకున్నాడు. చేతిరుమాలు నోటికి అడ్డంగా పెట్టుకుని మెట్లవరసవంక, మాసినగోడలవంక చూచి, ఒక చౌకభారు వేశ్యాగృహంలా కనుపిస్తున్న ఆ వాతావరణాన్ని పరిశీలింపసాగాడు. మధ్యాహ్నసమయంలో పడుపుకత్తె

లందరూ నిద్రిస్తున్న సమయంలో వేశ్యాగృహం ఎలాఉంటుందో అలా విషాదకరంగా ఉన్నది ఆ వాతావరణం. రెండవఅంతస్తు చేరేసరికి అతను ఒక నిద్రిస్తున్న పిల్లిని దాటివెళ్ళవలసివచ్చింది. సగం మూసుకున్న కళ్ళతో ఆ పిల్లి సమాధిలోఉన్న ఋషిలాఉన్నది.

లాబోర్డెటీ చెప్పినట్టు కుడిప్రక్క తలుపు తెరవాలి అంతే. అక్కడ నానా వేచిఉన్నది. నానా వేచిఉన్న ఆ గది మాథిల్డీ డ్రెసింగ్ రూమ్. దానికి సరిగా గది సర్దుకోడమే తెలీదు. అందుచేత ఆగది చిందరవందరగా ఉన్నది. పగిలినకుండలు, విరిగినకుర్చీలు, మాసినసోఫాలుఉన్నాయి. సోఫాలమీద మాసిన ఎరుపురంగు ఎవరో నెత్తురు కక్కినట్టుగాఉన్నది. గోడలకు అంటించిన కాగితం మాసి చిరుగులుపట్టిఉన్నది. గదినిండావాసన. లవెండర్ విలవఉన్నవాసన. అందుచేతనే నానా ఒక కిటికీతలుపు తెరచింది. నానా కిటికీ తలుపు తెరచి ఒక నిమిషం నిల్చుని పరిశుభ్రమైన గాలిపీల్చింది. ఒకమాటు మేడమ్ బ్రాన్‌వంక చూచింది. మేడమ్ బ్రాన్ విసురుగా కసవు ఊడుస్తోంది. దూరంగా వీధులలో వెడుతున్నబండ్ల చప్పుడు వినిపించడంలేదు. వాతావరణమంతా గ్రామసీమల్లోలాగా ప్రశాంతంగా ఉన్నది. నానా కను లెత్తిచూచేసరికి చిన్నచిన్నభవంతులు కనుపించసాగాయి. భవనాలన్నీ బారులుతీరి ఉన్నాయి. నానా ఆ దృశాన్నిచూస్తూ ధ్యాననిమగ్నురాలైంది. నానా ధ్యానాన్ని తలుపుదగ్గర చప్పుడుకావడం భంగపరిచింది. నానా తిరిగి 'లోపలికి రావచ్చు' అన్నది. కౌంట్ లోనికిరావడం గమనించి, కిటికీతలుపు మూసింది నానా. ఈరోజు చల్లగాఉన్నది. నానాకిటికీతలుపుమూసి కౌంట్ వంక చూసింది ఒకరివంకఒకరు నిశ్చలంగా గంభీరంగా చూచుకున్నారు. కౌంట్ నిశ్శబ్దంగా నిటారుగా నిల్చునిఉండడంచూచి నానా నవ్వి, 'మళ్ళీ వచ్చారన్నమాట, మహాశయా!' అన్నది.

కౌంట్‌కు ఒక్కమాటుగా అతన్ని తీసుకునివెళ్ళి ఉత్తరధృవంలో ఉంచినట్టయింది. అతను ఆమెను 'మేడమ్' అని పిలిచి ఆమె పునర్దర్శనం కలగడం తన కెంత సుఖావహంగా ఉన్నదో చెప్పాడు. నానా అతనిపట్ల మరికొంత చనువుచూపింది.

"ఎందుకలా బిర్రబిగుసుకుని నిల్చుంటావు? ఒకరినొకరం చూడ

దలుచుకున్నప్పుడు చీనాకుక్కల్లా అలాచూడడమెందుకు? తప్పు మనిద్దరి దగ్గరా ఉన్నది. నామటుకు నేను క్షమిస్తున్నాను" అన్నది నానా.

ఇకనుంచి పాతగాథ మళ్లీ త్రవ్వవద్దన్నది. అతను సరేనని తల ఊపాడు. అతను నెమ్మదిగా నెమ్మదిగా స్థిమితపడుతున్నాడు. కాని అతనిలో ప్రవాహాలలాగా పొరలివస్తున్న మాటలను వెలువరించేశక్తి లేకపోయింది. అతని స్థితికి ఆశ్చర్యపడి నానా తనతురుపుముక్కను విసిరికొట్టింది.

చిన్నారి చిరునవ్వుతో, 'సరే, అంతా బాగానే ఉన్నది. మనం మళ్లీ సమాధానపడ్డాం కాబట్టి, కరస్పర్శ చేసుకుని ఇకముందు మంచి స్నేహితులంగా ఉందాం' అన్నది.

'మంచిస్నేహితులంగా అంటే?' అంటూ గొణిగాడు కౌంట్ ఆతురతతో.

'ఇకముందు మనం ఎక్కడైనా కలిస్తే బుద్ధిహీనుల్లా ప్రవర్తించ కూడదు'

అతను ఆమెను మధ్యలో ఆపి ఏదో చెప్పబోయాడు.

'నేను చెప్పదలుచుకున్న దంతా పూర్తిగా చెప్పనీ. ఇంతవరకు నా జీవితంలో ఏ పురుషుడూ నన్ను నిందితురాలినిగా చిత్రించలేదు. నాపై నేరారోపణ చెయ్యలేదు. మొట్టమొదటివాడివి నువ్వే. మా మర్యాదలు మాకుంటాయి' అన్నది నానా.

'కాని విషయం అదికాదు. నువు నేనుచెప్పేది కాస్త వినాలి' కౌంట్ కొంచెం తీవ్రంగా అన్నాడు.

నానా అక్కడనుంచి వెళ్ళిపోతుందేమోనన్న భయంతో ఆమెను కుర్చీమీద కూర్చోబెట్టాడు. ఆందోళనతో అటూఇటూ తిరగడం మొదలెట్టాడు. ఆ చిన్న డ్రెసింగ్ రూంలో వెచ్చని ఆవిరి వ్యాపించి ఉన్నది. బయటినుంచి చిన్నశబ్దంకూడా వినిపించడంలేదు. దూరాన్నుంచి అప్పుడప్పుడు ఆగి ఆగి వేణుగానంలా ఏదో శబ్దంమాత్రం వినిపిస్తోంది.

అతను ఆమెముందునిల్చుని 'నామాట విను. నేను నిన్ను మళ్లీ తీసుకెళ్ళడానికి వచ్చాను. మళ్లీ నీతో జీవితం ప్రారంభిద్దామనుకుంటున్నాను. నీ కా విషయం తెలుసు. మరి నాతో ఇలా మాట్లాడుతావేం? నువు ఒప్పుకుంటావా, లేదా? చెప్పవూ?' అన్నాడు.

నానా తలవంచుకుని కూచునిఉన్నది. తనకొనగోటితో సోఫాఎరుపు రంగును గిల్లుతున్నది. అతని తొందరపాటు గమనించినా తనుమాత్రం తొందరపడలేదు. కాస్సేపు అలాగే తలవంచుకునికూచుని, తరువాత తల ఎత్తి చూచింది. ఆమెకళ్ళలో ఒకవిధమైన విషాదం కనుపించింది. 'వీల్లేదు బాబూ, నీతో ఇక ఎన్నటికి ఉండలేను' అన్నది.

'ఎందుకని? ఎందుకని?' అన్నాడు కౌంట్. అతని ముఖంలో బాధ సుడిగుండాలుగా తిరిగింది.

'ఎందుకంటే అది అసాధ్యంకనక. అంతే. నాకు ఇష్టంలేదు' అన్నది నానా. అతను కొద్ది క్షణాలపాటు ఆమెవంక నిశ్చలంగా నిరామయంగా చూచాడు. తరువాత నేలమీద మోకాళ్ళూనాడు. ఆమె గాభరాపడి, తమాయించుకుని 'పిల్లాడిలా ప్రవర్తించకు' అన్నది.

ఆమె ఈమాట అనేలోగానే అతను శిశువులా ప్రవర్తించాడు. ఆమె కాళ్ళవద్ద మోకాళ్ళపైకూచుని, ఆమెనడుముచుట్టూ చేతులువేశాడు ఆమె మోకాళ్ళమధ్య తలఉంచి, ఆమెను గట్టిగా నలపతంమొదలెట్టాడు. పట్టులా మెత్తగాఉన్న ఆమెశరీర స్పర్శతో మళ్ళీ అతని నరాలన్నీ గాలివానకు తీగలు వణికినట్లు వణకసాగాయి. అతన్ని తీవ్రజ్వరం ఆవేశించినట్లయింది. తను ఆమెలో ఒకభాగమైపోదామన్నంత గాఢంగా ఆమెను ఒత్తుకో సాగాడు. కామవాంఛను ప్రకోపింపచేసే దీర్ఘనిశ్వాసలు ఆగదినిండా ఆవరించాయి.

'తరువాత? తరువాత?' అన్నది నానా అతన్ని యధేచ్ఛగా ప్రవర్తింపనిస్తూ. 'నేను అసాధ్యమని చెబుతున్నప్పుడు నీవిలా చెయ్యడంవల్ల వచ్చేలాభమేమీ ఉండదు. అయ్యో బాబూ! వట్టి పసికుర్రాడిలావున్నావే?' అన్నది నానా.

'తరువాత కొంచెం తమాయించుకున్నాడు. కాని నేలమీదనే వున్నాడు. ఆమెనుమాత్రం తనపట్టులోనుంచి కదలనివ్వలేదు. అతని గొంతు ఏడ్పుతో రుద్ధమైపోయింది.

'కొంచెం దయతలచి నామాట విను నానా! నేను నీకోసం అప్పుడే ఒక పెద్దబంగళా మాట్లాడివుంచాను. నీకోరికలన్నీ నాకుతెలుసు. నిన్ను నాదాన్నిగా చేసుకోవడంకోసం నా సర్వస్వాన్ని త్యజించమన్నా త్యజిస్తాను,

కాని, నువ్వుమాత్రం ఈ ఒక్కమాట వినాలి. నువ్వు నాటానిపిగా వుండాలి; అంతే. నీకోసం వజ్రాలు....వైఢూర్యాలు....'

ప్రతిమాటకూ నానా సగర్వంగా తల ఊపింది. తరువాత అతను డబ్బుప్రస్తావన తీసుకురాగా నానా సహనం కోల్పోయింది.

'మంచిదాన్ని కాబట్టి ఇంతవరకూ ఊరుకున్నాను ఇక ఒక్కమాట మాట్లాడినా ఊరుకోను. నాకు ఊరికే విసుగెత్తించకు' అన్నది. ఇలా అంటూ అతన్ని విదిలించేసి, 'లేదు, వీల్లేదు' అన్నది.

అతను ఎంతో బాధతో భారంగా లేచాడు. కుర్చీలో కుప్పకూలి, ముఖాన్ని చేతుల్లో దాచుకున్నాడు. నానా అటూఇటూ తిరుగసాగింది. కొద్ది సేపు అలా తిరిగి, ఆగి, కౌంట్ముందుకువచ్చి నిల్చుని, ఇలా అన్నది. 'శ్రీమంతులు తమధనంతో దేనినైనా పొందగలమనుకోడంచూస్తే నాకు ఆశ్చర్యం కలుగుతుంది. నాకు నీడబ్బూ, నీబహుమతులూ అన్నీ తృణంతో సమానం. నువ్వు పారిస్‌నగరాన్నంతా నాపాదాక్రాంతంచేసినా నేను నిన్ను లెక్కచెయ్యను. హృదయం మనవద్దలేకపోయినతరువాత ఎంత భవనాల్లో నివసిస్తేమాత్రం ప్రశాంతి ఎలావుంటుంది? నాకూ డబ్బుంది. నేను డబ్బు మీద నృత్యంచేస్తాను. నేను తలుచుకుంటే డబ్బుమీద ఉమ్మేస్తానుకూడాను' అన్నది నానా. ఆమెకళ్ళలో ఒక విధమైన అసహనం తాండవించింది. తరు వాత ఆమె విషాదపూరిత కంఠస్వరంతో 'నేను జీవితంలో డబ్బుకంటె విలువైన వస్తువును చూచాను. ఆ వస్తువును నాకెవరైనా ఇవ్వగలిగితే.... అన్నది.

అతను నెమ్మదిగా తలెత్తిచూచాడు. అతనికళ్ళలో ఆశాజ్యోతివెలిగింది.

'నువునాకు ఆవస్తువును ఇవ్వలేవు. దాన్ని ఇవ్వగలశక్తి నీకులేదు. అందుకనే ఆవిషయాలన్నీ నీకో చెబుతున్నాను. ఇది మనలోమాట. నేను వీరి కొత్తనాటకంలో ఉత్తమ స్త్రీపాత్ర ధరించగోరుతున్నాను' అన్నది.

'ఏ పాత్ర?' అన్నాడు అతను ఆశ్చర్యంతో గొణుగుతూ. 'డచెస్ హెలెన్‌పాత్ర. గెరాల్డైన్‌పాత్ర నేను అభినయిస్తానని అనుకుంటే వారు ఎంతో పొరబడ్డారన్నమాట. ఆ పాత్రకు అంత ప్రాధాన్యంలేదు. ఒకే రంగంలో వస్తుంది. అదీకాక, అసలు విషయం అదికాదు. నేను కులాసా స్త్రీలపాత్రలు ఇదివరకు ఎన్నోసార్లు అభినయించాను. ఆపాత్రలు అభిన

యించి అభినయించి నాకు విసుకెత్తింది. అందరూ నాలో ఎప్పుడూ ఎందరో కులాసాస్త్రీలు ఉన్నారని అనుకునేటంతగా అలాటిపాత్రలు అభినయించాను. రానురాను అలాటిపాత్రలపై నాకు మోజు నశించింది. నాకూ ఒక గొప్ప స్త్రీపాత్ర అభినయించాలని వుంది' అన్నది నానా.

ఆమె ఇలాచెబుతూ కిటికీవద్దకువెళ్ళి, కోడిపుంజులా సగర్వంగా నడుస్తూ తిరిగివచ్చింది ఇంకా కన్నీళ్ళు పూర్తిగా ఆరనికళ్ళతో ఆమెవంక చూస్తున్నాడు కౌంట్. ఆమె ఇలాతిరుగుతూ, అతనిముందు ఆగి, 'నా కోరిక మంచికోరికే నంటావా?' అని అడిగింది.

'అవును అవును' అంటున్న కౌంటు చూపు ఇంకా కన్నీటితో మందంగానే ఉన్నది.

'నేను ఆ ఉత్తమ స్త్రీపాత్రను అభినయించగలను. ఒకమాటు ఇంటి వద్ద ప్రయత్నించిచూచాను నాలాగా పురుషులను తృణప్రాయంగా చూచే ఆ డచెస్‌పాత్రను అభినయించగలవారు వీరిలో ఎవరూలేరు. ఒక మాటు నిన్నెలా గిలికించానో నీకూ జ్ఞాపకం ఉందికదూ? అది - ఆ ఠీవి స్త్రీకి జన్మతః కాని రాదు, అదీగాక నాకు మర్యాదస్తురాలిపాత్ర అభినయించాలని ఉంది. చిన్నతనంనుంచీ నేను కన్నకలలలో ఈ కల ఒకటి. నేనాపాత్ర అభినయించితీరాలి! నే నాపాత్ర అభినయించితీరాలి' అన్నది నానా ఆవేశంతో.

ఆమెగొంతు రానురాను రుద్ధమైంది. ఆమె ముఖంలో తీవ్రత పొడచూపింది. ఇంకా ముఫత్ ఆమె నిరాదరణ, కోపాల్నుంచి పూర్తిగా కోలుకోలేదు. ఏమీ తెలియవాడిలా స్తబ్ధుడై చూస్తూ కూచున్నాడు. కాస్సేపు ఇద్దరూ మాట్లాడలేదు.

'నేను చెబుతున్నది అర్థమైందా? నువు ఆపాత్రను నాకు కుదిర్చి పెట్టాలి' అన్నది నానా.

ముఫత్ చకితుడయ్యాడు. 'కాని, సాధ్యంకాదే. నాకు అలాంటి శక్తిలేదని నువ్వే చెప్పావుకదూ?' అన్నాడు.

నానా మధ్యలో అడ్డుతగులుతూ 'నువు క్రిందికివెళ్ళి బోర్డ్‌నెవ్‌తో ఆ పాత్ర కావాలని చెప్పాలి. వెళ్ళగానే ఈమాటచెప్పకు. బోర్డ్‌నెవ్‌కు ప్రస్తుతం కొంతడబ్బు అవసరమయింది. నువ్వతనికి కొంతడబ్బు అప్పు పెట్టు. నీదగ్గర పారేసినా తరగనంత డబ్బుందికదా' అన్నది నానా. కాని

ముఫత్ ఎంతకూ ఒప్పుకోకపోవడంచూచి ఆమె కోపోద్రిక్తురాలైంది. 'నాకు తెలిసింది. రోజ్‌కు ఇష్టంగావుందని భయపడుతున్నావులే. నువు నేల మీద దొర్లుతూ, ఏడుస్తున్నప్పుడు నే నామెనుగురించి మాట్లాడలేదు. ఆమెను గురించి చెప్పవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయి. ఒక పురుషుడు ఒక స్త్రీతో తను ఆజన్మాంతం ఆమెనే ప్రేమిస్తానని ప్రమాణంచేసి మళ్లీ మొదటి స్త్రీతో కలిసి ఉండకూడదు. నా హృదయంలో ఇప్పటికీ ఆ పుండు మానిపోలేదు' అన్నది నానా.

కౌంట్ చివరకు, 'నేను రోజ్‌ను ఎంతమాత్రం లెక్కచెయ్యను. ఏ క్షణాన్నైనా వదిలెయ్యడానికి సిద్ధంగావున్నాను.' అన్నాడు.

ఈ మాటకు నానా సంతృప్తిచెందినట్టుగా కన్పించింది. "మరి అభ్యంతరం యేమిటి?" అన్నది.

ఈసారి నానా నెమ్మదిగా మాట్లాడింది. ఇప్పుడిప్పుడే అసలు విషయంలోకి వస్తోంది. ముఫత్ నేలకేసిచూస్తూ మౌనంగా కూర్చున్నాడు. తనకుతానై కల్పించుకున్న ఒక అజ్ఞానప్రాకారంలో నిద్రించసాగాడు. ఫాష్‌రెపట్ల అతనిలో ఒకవిధమైన కోపం దాగివున్నది.

"ఫాష్‌రె రాక్షసుడా ఏమిటి? పైకి ఎలాకనుపించినా అసలు మంచి వాడే. నాకోసమని చెప్పు" అన్నది నానా.

అసలు ఈ విషయమే పెద్దగండతగలైరగా కనుపించింది కౌంట్‌కు. "వీల్లేదు. ఎన్నటికీ వీల్లేదు" అన్నాడు బిగ్గరగా.

"ఫాష్‌రె నువు ఏమిచెప్పినాకాదనడు" అన్నమాట ఆమె పెదవుల వరకూ వచ్చింది. కాని, అంతఘాటైనమాట ప్రస్తుతం ప్రయోగించదలుచు కోలేదు. నానా చిరునవ్వునవ్వింది అంతే. ఆ నవ్వు విచిత్రమైంది. ఆ నవ్వులో ఎన్నోమాటలను పూవుల్లా వెదజల్లింది. ముఫత్ ఆమెవంకచూచి మళ్ళీ కళ్ళుదించేసుకున్నాడు. అతనిముఖం పాలిపోయింది.

"నువు నామాట మన్నించేటట్టు లేవుకదూ?" అన్నది నానా.

"నేను నువుచెప్పిన ఏపని అయినా చెయ్యగలను. కాని, ఈ పని మాత్రం-" అంటూ గొణిగాడు ముఫత్ బాధపడుతూ. ఇక లాభంలేదని నానా వాదించడం మానేసింది. తన చిన్నారి చేతులతో అతనితల పట్టు కుని ముందుకువంగి పెదవులమీద ఒక ఘాటైనముద్దు అంటించింది. గాఢ

పరిష్వంగాన్ని ప్రసాదించింది. కౌంట్ నరాల్లో విద్యుచ్ఛక్తి ప్రవహించి నట్టయింది. అతనికళ్ళు మూసుకుపోయాయి. అతనిలో యెదిరించేశక్తి మటు మాయమైంది. నానా అతన్ని లేవదీసి 'ఇక వెళ్ళు' అన్నది. అంతే.

కౌంట్ మెల్లిగా లేచి, వాకిలివద్దకు నడిచాడు. గదివాకిలిదాటేలోగా మళ్ళీ ఒకమాటు కౌగలించుకుని తన చిరుగడ్డాన్ని అతని వక్షస్థలానికి రాచింది. మెల్లగా 'మనభవనం ఎక్కడ?' అన్నది.

"ఎవెన్యూ డి విల్లియర్స్‌లో"

"బండ్లు ఉన్నాయా?"

"ఊఁ"

"వజ్రాలు, వైఢూర్యాలు?"

"ఓ!"

"ఎంతమంచివాడివోయ్ నాచిన్నినాన్నా! నేను పట్టలేక అలా చేశాను, మరేమీ అనుకోకు. ఈ మాటు ప్రమాణంచేసి చెబుతున్నాను. నేను పూర్వంలా ఉండను. నీ కిప్పుడు అర్థమైందికదూ-స్త్రీకి ఏంకావాలో? నాకు ప్రతిదీ ఇస్తావుకదూ నువ్వు?" అన్నది నానా. ఇలాఅని అతన్ని నాజూకుగా బైటికినెట్టింది. వాకిట్లోనిలబెట్టి అతనికి హుంషారునిస్తూ అతని పెదవులపై ముద్దులవర్షం కురిపించింది. ఒక్కనిముషం ఊపిరి సలుపుకోడానికి నిల్చున్నది. అబ్బ! ఆ మాథిల్డేగదిలో ఏదో వాసనవేస్తోంది. నానా గది కిటికీతెరచి బయట విశాలాకాశంలోకి చూచింది.

ముఫత్ వణికిపోతున్న అడుగులతో మేడమెట్లుదిగాడు. క్రిందికివెళ్ళి ఏంచెప్పాలో అతనికి తోచలేదు. తనకు ఏమాత్రం సంబంధంలేని ఈవిషయంలో ఎలా జోక్యం కలిగించుకోవాలో అతనికి అర్థంకాలేదు. అతను రంగస్థలాన్ని చేరగానే ఎవరో పోరాడుకుంటున్నట్టు వినిపించింది. నటకులు రెండవఅంకం ముగింపులో ఉన్నారు.

ఫాషరె, తనడైలాగుల్లో కొన్ని తీసివేశాడని ప్రూలెరెకు కోపం వచ్చింది.

'తీసేస్తే మొత్తం తీసేయ్. ఉన్నవే 200 లైన్లకు మించిలేవు' అని బిగ్గరగా అరిచాడు ప్రూలెరె. ఇలా అరుస్తూ వణుకుతున్న వ్రేళ్ళతో తన జేబులోని కొన్ని కాగితాలు బైటికితీశాడు. దెబ్బతిన్న గర్వం అతని

ముఖంలో స్పష్టంగా కనిపిస్తోంది. పెదవులు గట్టిగాకరుచుకున్నాడు. కళ్లు చింతనిప్పుల్లా మండిపోతున్నాయి. తనలోని అంతరంగిక విప్లవాన్ని దాచు కోలేకుండా ఉన్నాడు. ఎంతో ప్రజాభిమానాన్ని చూరగొన్న తనలాటి నటుడేమిటి రెండువందల లైన్ల పాత్ర నభినయించడమేమిటి?

'ఇంతకంటె సేవకునిపాత్ర ఇస్తే ఎంతో సంతోషించేవాణ్ణి' అన్నాడు కోపంగా.

'ఉండవయ్యా ఫ్రూలెరీ, కొంచెం తమాయించు' అని ప్రతిమలాడ సాగాడు బోర్డ్‌నెవ్-'నీకోసం ప్రత్యేకంగా కొన్ని సందర్భాలు పెట్టిస్తాలే' అన్నాడు.

'ప్రతి రంగంచివర నాడైలాగులు ఉండాలి' అన్నాడు ఒక నటకుడు. ఫాష్‌రె మౌనం అర్థాంగీకారం అన్నట్టు ఊరుకున్నాడు. ఫ్రూలెరీ పోర్షన్ కాగితాలు మళ్ళీ జేబులో పెట్టుకున్నాడు. కాని పూర్తిగా సంతృప్తిచెంది నట్టు కన్పించలేదు. బాస్క్, ఫాంటన్‌లు ఈవివాదంతో సంబంధంలేనట్టు ఒక ప్రక్కగా నిల్చున్నారు. నటులందరూ ఫాష్‌రెచుట్టూమూగి, ఏవేవో ప్రశ్న లడగడం మొదలెట్టారు. రంగస్థలం వెనుక కీనీడను కౌంట్ నిల్చు న్నాడు. బోర్డ్‌నెవ్ అతన్నిచూడగానే చప్పున లేచి కౌంట్ దగ్గరకు వెళ్ళి నిల్చుని, 'వట్టి గొడవమనుష్యులండీ, వీళ్ళతో వేగలేకుండా ఉన్నాను. ఎప్పుడూ ఏదోఒకగొడవ లేవదీస్తుంటారు. ఎప్పుడూ ఎవరినో ఒకరిని దుమ్మెత్తిపోస్తూనే ఉంటారు' అన్నాడు.

ఇలా చెప్పి బోర్డ్‌నెవ్ ఆగిపోయాడు. తరువాత కాస్సేపు ఇద్దరూ మౌనంగా ఊరుకున్నారు. ముఫత్ ఆ విషయం ఎలా ప్రస్తావిద్దామా అని తనలో ఆలోచిస్తూ నిల్చున్నాడు. కాని, ఎంతఆలోచించినా దారి తోచక చివరకు ఎలాగైనా బైటపడాలనే ఉద్దేశంతో, 'నానా డచెస్ పాత్ర ధరించుతా నంటోంది' అన్నాడు.

భోర్డునెవ్ ఆశ్చర్యంతో నోరుతెరచి, 'అయ్యోరామ! అదెలా సాధ్య పడుతుంది' అన్నాడు.

ఇలా అని తలపైకెత్తగా కౌంట్ ముఖంలో ఎంతో ఆందోళన, బాధ కన్పించాయి.

మళ్లీ ఇద్దరూ మౌనంగా ఊరుకున్నారు. నానా కోరికను తానెంత

మాత్రం లెక్కచెయ్యలేదు. నానా ఆ పాత్ర ధరిస్తే అదో విచిత్రంగా ఉంటుంది, పైగా ముఫత్ తనచేతిక్రింద ఉంటాడు. బోర్దునెవ్ ఇలా ఆలోచించి వెనక్కి తిరిగి, 'ఫాషరె!' అని పిలిచాడు.

ఆ పిలుపు ఫాషరెకు విన్పించలేదు. ఫాషరె ఫాంటన్‌తో 'తార్‌దిలె' పాత్రనుగూర్చి మాట్లాడుతున్నాడు.

'ఫాషరె!'—బోర్దునెవ్ మళ్లీ పిలిచాడు.

ఇలాగైనా ఫాంటన్‌తో వాదించేపీడ వదిలిపోయిందికదా అని ఫాషరె అక్కడనుంచి చరాలున వెళ్ళిపోయాడు.

ఫాషరె అక్కడికి వెళ్ళగానే బోర్దునెవ్ వారిద్దరినీ రంగస్థలం వెనకాలవున్న సామాన్లగదిలోకి తీసుకెళ్ళాడు. వా రలావెళ్ళడం మినాన్ ఆశ్చర్యంగాచూచాడు. వారు కొన్నిమెట్లు దిగి, చీకటిగా ఉన్న ఆ గదిలోకి వెళ్ళారు. చూరు చాలా క్రిందికి వున్నది. కిటికీతలుపులు మాసిపోయి ఉన్నాయి. గదినిండా నాటకాల వస్తువులు చెల్లాచెదురుగా పడేసిఉన్నాయి. 'లోపలికి రండి' ఇక్కడికి ఎవరూ రారు' అన్నాడు బోర్దునెవ్.

కౌంట్ లోపలికి ప్రవేశించాడు. ఫాషరెకు ఇదంతా ఏమిటో అర్థంకాలేదు. 'ఏమిటి పని?' అని అడిగాడు. 'ఆ, ఏమీలేదు, మాకు ఒక కొత్తభావం స్ఫురించింది. కొంచెం ప్రశాంతంగా విను. నానా డచెస్ పాత్ర ధరిస్తే ఎలా వుందంటావు' అన్నాడు బోర్దునెవ్.

ఈ మాట వినగానే రచయిత కొంచెం గాభరాపడ్డాడు. 'నువు నిజంగానే అంటున్నావా? లేక పరిహాసానికి అంటున్నావా? ఈ మాట వింటే ఎవరైనా నవ్విపోతారు!' అన్నాడు.

'అవును. జనాన్ని నవ్వించడానికే ఈ కొత్తభావం స్ఫురించింది. ఈ భావం మన కౌంట్‌గారి మనస్సును పూర్తిగా ఆవరించింది' అన్నాడు బోర్దునెవ్.

కౌంట్ 'అవును. అలాచేస్తే అద్భుతంగా ఉంటుంది' అన్నాడు.

ఫాషరెకు కోపంవచ్చింది. కౌంట్‌కు తనరచనకు సంబంధమేమిటి? చివరకు, 'నానా చలాకీపిల్లలపాత్ర ధరించగలదు. కాని ఉదాత్తస్త్రీపాత్ర ధరించడం అసంభవం' అన్నాడు.

'నువు ఆమెను బాగా అర్థంచేసుకోలేదనుకుంటాను. ఇంతకుముందే ఆ భూమిక నెంతచక్కగా అభినయించగలదో ఆమె నాకు చూపించింది' అన్నాడు కౌంట్ కొంచెం ధైర్యం తెచ్చుకుంటూ.

"ఎక్కడ అభినయించిచూపెట్టింది?' అన్నాడు ఫాష్‌రె ఆశ్చర్యంగా.

"మేడమీద డ్రెసింగ్ గదుల్లో అద్భుతంగా నటించింది. ఆ చూపులు చూచితీరాలి"

తరువాత వారిద్దరినీ ఒప్పించాలనే ఆవేశంలో తన్నుతాను మరచిపోయి అభినయించి చూపెట్టసాగాడు. ఫాష్‌రె ఆశ్చర్యంగా అతన్ని చూస్తున్నాడు. అతనికి అర్థమైంది. అతనికోపంకూడా అదృశ్యమైంది ఫాష్‌రె చూపులలో జాలి నిరసన కలిసిఉండడంగమనించి కౌంట్ కొంచెం సిగ్గుపడి తన అభినయాన్ని ఆపాడు.

"ఆమె బాగానే నటించవచ్చు. కాని, ఆ పాత్రను ఇదివరకే రోజ్‌కు ఇచ్చేశాం. ఇప్పుడు మళ్ళీ మార్చడం బాగుండదు' అన్నాడు ఫాష్‌రె.

"అదే అభ్యంతరమైనట్లయితే ఆ అభ్యంతరాన్ని నేను తొలగిస్తాను' అన్నాడు బోర్డ్‌నెవ్.

కాని ఫాష్‌రె అందుకు అంగీకరించలేదు.

తరువాత వారందరిమధ్య నిశ్శబ్దం వ్యాపించింది. కౌంట్ తలవంచుకుని రుద్ధస్వరంతో, 'ఇది నువు నాకోసం చెయ్యాలి' అన్నాడు.

"వీల్లేదు, వీల్లేదు' అన్నాడు ఫాష్‌రె.

ముఫత్ గొంతు మరింత రుద్ధమయింది. 'నేను ని న్నర్థిస్తున్నాను. ఇది నా అభిమతం' అన్నాడు.

ఇలా అని సూటిగా అతనికళ్ళల్లోకి చూచాడు. ఆ చూపులో ఫాష్‌రెకు ఏదో అంతరార్థం తోచింది. 'సరే, కానీండి. కాని పాత్ర విజయవంతంకాదు. మినాన్‌తోకూడ మాట్లాడండి' అన్నాడు.

కొంచెంసేపటినుంచి మినాన్ అక్కడే వాకిట్లో తారట్లాడుతున్నాడు. బోర్డ్‌నెవ్ మొట్టమొదట పాత్రమార్చాలని అన్నప్పుడు అతనికి పట్టరాని కోపంవచ్చింది. వారు తన భార్యభవిష్యత్తును పాడుచెయ్యదలుచుకున్నారనుకున్నాడు. బోర్డ్‌నెవ్ ప్రశాంతంగా అతన్ని ఒప్పించడానికి ప్రయత్నించాడు. రోజ్ ధరించతగినంత గొప్పపాత్ర కాదన్నాడు. ఈ నాటకం కాగానే

మరో గొప్ప ఒపెరా' ప్రారంభం కానున్నదనీ, అందులో రోజ్‌కు గొప్ప పాత్ర ప్రత్యేకింపబడిందనీ చెప్పాడు. రోజ్ భర్త ఇంకా గొణుగుతూం డడం చూచి, సంవత్సరం కాంట్రాక్టు ఒకమాటే వ్రాస్తానన్నాడు. పారిస్ లోని మరే గొప్ప థియేటర్‌లో ఇచ్చే కాంట్రాక్టుకన్న పెద్దకాంట్రాక్టు ఇస్తా నని చెప్పాడు. కాని మినాన్ తన అభిమానం దెబ్బతింటుందని ఎంతకూ ఒప్పుకోలేదు. వందప్రదర్శనాలకు గ్యారంటీ, ఒక్కరాత్రికి మూడువందల ఫ్రాంకులు ఇస్తానన్నాడు బోర్డ్‌నెవ్. చిట్టచివరకు పదివేలఫ్రాంకులిస్తే మరో థియేటర్‌కు వెళ్ళిపోతానన్నాడు మినాన్.

'అమ్మయ్య! సరే!' అన్నాడు కౌంట్.

"పదివేలా? రోజ్‌ను వదిలించుకోడానికి పదివేలా?" అన్నాడు బోర్డ్‌నెవ్. కౌంట్ ఒప్పుకోమని బలవంతపెట్టాడు. చివరకు బోర్డ్‌నెవ్ ఒప్పుకున్నాడు.

ఈ చర్చంతా బైటనుంచి వింటున్న ఫాంటన్ రోజ్‌కు చెప్పాడు. రోజ్ అక్కడికి పరుగెత్తుకొచ్చింది. ఆమె రాగానే అందరూ మౌనంగా ఊరుకున్నారు. నలుగురివంకా చూచింది. కౌంట్ గౌరవపురస్సరంగా తల వంచాడు. ఫాష్‌రె ఆమెవంక ప్రశ్నార్థకంగా చూచాడు. మినాన్ బోర్డ్ నెవ్‌తో ఎగ్రిమెంట్ షరతులు మాట్లాడుతున్నాడు.

"ఏమిటి ఈ గొడవంతా?" అన్నది కీచుగొంతుతో మినాన్ సతి.

"ఏమీలేదు, బోర్డ్‌నెవ్ నువ్వు పాత్ర వదులుకున్నందుకు పదివేల ఫ్రాంకులిస్తున్నాడు" అన్నాడు మినాన్.

రోజ్ ముఖంలో నెత్తురుచుక్క లేదు. వణికిపోతూ నిల్చున్నది. ఒక్కమాటు అతని కళ్ళలోకి సూటిగా చూసింది. ఆ చూపులో ఆమెలోని ఆంతరంగిక విప్లవమంతా అచ్చుగుద్దినట్టు కనుపించింది. రోజ్ ఎన్నడూ తన నాటకం కాంట్రాక్టు విషయంలోకాని, తన ప్రేమికుల కాంట్రాక్టుల విషయంలోకాని అతనికి ఎదురు చెప్పేదికాదు. ఈమాటు అతనివంక చుఱ చుఱచూచి 'నీవు వట్టి పిరికిపందవు' అన్నది, అతనిముఖాన కొరడాతో కొట్టినట్టు. ఇలా అని చరచర అక్కడినుంచి వెళ్ళిపోయింది. మినాన్ భయంతో 'ఏమిటి? నీకు పిచ్చెత్తిందా?' అంటూ ఆమెవెనకాల పరు

గెత్తాడు, "ఒక వైపునుండి పదివేల ఫ్రాంకులు, మరోవైపునుంచి పాతిక వేల ఫ్రాంకులు వస్తుంటే కాలదన్నుకుంటావా?" అంటూ ఆమెను ఒప్పించడానికి ప్రయత్నించసాగాడు. ఏదిఏలాఉన్నా ముఫత్ అమెనువదిలిపెట్టడం తథ్యం. అందుకని అతనిరెక్కల్లోని చిట్టచివరిఈక పీకెయ్యడం మంచిది. కాని. రోజ్ ఎగదన్నుకొస్తున్న కోపంతో మాట్లాడలేకపోయింది. మినాన్ బోర్డ్‌నెవ్‌తో, "ఎగ్రిమెంట్‌మీద రేపుప్రొద్దున సంతకాలు చేసుకుందాం. డబ్బు సిద్ధంగా ఉంచ" మన్నాడు.

జరిగిన ఈ వైనమంతా నానాకు లాబోరైటీద్వారా తెలిసింది. ఆమె విజయగర్వంతో ఒక గొప్ప పురానాకుటుంబంలోని స్త్రీలాగ అభినయించసాగింది. చూడగానే మండిపడింది. నానా రోజ్‌ను పిడికిలితో కొట్టబోయింది. కాని వెంటనే నిగ్రహించుకున్నది. నీకు పిచ్చెత్తిందా ఏమిటే?' అన్నది. నానా ఈ పాత్రధరిస్తుందనే ఆనందంలో పాంటన్ ఒక్కడుమాత్రమే అనాసక్తంగా ఊరుకున్నాడు. నానా మెల్లిని అడుగులలో అతనివద్దకువెళ్ళి "ఏం? బాగున్నావా?" అన్నది.

బోర్డ్‌నెవ్ ఆనాటి కింక రీహార్సల్ లేదని చెప్పాడు. కౌంట్ నెమ్మదిగా తనబండిలో ఎక్కి నానాతో వెళ్ళిపోయాడు.

తరువాత ఒక నెలకు "లిటిల్‌డచెస్" ప్రథమ ప్రదర్శనం నానాకు పెద్ద విషాదంగా పరిణమించింది. నానా ఆ పాత్రలో చెప్పరానంత అసహ్యంగా ఉన్నది. అందరూ వినోదపాత్రను చూస్తున్నట్టు ఆనందించారు. ఆమె రంగస్థలంమీదికి రాగానే బాక్సులో కూచున్న రోజ్ నవ్వేది. రోజ్‌నవ్వు అందరికీ వ్యాపించేది. నాటకంముగిసినతరువాత కౌంట్‌తో ఒంటరిగా ఉన్నప్పుడు, అందరికీ కన్నుకుట్టి ఇలాచేస్తున్నారు. ఈ నవ్వే వాళ్ళందరినీ నా కాలిదుమ్ము నాకేటట్టు చేస్తాను. గొప్ప స్త్రీ అంటే ఏమిటో పారిస్ కంతకూ పాఠంనేర్పుతాను' అన్నది నానా.

# 10

నానా ఉచ్ఛతరగతి విలాసినిగా తయారైంది. పురుషజాతి మౌఢ్యాన్ని అల్పబుద్ధినీ వినియోగించుకోవడం ఆమెకు భాషనైపోయింది. ఇది ఆమె జీవితయాత్రలో ఒకనూతనాధ్యాయం. ఒక ఉన్నతవర్గవిలాసినికి ఉండవలసిన మిలమిలలు, తళతళలతో ఆమె పారిస్‌నగర నాగరికులను

ఆకట్టుకుంది. ఉన్నతవర్గాన్ని తనకు పాదాక్రాంతంచేసుకున్నది. ప్రతి గోడమీద ఆమె చిత్తరువులే. ప్రతి వార్తాపత్రిక ఆమెపేరు వేనోళ్ళ పొగడింది. ఆమె తన గుర్రపుబగ్గీలో వెడుతూంటే జనం గుంపులుగుంపులుగా ఆమెను చూడడానికి మూగేవారు. ఒక దేశపు రాణీపేరు ఉచ్ఛరించినట్టుగా ఆమెపేరు ఉచ్ఛరించేవారు. ఆమె చల్లగా మెల్లిగా అన్యాసక్తంగా అందంగా విరజాజిపూలు వెల్లివిరిసినట్టుగా తొలివెన్నెలరేకలా నవ్వేది. మర్యాదస్తురాలి పాత్ర అభినయించలేని ఈ స్త్రీ రంగస్థలందిగగానే పురుషుడన్న ప్రతి వ్యక్తినీ గిలికించడం ఎంతో అద్భుతం. చుట్టుప్రక్కలను గమనించని సామ్రాజ్ఞిలాగా పారిస్ నగరాన్నంతా తనపాదాలక్రింద తొక్కివేస్తూ నడిచేది. పారిస్‌నగరంలోని గొప్పగొప్ప కుటుంబాల స్త్రీలందరూ ఆమెను అనుసరించి, ప్రవర్తించుకోసాగారు,

"ఎవెన్యూ డి విల్లెరె" లో నానా భవనం ఆకాశాన్నంటుతూంది. ఆ భవనం రాజభవనంలా ఉంటుంది. ముఫత్ ఈ భవనాన్ని నానాకోసం ప్రత్యేకంగా కొన్నాడు ఒక యువకశిల్పి ఈ భవనాన్ని రినైజాన్స్ పద్ధతిలో చిత్రించాడు. భవనంనిండా ఎన్నో చిత్రవిచిత్రమైన చక్కని పరికరాలు, అలంకారాలు మెరిసిపోతున్నాయి.

పెద్దవరండా; వరండా కింద నుగా పాలరాతిమెట్లు; ఆ మెట్లపై అందమైనతివాసీ; తోటలో సుమసౌరభం గుబాళిస్తోంది. విశాలంగా ఉన్నమెట్ల వరుసకు వెలుగునివ్వడానికై ఒక పసుపుపచ్చనిగ్లాసుకిటికీ ఉంది. మెట్ల వరుసమొదట్లో ఒక నీగ్రోప్రతిమ ఉన్నది. ఆ ప్రతిమచేతిలో ఒక వెండి పళ్ళెరం. నాలుగు పాలరాతి స్త్రీ ప్రతిమలు నగ్నవక్షోజాలతో మిలమిలలాడుతున్నాయి. వాటిచేతుల్లో దీపాలు అమర్చబడి వెలుగుతున్నాయి.

నానా డ్రాయింగ్‌రూం పదునారవ లూయీ శైలిలో అలంకరింపబడివుంది. నానా పెద్దలకూ, ప్రసిద్ధవిదేశయాత్రికులకూ ఇక్కడే విందులూ, వినోదాలూ ఏర్పాటుచేస్తుంది. సాధారణంగా నానా క్రిందనే భోంచేస్తుంది. భోజనంకాగానే మేడపైకివచ్చి, విశ్రాంతి తీసుకుంటుంది. ఆమె ఈ భవనంలో ప్రవేశించినతరువాత శయ్యామందిరాలంకారమును రెండు పర్యాయములు మార్చింది. మొదటసారి సాటిన్‌సిల్కు పరిచింది, రెండోసారి నీలం సిల్కు అలంకరించింది. కాని, నానాకు ఇంకా సంతృప్తి కలుగలేదు. పడక

తక్కువఎత్తులో పెద్దసోఫాలాగా ఉన్నది. 20 వేల ఫ్రాంకులు ఖరీదుచేసే వెన్నిసులేసు అలంకరింపబడి ఉన్నది. గది అంతటా తివాసీపరచబడింది. ఎక్కడచూస్తే అక్కడ మెత్తని తెల్లఎలుగుబంటుతోళ్లు పరిచారు. పడక గదికి ఆనుకొని ఉన్న పెద్దహాలు ఎంతో రమణీయంగా ఉన్నది. గులాబి రంగుతెరలు గాలికి రెపరెపలాడుతున్నాయి. వివిధదేశాల విచిత్రవస్తువులు అలంకరింపబడ్డాయి. ఇటలీ, స్పెయిన్, పోర్చుగల్, చైనా, జపాను - వగైరా అనేకదేశాల అలంకారాలు ఉన్నాయి. పెద్ద పెద్ద ప్రక్కలంత పడకకుర్చీలు ఉన్నాయి. రెండు పోర్సిలియన్‌తోచేసిన చిన్న స్త్రీ ప్రతి మలు ఉన్నాయి. ఒక స్త్రీప్రతిమ పూలమాల కూర్చుతోంది. మరో స్త్రీ ప్రతిమ పూర్తిగా నగ్నంగాఉంది. చేతులు క్రిందికి, కాళ్ళు ఆకాశంలోకి ఉన్నాయి. ఒకద్వారంనుంచి చూస్తే పడకగది కనుపిస్తుంది. పడకగదిగోడ లకు నిలువుటద్దాలు వ్రేలాడుతున్నాయి. స్ఫటికప్రతిమలు, దంతపు బొమ్మలూ ఉన్నాయి. ఒక గులాబీతెరలోనుంచి మందమైనకాంతి లోనికి వస్తోంది. ఆ కాంతివల్ల గదిఅంతా నిద్రపోతున్నట్టు కనుపిస్తోంది. నానాకు ప్రియమైన గులాబీపరిమళం గది అంతటా మంచుపొగలా వ్యాపించింది.

ఈ భవనంలో ప్రవేశించినప్పుడు నానాకు ఒకసమస్య ఎదుర్కొన్నది. ఈ భవనానికి తగినంతమందిసేవకులను ఏర్పాటుచేసుకోవాలి. నానా దగ్గర జో ఇంకా పనిచేస్తూనే ఉంది. నానాకు మహర్దశ ఉన్నదని జోకు గాఢవిశ్వాసం. నానాజీవితంలో ఈ మార్పు సంభవించిన తరువాత జో అన్ని పనులూ ఎంతో జాగ్రత్తగా స్వయంగానే చక్కబెడుతోంది. కాని స్త్రీ సేవకురాలు ఒక్కతెమాత్రమే ఆ ఇంటికంతా సరిపోదు. ఒక బట్లర్ ఉండాలి. గుర్రపుబగ్గీతోలడానికి ఒక కోచ్‌మన్ ఉండాలి. ఒక వంట వాడు కావాలి. ఈ భవనాన్ని తీసుకొన్నకొత్తలో ఏర్పాట్లవిషయంలో లాబోర్డెటీ ఎంతో సాయపడ్డాడు. గుర్రాలు బేరమాడిపెట్టాడు. నానాను దుకాణాలకు తీసుకెళ్ళిసామాన్లు కొనిపెట్టాడు. సేవకులనుకూడా ఏర్పాటు చేశాడు. అంతకుపూర్వం ఒకడ్యూక్‌వద్ద పనిచేస్తున్న ఛార్లెస్ అనే అతన్ని గుర్రపుబగ్గీతోలడానికి ఏర్పాటుచేశాడు. జూలియన్ అనే బట్లరును కుదిర్చాడు. అన్ని ఏర్పాట్లూ రాజభవనాల్లో జరిగినట్లు జరిగాయి.

రెండోనెలవచ్చేసరికి ఏర్పాట్లన్నీ పూర్తిఅయినాయి. ఖర్చు సంవత్స

రానికి మూడులక్షల ఫ్రాంకులు, ఎనిమిదిగుర్రాలు. అయిదుగుర్రపుబగ్గీలు ఉన్నాయి. నానా క్రమక్రమంగా ఈ నూతన వాతావరణానికి అలవాటు పడింది. రెండో ప్రదర్శనంతరువాత థియేటర్‌నుంచి విరమించుకున్నది. ఇప్పుడామెమనస్సు నిర్మలంగావుండి, ఒకవిధమైన శాంతి ఏర్పడింది. ఆమె మనుస్సులో క్షుద్రవాంఛలు నశించి ఇప్పుడు ఒకటేకోరిక తాండవిస్తోంది. ఆ కోరిక అతి విచిత్రమైనది. డబ్బు విచ్చలవిడిగా వెదజల్లాలని, ఆ డబ్బు ఇచ్చినవ్యక్తిని నిరసనగాచూడాలని, అతన్ని పూర్తిగా ఆహరించి, అంత రింపచెయ్యాలని, నాశనంచేయబడిన ప్రేమికులను చూచి, తను సగర్వంగా ఉండాలని ఆమె కోరిక।

నానా తనకూ కౌంట్‌కూ మధ్యగల పరస్పరసంబంధ బాంధవ్యాలను స్పష్టీకరించింది. అతను ప్రతినెలా బహుమతులుకాక, 12 వేల ఫ్రాంకులు ఇవ్వాలి. అందుకుగాను ఆమె అతనికి విశ్వాసపాత్రురాలుగా ఉండాలి; అతనిపట్ల విశ్వసనీయంగా ఉంటానని నానా ప్రమాణంచేసింది. కాని, ఆ ఇంటికి యజమానురాలుగా ఆమెకు పూర్తి స్వాతంత్ర్యం ఉండాలి. ఆమె స్వాతంత్ర్యంవిషయంలో అతను జోక్యం కల్పించుకోకూడదు. ఉదాహర ణకు—ప్రతినిత్యం ఆమె తనస్నేహితులను ఆహ్వానిస్తుంది. అతను నిర్ణీత సమయాల్లోనే రావాలి కాని, అస్తమానం వస్తూపోతూ ఉండకూడదు. టూకిగా చెప్పాలంటే ఆమెయందు పూర్తివిశ్వాసం ఉంచాలి, అతను ఎప్పుడైనా అసూయకనపరిస్తే నానా గంభీరత వహించి, అతని సొత్తంతా అతనికిచ్చివేసి వెళ్ళిపోతానని భయపెట్టేది. లూయీమీద భీకరమైన ఒట్లు పెట్టేది. మొదటినెల ఆఖరులోగానే ముఫత్ ఆమెను గౌరవించసాగాడు.

నానా తాను కోరినదానికంటె హెచ్చుగానే పొందుతోంది. క్రమ క్రమంగా అతన్నివశపరుచుకున్నది. అతను అన్యాసక్తంగా ఉన్నప్పుడు ఏవేవో కబుర్లుచెప్పి అతన్ని ఉజ్జీవింపచేసేది. అతనికి ఎన్నో విషయాల్లో సలహా లిచ్చేది. అతనిభార్య విషయంలో, అతని కుమార్తెవిషయంలో, అతని హృదయానికి ధనానికి సంబంధించిన ప్రతి విషయంలోను సలహా లిచ్చేది. ఎంతో ఓపికగా చక్కని సలహా లిచ్చేది.

ఒక్కసారి మాత్రమే నానాకు కోపంవచ్చింది. అది డానెట్ తన కుమార్తెను వివాహమాడబోతున్నాడని కౌంట్ చెప్పినప్పుడు. కౌంట్

బహిరంగంగా నానాను తన సంరక్షణలో వుంచుకున్నప్పటినుంచి డానెట్ ఆమెతో సంబంధాలు తెగతెంపులుచేసుకోవడం మంచిదనుకున్నాడు. మునుముందు తనకు మామగారుకానున్న కౌంట్‌ను ఆ పిశాచి పిడికిట్లో నుంచి తప్పిద్దామనుకున్నాడు. అందుచేత నానాకు అతనిమీదపట్టరానంత కోపంవచ్చి తిట్టింది. అతను అతి నీచస్త్రీలకోసం తన డబ్బంతా తగలేశా డన్నది. అతనికి మట్టూ—మర్యాదా లేదన్నది. ఎప్పుడూ తన స్వంతడబ్బు ఖర్చులేకుండా ఏ డిన్నరుకో వెళ్ళి జీవయాత్రగడుపుతున్నా డన్నది. తాను పూర్వం డానెట్‌తో సంబంధం కలిగివున్నాననీ, డానెట్‌లాంటి భ్రష్టుణ్ణి ఎక్కడా చూడలేదనీ చెప్పింది. ఈ విషయాలన్నీ విన్నప్పుడు కౌంట్ ముఖంలో నెత్తురుచుక్క లేకుండాపోయింది. మళ్ళీ ఎన్నడూ డానెట్‌ను గురించి మాట్లాడలేదు.

ఇప్పుడు నానాభవనంలో బందోబస్తులన్నీ దండిగా ఉన్నాయి. జో అన్నివిషయాలూ స్వయంగా చూచుకుంటోంది, భవనంలో అన్ని శాఖలూ ఒక యంత్రంలోని భాగాల్లాగా సాగిపోతున్నాయి. కొన్ని నెలల వరకూ ఏ లోపమూ కనుపించలేదు.

ఒక ఉదయాన ముఫత్ ఇంకా పడకగదిలో నిద్రిస్తూండగా జో ఒక పెద్దమనిషిని డ్రెసింగ్‌రూమ్‌లో ప్రవేశపెట్టింది. నానా అప్పుడు తన లోపలిదుస్తులు మార్చుకుంటోంది. 'జిజీనే!' అన్నాడు ఆ యువకుడు ఆశ్చర్యంగా. ఆ యువకుడు జార్జ్ నానాను చూడగానే ఆమెను కౌగలించుకొని చేతులామె మెడకుచుట్టి, ఆమెకు ఊపిరి సలపకుండా ముద్దులవర్షం కురిపించాడు. ఆమె భయంతో 'వెళ్లు అత నక్కడ ఉన్నాడు' అని జోతో, 'నీకు పిచ్చెత్తిందా ఏమిటే. ఇతన్ని క్రిందికితీసుకెళ్లు. నేను క్రిందికివస్తాను' అన్నది.

జో అతన్ని బలవంతంగా క్రింది భోజనశాలలోకి తీసుకెళ్ళవలసి వచ్చింది. నానా క్రిందికివచ్చి, ఇద్దరినీ చీవాట్లువేసింది. జో పెదాలుకొరుక్కుని అక్కడనుంచి వెళ్ళిపోయింది. జార్జి నిర్మలమైనకండ్లతో నానా వంక తదేకంగా చూడసాగాడు. అతనికళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. అతని జీవితంలో చెడురోజులు గడిచాయి. అతని మనస్సు మళ్లీ కుదుట పడినదనుకున్నది అతని తల్లి. అందుచేత లెఫాండెటీనుంచి వెళ్ళడానికి

అనుమతించింది. అతను పారిస్‌చేరగానే తక్షణం తన ప్రియురాలిని ముద్దాడాలనే ఉద్దేశంతో టాక్సీలోవచ్చాడు. ఇకముందు ఆమెతోనే కలిసి ఉంటానన్నాడు. ఇలాచెబుతూ ఎంతో ఆతురతగా తనచేతులతో ఆమె చేతులు పట్టుకున్నాడు.

'నువు ఇంకా నీ బేబీని ప్రేమిస్తున్నావుకదూ?' అన్నాడు అమాయకంగా.

'అవును. కాని నువు ముందుగా చెప్పకుండా ఇక్కడికి రాకూడదు. నేను స్వతంత్రురాలిని కాదు' అన్నది.

జార్జి యింతవరకూ తన పరిసరాలను గమనించలేదు. తనచుట్టూ ఏదో పెద్దమార్పు ఉన్నట్టు గమనించసాగాడు. ఎంతో గొప్పగా కన్పిస్తునన భోజనశాలను పరిశీలించాడు. 'అవును, నిజమే' అన్నాడు విషాదంగా.

అతను ఉదయవేళలందు రాకూడదనిచెప్పింది నానా. మధ్యాహ్నం నాలుగు, ఆరు గంటలమధ్య రావచ్చు నన్నది. అతను ఆమెవంక దీనంగా, ప్రశ్నార్థకంగా చూచాడు. ఆ చూపుచూచినప్పుడు నానా హృదయం ద్రవించింది. ఒక లేతముద్దు అతని నుదుటిపై ఒత్తుగా ముద్రించింది.

'బాగుండు బాబూ, నాకు తోచినంతవరకు నే నెప్పుడూ మంచే చేస్తాను'.

కాని, తరువాత నానా పూర్వంలాగా లేదని అతను గ్రహించాడు. జార్జి ఎంతో మంచివాడని నానా ఉద్దేశం. అతను తనకు స్నేహితుడుగా ఉండాలి. అంతే. అతను రోజూ నాలుగుగంటలకు నానాఇంటికి వస్తాడు. ఎంతో దీనంగా ఒక మూల కూచుంటాడు. నానా అనుగ్రహించి అతన్ని చేరదీయాలి. పెంపుడుకుక్క రొట్టెముక్కలు తిన్నట్టు ఆమె స్నిగ్ధ సౌందర్య లవలేశాలను అతను ఆకాంక్షిస్తాడు. నానా పెంపుడు కుక్క బిజోలాగానే ఇంట్లో ఎంతో చనువుగా తిరుగుతాడు. ఆమె కొంగుపట్టుకుని తిరుగుతాడు.

తనకొడుకు మళ్ళీ నానావలలోపడ్డాడని మేడమ్ హూగన్‌కు తెలిసింది. ఆమె వెంటనే పారిస్‌కు వెళ్ళి తన పెద్దకొడుకు — లెఫ్టినెంట్ ఫిలిప్ సహాయంకోరింది. జార్జ్ తన అన్నను తప్పించుకొని తిరుగుతున్నాడు. తన అన్నతలుచుకుంటే ఎంత పనైనాచేస్తాడని అతనికి తెలుసు, ఒకరోజున

నానాతో, 'మా అమ్మ తనంతటతాను ఇక్కడికిరాదు. మా అన్నను పంప వచ్చు' అన్నాడు.

నానాకు కోపంవచ్చింది. 'ఎలావస్తాదో రానీ; వచ్చి ఏంచేస్తాదో చూస్తాను. ఫ్రాంసిస్ అతన్ని తగినవిధంగా పంపేస్తాడు' అన్నది. కొన్నాళ్ళ వరకూ ఎవరూ రాలేదు.

నానా, 'జిజీ, మీ అన్న రాలేదేం? వట్టి పిరికిపందలా ఉన్నాడే' అన్నది.

ఆ మరునాడు నానా జార్జ్‌తో ఒంటరిగా ఉన్నసమయంలో ఫ్రాంసిస్ వచ్చి, లెఫ్టినెంట్ ఫిలిప్‌ను ప్రవేశపెట్టవచ్చునా అని అడిగాడు. కుర్రవాడి ముఖం పాలిపోయినట్లయింది. 'నేను అనుకుంటూనే ఉన్నాను. ఈ ఉద యాన అమ్మతో మాట్లాడాను' అన్నాడు.

ఏదో పనిమీద ఉన్నాననిచెప్పి పంపించివెయ్యమని బతిమలాడ సాగాడు. నానా అప్పుడే లేచి, 'ఎందుకుపంపెయ్యాలి? నేనుభయస్థురాలి నను కుంటాడు. ఫ్రాంసిస్! అతన్ని ఒకపావుగంట డ్రాయింగ్‌రూమ్‌లో కూర్చో బెట్టి, తరువాత ప్రవేశపెట్టు' అన్నది.

నానా కూచోలేదు. ఆతురతతో అటూఇటూ తిరుగనారంభించింది. జార్జ్ భయంతో సోఫాలో పడుకునివున్నాడు. అతన్ని అశక్తత ఆవరించిన ట్లుంది. రాబోయేదృశ్యాన్ని ఊహించుకుని వణికిపోతూ పడుకున్నాడు. ఆమె అటూఇటూతిరుగుతూ, 'ఒకపావుగంట వేచివున్నాడంటే మనిషి పూర్తిగా చల్లారిపోయుడు. ఎవరో అనామకురాలిఇంటికి వచ్చానని దురభి ప్రాయం అతనికుంటే డ్రాయింగ్‌రూమ్ అతన్ని చకితుణ్ణిచెయ్యకపోదు' అన్నది.

పావుగంటకాగానే జార్జ్‌ని పంపివేసింది. తలుపుచాటునవుండి, వారు మాట్లాడుకునేది విననని అతనిచే ప్రమాణం తీసుకుంది. అలా వింటూంటే సేవకులు చూచేయెడల మర్యాదగావుండ దన్నది. జిజీ పడకగదిలోకి వెళుతూ 'మా అన్న -' అంటూ ఏదో అనబోయాడు.

'ఏం పరవాలేదు. అతను మర్యాదగావుంటే మర్యాదగానేవుంటాను' అన్నది నానా.

ఫ్రాంసిస్ ఫిలిప్‌ను లోపలికి ప్రవేశపెట్టాడు. ఫిలిప్ ఓవర్‌కోటు

వేసుకుని వున్నాడు. జార్జ్ మొట్టమొదట వారు మాట్లాడేది వినకుండా వుండాలని మెల్లని అడుగులతో పడకగదివద్దకు వెళ్ళాడు. కాని, వారి మాటలువిని, ఆగిపోయాడు. అతను భయంతో వణికిపోతున్నాడు. అతని కాళ్ళక్రిందభూమి క్రుంగిపోతున్నట్టుగావున్నది. పోటాట, చెంపదెబ్బలు, అరుపులు, కేకలు — ఎన్నో భయంకర విషయాలను ఊహిస్తున్నాడు అత నికి వారిమాటలు కొద్దికొద్దిగా విన్పిస్తున్నాయి, ఫిలిప్ మాటలలో, కుర్ర వాడు, కుటుంబం, పరువు ప్రతిష్ఠ ఇలాంటిమాటలు విన్పించాయి. తన ప్రియురాలు మండిపడుతుందేమోనని జార్జ్ భయపడసాగాడు. కాని అలాంటి పరుషవాక్యాలేమీ అతనికి వినిపించలేదు. నానా నోటినుంచి ఒక్క మాటకూడా వినిపించలేదు. నానా ప్రాణంలేనట్టుగా వున్నది. తన అన్న గొంతు మెల్లగా మృదువుగా విన్పిస్తోంది. అతనికేమీ అర్థంకాలేదు. చివ రకు అతనికొక శబ్దం విన్పించింది. ఆ శబ్దం అతనికి ఆశ్చర్యాన్ని కలిగిం చింది. అది నానా వెక్కివెక్కి ఏడుస్తున్న శబ్దం. ఒక క్షణంపాటు అత నిలో ఏవేవో విరుద్ధమైన వుద్రేకాలు సంఘర్షించసాగాయి. అక్కడినుంచి వారిముందుకు పరుగెత్తుకెళ్ళాలనిపించింది.

ఆక్షణంలోనే జో పడకగదిలోకివచ్చింది. అతను సిగ్గుతో ప్రక్కకు తొలిగాడు కాస్సేపైన తరువాత జో 'అమ్మగారితో మాట్లాడుతున్నది మీ అన్నగారేనా?' అని అడిగింది.

'అవును' అన్నాడు రుద్ధకంఠంతో.

'నీకు మనస్సులో కష్టంగావున్నదా? అని అడిగింది జో.

"అవును"

"ఏమీ దిగులుపెట్టుకోకండి. అమ్మగారు అన్నీ సర్దుబాటుచేస్తుంది"

అంతే, మళ్లీ వారు మాట్లాడుకోలేదు ఒకపావుగ టవరకు జో గది వదలి బైటకి వెళ్ళలేదు, జార్జి ప్రక్కచూపులతో డ్రాయింగ్ రూమ్‌వంక చూస్తున్నాడు. ఇంతసేపు వారిద్దరూ అక్కడ ఏంచేస్తున్నట్టు? బహుశా నానా ఇంకా విలపిస్తూవుండివుంటుంది. అతను ఆమెను చెంపదెబ్బకొట్టి వుంటాడు. జో గదిలోనుంచి వెళ్ళిపోగానే జార్జితలుపుదగ్గరకువెళ్ళి, చెవి యొగ్గి విన్నాడు. తన్నుతనే నమ్మలేకపోయాడు. ఏదో మృదువైన గుస గుసలు, చక్కిలిగింతపెట్టబడిన స్త్రీనవ్వూ విన్పించాయి. తరువాత ఏవో

మెత్తనిమాటలు చెబుతూ, నానా ఫిలిప్‌ను మెట్లవరకూ సాగనంపింది. తరువాత జార్జ్ వెళ్ళిమాతగా నానా నిలువుటద్దంవద్ద నిల్చునివున్నది. జార్జ్‌కి నానాను చూడగానే ఏం మాట్లాడాలో తోచలేదు. 'ఏంజరిగింది?' అని అడిగాడు.

'ఏం జరుగుతుంది?' అన్నది నానా వెనుదిరగకుండా అలాగే అద్దంలో చూచుకుంటూ—'ఏం అబ్బాయ్, మీ అన్నయ్య మహా గడుసు పిండమని చెప్పావే—అతను చాలా మంచివాడే' అన్నది.

'అయితే అంతా సర్దుబాటు అయిందన్నమాట' అన్నాడు జార్జ్.

'ఆఁ అంతా సర్దుబాటు అయినట్టే. మేము రక్కుకుని పీక్కుంటా మనుకున్నావా ఏమిటి?'

జార్జ్‌కి ఇంకా అర్థంకాలేదు. 'నువు ఏడుస్తున్నట్టుగా విన్పించిందే' అన్నాడు.

'నేనా? ఏడవడం!' అన్నది నానా అతనికళ్ళలోకి సూటిగా చూస్తూ 'నువు కలలుకంటున్నావా? నాకు ఏడ్వవలసిన అవసరం ఏము న్నది?' జార్జ్ మరీ గాభరాపడ్డాడు. తరువాత నానా ఇలా చెప్పింది. 'మీ అన్నయ్య నన్ను వెంటనే అర్థంచేసుకోగలిగాడు నేను సామాన్యమైన తక్కువ కుటుంబంలో పుట్టిన స్త్రీనే కావచ్చు మీ కుటుంబం పరువు ప్రతిష్ఠలు నిలబెట్టడానికై అతను జోక్యంకలిగించుకొని ఉండవచ్చు. కాని ఒక్క చూపుతో అతను అందరులౌకికుల్లాగానే ప్రవర్తించాడు. కాబట్టి నువ్వేమీ గాభరాపడక్కర్లేదు. అన్నీ సర్దుబాటుచేశాడు అతను మీ తల్లికి నచ్చ జెపుతాడు' అనిచెప్పి నానా నవ్వుతూ "అదీకాక నీ అన్నను ఆహ్వానించాను. అతను మళ్ళీ వస్తాడు" అన్నది.

"అయితే మళ్ళీ వస్తాడన్నమాట" అన్నాడు ఆకుర్రాడు ఆశ్చర్యంగా.

అంతే. అంతటితో ఆ సంభాషణ సమాప్తమైంది తరువాత ఇద్దరూ ఫిలిప్‌నుగురించి మాట్లాడుకోలేదు. ఆమె బైటికివెళ్ళాలని ముస్తాబవుతోంది. అతను తన విశాలమైన విషాదపూరితనయనాలతో ఆమెను చూడసాగాడు. ఈ విషయం ఇంతసులభంగా సర్దుబాటుకావడం అతనికి ప్రీతికరంగానే ఉన్నది. ఆ కుర్రాడు మృత్యువునైనా వరించగలడు కాని, నానా వియోగాన్ని భరించలేడు. అతని హృదయంలోమాత్రం ఒక అవ్యక్తవేదన

పెలవేస్తూలేఉన్నది ఏదో బాధ అతన్ని వేధిస్తోంది. ఆ బాధను వెలిబుచ్చే ధైర్యంఅతనికిలేదు. ఫిలిప్ తనతల్లి మనస్సును ఎలా చల్లబరిచాడో అతను అర్థంచేసుకోలేకపోయాడు. మూడురోజుల తరువాత ఆమె లెఫాండెటీకి గప్‌చిప్‌గా వెళ్ళిపోయింది. ఆ రాత్రే ఫిలిప్ నానా ఇంటికి వచ్చాడు. జార్జ్ అన్నముందు చాలా బిడియపడ్డాడు. చిన్నతనంనుంచీ జార్జ్ అన్ననుచూస్తే తండ్రిని చూచినట్టు భయపడేవాడు. నానాతో అతను పెద్దగా నవ్వుతూ కేరింతలుకొడుతూ చనువుగా ఉండడం చూచి, జార్జి మరీ కుంచించుకు పోయాడు. ఆనాటినుంచి ప్రతినిత్యం అతని అన్న నానా ఇంటికి రాసా గాడు. ఆవిధంగా రానురాను జార్జికి బిడియం తగ్గిపోయింది.

నానా ఆనందంతో వెలిగిపోతోంది. ఇది గొప్ప వేశ్యాంగన జీవితం లోని అంతిమపరివర్తన. ఈ అంతిమాధ్యాయంలో నానా గృహంలో ఆనందదేవత వేలగజ్జెలతో కిణకిణమని నిత్యం నృత్యంచేస్తోంది.

ఒకనాటి మధ్యాహ్నం కౌంట్‌ముఫత్ అకాలంలో నానాగృహానికి వచ్చాడు. అమ్మగారు ఎవరోస్నేహితులతో మాట్లాడుతోందని చెప్పింది జో. అంచేత కౌంట్ తిరిగివెళ్ళాడు. అతను సాయంత్రం మళ్ళీ తిరిగిరా గానే నానా అతన్ని ముభావంగా ఆహ్వానించింది ఆమె నతడు అవ మానించినట్టు భావించసాగింది. 'అయ్యా! మీరు నన్నెందుకు అవమానిం చారో నాకు అర్థంకావడంలేదు. నేను ఇంట్లోఉన్నప్పుడు మీరు అందరి లాగానే రావచ్చునని మీరు గ్రహించాలి' అన్నది బింకంగా.

కౌంట్ నోరుతెరచుకొని విస్తుపోయి నిల్చున్నాడు. ఏదో చెప్ప బోయాడు కాని, అంతలో నానా అడ్డుతగిలి 'మీ రేల తిరిగివెళ్ళారో నాకు అర్థంకావడంలేదు. నా స్నేహితుడున్నాడని కాబోలు! వారితో నేను ఏంచేస్తున్నాననుకున్నారో! మీ ప్రవర్తనవల్ల నాకు కలిగేఫలితం అప ఖ్యాతిమాత్రమే' అన్నది.

అతను ఆమెక్షమాపణ పొందేసరికి తలప్రాణం తోకకొచ్చింది. కొన్నాళ్ళనుంచి జార్జి తనకు వినోదాన్ని చేకూర్చేకుర్రవాడని చెబుతోంది నానా. ఫిలిప్, జార్జి, కౌంట్ అందరూకలిసే భోంచేస్తున్నారు. భోజనా నంతరం కౌంట్ ఆ కుర్రవాణ్ణి ఒక పక్కకు తీసుకెళ్ళి వాళ్ళతల్లియొక్క క్షేమసమాచారాలు అడిగేవాడు. హ్యూగన్, వాండ్రెవె, కౌంట్, అందరూ

వచ్చిపోతున్నారు. కౌంట్ ఒక్కడుమాత్రం నిర్ణీత సమయాల్లోనే వస్తు న్నాడు. ఒక్కొక్కసారి అపరిచితవ్యక్తిలాగా అ టీఅంటనట్లు ప్రవర్తిస్తు న్నాడు. ఒకరాత్రి నానా తెల్లపలుగుబంటు చర్మాలమీద కూచుని, సాక్స్ విప్పుతూండగా అతను చనువుగా మాట్లాడుతున్నాడు. ముఖ్యంగా ఫిలిప్ను గురించి మాట్లాడుతున్నాడు.

"నువు చెప్పేది నిజమే. వాళ్ళందరూ చాలా మంచివారు. నే నెవరో వాళ్ళకు బాగా తెలుసు. వారు ఒక్కనిమిషం వళ్ళుమరిచి ప్రవర్తిం చినా బైటికి గెంటించేదాన్ని" అన్నది నానా.

ఇన్ని భోగభాగ్యాలు, ఇంత విశాలభవనం ఉన్నప్పటికీ నానాకు మనశ్శాంతిలేదు. జీవితం శూన్యంగా నిర్జీవంగా కనుపిస్తోంది.

రాత్రి ఒక్కక్షణంకూడా బీరుపోకుండా ఆమెప్రక్కన పురుషు లామెను అంటిపెట్టుకొని వుంటున్నారు. ఎటుచూచినా ధనం రాసులు రాసులుగా కనుపిస్తోంది. డ్రెసింగ్ టేబిల్ పైన, డ్రాయిర్లలోకూడా నోట్లు బొత్తులుగా ఉంటున్నై కాని ఇవేమీ నానాకు సుఖాన్ని, శాంతిని, స్థిమితాన్ని చేకూర్చలేదు. ఎక్కడో ఏదో శూన్యత్వం గోచరించసాగింది. జీవితం అగమ్యంగావెళ్ళే బండిచక్రంలా పరిభ్రమిస్తోంది. ప్రతిరోజూ అదే ఉదయం, అదే సాయంత్రం, అవే గంటలు, అవే నిమిషాలు,అవేసెకండ్లు- అర్థంలేకుండా దొర్లిపోతున్నాయి. నానా ఒక పక్షిలా—పక్షి ఎలా తిని, మొదటదొరికిన కొమ్మపై నిద్రిస్తుందో—అలాగేనివసించసాగింది.ఇప్పుడు అన్న - వసనాలకు లోటులేదు. వాటికోసం ప్రయత్నం చెయ్యవలసిన అగత్యంలేదు ఈభావన పగలంతా ఆమెమనస్సును ఆవరించివుండేది ఆమె ఒక విధమైన మానసిక సోమరితనానికి కాన్వెంట్లో సన్యాసినిలా లొంగి పోయింది. ఎప్పుడు ఎక్కడికి వెళ్ళవలసి వచ్చినా బండిలోనే వెళ్ళేది. అందుచే ఆమెకు తన కాళ్ళ అవసరమే కనుపించలేదు. తన చిన్ననాటి వినోదాలను మళ్లీ ప్రారంభించింది. అస్తమానం తన పెంపుడుకుక్క బిజోను ముద్దాడుతూ కూచునేది ఈవిధంగా తన్నుతాను ఒక శూన్యంలో వదిలేసింది. నానాను ఎక్కువగా ఆందోళనపరిచింది ఒక్కటే. అది ఆమె సౌందర్యం. సౌందర్యం! తన శరీరం-పూవులాంటి తనశరీరం- ఏనాటికైనా వాడిపోతుందనే భయం! ఎప్పుడూ అద్దంలో తన్నుతాను పరీక్షించుకుంటూ

ఉండేది. ఎప్పుడూ సుగంధద్రవ్యాలతో తన శరీరాన్ని పరిరక్షించుకునేది — ఏ క్షణాన్నయినా ఎవరిముందైనా — విర్భీతిగా — విస్సంకోచంగా — నగ్న మూర్తిగా నిలబడగలగడానికి.

ప్రతి ఉదయం పదిగంటలకు నిద్రలేచేది నానా. బిజో ఆమె నుదుటిని తన నాలుకతో నాకి, ఆమెను మేల్కొలిపేది. నానా నిద్రలేవగానే ప్రక్కమీదవుండే, పెంపుడుకుక్కతో కాస్సేపు ఆడుకునేది. అప్పుడప్పుడు కౌంట్ మీదికికూడా దూకేది ఆ కుక్క. కౌంటుకు మొట్టమొదట అసూయ కలిగింది ఆ కుక్కపైనే. పదకొండు గంటలయ్యేసరికి ఫ్రాంసిస్‌వచ్చి ఆమెకేశాలంకరణ పూర్తిచేసేవాడు. అది సాయంత్ర చేసుకునే క్లిష్టకేశాలంకరణకు నాందిమాత్రమే. ఎవరో ఒకరు తోడులేకుండా చేసేదికాదు. మధ్యాహ్నంపూట 'ఫిగారో' పత్రిక చదివేది. అప్పుడప్పుడూ తనకు సాహిత్యంలోకూడా అభిరుచివున్నదని తెలియచెయ్యడానికై ఏదైనా నవల తెరిచేది. 5 గంటలవరకు ముస్తాబయ్యేది. తరువాత దీర్ఘనిద్రనుంచి కొంచెం చలనం పొందినట్టు కన్పించి, ఇతర కార్యక్రమాలకు పూనుకునేదికాదు.

అప్పుడప్పుడూ వెళ్ళి, చిన్నలూయీని చూడాలనుకునేది. ఉండి ఉండి కొడుకునుచూడాలనే వెర్రి ఆవేశం నానాను ఆవరించేది, వెంటనే కాలినడకను వెళ్ళి మాతృమూర్తిలా లూయీనిచూచేది. సాధారణంగా ఆది వారాన్ని తన కుటుంబంకోసం ప్రత్యేకించుకున్నది.

ఆరోజున ముఫత్ ఎక్కడికైనా వెడదామన్నా నానా నిరాకరిస్తూ, ఇల్లాలిలా ముగ్ధమోహనమైన చిరునవ్వు నవ్వేది, ఆనాడు తన పినతల్లిగారింటికివెళ్ళి భోజనంచేసి, తనబిడ్డను చూచివచ్చేది.

చిన్నలూయీకి ఎప్పుడూ ఏదో రుగ్మత. వాడి కిప్పుడు మూడు సంవత్సరాలవయస్సు, అతన్ని చూచినప్పుడల్లా నానాహృదయం వేగంగా కొట్టుకునేది. తల్లియైన తను ఇంతసుఖంగావుండడం-వాడు ఎప్పుడూ ఏదో రుగ్మతతో అవస్తపడుతూండడం నానాకు భయక్లేశ దుఃఖాలను కలిగించేది. బిడ్డ తనమనస్సును ఆకర్షించనిరోజుల్లో నానా తనజీవితపు రొదలో పడిపోయేది. విందులు విలాసాలు, థియేటర్లు,డాన్సులు, ఆమెను ఉక్కిరిబిక్కిరి చేసేవి. తనలో అవ్యక్తంగా పేరుకుంటున్న శూన్యత్వాన్ని ఆమె జయించలేకుండాఉన్నది. ఆ శూన్యత్వం ఆమెలో అంతులేని వేదనను రగు

ల్కొల్పుతోంది. ప్రతిక్షణం ఏదోఒక ఉద్విగ్నానందంలో ఆమె మునిగి ఉన్నప్పటికీ నానా ఎంతో అలసటతో కుంగిపోతున్నది. ఒక్కక్షణం ఏకాంతంగాఉన్నా ఆమె భరించగలిగేదికాదు. ఆమె నేదో విషాదం ఆవరించేది తనలోని శూన్యత్వమే ఆమెకు జ్ఞాపకంవచ్చేది. తనసమాజంలోని నిస్సారతే ఆమెకు గోచరించేది. తనజీవితాన్నంతా ఈక్రింది ఒక్కమాటలో వ్యక్తీకరించేది నానా-'ఈ పురుషులు-అబ్బ! వీళ్ళు నన్నెంత విసుకెత్తిస్తున్నారు!' అనుకునేది.

ఒకనాటి మధ్యాహ్నం నానా ఇంటికి తిరిగివస్తూండగా ఒక స్త్రీ తటస్థపడింది. అరిగిపోయినబూట్లు, మాసిన గౌను, వానలోతడిసి, ఎండలో ఎండి వస్తున్నట్టుగా ఉన్న ఆ స్త్రీని నానా హఠాత్తుగా గుర్తుపట్టింది.

'చార్లెస్, బండిఆపు' అన్నది. 'సాటిన్!' అని ఆ స్త్రీని పిలిచింది.

దారినిపోయేవారు ఆగి ఈ దృశ్యాన్ని చూచారు. వీధివీధంతా కట్టడిపోయింది. సాటిన్ బండిదగ్గరకు వచ్చింది. బండిచక్రాలబురద సాటిన్ గుడ్డలను మరింత మలినపరిచింది.

'ఎక్కు త్వరగా లోపలికి' అన్నది నానా ప్రశాంతంగా—ప్రపంచం తననుగురించి ఏమనుకున్నా తృణప్రాయంగా పరిగణిస్తూ. ఈ విధంగా తళతళ మెరిసిపోతున్న తనబండిలో సాటిన్‌నుఎక్కించుకుని వెళ్ళింది.

ఆనాటినుంచి అహర్నిశలు, నానా సాటిన్‌తోనే గడిపేది. సాటిన్ తన కష్టభాజనమైనజీవితంలోని వివిధఘట్టాలను నానాకు చెప్పేది. నానా ఎంతో ఆసక్తితో, ఆదరంతో వినేది. నానా భవనంలో మూడురోజుల పాటు కమ్మగా భోంచేసి, పరిశుభ్రమైన బట్టలు ధరించి, పోలీసులు తనకెలాంటి ఉపద్రవాలు కలిగించారో—మరేయే కష్టాలు అనుభవించిందో సాటిన్ నానాకు పూసగుచ్చినట్టు చెప్పింది. నానా కోపోద్రిక్తురాలై, సాటిన్‌ను ఓదార్చి, ఆ రొంపినుంచి సాటిన్‌ను ఏవిధంగానైనా తప్పిస్తానని ప్రమాణంచేసింది. అవసరమైతే పోలీస్‌మంత్రినైనా కలుసుకుంటానన్నది. పూర్వం ఎంతకూ జరుగని దీర్ఘమైన మధ్యాహ్నాలు ఇప్పుడు యిట్టే గడిచిపోతున్నాయి. నాలుగోనాడుఉదయం సాటిన్ ఎవరికీ చెప్పకుండానే అదృశ్యమయింది. సాటిన్‌కూ పేవ్‌మెంట్లకూ జన్మతః అవినాభావ సంబధం ఉంది.

ఆ నాడు నానా పెద్దతుఫానురేపింది. సేవకులందరూ జవాబుచెప్ప లేక తలలు వాల్చుకున్నారు. ఫ్రాన్సిస్ ద్వారంవద్ద నిల్చోనందుకు నానా అతనిపై మండిపడింది. సాటిన్‌ను బజారుముండ అని తూలనాడింది. ఇక ముందు అలాంటివారికి శరణ్యమివ్వడంవల్ల లాభంలేదని పాఠం నేర్చు కున్నానన్నది.

ఆ మధ్యాహ్నమంతా నానా గదిలోకూచుని వెక్కి-వెక్కి-ఏడ్చింది. ఆ సాయంత్రం బండిలో 'లా రె'కు వెళ్ళింది. సాటిన్ 'రూదిమార్టిర్' వద్ద డైనింగ్‌హోటల్‌లో ఉండవచ్చుననుకుంది నానా. సాటిన్‌ను మళ్ళీ తీసు కుని రాదలచుకోలేదు. ముఖంమిదకొట్టి, చక్కా-వద్దామనుకున్నది నానా వెళ్ళి చూచేసరికి సాటిన్ మేడమ్ రాబర్ట్‌తోకలిసి ఒక చిన్నటేబిల్‌వద్ద కూచుని, భోంచేస్తోంది. నానా కన్పించగానే నవ్వింది. ఆనవ్వు నానాహృద యానికి శూలంలా నాటింది. కాని, నానా వెంటనే బైటపడిపోలేదు. శాంతంగా ఊరుకున్నది. అక్కడున్న స్త్రీలందరికి షాంపేన్ పోయించి, సాటిన్‌నుతీసుకెళ్ళి బండిలో కూచోబెట్టుకుని 'ఈ మాటు తప్పించుకుపోతే చంపేస్తాను జాగ్రత!' అని బెదిరించింది.

కాని సాటిన్ మళ్ళీ తప్పించుకుపోయింది. ప్రతిసారీ నానా వెళ్ళి తీసుకురావడం, సాటిన్ తప్పించుకుపోవడం జరుగుతున్నది. మోసగింప బడినస్త్రీ ఉద్రిక్తురాలయినట్టు నానా ఉద్రిక్తురాలుకావడం, సాటిన్‌ను- ఈ మహాభవనంలో భోగభాగ్యాలతో సరిపెట్టుకోలేని ఒక బజారుపిల్లను వెదకడానికి వెళ్ళడం - ఇవైసార్లకుపైగా జరిగింది. సాటిన్ ఇలా మాటి మాటికి వెళ్ళిపోడానికి మేడమ్ రాబర్ట్ కారణమనుకున్నది నానా.

ఒకరోజున మేడమ్ రాబర్ట్‌ముఖాన్ని చీరేస్తా నన్నది నానా. ఈ మాటు ఎప్పుడువెళ్ళినా, తన వజ్ర-వైఢూర్యాలన్నీ ధరించి వెళ్ళేది నానా. తనతోపాటు తనపరివారాన్నంతా తీసుకెళ్ళేది. ఇంతగొడవ జరుగు తున్నా సాటిన్‌మాత్రం ప్రశాంతంగా ఉండేది. నీలికళ్ళు, కన్నెముఖం- ఎంతో నిశ్చలంగా ఉండేది నానా సాటిన్‌కు పెద్దపెద్దబహూమతులిచ్చేది. అదిచూచి మేడమ్ రాబర్ట్ మాత్సర్యంతో నానా ప్రేమికులకు కొన్ని పేరు లేనిలేఖలు వ్రాసింది.

ఇటీవల కొన్నాళ్ళనుంచి కౌంట్ ముఫత్‌కు మనస్సు బాగుండడం

లేదు. ఒకరోజున నానాకు ఒక లేఖ చూపాడు. ఆలేఖలో నానా ఇతరులతో ప్రేమకలాపం సాగిస్తున్నదని ఉంది.

"అంతా అబద్ధం! శుద్ధ అబద్ధం!' అన్నది నానా ఉద్రిక్తురాలై.

"నువు ప్రమాణం చేస్తావా?' అన్నాడు ముఫత్ కొంచెంతెరపినపడి.

"ఎవరిమీద ప్రమాణంచెయ్యమన్నా చేస్తాను. నా కొడుకుమీద ఒట్టేసుకోమన్నా సరే' అన్నది నానా.

ఆ ఉత్తరంలో సాటిన్ అనే నీచస్త్రీతో ఆమెకుగల పరిచయాన్ని గురించికూడా వ్రాసిఉన్నది. నానా లేఖను కడపటివరకు చదివి, 'ఇప్పుడర్థమైంది- ఈలేఖ ఎవరు వ్రాశారో!' అన్నది.

ఉత్తరంలోని చివరభాగాన్నిగురించి ఏమంటావని ముఫత్ అడిగితే 'ఆ విషయం మీకు అనవసరం' అన్నది.

ముఫత్ మరీ ఎక్కువగా గొణుగుతూండడంచూచి, నానాకు విసుగెత్తి 'ప్రియమిత్రమా! ఒక్కటే పరిష్కారమార్గం ఉంది. ఆ తలుపువంక చూడు; అవి తెరచిఉన్నాయి. నేను ఎలావున్నానో అలాగే నన్ను పరిగ్రహించు. లేదా నన్ను వదిలేసి వెళ్లు' అన్నది.

కౌంట్ తల వంచుకున్నాడు. ఆనాటినుంచి సాటిన్ ఆ గృహంలో ఒక సభ్యురాలైపోయింది. అందరూ ఆమెను తమతో సమాన హోదాగల స్త్రీవలె చూడసాగారు. జార్జ్, ఫిలిప్ ఎంతో చనువుగా ఉండేవారు.

ఒకరాత్రి నానా 'రూ డి మార్టిర్'కు భోంచెయ్యడానికి వెళ్ళింది. ఆమె భోంచేస్తూవుండగా అక్కడికి డానెట్ వచ్చాడు. ఇప్పు డతను జీవితంలో స్థిరపడినప్పటికీ—తన పాత దురలవాట్లను మరచిపోలేక, అక్కడికి వస్తున్నాడు.

పారిస్‌నగరంలోని కశ్మలమంతా పేరుకున్న అమారుమూలహోటల్లో పరిచితుల ముఖాలేవీ కనుపించవని అతను అక్కడికివస్తాడు. నానానుచూడగానే అతను కొంచెం గాభరాపడ్డాడు. కాని, పైకి బింకంగా చిరునవ్వు నవ్వాడు. నానా భోజనం చేస్తున్న టేబిల్ వద్ద కూచుని, భోజనం చెయ్యవచ్చునా అని అడిగాడు. అతను పరిహాసానికి దిగాడని గ్రహించి, నానా గంభీరంగా ముక్తసరిగా 'తమకు ఎక్కడ అనువుగా వుంటే అక్కడే కూచోండి. ఇది పబ్లికు హోటలు' అన్నది.

ఈ విధంగా ప్రారంభించిన సంభాషణ రాను రాను గమ్మత్తుగా తయారైంది. నానా టేబిల్‌మీద మోచేతులుంచి, 'సరేకాని, అబ్బాయీ — నీపెళ్ళి — ఏమైంది?' అని అడిగింది.

'జరిగేటట్టు లేదు' అన్నాడు డానెట్.

నానా గడ్డంకింద చెయ్యి పెట్టుకుని, పెదవులపై చిరునవ్వు చిందులాడిస్తూ మిలమిలలాడే కండ్లతో అతనికేసి సూటిగా చూస్తూ 'అయితే నేను లంజనన్నమాట! నా గుప్పిట్లోనుంచి నీకు కానున్న మామగారిని వదిలించాలన్నమాట! నన్ను పూజించి ప్రతి చిన్న విషయం నాతో చెప్పే వ్యక్తితో నీ వెన్ని పాడుకూతలు కూశావో నాకు తెలుసు. కాని, నామాట విను; నేను తలుచుకుంటే నీ పెళ్ళి చేయించగలను' అన్నది.

తరువాత కొద్దినిమిషాలపాటు నానా చెప్పినది నిజమేననే అభిప్రాయానికి వచ్చాడు డానెట్. ఆవిషయమంతా నానా చేతుల్లో వదలిపెట్టి, నానాకు పూర్తిగా లోంగిపోదామనుకున్నాడు. కాని, చమత్కారం మానలేదు. భోజనం ముగించిన తరువాత 'నాకు మేడమ్ ఈస్టలీకి నివాహంచెయ్యి' అన్నాడు పెద్దమనిషి తరహాగా. నానా చక్కలిగింత పెట్టినట్టు నవ్వింది.

డానెట్‌మీద కోపం తెచ్చుకోవడం ఎలాంటి స్త్రీకైనా అసాధ్యం. స్త్రీలముందు అతను విజయవంతుడు కావడానికి కారణం మృదువైన కంఠస్వరమే. అతని స్వరంలో శ్రావ్యమైన స్వచ్ఛత, మాధుర్యం వున్నాయి. అందుకనే అనేకమందిస్త్రీలు అతనికి 'వెల్వెట్ గొంతుక' అని నామకరణం చేశారు. అతని శక్తి అతనికి తెలుసు. అందుకనే నానాను తనమాటలతో జోకొట్టాడు.

టేబిల్‌వద్దను౦చిభోజనంముగించి లేవగానే,నానా అప్పుడేవికసించిన గులాబీపూవల్లే తయారైంది. వణుకుతున్న హస్తాలు అతని భుజంమీదవేసి నడవసాగింది. ఆ రోజున చాలా చల్లగావుంది. అందుకని నానా తనబండిని ఇంటికి పంపేసి, కాలి నడకనే డానెట్ ఇంటికి వెళ్ళి రెండు గంటలసేపు మాట్లాడుతూ కూచుంది. మాటలు ముగిసినతరువాత లేచి బయల్దేరుతూ, 'అయితే', 'మీమీ, ఈ పెళ్ళి జరిగితీరాలంటావు?' అన్నది.

'నేను అంతకంటె చెయ్యగల ఘనకార్యం ఏమీలేదు' అన్నాడు డానెట్.

తరువాత ఒకక్షణం మౌనంగాఊరుకుని, 'సరే, నా కిష్టమే-నీకు తప్పకుండా సహాయంచేస్తాను' అని పెద్దగానవ్వింది నానా. ఆమెవక్షస్థలం ఇంకా అనాచ్ఛాదితంగానే వున్నది.

'నీకు పెళ్ళిచేస్తే ఏమిస్తావో చెప్పు?' అన్నది నానా.

అతను ఆమెను కౌగిలించుకుని, ఆమెజబ్బలు ముద్దుపెట్టుకున్నాడు. నానా వెనక్కు ఒరిగింది.

ఆ మరునాడు నానా గృహంలో డిన్నర్‌పార్టీ జరిగింది. ముఫత్, వాండెవ్రె, ఫ్యూగన్, సాటిన్ -- అందరూ సమావేశమైనారు. ఆరోజున కౌంట్ పెందరాళేవచ్చాడు. నానాకు 80 వేల ఫ్రాంకులు అప్పున్నది. ఆ అప్పుతీర్చాలి. అంతేకాక రెండు మణులు కావాలని ఎన్నాళ్ళనుంచో అడుగుతోంది. అవి కొనాలి. కౌంట్ ఆస్తిలో ఇప్పటికే చాలభాగం ఖర్చయింది. తన ఎస్టేట్లు అమ్మడానికి ఇష్టంలేక ఒకషరాబును కలుసుకుందామనుకున్నాడు. నానా సలహానుసరించి లాబోర్డెటీని పంపుదామనుకున్నాడు. లాబోర్డెటీ ఈ వ్యవహారం తనతలకుమించినపని అని తెలుసుకుని ఫ్రాంసిస్ చేతుల్లో వదిలిపెట్టాడు. కౌంట్ తనపేరు బైటికితీసుకురావద్దని చెప్పి, అన్ని విషయాలు వాళ్ళనే చూచుకోమన్నాడు. ముఫత్ లోనికి వచ్చేప్పటికి ఫ్రాంసిస్ నానా తలకట్టు ముగిస్తున్నాడు. లాబోర్డెటీ కూడా డ్రెసింగ్‌రూమ్‌లో ఉన్నాడు. కౌంట్‌ను చూడగానే ఒక పెద్ద నోట్లకట్ట టేబిల్‌మీద పెట్టాడు. నానా అతన్ని డిన్నర్‌కు ఉండమన్నది. కాని, ఒక శ్రీమంతుడైన విదేశీయునికి పారిస్‌నగరం చూపెట్టవలసి ఉండుటచే వీల్లేదన్నాడు. తరువాత ఒక అరగంటలో కౌంట్‌కు మణులపెట్టె అందించబడింది.

భోజనసమయంలో నానా అదోవిధంగా ఉన్నది. 80 వేల ఫ్రాంకులు వ్యాపారస్థులకు ఇచ్చివెయ్యడమంటే నానాకు ఎంతో కష్టమనిపించింది. స్వర్గభవనంలా మెరిసిపోతున్న ఆ హాల్లో భోజనంచేస్తూ నానా పేదరికంలో ఉండే సౌందర్యాన్ని ప్రస్తుతించనారంభించింది. పురుషు లందరూ సాయం త్రపుదుస్తులు ధరించిఉన్నారు. నానా తెల్లని సాటిన్‌గౌను వేసుకున్నది. సాటిన్ నల్లని సిల్కుగౌనులో వినయంగా కూచున్నది. మెడలో ఒక స్నేహితురాలు బహూకరించిన బంగారుబిళ్ళ అలంకరించుకున్నది.

"పేదరికంలోనే ఎంతో హాయి ఉన్నది" అన్నది నానా.

కుడిప్రక్కన ముఫత్, ఎడమప్రక్క వాండెవ్రెకూచుని ఉన్నారు. సాటిన్‌తో 'మనం చిన్నతనంలో బళ్ళోకివెళ్ళేరోజుల్లో ఎంత హాయిగా నవ్వుకునేవాళ్ళం!' అన్నది. ఇద్దరూ చిన్ననాటిస్మృతులు జ్ఞాపకం తెచ్చుకున్నారు. తన యౌవనకేళీ-విలాసాలుకూడా జ్ఞాపకం తెచ్చుకున్నారు.

'నీకు విక్టర్ జ్ఞాపకం ఉన్నాడుకదూ? అతను వట్టి గడుగ్గాయి. ఆడపిల్లలను చీకటిగదుల్లోకి లాక్కెళ్ళేవాడు!' అన్నది నానా.

'అవును. నాకూజ్ఞాపకంఉంది' అని, 'మీ ఇంటిముందు ఒక ద్వారపాలకురాలు ఉండేది, ఎవరూ?' అని అడిగింది సాటిన్.

'బోషే. ఆమె చనిపోయింది.'

'నా కిప్పటికీ జ్ఞాపకంఉంది. మీ అమ్మ-అబ్బ!-ఎంత లావుగా ఉండేది! ఒకనాటిరాత్రి మనం ఆడుకుంటున్నాం. మీ నాన్న తాగివచ్చాడు. అబ్బ! ఎంత తప్పతాగి వచ్చాడు!' అన్నది సాటిన్ మళ్లీ.

'అవును. మా నాన్న వట్టి వెర్రిబాగులమనిషి. అబ్బ! ఎంత ఘోరం! నేను అన్ని రకాలజీవితాన్ని చూచాను' అన్నది నానా.

ముఫత్ ఈ సందర్భంలో జోక్యంకలిగించుకుని, 'మీరు మాట్లాడుతున్నది అంత వినోదకరమైనవిషయంకాదు' అన్నాడు.

'కాదూ?' అని అతనివంక చురచుర చూచి 'కాకపోవచ్చు. నేను స్వచ్ఛమైన హృదయంగల స్త్రీని. నేను నాలోఉన్నదంతా బైటకి చెప్పేస్తాను. మా అమ్మ బట్టలుతికేవృత్తిలో వుండేది మా నాన్న త్రాగుబోతు. త్రాగుడుతోనే చనిపోయాడు. నీకు ఈ విషయాలు పడకపోతే-నా కుటుంబం నీ మర్యాదకు భంగంకలిగిస్తే-'అన్నది నానా.

అందరూ ఆమెకుటుంబాన్ని ఎంతో గౌరవిస్తున్నా మన్నారు. కాని, నానా ఊరుకోలేదు, 'నా కుటుంబం నీ మర్యాదకు, నీ అంతస్తుకు భంగం కలిగిస్తే నన్ను వదలపెట్టి వెళ్ళు. నేను తల్లి - దండ్రులను కాదనే స్త్రీని కాను. నన్ను గౌరవిస్తే వారినీ గౌరవించాలి. అర్థమైందా?' అన్నది నానా.

ఆమె చెప్పేవాటికన్నిటికీ వారు అంగీకరించారు. అందరూ తలలు వంచుకుని ఆమెముందు చాలా తక్కువ అంతస్తుగలవారిలా కూచున్నారు ఆమె తననిరంకుశత్వంతో తనకాలిక్రింద వారిని అణిచివేసింది, వారామెకు

పెద్ద పెద్దఆస్తులు ఇవ్వవచ్చు. ఆమెను పెద్దభవనాలలో ఉంచవచ్చు. కాని, ఆమె తనచిన్ననాటి జీవితాన్ని మరచిపోలేదు. 'డబ్బు! డబ్బు! డబ్బు! వెధవడబ్బు! అన్నది నానాడబ్బు చూచేవారి మనస్తత్వం నీచమైన వ్యాపారస్తుల మనస్తత్వం అన్నది. సుఖంగా శాంతంగా నిరాడంబరంగా జీవించడమే మంచిదన్నది. ఇలా అని జూలియస్‌నుచూచి, 'షాంపేన్ పొయ్యవేం?' అన్నది. నానాగ్లాసులో షాంపేన్ పోయబడింది. ఆమె షాంపేన్ చప్పరించింది. ఫ్రాన్సిస్ యాపిల్‌ప్లేటు అందించబోగా కొన్నిపండ్లు క్రింద పడ్డాయి. 'స్టుపిడ్! ఫూల్!' అని అరిచింది నానా.

పళ్ళెంలో పండ్లు సరిగాఉంచలేదని ఏదోచెప్పబోయాడు ఫ్రాన్సిస్.

"అయితే నువుకాదు ఫూల్, జోయేఫూల్" అన్నది నానా మళ్ళీ.

"అమ్మగారూ —" అన్నది జో బాధగా.

తరువాత నానా లేచి సామ్రాజ్ఞిలా 'ఇక చాలు. అందరూ వెళ్ళిపొండి. ఇక మీతో అవసరంలేదు' అన్నది.

తరువాత నానా చల్లబడింది సాటిన్ యాపిల్ తింటూ నానా వెనకాల నిలబడి, ఆమె చెవిలో గుసగుసలాడడం ప్రారంభించింది. అందరూ అదోలా చూచారు ఆమెవంక. అందుకని సిగ్గుపడి దూరంగావెళ్ళిపోతే జార్జ్ వెళ్ళి సాటిన్‌ను తీసుకొచ్చి కుర్చోబెట్టాడు.

"ఓసేయ్ పిచ్చిపిల్లా! ఎందుకే అలా సిగ్గుపడతావు? వీళ్ళను లెక్క చెయ్యకే" అన్నది నానా తరువాత ఎవరూమాట్లాడలేదు.

ఈ పెద్దమనుష్యులమధ్య, ఈ గొప్పగొప్ప కుటుంబీకులమధ్య ఆ ఇద్దరు స్త్రీలూ ఒకరివైపు మరొకరు పురుషజాతిపై పగతీర్చుకుంటున్నట్టుగా చూస్తూ కూచున్నారు.

కాఫీసమయానికి మేడమీదికి వెళ్ళారు. రెండు పెద్దలాంతర్లు వెలుగుతున్నాయి. ఆ లాంతర్ల వెలుతురు గులాబిరంగు తెరలలోనుంచి వస్తూ, అదో వింతసోయగాన్నిస్తోంది. గది వెచ్చగాఉంది. అది నానా ప్రైవేటుగది. ఆమె చేరుమాలు, పుస్తకాలు అక్కడక్కడ పడిఉన్నాయి.

సాటిన్ వెళ్ళి ఒక సోఫామీద పడుకుని సిగరెట్ వెలిగించింది. ఫిలిప్, జార్జి అక్కడికివచ్చి ఆమెను వేధించసాగారు. సాటిన్ నానాతో, 'వీళ్ళు నన్ను చంపుకుతింటున్నారు. వీళ్ళను వెళ్ళమని చెప్పు' అన్నది.

"దాన్ని వదిలిపెట్టండయ్యా" అన్నది నానా.

సాటిన్ డ్రెసింగ్‌రూమ్‌లోకి వెళ్ళింది. నానా ఆ నలుగురువ్యక్తులతో కబుర్లు చెబుతూ కూచుంది. ఆ రోజంతా ఆమె ఏదో నవల చదువుతూ కూచుంది. ఆ నవల ఒక గొప్ప వేశ్యాంగనచరిత్ర. నానాకు ఆ పుస్తకం చదివి చదివి విసుకెత్తింది. ఆమె కలాంటి సాహిత్యమంటే చెడ్డ అసహ్యం. పుస్తకాలనుగురించి నాటకాలనుగురించి నానాకు నిశ్చితాభిప్రాయాలు ఉన్నాయి. ఆమెకు ఉదాత్తమైన రచనలంటే చాలా యిష్టం. రచనలు అంతరంగంలోని మాలిన్యాన్ని క్షాళనంచేసి, ఆత్మను ఉన్నతపథాలకు చేర్చవలెనని ఆమె ఉద్దేశం.

తరువాత పారిస్ నగరాన్ని ఆందోళనపరుస్తున్నకొన్ని చిక్కులను గురించి మాట్లాడుకున్నారు. కొన్నివార్తాపత్రికలలోని చిన్నచిన్న వ్యాసాలనుగురించి చర్చించుకున్నారు. నానా రిపబ్లికన్లపై నిప్పులుకురిపించింది. శుభ్రంగా స్నానంచెయ్యడంకూడా చాతకాని వీళ్ళకు ఏం మర్యాద ఉన్నదని ఈసడించింది. ప్రజలకు కావలసిన ఉపకారాలన్నీ చక్రవర్తి చెయ్యనే చేశా డన్నది. వీళ్ళు ఎలాంటివారో తనకు తెలుసు. ఆమధ్యాహ్నమే ఆమె 'ఫిగారో' పత్రికలో ఒక బహిరంగసభనుగూర్చిన వ్యంగ్యవ్యాసాన్ని చదివింది. ఆ వ్యాసంనిండా అసభ్యపదజాలమే.

"రిపబ్లిక్ ప్రతివారికీ నష్టం కలిగిస్తుంది. భగవంతుడు చక్రవర్తిని సంరక్షించుగాక!" అన్నది నానా.

"భగవంతుడు నీకోరికను తప్పకుండా మన్నిస్తాడు. చక్రవర్తిబలమే గొప్పది" అన్నాడు కౌంట్.

నానా ఇలాంటి మంచిభావాలు కలిగిఉండడం, కౌంట్‌కు ఎంతో ఇష్టం. రాజకీయాలనుగురించి ఇరువురి అభిప్రాయాలు ఒకటే.

ఇందరు మాట్లాడుతున్నా జార్జ్ స్తబ్ధుగా కూచున్నాడు.

"ఏం? అలాఉన్నావు?" అని అడిగింది. నానా.

"ఏమీలేదు, వింటున్నాను" అన్నాడు జార్జ్. కాని, అతనులోలోపల బాధపడుతున్నాడు. డైనింగ్ రూంలోనుంచివచ్చిన తరువాత ఫిలిప్ ఆమెతో పరిహాసాలాడడం జార్జి విన్నాడు. అదీగాక ఇప్పుడు ఫిలిప్ ఆమె పక్కనే కూచుని ఉన్నాడు. అతని గుండె పగిలిపొయ్యేటంత తీవ్రంగా కొట్టుకుం

టోంది. వారిద్దరూ కలిసిఉండడం అతను చూడలేదు. ఫిలిప్ నానా ప్రేమికుడవుతాడని అతను కలలోనైనా ఊహించలేదు.

"బిజోను తీసుకో" అన్నది నానా ఓదార్పుగా - తన ఒడిలో నిద్రిస్తున్న కుక్కపిల్లను జార్జికి ఇస్తూ. జార్జ్ ఆమె కుక్కపిల్లను తన ఒళ్ళో కూచోబెట్టుకుని, ఒకవిధంగా సుఖానుభూతి పొందాడు.

తరువాత గతరాత్రి వాండెవ్రె పొందిననష్టాన్నిగురించి మాట్లాడుకోసాగారు. ఈవార్త విన్నప్పుడు ముఫత్ ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు. కాని వాండెవ్రె తనకష్టాన్నిగురించి నవ్వుతూ చెపుతున్నాడు. అప్పుడే ఈవార్త పారిస్‌లో నలుగురి నోట పడింది. కొంతకాలంనుంచి నానా అతనిలో మార్పును గమనిస్తూనేవుంది. అతను అదోలా ఉంటున్నాడు. పెదవులచివర ముడతలు ఏర్పడుతున్నాయి. అతనిచూపులు అనిశ్చలంగా ఉంటున్నాయి. కాని, అతని అభి[illegible]తపు రీవిమాత్రం ఇంకా తగ్గిపోలేదు. అతని జీవితం స్త్రీలతో, [illegible]తో దివాలాతీసింది. అతనికి లూసిగ్నాన్ అనే ఒక గుర్రంపై ఆశ ఉంది. నానా అతన్ని డబ్బు అడిగినప్పుడల్లా లూసిగ్నాన్ గెలిస్తే ఇస్తానంటూండేవాడు.

వాళ్ళిలా మాట్లాడుకుంటూ ఉండగా సాటిన్ డ్రెసింగ్‌రూమ్ వాకిట్లోకి వచ్చి నిల్చుని నానను వినయంగా పిలిచింది. నానా లేచి వెళ్ళింది. అక్కడ సమావేశమైన పెద్ద మనుష్యులు సిగరెట్లు కాల్చుకుంటూ త్రాగిమైకంలోఉన్న ఒక హంతకుడు తన చర్యలకు ఎంతవరకు బాధ్యుడా అన్న విషయాన్నిగురించి తీవ్రంగా చర్చించుకుంటున్నారు.

డ్రెసింగ్ రూంలో జో కుర్చీమీద కూచుని, వెక్కివెక్కి ఏడుస్తోంది. సాటిన్ ఎంత ప్రయత్నించినా ఓదార్చలేకుండా ఉన్నది.

"ఏమిటి? ఎందుకు ఏడుస్తావు?" అన్నది నానా ఆశ్చర్యంతో.

"ఇరవై నిమిషాలనుంచి నేనెంత చెప్పినా ఏడుస్తూనేఉన్నది. నువు దాన్ని ఫూల్ అన్నావుట, అందుకని ఏడుస్తోంది" అని చెప్పింది సాటిన్.

"అబ్బే, ఏదో తొందరలో అన్నానుగాని, నిజంగా అన్నానుటే" అంటూ నానా జోను ఓదార్చసాగింది. జో నానా నడుముచుట్టూ చేతులు వేసి ఏడుస్తూ "నేను అమ్మగారిని ప్రేమించినట్టు ఎవరినీ ప్రేమించలేదు" అన్నది.

నానా జోను ముద్దాడింది. తనకు దానిమీద ఎంతమాత్రం కోపం లేదనడానికి గుర్తుగా, తాను మున్మొరుమాత్రమే ధరించిన ఒకగౌను బహూకరించింది. వారి పోట్లాటలు ఎప్పుడూ బహూమతులతో అంతమవుతాయి. నానాకు కోపంవచ్చిందని అందరూ ఫోంచేయకుండాఉన్నారని చెప్పింది. నానా వారందరికి నాణాలు పంపి, కోపంచల్లార్చింది. తనవల్ల ఎవరిమనస్సుకు నొప్పికలిగినా ఆమె చూడలేదు.

నానా తన డ్రాయింగ్‌రూమ్‌కు తిరిగి వచ్చింది. వీళ్ళందరూ తన్ను వేధిస్తున్నారనీ, తను వెళ్ళిపోతాననీ సాటిన్ నానాచెవిలో చెప్పింది.

"నువు వాళ్ళను పంపెయ్. లేకపోతే నే వెళ్ళిపోతా" నని సాటిన్ వచ్చి సోఫాలో పడుకున్నది.

పెద్దమనుష్యులందరూ ఇంకా ఏవేవో విషయాలు చర్చించుకుంటున్నారు. వీళ్ళను ఎలా వదిలించుకోవాలా అని ఆలోచిస్తోంది నానా. ముఖ్యంగా కౌంట్‌ను ఎలావదిలించుకోవటం? అని యోచిస్తోంది. తతిమ్మావారు ఎలాగో వెళ్ళిపోతారు. కాని, కౌంట్‌మాత్రం ఇప్పు డప్పుడే వెళ్ళిపోడు. క్రమక్రమంగా ఒక్కొక్కరే సెలవుతీసుకొని వెళ్ళిపోయారు. ఒక్క కౌంట్‌మాత్రమే మిగిలిపోయాడు. ఎవరూ లేకపోవడంచూచి ఆమె ప్రక్కకు చేరి కూచుని ఆమెచేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని ముద్దాడసాగాడు. ఆమె విషయాన్నిమారుస్తూ అతనికుమార్తె 'ఈస్టలీ' బాగున్నదా అని అడిగింది. గతరాత్రి అతను తనకు ఇంట్లో శాంతి లేదని చెప్పాడు. తనభార్య ఎప్పుడూ ఇంట్లోనే ఉండదనీ, తనకూతురు ఏకాంతంలో విషాదంగా కూచుని ఉంటుందనీ చెప్పాడు.

నానా తన వాగ్దానాన్ని జ్ఞాపకంతెచ్చుకుంటూ, 'మీరు ఈ స్టలీకి పెళ్ళిచెయ్యకూడదూ?' అన్నది. డానెట్ పేరు చెప్పడానికికూడా సాహసించింది. అతనిపేరు వినగానే కౌంట్ ఒకవిధమైన విసుగుదల చూపించాడు

నానా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చుతూ అతని మెడకు చేతులుచుట్టి "ఎందు కంత అసూయ. అతను నాపై చాడీలు చెప్పాడు. అప్పుడు నాకు కోపంవచ్చినమాట నిజమే. కాని, ఇప్పుడు నా కేమాత్రం కోపంలేదు. ఈ పెళ్ళి తప్పకుండా జరిగితీరాలి. నీ కుమార్తె సుఖానికి అడ్డుతగలడం

నా కేమాత్రం ఇష్టంలేదు. డానెట్ నిజంగా చాలా మంచికుర్రాడు. నీకు అలాంటి కుర్రాడు దొరకడు" అన్నది పట్టుదలగా.

తరువాత డానెట్‌నుగురించి ఎంతో గొప్పగాచెప్పసాగింది. కౌంట్ మళ్లీ ఆమె చేతుల్ని తనచేతుల్లోకి తీసుకున్నాడు. ఆమె చెప్పినదానికి కాదన లేకపోయాడు. తరువాత వెళ్ళిపడుకుందామన్నాడు. కాని, నానా తనకు శరీరంలో బాగాలేదన్నది. మరి చేసేదిలేక కౌంట్ వెళ్ళడానికి ఉద్యుక్తుడైనాడు. వాకిలి వరకూ వెళ్ళి, మళ్లీ తిరిగివచ్చి మణిహారంఉన్న పెట్టెను చేతికిచ్చాడు.

"ఓ, మణులా! మీకు నే నంటే ఎంత ప్రేమ! ఎంతదయ!" అన్నది నానా. అంతే, తరువాత అతన్ని వెళ్ళనిచ్చింది. సాటిన్ సోఫాలో పడుకుని ఉంది. అతను వెళ్ళగానే సాటిన్ లేచి, నానానడుముపట్టుకుని డాన్సు చేస్తూ పాటపాడింది. కిటకీవద్దకు వెళ్ళిచూచి "నడుస్తుంటే చూడు - వట్టి ఐడుద్దాయిలా ఉన్నాడు" అన్నది. ఇద్దరూ బయటికి చూచారు. ఒంటిగంట కొట్టింది. ఎవెన్యూడివిలెరె" భవనం ఏకాంతంగా నిర్జనంగా విశాలంగా కనుపిస్తోంది. కౌంట్ వెళ్ళిపోవడం చూస్తూ వారిద్దరూ నవ్వుపట్టలేక పోయారు. "ఆపు, అరుగో పోలీసులు!" అన్నది నానా.

ఇద్దరూ నవ్వుఆపేసి పోలీసులు వెళ్ళడం గమనించారు. నానాకు ఎన్ని భోగభాగ్యాలు అబ్బినా, ఇంకా పోలీసులంటే భయమే! ఎప్పుడు పోలీసును చూచినా ఆమెకు ఎందుకల్లనో గుండెదడ. సాటిన్ వణికిపోతూ నానాను దగ్గరగా ఒత్తుకున్నది. వా రక్కడే నిల్చుని, దగ్గరకు వస్తున్న ఒక లాంతరు వెల్తురును పరిశీలించసాగారు. అది ఒక ముసలి స్త్రీ చేతిలోని లాంతరు. ఆ ముసలిది వీధిలోని గుడ్డపీలికలు ఏరుకుంటోంది. సాటిన్ ఆ ముసలిదాన్ని గుర్తుపట్టింది. అది "క్వీన్‌పొమేరే" అని తరువాత ఆమెచరిత్ర చెప్పుకొచ్చింది. ఒకప్పుడు ఆముసలిది గొప్ప స్త్రీయే. ఆ స్త్రీ తన సౌందర్యంతో పారిస్ నగరాన్నంతా పిచ్చెక్కించింది. ఎందరో పెద్దమనుష్యులు ఆమెగడపలో పడి ఏడుస్తూండేవారు. ఇప్పుడు ఆవిడ పతనమైపోయింది. అస్తమానం తాగుతుంది. వీధుల్లో పిచ్చిదానిలా తిరుగుతుంది పిల్లలు దాని చుట్టూ చేరి, రాళ్లు రువ్వుతారు. అది బైటపడలేని రొంపిలో దిగబడి పోయింది.

నానా ఇదంతా అతిగంభీరంగా ఆలకించింది.

"ఇప్పుడా ముసలిది ఏం చేస్తోందో చూడు!" అన్నది సాటిన్. ఇలా అని పురుషునివలె ఈలవేసింది. గుడ్డ లేసుకుంటున్న ముసలిది తలయెత్తి చూచింది, దానిముఖం నల్లగా బొగులా ఉన్నది. పండ్లు లేవు. బోసినోరు. కళ్ళు లోపలికి పీక్కుపోయి, సొరంగాల్లాగా ఉన్నాయి. ఈ భయంకరమైన పతితవేశ్యనుచూచి నానా ఆపాదమస్తకం వణికిపోయింది. ఆ చీకటి తెరలలో - ఎందరో పురుషులను పాదాక్రాంతంచేసుకుని, అలసిసొలసిన ఒక వృద్ధ వేశ్య స్వరూపం గోచరించింది నానాకు. సాటిన్ మళ్లీ ఈల వేసింది."

"ఇక చాలించు. పోలీసులు!" అన్నది నానా.

కిటికీతలుపులు మూశారు. నానా వణికిపోతూంది. ఆమెతలలో చెమటపోసి, జుట్టంతా తడిసింది. తన భవనమే తనకు కొత్తగాకన్పించింది. తనభవనంలోని భోగవస్తువులన్నీ యధాస్థానంలోనే ఉన్నాయి. తనే ఈభవనంలో ప్రతివస్తువులోను విస్తరించినట్టు తోచింది. తన కామశక్తి ఇంత గొప్పదని నానా ఎన్నడూ గుర్తించలేదు. ఆమె తనచుట్టూ ఒక సారి కలయచూచుకొని, తాత్వికమైన కంఠస్వరంతో "యౌవనంలో వచ్చిన అవకాశాన్ని పోగొట్టుకోడం ఎందుకైనా మంచిదికాదు" అన్నది.

సాటిన్ అప్పుడే పడకగదిలోకి వెళ్తూంటే త్వరగా రమ్మన్నది.

నానా డ్రెసింగ్‌రూంలోకి వెళ్ళి, వివస్త్రికానారంభించింది. రెండు చేతులతో జుట్టుపట్టుకుని విదిలించింది. జుట్టుపిన్నులు గలగల క్రింద పడ్డాయి.

# 11

ఆనాడు ఆదివారం.

జూన్ నెల మొదటిరోజులు. ఆకాశం మబ్బుమబ్బుగా ఉన్నది. 'బాయ్‌డిబొలోన్'లో ఆనాడు పారిస్ గ్రాండ్ ప్రైజ్ రేస్ జరగనున్నది. ఉదయమంతా మసకమసకగా ఉన్నది. పదకొండుగంట లయ్యేసరికి ఆకాశంలో మబ్బులన్నీ విడిపోయాయి, అప్పటికి లాంగు ఛాంప్స్ రేస్‌కోర్స్

దగ్గరికి కొన్నిబండ్లు వచ్చి నిల్చిఉన్నాయి. కొందరు గుర్రపుబగ్గీలమీద, కొందరు గుర్రాలమీద వచ్చారు.

నానా ఆ రేస్‌కోర్సు తనకోసమే జరుగుతున్నదన్నంత ఉత్సాహంగా ఉన్నది. అందుకని విన్నింగుపోస్ట్‌కు దగ్గరలో తన స్థానాన్ని ఏర్పాటు చేసుకోదలిచింది. కౌంట్ ముఫత్ బహూకరించిన నాలుగుగుర్రాలబగ్గీలో అందరికన్న ముందుగా వచ్చింది. చక్కని బ్లూసిల్కుగౌను ధరించింది. జాకీలు ధరించే ఒకటోపీ పెట్టుకున్నది.

పన్నెండుగంటలు కొట్టారు. ఇంకా రేస్ ప్రారంభంకావడానికి మూడుగంటల వ్యవధి ఉన్నది. చిన్నలూయీని, జోనుకూడా తీసుకొచ్చింది నానా. ఆమె చుట్టుపక్కల ఎవరున్నారోకూడా అట్టే గమనించకుండా ఫిలిప్, జార్జిలతో పెద్దగా మాట్లాడుతున్నది. 'చూశారా. రోజురోజుకూ అతను భరించరానివాడై పోతున్నాడు. అందుకని అతన్ని వెళ్ళిపొమ్మన్నాను. రెండురోజులనుంచి రావడంలేదు' అంటున్నది.

ఆమె మాట్లాడుతున్నది ముఫత్‌నుగురించి. ఆమె తనపోట్లాటకు అసలు కారణంమాత్రం చెప్పలేదు.

'ఇటీవల మరీ వెర్రివేషాలువేస్తున్నాడు. వట్టి మొండిఘటంలా వున్నాడు. ఉదాహరణకు ప్రతిరాత్రి అతను ప్రార్థనచేస్తాడు. నేను గమనించడంలేదనుకున్నాడు. కాని, నేను పడుకుని చూస్తూనేవుంటాను' అని చెప్పసాగింది నానా.

"ప్రార్థన ముందు చేస్తాడా? వెనక చేస్తాడా?' అని అడిగాడు ఫిలిప్.

నానా పెద్దగా నవ్వింది. 'అదీ విషయం. రెండుసార్లూ చేస్తాడు. నాకు కాస్తకునుకుపట్టినా తనలోతాను ఏదో గొణుక్కుంటూంటాడు. నాకూ మతంలో విశ్వాసముంది. ఎందుకూ అలా నవ్వుతున్నారు? మీరు నవ్వినంత మాత్రాన నా నమ్మకంపోదు. అతను వెక్కివెక్కిఏడుస్తాడు. పశ్చాత్తాపాన్ని గురించి మాట్లాడుతాడు. మొన్న ఒకరోజున....' అంటూ యేదో చెప్పబోయి, మిసెస్ దంపతులురావడం చూచి ఆగింది నానా.

రోజ్ గ్రే సిల్కుగౌను ధరించింది. ఆమె, ఆమెభర్త, పిల్లలు వచ్చారు.

తరువాత నానా మళ్ళీ యిలా ప్రారంభించింది— 'అత నెవరో తెలుసా? ఆ ముసలాడు? చక్కగా ముస్తాబై వున్నాడు—పండ్లు అస హ్యంగా వున్నాయి-అతన్ని మిస్టర్ వీనట్ అంటాడు. ఈవాళ ఉదయమే మా ఇంటికి వచ్చాడు.

"అతను నాతో బలే విచిత్రమైన విషయాలు చెప్పాడు. కౌంట్‌ను గురించి, కౌంట్‌కుటుంబాన్నిగూర్చి చెప్పాడు. ఏదోవిధంగా వాళ్ళ సంసా రాన్ని చక్కబెట్టమని చెప్పాడు"

"అదుగో, కౌంటెస్ వస్తున్నది" అన్నాడు జార్జ్.

"ఎక్కడ? ఎక్కడ" అన్నది నానా.

నానా అద్దాల్లోనుంచి చూచింది. కౌంటెస్, ఆమెకుమార్తె కన్పిం చారు. డానెట్‌కూడా వాళ్ళదగ్గర వెడుతున్నాడు. తరువాత ఫిలిప్, డానెట్ వివాహాన్నిగూర్చి ప్రస్తావించాడు.

"నాకు తెలుసు. మంచిసంబంధమే' అన్నది నానా నవ్వుతూ.

క్రమక్రమంగా జనం నిండిపోతున్నారు. అన్నిరకాలబండ్లు వచ్చి, వరుసగా నిల్చుంటున్నాయి.

లాబోర్డెటీ ఒకబండిలోనుంచి దిగాడు. ఆ బండిలోనుంచే గాగా, క్లారిసీ, బ్లాంసీలు కూడా దిగారు. నానా అతన్ని జార్జ్‌తో పిలిపించింది.

అతను దాపుకు వచ్చేప్పటికి 'నా ఖరీదెంత?' అని అడిగింది నానా నవ్వుతూ. ఆ మాట్లాడుతున్నది 'నానా' అనే ఒకగుర్రాన్ని గురించి. ఆ గుర్రం డయానా ప్రైజ్ రేస్‌లో ఘోరంగా ఓడిపోయింది. 'ఇంకా యాభయిలోనే ఉంది" అన్నాడు లాబోర్డెటీ. "అయితే నా ఖరీదు చాలా తక్కువన్నమాట!"

లాబోబోర్డెటీ ఏదో తొందరపనిమీద వెళ్ళడానికి ఉద్యుక్తుడైనాడు. కాని, నానా మళ్ళీ అతన్ని వెనక్కి పిలిచింది. ఆమెకు ఒక చిన్న సలహా కావలసివచ్చింది. లాబోర్డెటీకి జాకీల విషయం, వివిధ గుర్రాల విషయం కూలంకషంగా తెలుసు. పూర్వం ఇరవైసార్లు అతను చెప్పిన గుర్రాలు పందెంలో గెలిచాయి. "పందాల జ్యోతిష చక్రవర్తి" అని అతనికి పేరు పెట్టారుకూడాను. "ఏగుర్రంమీద పందెం వేయమంటావు? ఇంగ్లీషుగుర్రం ఖరీదెంత?" అని అడిగింది నానా.

తరువాత లాబోర్డెటీ కొన్నిగుర్రాల గుణగణాలు, శక్తిసామర్థ్యాలు వర్ణించాడు. "స్పిరిట్" "వెలేరియో" "కాసినస్" "హసార్డ్" "గోమ్"లు మంచిగుర్రాలని చెప్పాడు.

నేను ఇంగ్లీషుగుర్రంమీద ఆడను. నేను దేశభక్తురాలిని."వెలేరియో" పైనే పందెం వేస్తాను అన్నది నానా. "లూసిగ్నాన్" మీదకూడా వేస్తానన్నది.

లాబోర్డెటీ ఆమెవంక అదోవిధంగా చూచాడు. ఆమె ముందుకు వంగి అతన్ని మెల్లగా, "వాండెవ్రె నీతో పందెంవేయమని చెప్పాడు కదూ?" అని అడిగింది.

లాబోర్డెటీ తాను పెద్దగా హేతువాదాన్ని నమ్మననీ, తనహృదయం ఏ గుర్రంమీద ఆడమని చెబితే, ఆగుర్రంమీదే ఆడుతాననీ చెప్పాడు.

నీకు అన్ని గుర్రాలూ ఇష్టమే కాని, "నానా" మాత్రం ఇష్టంలేదు కదూ?" అన్నది నానా నవ్వుతూ.

ఈ మాట విని బండిలో కూచున్నవాళ్ళందరూ నవ్వారు. లూయీ తల్లి అంటున్న మాటలకు అర్థం తెలీక కళ్ళెత్తి ఆమెవంక చూచాడు.

బండ్లు ఇంకా వస్తూనే వున్నాయి. వచ్చిన బండ్లన్నీ అయిదు వరుసలుగా నిలబడ్డాయి. కొన్నిబండ్లు వేరువేరుగా నిలబడిఉన్నాయి.

"ఎవరెవరు ఏ ఏ గుర్రంమీద ఆడుతారో తెలియకపోవడం ఎంత విచిత్రం!" అన్నది నానా.

నానా ఒక బుక్‌మేకర్‌ను ఎన్నుకోవాలని లేచి నిలబడింది. కాని, తనచుట్టూ ఎందరో పరిచితులముఖాలు కనుపించేసరికి ఆమె తన ఉద్దేశాన్ని మరిచిపోయింది. మినాన్‌దంపతులు, గాగా, క్లారిసీ, బ్లాంసీలేకాక, టాటన్ నెనె, మేరియాబ్లాండ్, కార్‌లైన్, ఆమె తల్లి-మరెందరో కనుపించారు. దూరంగా లూసీస్టీవార్ట్ చక్కనిసిల్కుగౌనుధరించి, ఒక యువకునిపక్కన కూచునిఉన్నది. సైమన్, స్టీనర్ రావడం నానాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. సైమన్ తెల్లటి సాటిన్ డ్రెస్‌లో వెలిగిపోతోంది. దూరాన్నుంచే నానా వారికి వంగి నమస్కరించింది. సైమన్ నవ్వుతూ చెయ్యి ఊపింది.

నానా ముసలిట్రికాన్ రావడం చూచింది. ఆ ముసలిది డ్రైవర్ సీటుమీద నిల్చుని, రేస్‌గ్రౌండ్‌నంతా పరిశీలిస్తోంది.

"చూడు, వాడు - లాఫలాసీ వస్తున్నాడు-" అన్నాడు జార్జ్ హఠాత్తుగా.

అందరికీ ఆశ్చర్యం కలిగించింది. నానా లాఫలాసినిగుర్తించలేక పోయింది. లాఫలాసి ఎంతో మారిపోయాడు, పినతండ్రి ఆస్తి వచ్చిన తరువాత ఎంతో కులాసాపురుషుడులా తయారయ్యాడు.

"లాఫలాసి ఇప్పు డెంతో చక్కగా తయారయ్యాడు" అన్నది నానా.

గాగా, క్లారిసీ, లాఫలాసిని పిలిచారు - మళ్ళీ అతన్ని తమవలలో వేసుకోడానికి, కాని అతను వారిని గమనించకుండానే వెళ్ళిపోయాడు. లాఫలాసి నానాదగ్గరకు వెళ్ళి నిల్చున్నాడు. గాగావద్దకు వెళ్ళలేదేమని అడిగింది నానా.

"ఆ పాతసంబంధాలతో విసుకెత్తిపోయాను. ఇప్పుడు నువ్వే నా జూలియట్‌వు" అన్నాడు నానాతో.

అందరియెదుట అతడు అన్న ఈ మాటవిని నానా పగలబడినవ్వింది. "సరే కాని, నువు ఏగుర్రంమీద ఆడుతున్నావు?" అన్నది లాఫలాసితో.

"నేను దేశభక్తుణ్ణికాదు. ఇంగ్లీషు గుర్రంమీదే ఆడుతున్నాను" అన్నాడు లాఫలాసి.

తరువాత వారు ఆ యా గుర్రాల గుణగణాలను చర్చించుకోసాగారు.

నానాదగ్గర ప్రారంభమైన గుర్రాలచర్చ రేస్‌గ్రౌండ్ మొత్తానికి వ్యాపించింది. మొత్తంమీద, స్పిరిట్, లూసిగ్నాన్" అనే రెండుగుర్రాల మధ్య పోటీజరుగుతుందని అందరూ అనుకుంటున్నారు. నిరుడు లార్డ్ రీడింగ్‌యొక్క 'బ్రామా' అనేగుర్రం గ్రాండ్ ప్రైజ్ గెల్చింది.

నానాగుర్రంమీద ఎవరూ పందాలుకాయడంలేదు. ఆపేరే ఎవరూ తలచడంలేదు.

లాఫలాసి, 'నేను నానాపై ఒక 'లూయీ'పం దెంకడతాను' అన్నాడు.

'నేను రెండు' అన్నాడు జార్జ్.

'నేను మూడు' అన్నాడు ఫిలిప్.

ఇలా ఒకరికన్నఒకరు సంఖ్య హెచ్చించడం మొదలెట్టారు నానాను వేలంపాడుతున్నట్టు.

మొదటిరేస్ ప్రారంభమవుతున్నది. సూచనగా గంటమ్రోగింది. ఎవరూ అంత పట్టించుకోకుండానే మొదటిరేస్ జరిగిపోయింది. ఒకక్షణం పాటు సూర్యుడు మబ్బులచాటున మూసుకుపోయాడు. చిన్నజల్లుపడింది. ఒకక్షణం అరుపులు, కేకలు, నవ్వులు వినిపించాయి. కాని, జల్లు వెంటనే ఆగిపోయింది. సూర్యుడు మిరుమిట్లుగొలిపే కాంతితో మళ్ళీ ప్రత్యక్షమయ్యాడు. సూర్యరశ్మితోపాటు స్త్రీల చిరునవ్వుల తళుక్కులుకూడావచ్చాయి.

జనంలోనుంచి గుసగుసలు వినిపించసాగాయి. 'చక్రవర్తిభార్య వస్తున్నది' అని జనం గుసగుసలాడుతున్నారు ఆమె వెనకాల శిలావిగ్రహంలా నడుస్తూ కౌంట్ ముఫట్‌కూడా వచ్చాడు.

"అదుగో కౌంట్" అన్నారు జార్జ్.

అందరూ నవ్వుతున్నారు. సాటిన్ అక్కడేవుంటే బావుండు ననుకున్నారు 'ఆ చిలిపిపిల్ల సరాసరి వెళ్ళి కౌంట్‌పొట్టలో ఒకపోటు పొడిచేది'-అనుకున్నారు.

కొన్నిసమిషాలపాటు నానా కౌంటెస్ సెబైన్‌ను పరిశీలనగా చూచింది. సెబైన్ ప్రక్కనే ఆమెకుమార్తె-ఈస్టెలీ కూచుని ఉన్నది. డానెట్‌కూడా అక్కడే ఉన్నాడు. తరువాత నానా, 'ఇప్పుడు నన్ను ఎవరుచూచినా ఆశ్చర్యపడరు. నేనే వాళ్ళను అతిహేళనగా చూడకలిగిన స్థితిలో ఉన్నాను. మర్యాద, పరువు... అన్నీ నశించాయి. అన్నిచోట్ల కల్మషం వ్యాపించింది. అందుకనే నేను ఎలాంటి నిందనైనా భరించి సహించను' అన్నది.

ఈవిధంగా నానా అక్కడ సమావేశమైన పిన్నలనూ, పెద్దలనూ- అందరినీ విస్మరించింది.

గంటలు మ్రోగుతున్నాయి. గుర్రాలు పరుగెదుతున్నాయి. 'లంచ్'కి వేళకావచ్చింది. 'గ్రాండ్ ప్రైజ్ రేస్' ప్రారంభమయ్యేవరకూ లంచ్ ఏర్పాట్లు చేయబడుతున్నాయి. అందరూ విశ్రాంతిసమయంలో తిని, తాగుతున్నారు. ఎందరో పెద్దమనుష్యులువచ్చి, నానాతో కరస్పర్శచేస్తున్నారు. నానా అందరికీ షాంపేన్ అందిస్తోంది. మధ్యలో ఆగి, 'అదుగో, బోర్డెనేవ్ వస్తున్నాడు. అతన్ని పిలుచుకురండి' అన్నది.

బోర్డ్‌నెవ్ ఆ జనంలో మారుపడినమనిషిలా చేతులు వెనకాల పెట్టుకుని, ఏదో దిగులుగా ఆలోచిస్తూ తిరుగుతున్నారు.

నానా చుట్టూ షాంపేన్‌కోసం జనం గుమికూడారు. లాఫలాసి షాంపేన్ పోస్తున్నారు. మరికొందరిని పిలుచుకురావడంకోసం జార్జి వెళ్లారు. నానా ప్రతివారికి ఒక చిన్న సన్నజాజిమొగ్గలాంటి చిరునవ్వునూ, చక్కని పరిహాసోక్తినీ ప్రసాదిస్తోంది. ఆమెజుట్టు గాలికి మబ్బుతెరలా ఎగురుతోంది. తుదకు ఆమె విజయసూచకంగా తనగ్లాసునింపుకుని, ఆ గ్లాసును పైకెత్తి వీనస్‌పాత్ర పోజులో నిల్చింది.

ఎవరో ఆమెవీపు స్పృశించారు. ఆమె వెనుదిరిగిచూచింది. మినాన్‌ను చూచి నానా ఆశ్చర్యపడింది. మినాన్ ఆమెకు చెప్పవలసిన ముఖ్యవిషయమేదో ఉన్నదనగా ఆమె అతని ప్రక్కన కూచున్నది.

'నా భార్య ఇంకా 'లిటిల్ డచెస్' గొడవ మరచిపోలేదు. ఆమె చేతిలో ఒక ఆయుధంఉంది' అన్నారు.

'ఏమి టా ఆయుధం? ఉంటేమాత్రం నాకేం లెక్క' అన్నది నానా.

'ఆమెదగ్గర ఒకఉత్తరం ఉంది. బహుశా ఆ ఉత్తరాన్ని ఫాషరె జేబులోనుంచి చిక్కించుకొనిఉంటుంది. ఆ ఉత్తరం కౌంటెస్ సెబైన్ ఫాషరెకు వ్రాసింది. రోజ్ నీ మీద పగతీర్చుకునే ఉద్దేశంతో ఆ ఉత్తరాన్ని కౌంట్‌కు పంపదలుచుకున్నది' అని చెప్పాడు మినాన్.

"అయితేమాత్రం నాకొచ్చిన నష్టమేమిటి?" అన్నది నానా.

"కాని, ఈపని చెయ్యడం నా కిష్టంలేదు. ఈపని పెద్ద అపనిందకు దారితీస్తుంది" అన్నారు మినాన్.

అతను ఆవిషయాన్ని మరింత సవిస్తారంగా చెప్పడానికి భయపడి ఆపేశాడు. కాని, కొంచెమాగి మళ్లీ ప్రారంభించాడు—"రోజ్ ఆఉత్తరం పంపుతుందనుకో. అప్పుడు పెద్ద అపనింద వ్యాపిస్తుంది. నీవూ అందులో చిక్కుకుంటావు. తప్పంతా నీదేనంటారు. కౌంట్ వెంటనే తన భార్యనుంచి విడిపోతాడు" అన్నారు.

"ఎందువల్ల?"—

మినాన్ ఏదో చెప్పబోయాడు. ఈలోగా ఏదో పెద్దధ్వని వినిపించింది. మళ్లీ మెరుపుతీగల్లా గుర్రాలు పరుగుతీయసాగాయి. ఇంక గ్రాండ్

ప్రైజ్ రేస్ ప్రారంభంకానున్నది. జనంలో పెద్దసంచలనం వ్యాపించింది. ఆ చివరిక్షణంలో పందాలువేస్తున్నవారందరినీ ఒక చిత్రవిషయం చకితుల్ని చేసింది. "నానా" రేటు హెచ్చుకాసాగింది పూర్వం ప్రతి పందెంలోను ఘోరంగా ఓడిపోయిన ఈ చిన్నిగుర్రానికి ఈక్షణంలో ఇలా రేటు పెరగడం అందరికి ఆశ్చర్యాన్ని కల్గించింది. ఈ కొత్తపిచ్చికి కారణం ఏమిటో ఎవరికీ అర్థంకాలేదు. కొందరు నవ్వారు. కొందరు గేలిచేశారు.

"నానాను స్వారీచేస్తున్న దెవరు?" అని అడిగాడు లాఫలాసి. అప్పుడు అందరిదృష్టి అసలునానపైకి మళ్ళి, అక్కడకూడిన పెద్దమనుష్యులందరూ ఆ ప్రశ్నకు అపార్థాన్ని కల్పిస్తూ నవ్వారు.

నానా వంగి నమస్కరించి, "నానాను స్వారీచేసే దెవరు? 'ప్రైస్' [వెల] స్వారీ చేస్తాడు" అని జవాబు చెప్పింది.

మళ్లీ చర్చ ప్రారంభింపబడింది. "ప్రైస్" అనే ఒక ఇంగ్లీషు జాకీ ఉన్నాడు. నానా జవాబు విని, మళ్లీ అందరూ నవ్వారు. నవ్వుతూ, కేరింతలుకొడుతూ అందరూ షాంపేన్ సేవించారు. తరువాత ఆ జనంలో గుసగుసలు ప్రారంభమైనాయి. వాండెవ్రె అక్కడికి వచ్చాడు. అందరూ అతనికి దారియిచ్చారు. "ఇప్పుడా దర్శనం?" నానా కొంచెం కోపంగా అని "నేను రేస్ గ్రౌండ్ అంతా తిరిగి చూద్దామనుకుంటున్నాను" అన్నది.

"నాదగ్గర ఒక లేడీస్ టికెట్ ఉంది. నేను చూపిస్తాను," రమ్మన్నాడు వాండెవ్రె.

అతనిభుజంమీద చెయ్యివేసి బయలుదేరింది నానా. కారలైన్, లూసీ, తదితరస్త్రీలు అసూయాదృక్కులలో చూచారు. వారిద్దరూ కలిసి నడుస్తూండగా "నానాగుర్రానికి ఇంతధర పెరిగిందేమిటి చెప్మా? చాలా విచిత్రంగా ఉన్నదే!" అన్నది నానా.

"అవును, ప్రతిపందెగాడూ ఆగుర్రాన్నిగురించే మాట్లాడుతున్నాడు. పందెగాళ్ళ వెర్రి అంటూ ఒకవెర్రి ఉంటుంది" అన్నాడు వాండెవ్రె.

"నాకు కాస్త విపులంగా చెప్పు. నే నా గుర్రంమీద పందెం కాయదలచాను".

అతనికి ఎందుకో కోపంవచ్చింది. "ప్రతిగుర్రానికి అవకాశంఉంది. ఇదంతా పందెగాళ్ళవెర్రి!" అన్నాడు.

అతను అకారణంగా హఠాత్తుగా ఇలా కోపంగా మాట్లాడడం నానా ఎన్నడూ చూడలేదు. అందుచేత ఆమెకు బాధకంటె ఎక్కువగా ఆశ్చర్యంకలిగింది. ఇలా కోపంరావడం అతనిస్వభావంకూడా కాదు.

ఇలా తనకు అనవసరంగా కోపంవచ్చినందుకు అతనుకూడా సిగ్గు చెందాడు నానా అతన్ని మర్యాదగా ప్రవర్తించమని చెప్పింది.

ఇటీవల కొన్నాళ్ళనుంచి అతనికి ఈ విధంగా వళ తప్పి కోపం రావడం జరుగుతూనేఉంది. ఆనాడు అతను తన కడసారిపందెం ఆడుతున్నాడని పారిస్‌నగరమంతా అనుకుంటోంది. ఈసారితో అతను పూర్తిగా మునగడమో తేలడమో తేలిపోవాలి. నానా "ఇదివరకే అతన్ని చాలవరకు ఆర్పేసిందని అందరికీతెలుసు. అతని ధనాన్ని తన చేతులతో విచ్చలవిడిగా విరజిమ్మింది బాడెన్‌కు ఎక్స్‌కర్షన్ వెళ్ళినప్పుడు హోటల్ బిల్లుకు మిగలకుండాకూడా డబ్బు ఖర్చుచేయించింది. ఒకనాటిరాత్రి తప్పతాగి గుప్పెడు వజ్రాలు నిప్పుల్లోపోసి, బొగుల్లా మండుతాయోలేదో చూచింది. క్రమ క్రమంగా ఆ శ్రీమంతుణ్ణి కడంట ఆహరించుకున్నది. ఈ క్షణంలో అతను తన కున్నదంతా పణం పెడుతున్నాడు.

గేట్‌కీపరు వారిని లోనికి రానిచ్చాడు. నానా మహా వయ్యారంగా నడుస్తూంది.

అక్కడ సమావేశమైఉన్న అభిజాతవర్గ స్త్రీ సమూహాన్నంతా చూచింది. కౌంటెస్ సెబెన్‌వైపుకు నిశ్చల సూక్ష్మదృక్కులు సారించింది. చక్రవర్తిని ప్రక్కనె గంభీరంగా నిలబడిఉన్న ముఫత్ కన్పించాడు. అతను అలా నిల్చునిఉండడం నానాకు ఎంతో వినోదకరంగా కనుపించింది. అటు వెడుతూవున్న డానెట్, ఫాష్‌రెలు ఆమెకు వంగి నమస్కరించారు.

అక్కడ గడ్డిపరచివున్న ఒక బహిరంగస్థలంలో ఎందరో బుక్ మేకర్స్ నిల్చునివున్నారు. వాళ్ళముఖాలు చిత్రవిచిత్రంగా వున్నాయి.

'వీళ్ళు ఎంత చిత్రంగావున్నారు!' అన్నది నానా.

వాండెవ్రె ఒకబుక్‌మేకర్‌ను పిలిచాడు. పూర్వం వాడు అతని దగ్గర గుర్రపుబగ్గీ తోలుతూండేవాడు. ఎద్దంతమనిషి. ముఖం ఎర్రగా కంద గడ్డలావుంది.

"ఎంతలో వుందోయ్" అన్నాడు వాండెవ్రె.

"ఐదువేల రూపాయిలు"

వారిద్దరూ మాట్లాడుకున్నమాటలలో ఒక్కటీ నానాకు అర్థంకాలేదు. కాని, అతన్ని అడగడానికి సాహసించలేకపోయింది. వాండెవ్రె వెంటనే ఆమెను లాబోర్డెటీకి అప్పజెప్పి వెళ్ళిపోయాడు.

అది ఇరుకైన గదిలాగా ఉన్నది. చూరు వంగిఉన్నది. ఒక చిన్న రైల్వేస్టేషన్‌లో సామాన్లుతూచేగదిలా ఉన్నది. అక్కడ గుర్రాలనుతూచే పెద్దయంత్రం వుంటుందనుకున్నది నానా. కాని అలాంటిదేమీలేదు. అందరూ జాకీలపైనే ఆశపెట్టుకు కూచున్నారు. జాకీలు పాలిపోయిన ముఖాలతో కూచునివున్నారు లాబోర్డెటీ నానాకు 'ప్రైస్'ను చూపెట్టాడు. 'అతనేకదూ నా మీద స్వారీచేసేది?' అన్నది నానా నవ్వుతూ. నానా దృష్టికి అతను అందవిహీనుడుగా కన్పించాడు. ఆమెదృష్టిలో జాకీలందరూ వట్టిదద్దమ్మలే!

మళ్ళీ గంటమ్రోగింది. జనంలో విద్యుత్తు ప్రసరించినట్టయింది. అందరూ షాంపేన్‌గ్లాసులు అవతలపెట్టారు. దృశ్యం మరింతస్పష్టంగాకనుపించడానికై నానా తనసీటులో ఎక్కి నిల్చున్నది.

నానా ఇప్పుడా దృశ్యాన్ని దూరాన్నుంచే చూడగల్గింది. దూరంగా విండ్‌మిల్—కుడిభాగంలో పచ్చికబయళ్లు—ఎదురుగా పర్వతపాతంలో ప్రవహించే సీన్‌నదీతీరంవరకూ వ్యాపించివున్న చిన్న చిన్న పార్కులు, తోటలతోకూడుకున్న ఇండ్లు — ఈ రమణీయ దృశ్యాన్నంతా చూడగలిగింది నానా.

ఇంకా జనం ప్రవాహాలుగా వస్తూనేవున్నారు.

"ఇక పందెం ప్రారంభంకానున్నది" అన్నాడు లాబోర్డెటీ.

ఎరుపు పసుపురంగుల జండా ఒకటి స్టార్టింగ్‌వద్ద ఊపబడింది. ఒక్కొక్క గుర్రమే రంగంలోకి వచ్చింది. ముందు 'కాసినస్' వచ్చింది. తరువాత 'హసార్డ్, బోమ్' వచ్చాయి. 'స్పిరిట్' రాగానే జనంలో ఆనందోత్సాహాలు హెచ్చినై. 'వాలెరియో' రాగానే జనం స్వాగతం చెప్పారు. తరువాత లూసిగ్నాన్ వచ్చింది. చివరకు నానా వచ్చింది.

'నానాజుట్టు, రంగు అచ్చంగా నా జుట్టుకుమల్లేనే ఉన్నాయే' అన్నది నానా.

మొదటిపరుగు అంత ఉత్సాహకరంగాలేదు, ఒక చిన్న పరుగుతీసి గుర్రాలు పోస్టుదగ్గరికి తిరిగివచ్చాయి. తరువాత రెండుపరుగులుకూడా అంత బాగాలేవు. చివరకు 'స్టార్టర్' గుర్రాలను అద్భుతమైన పరుగుకు వదిలి పెట్టాడు.

"అద్భుతం!" అన్నారు జనమంతా.

జనంగోల అణిగిపోయింది. పూర్తిగా నిశ్శబ్దంఆవరించింది. కళ్ళన్నీ తదేకంగా గుర్రాలమీదేవున్నాయి. 'హసార్డ్', 'కాసినస్' ముందుగా పరుగెత్తాయి.

"అయ్యో! ఇంగ్లీషుగుర్రం ముందు పరుగెత్తుతున్నదే' అన్నాడు. లాబోర్డెటీ.

అందరూ మునివేళమీద నిల్చుని, ఆతురతతోచూస్తున్నారు.

"ఇంగ్లీషుగుర్రమే గెలుస్తుంది. 'లూసిగ్నాన్'కు సొలివచ్చేస్తోంది!' అన్నాడు బోర్డ్‌నెవ్.

మరోపరాజయం! అందరిహృదయాల్లోను బాధ రేకెత్తుతున్నది. లూసిగ్నాన్ గెలుపుకోసం అందరూ ప్రార్థనలు చేస్తున్నారు. 'ఏమీ దిగులు పెట్టుకోకండి; ఇంగ్లీషుగుర్రం వెనుకబడిపోయింది' అన్నాడు జార్జ్.

వాలెరియో ఇంకా అన్నిగుర్రాలముందు పరుగెత్తుతోంది.

స్పిరిట్ ముందుపరుగెత్తాలని యత్నిస్తోంది.

"నానా" "లూసిగ్నాన్"ను కొట్టేస్తోంది.

జనంలో అన్నివెపులనుంచి హాహాకారాలు బయలుదేరాయి. ప్రతి వారి పెదవులమీద స్పిరిట్, నానా, లూసిగ్నాన్, వాలెరియో అనేపేర్లే ఉన్నాయి.

"ఇంగ్లీషుగుర్రం వెనకబడింది" అన్నాడు ఫిలిప్ సంతోషంగా. నాలుగుగుర్రాలూ భయంకరమైనవేగంతో పరుగిడుతున్నాయి. ఒక పెద్ద గుంపు తనుకూచున్నవైపుకు తోసుకురావడం నానా చూచింది. జనం సముద్రంలా రొదచేస్తున్నారు. ఒకరినొకరు తొక్కుకుంటున్నారు.

అప్పుడు అందరూ ఒక విచిత్రదృశ్యాన్ని చూచారు. ప్రైస్ తన ఇనుపబెత్తంతో "నానా" వీపుమీద ఒక్కదెబ్బ కొట్టాడు. అంతవరకూ చనిపోతుందా బ్రతుకుతుందా అన్నట్టున్న ఆ గుర్రం నురుగులు గ్రక్కుతూ

కళ్ళవెంట నిప్పులుకురిపిస్తూ పరుగెత్తింది. ఒక్క పరుగుతో ప్రైస్ నానాను పోస్టువద్దకు చేర్చాడు.

"నానా! నానా! నానా!" అని అందరూ కేకలువెయ్యసాగారు! "ఫ్రాన్స్ వర్ధిల్లుగాక! ఇంగ్లండ్ నశించుగాక!" అని అందరూ ఒకటే కేకలు.

ఈ దృశ్యాన్ని చూచి, నానా సంతోషం పట్టలేకపోయింది. తన పేరుగలగుర్రం గెలవడం ఆమె కెంతో ఆనందాన్ని కలిగించింది. అందరూ "నానాను" ప్రశంసిస్తూంటే తన్నభినందిస్తున్నట్లేఉంది ఆమె తొడలుకొట్టుకుంటూ తన ఆనందాన్ని వెలిబుచ్చింది. బోర్డ్ నెవ్ చంకలోఉన్న చిన్న లూయీని తీసుకుని ముద్దులవర్షం కురిపించింది.

"మూడునిమిషాల నలభయిసెకండ్లలో పరుగెత్తింది" అన్నాడు బోర్డ్ నెవ్ తనగడియారం చూచుకుంటూ.

నానా ఇంకా తనపేరు ఆ జనంలో ప్రతిధ్వనించడం వింటూనే ఉన్నది. చిరుగాలికి ఎగురుతున్నజుట్టుతో బూగౌనుతో ఠీవిగా దేవతలా నిల్చున్నది. నానా నిల్చున్నప్రదేశంలో ఆమెభక్తులూ, ప్రేమికులూ, అందరూ పోగవసాగారు.

రేసులు సమాప్తికావస్తున్నాయి. కొన్నిబండ్లు వెళ్ళిపోయాయి. "వాబ్లాన్ ప్రైజ్" రేస్లు జరుగుతున్నాయి. వాండెవ్రెపేరు అక్కడక్కడా విన్పిస్తోంది. పందెంపోగొట్టుకున్నవారు ఉద్రిక్తులై ఉన్నారు. గెల్చినవారు ఏమీ పట్టనట్టుగాఉన్నారు. "వాండెవ్రెపని అయిపోయిందని జనంలో అక్కడక్కడ గుసగుసలాడుకుంటున్నారు. నానా మొదట్లో ఈ గుసగుసలను నమ్మలేదు. పాలిపోయిన ముఖంతోవచ్చిన లాబోర్డెటీని "ఏమైంది?" అని అడిగింది నానా మెల్లగా.

"అయిపోయింది" అన్నాడు లాబోర్డెటీ ముక్తసరిగా.

ఆ రాత్రి 'మాబిలె'లో నానాకు ఘనవిజయానికి స్వాగతం సన్మానం జరిగింది. అది ఆమెజీవితంలో మరపురానిరాత్రి. పారిస్‌నగరంలోని అభిజాతవర్గమంతా అక్కడ సమావేశమైంది. గ్యాస్‌లాంతర్లు తళతళలాడిపోతున్నాయి. స్త్రీలు నగ్నంగావున్న భుజాలతో అటూఇటూ తిరుగుతూ తాగుతున్నారు. నానా రేసెస్‌కు ధరించివెళ్ళిన డ్రెస్‌తోనే ప్రవేశించింది. అందరూ ఆమెను విజయోల్లాసంకొద్దీ ఎత్తుకుని ఊరేగించారు.

మంగళవారంవరకు ఆ విజయోత్సాహపుజ్వరంనుంచి నానా పూర్తిగా తేరుకోలేదు. ఆ ఉదయాన ఆమె మేడమ్ లెరాట్‌తో మాట్లాడుతోంది. వాండెవ్రె రేస్‌కోర్సులన్నిటినీ త్యజించాడనీ, తనపేరు తీసివేయించుకున్నాడనీ, ఆ ఉదయమే గుర్రపుశాలలకు నిప్పు పెట్టుకుని చనిపోయాడని నగరమంతా అనుకుంటున్నదనీ చెప్పింది నానా.

అంతలో లాబోర్డెటీ అక్కడికొచ్చాడు. నానాగెలిచిన నలభై వేల ఫ్రాంకులు తెచ్చి ఇచ్చాడు. ఈ డబ్బు నానాకు తృప్తికలిగించలేదు. నానా మిలియన్ ఫ్రాంకులైనా గెలుస్తాననుకున్నది.

వాండెవ్రె గుర్రపుశాలలో నిప్పంటించుకుని అంతరించిపోయాడు. ఆ దృశ్యాన్ని వివరిస్తూ 'ఆ దృశ్యం చాలా బ్రహ్మాండంగా ఉంటుంది. ఆదృశ్యాన్ని తలుచుకుంటేనే వెంట్రుకలు నిక్కబొడుచుకుంటాయి. అతను అందరినీ బైటికిపంపేశాడు. తనుమాత్రం లోపలఉండి, పెట్రోలు పోసుకున్నాడు తరువాత ఆకాశమెత్తున మంటలు లేచాయి. గుర్రాలు పెద్దగా అరుస్తూ తలుపులు బాదసాగాయి. కొందరైతే భయంతోనే చనిపోయేవారట' అన్నది నానా.

లాబోర్డెటీ వాండెవ్రెమరణాన్ని నమ్మలేదు. ఎవరో అతను కిటికీలోనుంచి దూకుతుండగా చూచారని చెప్పాడు. ఈమాట వినగానే నానా కలలు కల్లలయ్యాయి.

'అయ్యో! ఎంత గొప్పమరణం తప్పించుకున్నాడు!' అన్నది.

## 12

ఒంటిగంట దాటింది. నానా, కౌంట్ ఇంకా నిద్రపోలేదు. వెనీషియన్‌లేస్ అలంకరించివున్న మెత్తనిపక్కమీద పడుకుని ఉన్నారు.

మూడురోజులనుంచి కౌంట్ రావడంలేదు. తప్పుకుని తప్పుకుని తిరుగుతున్నాడు.

ఒక చిన్న లాంతరుమాత్రం ఆ గదంతా మందమైన కాంతినిస్తోంది. గదిలో నిశ్శబ్దమావరించి ఉన్నది. వెచ్చని ప్రణయ పరిమళం గదినిండా అలుముకున్నది. జార్చినతెరచాటునీడలో పక్క ఎంతో రమణీయంగా కన్పిస్తోంది. ఆ నిశ్శబ్దతలోనుంచి ఒక నిశ్వాసం విన్పించింది. తరువాత ముద్దాడినశబ్దం.

నానా ఒకక్షణంపాటు ప్రక్కచివర కూచున్నది. కౌంట్ నీడలో దిండుపైన తలపెట్టుకుని పడుకొని ఉన్నాడు.

ఒకక్షణం ఏదో ఆలోచించిన తరువాత ముఖంలో గాంభీర్యం వహించి 'ప్రియా! నువు ఈశ్వరుని నమ్ముతావా?' అని అడిగింది నానా.

ఆనాటి ఉదయంనుంచి ఆమెమనస్సు ఎంతమాత్రం బాగుండలేదు. నరకాన్నిగురించీ మృత్యువుగురించి ఆమెకున్న విచిత్రాభిప్రాయాలు ఆమెను చీకాకుపరుస్తున్నాయి. రాత్రులందు దప్పుడప్పుడు శిశువులకువలె ఏవేవో అతివిచిత్రమైన భయాలు ఆమెమనస్సును కల్లోలపరిచేవి.

నానా మళ్ళీ ఇలా అడిగింది, 'నేను స్వర్గానికి వెడతానంటావా?'

ఇలా అని చివురాకు రెమ్మలా ప్రకంపించింది.

నానా అడిగిన ఈ విచిత్ర ప్రశ్నలు వినేసరికి కౌంట్‌లో నిద్రాణమై వున్న మతవిషయిక పశ్చాత్తాపమంతా ఒక్కసారిగా పెల్లుబికింది. భుజాలపై నుంచి జారుతున్న నైట్ డ్రెస్‌తో, భుజాలపైకి జారిపడుతున్న కేశరాశితో, నానా కౌంట్‌వక్షస్థలంపై వాలి, వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

"నాకు చావంటేభయం, నాకు చావంటే భయం' అని ఒకటే ఏడుపు.

కౌంట్‌కూడా భయపడ్డాడు. నానా అతన్ని కౌగలించుకుని విలపించేసరికి, ఆ భయం అతనికికూడా అంటుకొన్నట్లయింది. ఆ స్త్రీ మనస్సును కల్లోలపరుస్తున్న అవ్యక్తబాధ తననూ కలవరపెడుతున్నట్టుగా ఉన్నది. నానా శరీరారోగ్యం బాగానేవుంది. ఇప్పుడామె చెయ్యవలసినదల్లా చర్చిలో క్షమాపణ పొందడమే. నానా తలడించింది. నానా తనజీవితంలో ఎవరికీ అపకారంచేసియెరుగదు. 'వర్జిన్' ప్రతిమకూడా మెడలో వేసుకున్నది. అయినా, ఆమెను ఒక సందేహం బాధిస్తోంది. వివాహం కాకుండా పరపురుషగమనంచేసిన స్త్రీలకు నరకప్రాప్తికలుగుతుందట! ఇది నిజమేనా? నరకస్వర్గాలకు వెళ్ళినవారెవరూ తిరిగివచ్చి, వారి అనుభవాలు చెప్పినట్టు కన్పించదు. ఆమె మెడలోని ప్రతిమను ముద్దాడింది.

మృత్యుభయంతో ఒక్కక్షణంకూడా ఒంటరిగా ఉండలేకపోతోంది నానా. అందుచే ముఫత్ నానాతో డ్రెసింగ్‌గదిలోకికూడా వెళ్ళవలసివచ్చింది. అక్కడనుంచి వచ్చినతరువాత కౌంట్ పడుకున్నాడు. కాని నానా ఇంకా

ఆలోచిస్తూ అటూఇటూ తిరుగుతున్నది. ప్రతిచిన్నశబ్దానికి ఉలికిపడు తున్నది. అద్దంవద్దకు వచ్చినపుడల్లా అద్దంముందు ఆగి, పూర్వపురోజుల్లో లాగా తన నగ్నసౌందర్యాన్ని ధ్యానిస్తోంది. అలా తన నగ్నసౌందర్యాన్ని వీక్షించినపుడల్లా ఆమెకు మృత్యుభయం హెచ్చుతున్నదేకాని, తగ్గడంలేదు. చనిపోయినప్పుడు మనిషి ఎంత అసహ్యంగా ఉంటాడు!' అనుకున్నది.

చెక్కిళ్లలోపలికితీసుకుని, కళ్లు పెద్దవిచేసి, తను ఎలాఉంటుందో చూచుకున్నది. అలాగే కౌంట్‌వంక తిరిగి 'చూడండి, నేను చనిపోయి నప్పుడు ఇలాఉంటానుకదూ!' అన్నది.

"నీకు పిచ్చెత్తినట్టుంది. ఇక వచ్చి పడుకో" అన్నాడు కౌంట్.

ఆమెచనిపోయి, సమాధిలో నిక్షిప్తమైనప్పుడు ఎలాఉంటుందో కూడ కౌంట్ ఊహించుకున్నాడు ఒకశతాబ్దిపుకల్మషానికి ప్రతినిధిగా నానా సమా ధిలో శయనిస్తుంది. కౌంట్ చేతులుజోడించి ప్రార్థించాడు, ఇటీవల కొన్నాళ్ళనుంచీ కౌంట్‌ను మతవిశ్వాసం ఆకట్టుకున్నది. 'ఈశ్వరా! పరమే శ్వరా!' అంటూ ధ్యానించసాగాడు. నానా పక్కదగ్గరికి వచ్చేసరికి అతను వెల్లకిలాపడుకుని, శూన్యంలోకి చూస్తున్నాడు. నానా మళ్లీ ఏడ్వసాగింది. కౌంట్ భయంతో ఆమెను కౌగలించుకున్నాడు. ఇద్దరినీ ఒకే మత్యుభయం ఆవరించింది.

రెండురోజుల తరువాత ఒక ఉదయాన ముఫత్ నానా ఇంటికి వచ్చాడు. ఏడవడంవల్ల అతనికళ్లు ఎర్రబారి ఉన్నాయి. అతనిలోని ఆంత రంగిక సంఘర్షణకారణంగా అతనిశరీరమంతా వణికిపోతోంది. జో ఇదంతా గమనించకుండా, అతనివద్దకు పరుగెత్తుకొచ్చి 'త్వరగారండి. రాత్రి అమ్మ గారు చనిపోయినంతపని అయింది' అనిచెప్పింది. కౌంట్ వివరాలు అడగ బోతే'విచిత్రం! చాలావిచిత్రం!' అని దారితీసింది.

మూడునెలలనుంచి నానామనస్సు మనస్సులోలేదు. 'ఎంచేతనో బాగాలేదు, అంటూవచ్చింది. స్పష్టంగా నిర్వచించలేకపోయేది. డాక్టర్‌బావ్ టరెల్‌కుకూడా కొన్ని అనుమానాలు ఉన్నాయి. ఒక్కొకసారి అతనితో విసుకెతి పరిస్థితి దాచుకోడానికే ఆమె సర్వవిధాలా ప్రయత్నించేది. తన్ను బాధిస్తున్న హాస్యవేదన ఏదో నానాకు సరిగాఅర్థమయ్యేదికాదు. తనదృష్టిలో తనే నీచంగా ఉన్నట్లు కన్పించసాగింది. తన కాముక ప్రవృత్తిలో ఏదో

కొరతకలిగినట్టు ఆమె ఆశ్చర్యపడుతుంది. కొందరికి కోరకుండానే సంతానం కలుగుతుంది. ఇది ఎంత విచిత్రం!

నానా జీవితంలో తనచుట్టూ మృత్యుబీజాలు వెదజల్లింది. కాని తనలో పవిత్రమాతృత్వం గంభీరవాహినిలా పెల్లుబుకుతోంది.

జరిగిన విషాదసంఘటననుగూర్చి జో ఇలాచెప్పింది—'నాలుగోగంట అయ్యేసరికి అమ్మగారికి వాంతులుపట్టుకున్నాయి. నేను డ్రెసింగ్‌రూంలోకి వెళ్ళేసరికి ఆమె నేలమీద మూర్ఛలోపడిఉన్నది. హత్యగావింపబడినట్టుగా ఆమెచుట్టూ నెత్తురుమడుగు ఉన్నది. ఏం జరిగిందో అప్పుడు నాకు అర్ధమైంది. అమ్మగారు నాతో చెప్పలేదని నాకు కోపంవచ్చింది. అతనూ నేనూ కలిసి, ఆమెను లేవదీశాం, అమ్మగారికి గర్భస్రావమైందని నేను అతను ఆశ్చర్యపోయాడు.

ఇల్లంతా తలక్రిందలైపోయింది. సేవకులందరూ పైకి క్రిందికి పరుగెత్తసాగారు.

'మీరు వెళ్ళిచూడండి, అయ్యగారూ.........ఇప్పుడు అమ్మగారికి కొంచెం నయంగానేఉన్నది. డాక్టర్‌కూడా వస్తానన్నాడు' అన్నది జో.

మేడమీద డ్రాయింగ్‌రూంలో సాటిన్ ఒక్కతే సోఫాలోపడుకుని సిగరెట్ కాలుస్తోంది.

జో కౌంట్‌ను పడకగదిలో ప్రవేశపెట్టింది. నానా ఎంతో పాలిపోయి పడుకుని ఉన్నది. ఆమెకళ్ళు ఆలోచనాత్మకంగా ఉన్నాయి.

కౌంట్‌ను చూడగానే అలాగే పడుకుని కదలకుండా చిరునవ్వు నవ్వింది. 'నేను మళ్ళీ నిన్నుచూస్తాననుకోలేదు' అన్నది.

అతను ఆమెజుట్టును ముద్దుపెట్టుకోడానికి ముందుకు వంగగా ఆమె ద్రవించినదై, శిశువునుగూర్చి అతని బిడ్డేనని చెప్పింది.

'అంతా అయిపోయింది. కాని, మించిపోయిన తరువాత చెయ్యగలిగిన దేమీలేదు. ఒకందుకు ఇదే మంచిదనుకుంటాను. మీకు ఒక బంధాన్ని కలిగించడం నా కిష్టంలేదు' అన్నది. 'ఎందుకలా ఉన్నావు? నీకుకూడా అస్వస్థతగావున్నదా?' అనడిగింది నానా.

"లేదు" అన్నాడు కౌంట్ బాధగా.

ఆమె అతనివంక సూదులు పొడిచినట్టు సుదీర్ఘంగాచూచింది. తరువాత సైగతో జోను అక్కడినుంచి పంపివేసింది.

జో వెళ్ళిపోయిన తరువాత కౌంట్‌ను దగ్గరికి తీసుకుని 'ప్రియా! అసలువిషయం ఏమిటి. చెప్పవూ? నీకళ్ళు అశ్రుపూరితాలై ఉన్నాయే? నాతో ఏదో చెప్పాలనే వచ్చావు. నాకు తెలుసు' అన్నది నానా.

నానా ఇలాఆప్యాయంగా ఆదరంగా అడిగేసరికి కౌంట్ వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. నానా అర్థంచేసుకుంది. రోజ్ ఉత్తరం ... పి ఉంటుంది. అతనిబరువు తగ్గిపోయేవరకు విలపించనిచ్చింది. తరువాత మాతృత్వం ఉట్టిపడే స్వరంతో, 'నీకేదైనా గృహకల్లోలం కలిగిందా?' అని అడిగింది. అతను తలఊపాడు. అప్పుడా గదిలోని వాతావరణం ఎంతో భారంగా ఉంది. ఆ గదినిండా పొగలాగా ఏదో బాధ అలుముకున్నట్టుగాఉంది. ఆ క్రితంరాత్రి అతను చక్రవర్తినివిందుకు వెళ్ళి ఇంటికిరాగానే సెబెన్ తన ప్రియునికి వ్రాసిన ఒకలేఖ అతని చేతిలోపడింది. ఆ రాత్రంతా అతను భయంకరంగా గడిపాడు, తెల్లవారిలేచి, ఆ క్రోధంలో తనభార్యను హత్య చేస్తానేమోనన్నభయంతో ఇల్లువిడిచి వచ్చాడు. అతను ఎప్పుడు ఎలాంటి చిక్కులలోఉన్నా నానావద్దకు వస్తాడు. అక్కడే అతనికి ఒకవిధమైన ఓదార్పు, మనశ్శాంతీ లభించుతుంది.

"ఏదోఒకవిధంగా ఉపశాంతిపొందాలి. నాకు చాలా కాలంనుంచి తెలుసు. కాని నేను నీకళ్ళు తెరిపించి వుండగలిగేదాన్నికాదు.గతసంవత్సరం కూడా నీకు అనుమానాలు వుంటూవచ్చేవి. నా తెలివితేటలవల్ల ఎలాగో ఒకలా సర్దుబాటుచేశాను. అయినప్పటికి నువు అవివేకంగా ప్రవర్తించ కూడదు సుమా' అని చెప్పింది నానా.

అతను ఏడ్వడం ఆపాడు. అతన్ని పరాభవాగ్ని దహిస్తోంది. 'నీకు ఆరోగ్యం బాగాలేదు. నీకు అలసట కలిగించటంమంచిదికాదు. మరి నేను వెడతాను' అన్నాడు.

'కాదు, వుండు. నీకు ఏదైనా మంచి సలహాఇస్తాను. నన్నుమాత్రం ఎక్కువగా మాట్లాడించకు. డాక్టర్ అలా చెప్పాడు'.

కౌంట్ గదిలో అటూఇటూ తిరుగుతున్నాడు. అయితే ఇప్పుడేం చేస్తావు?" అన్నది నానా.

"వాణ్ణి కొట్టేస్తాను"

"అది అంత తెలివిగలపనికాదు. మరి నీ భార్యవిషయమో?"

"విడాకులకోసం దావావేస్తాను. నా దగ్గర రుజువుఉందిగా."

"అదీ అంత మంచిపనికాదు. అలాటిపని నే నెన్నటికీ చెయ్యనివ్వను" అన్నది నానా.

తరువాత శుష్కస్వరంతో ఇలాటిపనులవల్ల తన గౌరవ ప్రతిష్ఠలకు ఎలాభంగంకలుగుతుందో, తనబ్రతుకునలుగురినోళ్ళలోపడి,ఎలాబట్టబయలై పోతుందో చెప్పింది.

అయితే మాత్రం ఏం? నేను ప్రతీకారం తీర్చుకున్నవాడినవుతాను' అన్నాడు కౌంట్.

'ప్రతీకారానికి ఇది కాదు పద్ధతి.' అతను ఏదో చెప్పబోయాడు కాని చెప్పలేకపోయాడు.

తరువాత నానా అతనిపై మరోరాయివిసిరింది. 'నిన్ను బాధిస్తున్న విషయం నన్ను చెప్పమంటావా? నువ్వే నీభార్యను మోసగించావని బాధ పడుతున్నావు. ప్రతిరాత్రి అందుకే ప్రార్థనచేస్తున్నావు. మరి నీ భార్యను నువ్వెలా నిందించగలవు? నీవే దారిచూపావంటుంది ఆమె' అన్నది నానా.

ముఫత్ ఈ మాటలు వినేసరికి కుర్చీలో కుప్పకూలిపోయాడు. నానా ఒకక్షణం మౌనంగా ఊరుకున్నది. తరువాత మెల్లిగా 'నా తల మరీ కిందికి ఉన్నట్టుంది. కొంచెం కింద ఎత్తుపెట్టు' అన్నది.

అత నలాగే చేశాడు. నానా నిశ్వసించింది. మళ్ళీ కోర్టుద్వారా విడిపడడం అంత ఉచితంకాదని చెప్పింది. అప్పుడు తన విషయంకూడా అందరూ చెప్పుకుంటారు. ఏ అల్పబుద్ధిగల స్త్రీయో అయినట్లయితే అతన్ని అలాచెయ్యమని సలహాయిచ్చేదే-అతని ఖర్చుతో తనపేరు బైటికివస్తుందని. కాని, నానా అన్నిటికన్న ఎక్కువగా అతని సుఖశాంతులనేకోరింది. తరువాత మెల్లగా తనశుష్కహస్తాలను అతనిమెడకుచుట్టి. 'నా మాట విను. నీ భార్యతో సమాధానపడు' అన్నది.

కౌంట్‌కు కోపంవచ్చింది. అతనిహృదయం బ్రద్దలైపోతోంది. 'అ దెన్నటికీ సంభవంకా' దన్నాడు. నానా మృదువుగా బలవంత పెట్టసాగింది.

'ఏదో విధంగా సమాధానపడాలి. నేనే నిన్ను నీ కుటుంబానికి

దూరంచేశానని అందరూ చెప్పుకోవడం నీకు ఇష్టం ఉండదుకదా! మరి నాకు కూడా ఎంతో అపకీర్తివస్తుంది. అందరూ నన్నుగురించి ఏమనుకుంటారో చెప్పు! నన్నుమాత్రం ఎప్పుడూ ప్రేమిస్తాననిచెప్పు. అంతే చాలు. నువ్విప్పుడు మరొకరి కౌగిట్లోకి పోబోతున్నావు కాబట్టి....' అనినానా వెక్కివెక్కి ఏడ్వసాగింది.

అతను ముద్దాడి 'నువు వట్టి పిచ్చిదానివి. నిన్ను వదలి నే నెక్కడికి వెడతాను?' అన్నాడు.

'అవును. నీ వా పని తప్పకుండా చెయ్యాలి. అంతకంటె మంచి మార్గం లేదు కూడాను. ఏమైనా ఆమె నీ భార్య.'

ఇలా సలహాయిచ్చిందినానా. మధ్యమధ్య ఈశ్వరుని విషయంకూడా మాట్లాడింది. ఒక సమాధానమార్గాన్ని బోధించింది. తనజీవితాన్ని తన భార్యతో, ఉంపుడుకత్తెతోను పంచుకొని ప్రశాంతంగా జీవయాత్రసాగించాలనీ, ఇద్దరిలో ఎవరికీ నొప్పికల్గింరాదనీ చెపుతూంటే ఆమెకు సాలి వచ్చింది. 'ఈ విధంగా నే నొక మంచిపని చేసినదాన్నవుతాను. నన్ను నువ్వు మరింతగా ప్రేమిస్తావు' అన్నది నానా.

తరువాత నిశ్శబ్దం. ఆమెకళ్ళుమూసుకుంది. అప్పుడామె చనిపోయిన మనిషిలా కన్పించింది. ఒకఅగాధమైన బాధారేఖ ముఫత్‌ముఖాన్ని ఆక్రమించింది.గతరాత్రినుంచి అతనికికలిగినదెబ్బవల్లకలిగినదుఃఖంలోముఫత్‌కు ఆర్థికచిక్కులు జ్ఞాపకంరాలేదు. నానా ఇప్పుడు వాటిని జ్ఞాపకంచేసింది, ఇప్పు డతను ఎంతో దబ్బుయిబ్బందిలో ఉన్నాడు. ఈ చిక్కులనుంచి ఎలాతప్పించుకోవాలో అతనికి తోచడంలేదు. లెఫాండెటీనుంచి తిరిగివచ్చిన తరువాత అతనిభార్య కౌంటెస్ స్తైబెన్‌లో ఎంతోమార్పు కనుపిస్తోంది. భోగవిలాసాలపట్ల ఆమెకు ఆసక్తిహెచ్చింది. లౌకికసౌఖ్యాలలో మునిగి తేలాలనేవాంఛ అధికమైంది. ఈవాంఛ వారిస్థితిని ఇప్పటికే చాలావరకు అగ్నిదాహంతో ఆహరించివేసింది.

పారిస్ నగరంలో అందరూ ఆమె భోగలాలసతనుగూర్చి మాట్లాడుకుంటున్నారు. పాతభవనాన్ని మార్చి, సరికొత్తభవనంగా తయారుచెయ్యడానికి 500,000 ఫ్రాంకులు ఖర్చుచేసింది. ధనం ప్రవాహంలా కరిగిపోయింది.

నానా కళ్ళుమూసుకుని పడుకున్నది. ఆమెను అలా బలహీనస్థితిలో చూచినప్పుడు కౌంట్‌కు భయంకలుగసాగింది.

తరువాత నానాకళ్లుతెరచి నిశ్వసించి, 'అయితే వివాహం ఎప్పుడు ఏర్పాటైంది?' అని అడిగింది.

"మంగళవారంనాడు కాంట్రాక్టుపై సంతకాలవుతాయి."

నానా ఇంకా కళ్లుమూసుకునే, అంధకారమయ భావజగత్తులోనుంచి మాట్లాడుతున్నట్లుగా, 'మీకు ఏది ఉచితమని తోస్తే అలా చెయ్యండి. నామట్టుకు నాకు అందరూ సుఖంగా ఉండడమే అభిమతం' అన్నది.

అతను అనునయంగా ఆమెచేతిని తనచేతిలోకి తీసుకున్నాడు. 'ముందు నువు విశ్రాంతితీసుకో' అన్నాడు. అతన్ని ఇంతవరకూ వేధించిన కోపం అంతరించింది. ఆ పడకగదిలో-ఆ వెచ్చదనంలో-ఈ ఈథర్ పరిమళంలో - అతన్ని ఒకవిధమైనప్రశాంతి ఆవరించింది. ఆ వెచ్చనిపక్కస్పర్శవల్ల అతనిలో గాయపడిన పురుషత్వం మెల్లగా తేరుకొన్నది. అతను ఆమెమీదికి వంగి, ఆమెనుకౌగలించుకున్నాడు. ఆమెముఖం నిశ్చలంగా ఉన్నప్పటికీ ఆమె పెదవులమీద చిరునవ్వు తాండవించింది. అంతలో అక్కడికి డాక్టర్ బాటరెల్ వచ్చాడు.

"ఎలాఉంది అమ్మాయ్?" అన్నాడు ఎంతో చనువుగా.

డాక్టర్ అందగాడు; యువకుడు. పారిస్‌నగరంలోని సభ్యసమాజంతో బాగా పరిచయంఉన్నవాడు. ఎప్పుడూ నవ్వుతూ స్త్రీలతో ఎంతో స్నేహంగాఉంటాడు. ఇలా నవ్వుతూ మాటాడుతూనే ఫీజులు దండిగా వసూలుచేస్తాడు. స్త్రీలందరూ అతనంటే చాలా గౌరవిస్తారు.

డాక్టర్ రాగానే ముఫత్ లేచి గదిలోనుంచి వెళ్ళిపోయాడు. తలుపుదగ్గరకువెళ్ళినకౌంట్‌ను నానా వెనక్కిపిలిచి నుదుటిపైముద్దాడి, 'నేను చెప్పినట్టు చేస్తావుకదూ? లేకపోతే నాకు చాలా కోపంవస్తుందిసుమా!' అన్నది.

కౌంటెస్ సెబైన్ తనకుమార్తె వివాహపు కాంట్రాక్టుపై మంగళవారంనాడు సంతకాలుకావాలని అభిలషించింది. ఆనాడే ఆమెనూతనగృహప్రవేశంకూడా జరుగుతుంది. 500 ఆహ్వానపత్రాలు పంపించబడ్డాయి.

ఆ విందు వసంతఋతువులో జరుగుతున్నది. జూన్‌మాసపు సాయంత్రం ఎంతో వెచ్చగా హాయిగొలుపుతూంటుంది. బాల్ డాన్సు డ్రాయింగ్ రూమ్‌లోనేకాక, ఆరుబయట తోటలోకూడా జరుపవచ్చు.

కౌంట్ దంపతులు ద్వారంవద్దనిల్చొని, అతిధులందరికి స్వాగతం చెప్పారు. అప్పుడప్పుడే అందంగా వెలిగించబడిన దీపాల కాంతులు పాల రాతిమెట్లపై ప్రతిఫలిస్తున్నాయి.

డాన్సింగ్ ప్రారంభించబడింది. ఆర్కెస్ట్రా తోటలో ఏర్పాటు చెయ్యబడింది. వెనీషియన్ దీపాల వెలుగునీడలలో తోటంతా మంత్రలోకంలాకనుపిస్తోంది. తోటచివర ఫలహారాలు ఉంచడంకోసం ఒక చిన్న డేరా వేశారు.

కౌంట్ తల్లి పాతస్నేహితులందరూ మంటచుట్టూ చేరారు, మేడమ్ డూ జాన్‌కాయ్ మొదట్లో కొత్తమార్పులను గుర్తించలేక సరాసరి భోజనశాలలోకి వెళ్ళింది. మేడమ్ ఛాంతెరె తోటకేసి ఆశ్చర్యచకితురాలై చూస్తున్నది.

'సెబైన్‌కు పిచ్చెత్తినట్టుంది. చూడు—వాకిలిదగ్గర ఎలా నిలబడి ఉన్నదో-ఒంటినిండా వజ్రాలు అలంకరించుకున్నది'అన్నది, మేడమ్ డూ జాన్‌కాయ్.

వారిద్దరూ ఒకక్షణం కౌంట్‌ను, కౌంటెస్‌ను దూరాన్నుంచి పరకాయించిచూచారు. సెబైన్ అద్భుతమైన 'ఇంగ్లీష్‌లేస్' అల్లిన చక్కని తెల్ల దుస్తులలో మెరుపుతీగలా మెరసిపోతోంది. యౌవనం, జీవం, కైపుఆమెచిరునవ్వులో వెల్లివిరుస్తున్నాయి. ముఫత్ ఆమెప్రక్కన వృద్ధునిలా కన్పిస్తున్నాడు.

తరువాత ఆ వృద్ధస్త్రీలిరువురూ వివాహాన్నిగూర్చి మాట్లాడుకోసాగారు. ఈస్టెలీ సిల్కుడ్రెస్‌లో అప్పుడే అటుపోతున్నది, ఆమె ముఖం నిర్మలంగా అనాఘ్రాతపుష్పంలావుంది. ఆమె ఎదురుచెప్పకుండా డానెట్‌ను వివాహంచేసుకోడానికి అంగీకరించింది. ఆమెముఖంలో సంతోషమూకన్పించడంలేదు; దుఃఖమూ కన్పించడంలేదు. చుట్టూ తనకోసం ఇంత గొప్ప ఆనందమేళ జరుగుతున్నా ఆమెమాత్రం నిశ్చలంగా ఉంది.

'అదుగో, డానెట్ వస్తున్నాడు!' అన్నదిమేడమ్ ఛాంతెరె. మేడమ్ హూగన్ తనకుమారులతో కలసివచ్చింది. డానెట్ ఆమెచెయ్యి పట్టుకుని కూర్చోబెట్టాడు. ఆమెపట్ల ఎంతో అనురాగపూర్వకమైన సాన్నిహిత్యాన్ని ప్రదర్శించాడు.

'థాంక్‌యు, ఇది నా పూర్వస్థలమే' అని ఆమెకూచున్నది. డానెట్ అచటినుంచి వెళ్ళిపోయిన తరువాత, 'నీ వతన్ని ఎరుగుదువా?' అని అడిగింది. మేడమ్ జాన్‌కాయ్.

'బాగా తెలుసు. చాలా మంచికుర్రాడు. జార్జ్‌కి ఇతనంటే ఎంతో ఇష్టం. అతనిది చాలా గొప్పకుటుంబం!' అన్నది మేడమ్ హూగన్. అతని తండ్రిపట్ల లూయీ ఫిలిప్‌కు ఎంతోగౌరవం. ఈ కుర్రవాడు కాస్త చెడిపోయివుంటే చెడిపోయిఉండవచ్చు ఏమైనా అతనిపినతండ్రులల్లో ఒకని ఆస్తి ఇతనికి వస్తుంది మేడమ్ హూగన్ ఈ విషయాలు చెబుతూంటే ఆ స్త్రీలిద్దరూ ఏమీపట్టపట్టు తలలూపారు. 'ఏమైనా ఈస్టెలీకి మరో మంచి సంబంధంచూచి ఉండవలసింది' అన్నది మేడమ్ ఛాంతెరె.

ఆర్కెస్ట్రా సంగీతం ప్రారంభమైంది. అతిథులు గదిలోప్రక్కలకు సర్దుకున్నారు. తేలికదుస్తులు ధరించినస్త్రీలు నల్లనిసూట్లు ధరించిన పురుషులతో బాల్‌డాన్స్ ప్రారంభించారు. సముద్రంలా కనిపిస్తున్న శిరస్సులపై దీపకాంతి జాలువారుతోంది. స్త్రీలుధరించిన మణిహారాలు మిలమిలా మెరుస్తున్నాయి. సాటిన్లు, సిల్కులు, నగ్నభుజాలు, ఆర్కెస్ట్రా సంగీతం- ఈ వాతావరణంలోనుంచి ఒక చక్కని పరిమళం ఉత్పన్నమైంది. మిగతా గదులలో స్త్రీలు బారులుతీరి కూర్చున్నారు. కన్నులమిలమిలలు, నవ్వులతళతళలు వెల్లివిరిసిపోతున్నాయి. ఇంకా అతిథులు వస్తూనేఉన్నారు. ఒక సేవకుడు వస్తున్నఅతిథులపేర్లు ముందే చెపుతున్నాడు.

రాను రాను ఫలహారాలదేరా క్రిక్కిరిసిపోతూన్నది. లాఫలాసి స్త్రీలవంక అదోవిధంగా చూస్తున్నాడు. వీనట్ డానెట్‌తో ఏదోవిషయం దీర్ఘంగా సంభాషిస్తున్నాడు.

మేడమ్ జాన్‌కాయ్, మేడమ్ ఛాంతెరె ఇలా మాట్లాడుకుంటున్నారు, 'ఇది అతని జీవితంలో చివరిఅధ్యాయం. ఆ లంజ ఇతన్ని పూర్తిగా గుప్పిట్లో పెట్టుకున్నది. ఎలాంటి దైవభక్తుడు ఎలా అయిపోయాడు'అన్నది

మేడమ్ జాన్‌కాయ్; కౌంట్ ముఫత్‌నుగురించి ప్రస్తావిస్తూ 'పూర్తిగా నాశనమైపోతున్నట్టున్నాడు. నా భర్తకుకూడా తెలిసింది. ఎప్పుడూ దాని భవనంలోనే పడిఉంటాడట. పారిస్‌నగరమంతా చెప్పినవోటచెప్పకుండా ఇదేవిషయం చెప్పుకుంటుంటోంది. నా మట్టుకు నేను సెబైన్‌ను క్షమించను. అదీ ఇలా డబ్బువిరజిమ్మితే — ' అంటోంది మేడమ్ ఛాంతెరె

'ఇద్దరూ రెండుచేతులా ఉన్నదికాస్తా నాశనంచేస్తే, ఇక ఆ అగాధంలోంచి బయటపడలేరు' అన్నది జాన్ కాయ్. ఆ సందర్భంలో వీనట్ అక్కడికివచ్చి, 'అంతా అయిపోయినప్పుడు ఈశ్వరుడే తన సహాయాన్ని అందిస్తాడు' అన్నాడు.

ఒకప్పుడు అతను ఈ కుటుంబానికంతా యాజమాన్యం వహించాడు. ఇప్పుడు అతనే ఈ కుటుంబపతనానికి దోహదంచేస్తున్నాడు. తన చేతుల్లోనుంచి అన్నివిషయాలు దాటిపోయాయని అతను గ్రహించాడు. ఏది ఎలాజరిగినా అతను చెయ్యకలిగింది ఏమీ లేదనేనిశ్చయానికి వచ్చాడు. కౌంట్ నానావల్లోపడడం, ఫాష్‌రె కౌంటెస్‌ల సంబంధం, డానెట్ ఈస్టెలీల వివాహం - అన్నీ అంగీకరించాడు.

బాల్‌డాన్స్ మరింత ఉత్సాహంగా సాగుతోంది. మహా కోలాహలంగా సాగుతున్న ఆ డాన్స్‌తో భవనమంతా రంకులరాటంలా భ్రమిస్తున్నట్టున్నది. స్త్రీలకళ్ళు ఎరుపెక్కి ఎర్రనిరాళ్ళలా మెరిసిపోతున్నాయి. అరతెరచిన పెదవులపై కైపుతోకూడిన మందహాసరేఖలు తాండవిస్తున్నాయి. వందలమందియువతుల నగ్నభుజాలు మిలమిల్లాడుతున్నాయి.

తోటవాకిలివద్ద నిల్చునిఉన్న లాఫలాసి, 'కౌంటెస్ అద్భుతంగా ఉంది. తనకుమాత్రేకంటె పదేండ్లుచిన్నదిలాగా కన్పిస్తున్నది. వాండెవ్రె ఆమె తొడలు అంతఅందమైనవికావనేవాడు నిజమేనా?' అన్నాడు ఫాకర్‌మాంట్‌తో.

'అడుగో. ఆవిషయం చెప్పగలవాడు వస్తున్నాడు. అతన్నేఅడుగు.'

ఫాష్‌రె అప్పుడే వస్తున్నాడు. ఆ కుటుంబానికి సన్నిహిత స్నేహితుడుకాబట్టి భోజనశాలలోగుండా వస్తున్నాడు. 'అగు, ఒక్కమాట. ఆ తెల్లసిల్కుతోఉన్న స్త్రీని చూచావా?' అన్నాడు లాఫలాసి,

'అవును. కౌంటెస్' అన్నాడు ఫాష్‌రె.

'అయితే నా కొకవిషయం చెప్పు. పదిలూయీలు పందెం. ఆమె తొడలు అందంగాఉంటాయా?' అని లాఫలాసి పగలబడినవ్వాడు.

'ఇడియట్!' అని ఫాష్రె జనాన్ని తప్పించుకుంటూ వెళ్ళిపోయాడు. ఆర్కెస్ట్రా మళ్ళీ 'బ్లాండీవీనస్' ప్రారంభించింది. ఫాష్రె మొట్టమొదట కౌంటెస్ సెబెన్‌కు వంగి నమస్కరించాడు. ఆమె చిరునవ్వునవ్వింది. తరువాత కౌంట్ వెనకాల ఒకక్షణం నిశ్చలంగా నిల్చున్నాడు. కౌంట్ గంభీరంగాఉన్నాడు. తనచూపులుదించి, ఫాష్రెవంక చూచాడు. మరింత గాంభీర్యాన్ని వహించాడు. కొద్దిక్షణాలపాటు ఇద్దరూ ఒకరినొకరు చూచుకున్నారు. ఫాష్రె ముందుగా చెయ్యిజాస్తే కౌంట్ తనచేతిని కలిపాడు. కౌంటెస్ సెబైన్ నేలకేసిచూస్తూ చిరునవ్వునవ్వింది. ఆర్కెస్ట్రాసంగీతం ఇంకా సాగుతూనేఉంది. 'ఇద్దరిచేతులూ కలిసినట్టున్నాయే?' అన్నాడు ఫాకర్‌మౌంట్.

ఈస్టెలీ దగ్గరకు వచ్చింది. ఫాష్రె ఆమెను అభినందించాడు, ఆమె పసిపిల్లలాగా అమాయకంగా అతనివంక చూచింది. డానెట్‌కూడా హృదయపూర్వకంగా ఫాష్రెతో కరస్పర్శచేశాడు.

ఆర్కెస్ట్రా ఇంకా కామోద్దీపకస్వరప్రసారాన్ని సుడిగుండం త్రిప్పినట్టు త్రిప్పుతూనే ఉన్నది. సంగీతం జలలు జలలుగా పొరలివస్తోంది. ఫిడేళ్ళు నిశ్వాసాలు విడిచినట్టు పాడుతున్నాయి.

తరతరాలుగాసాగివస్తున్న ఆ పురాతన కుటుంబగౌరవం ఆనాడు పేకమేడలా కూలిపోతున్నట్టుగా ఉన్నది. ఆ విలాస వినోదోత్సవాలకు ఆ భవనం కూలిపోయేటట్టున్నది. ఆ నాటి ఆర్కెస్ట్రాసంగీతం ఒక పురాతన జాతికి, సంప్రదాయానికి అంత్యకాలగంటలను మ్రోగింపజేస్తున్నట్టుగా ఉన్నది. నానా అదృశ్యరూపంతో ఆ వాతావరణాన్నంతా ఆవరించి, అందరినీ తనకల్మషంలో ఉడికించేస్తున్నట్టుగా ఉంది.

వివాహంనాటిరాత్రి కౌంట్ ముఫత్ తనభార్య పడకగదిలోకి వెళ్ళాడు. అతను రెండుసంవత్సరాలనుంచి ఆ గదిలో అడుగుపెట్టలేదు. అతనిరాక కౌంటెస్‌కు అత్యంత ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమె చిరునవ్వు నవ్వింది. అతను అస్పష్టస్వరంలో ఏవో కొన్నిమాటలుమాత్రం చెప్పగలి

గాడు. తరువాత ఆమె ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చింది. ఆ రాత్రి వారిరువురికి సమాధానం కుదిరింది.

ఈనాడుకూడా నానా రెండుగంటలవరకు నిద్రిస్తూనేఉన్నది. 'జో? ఆమెను మేలుకొలుపలేదు. నానాయే మెల్లగా కళ్ళుతెరచి, 'ఎవరదీ?' అన్నది.

ఆ క్షణంలో అక్కడికి డానెట్ వచ్చాడు. 'పెళ్ళిరోజున ఇలావచ్చావేమిటీ?' అన్నది నానా.

అతను నానాపక్కదగ్గరకువచ్చి 'నా అమాయకత్వాన్ని అడిగావు కదా! తీసుకొచ్చాను.'

నానా కళ్ళల్లో నీరుక్రమ్మేటంతగా నవ్వింది. 'ఏదీ ఒక్క ముద్దివ్వు. సరాసరి చర్చినుంచే వస్తున్నావా? ఇదేగా చివరిముద్దు' అన్నది.

డానెట్ ఆనాడే భార్యతోకలిసి వెళ్ళిపోవాలి.

# 13

సెప్టెంబర్ నెల చివరిరోజులు. ఆ సాయంత్రం కౌంట్‌ముఫత్ నానాగృహంలో భోంచెయ్యాలి. సాయంత్రమయ్యేసరికి అతనువచ్చి తను 'తూలెరి'కి తక్షణమే వెళ్ళాలని ఆజ్ఞ వచ్చినదని చెప్పాడు. ఇంకా దీపాలు వెలిగించలేదు. వంటింట్లో సేవకులు బిగ్గరగా నవ్వుతున్నారు. కౌంట్‌మెల్లగా మెట్లెక్కి పైకివెళ్ళాడు. నిశ్శబ్దంగా తలుపు తెరిచాడు. గులాబిరంగుసూర్యకాంతి గదిలో పడుతున్నది అప్పుడప్పుడే మునిమాపుకాంతులు గదిలోకి చొరబడుతున్నాయి. ఆ సంజచీకటిలో నానా జార్జ్‌చేతుల్లో వాలిఉండడం కౌంట్ కళ్ళబడింది అందుకు సందేహమేమీలేదు. ఇక వారు ఎంతకాదన్నా లాభంలేదు. కౌంట్ ఈ దృశ్యాన్నిచూచి, అరవబోయి అరవలేక స్తబ్ధుడై నిల్చున్నాడు.

నానా వెంటనే ఎగిరిపడిలేచి, అతన్ని పడకగదిలోనికి లాక్కెళ్ళింది.

ఇలా హఠాత్తుగా పట్టుబడినందుకు నానాకూడ ఆశ్చర్యస్తబ్ధురాలైంది. ఇంతకు ముందెన్నడూ ఆమె ఇంత అశ్రద్ధగాప్రవర్తించలేదు. ఇలా సంభవించడానికి చాలాకారణాలు దోహదంచేశాయి. నానాకు జార్జ్‌తో ఒక చిన్నపోట్లాట వచ్చింది. దానికికారణం జార్జ్ ఫిలిప్‌పట్ల విపరీతంగా

అసూయపడజొచ్చాడు. నానాభుజంమీద వాలి, వెక్కి-వెక్కి ఏడ్చాడు. ఆమె భరించలేకపోయింది. ఆమెకు ఏంచెయ్యాలో, జార్జ్‌ని ఎలా ఓదార్చాలో తెలియలేదు. అతనిపట్ల అమితజాలి కలిగి, అతనికోరిక మన్నించకుండా ఉండలేకపోయింది. తనది జాలిగుండె అయినందుకు ఫలితం ఇదేనా అనుకున్నది.

ఆమె పడకగదిలో ప్రవేశించినప్పుడు గది చీకటిగావుంది. నానా వెంటనే లాంతరుతెమ్మని అరిచింది. జో లాంతరుతీసుకొచ్చింది.

కౌంట్ చేతులు మోకాళ్ళమీదపెట్టుకుని గంభీరంగా కూచున్నాడు. కోపంవల్ల ఒక్కమాటకూడా మాట్లాడలేకపోయాడు. అతన్నేదో పెద్ద భయం ఆవేశించినట్టుగా వణికిపోసాగాడు. ఈ మౌనబాధ నానాకు ఎంతో కష్టంకలిగించింది. ఆమె అతన్ని ఓదార్చడానికిప్రయత్నించింది.'నిజమే నాది తప్పే. నేనెంతో పశ్చాత్తపిస్తున్నాను. నన్ను క్షమించు' అన్నది నానా.

అతనిపాదాలవద్ద కూచున్నది. మృదువుగా, జాలికొల్పే చూపులతో అతన్ని బ్రతిమిలాడసాగింది. కౌంట్ పల్లెత్తుమాటకూడా అనలేదు. ఒక దీర్ఘనిట్టూర్పు విడిచాడు, అంతే. ఆమె ప్రార్థనలకు లొంగిపోయాడు. జార్జ్‌ని పంపివెయ్యమన్నాడు. కాని, ఏంలాభం? అతని స్వప్నసౌధము నేలమట్టమైంది. ఇక నానాను ఎలా నమ్మగలడు? ఇకముందు నానాను అతన్ని బంధించేది విశ్వాసంకాదు. నానాలేకుండా తను జీవించలేనేమో ననే భయంమాత్రమే.

మధ్యాహ్నభాస్కరుడు చండప్రచండంగా వెలిగిపోతున్నట్టు, నానా పారిస్‌నగర సౌందర్యగగనంలో వెలిగిపోతున్నది. పాపమనేఆకాశంలో ఆమెతీక్ష్ణత మరింత హెచ్చింది. తనభోగభాగ్యాల నిరంతరప్రదర్శనద్వారా, డబ్బుపట్ల ఆమెకుగల తృణీకారభావంద్వారా ఆమె సమస్త పారిస్ నగరాన్ని ఆక్రమించి ఆచ్ఛాదించింది.

ఆమెభవనంలో నిత్యం ఒక పెద్ద కామాగ్నిగుండం ప్రజ్వరిల్లుతున్నట్లుగా వున్నది. ఆరని తీరని ఆమె దాహ - మోహాలు ఆ అగ్నిగుండం చల్లారకుండా ఆజ్యంపోస్తున్నాయి. ప్రతిక్షణం బంగారం గాలికి ఎగిరిపోతోంది. ఆమె శాశ్వతంగా కళ్ళుమూసినక్షణంలో ఆ బంగారం మసిగా మారుతుంది. ఆ భవనం ఒక అగాధభీకరమైనలోయపై నిర్మింపబడినట్టుగా

ఉన్నది. ఆ లోయలోకి ఎందరో పురుషులు తమ ధన-ధాన్యాలతో, నడిచి వెళ్ళారు. కాని ఒక్కరూ బయటికి రాలేదు. మిగిలినది వారి బుసిమాత్రమే.

నానా భవనంలో భోజనవ్యయమే నెలకు 5 వేల ఫ్రాంకులు. సేవకులు చెప్పరానంతగా వస్తువులన్నీ వృథాచేస్తారు. జాడీలు జాడీలు మద్యం పారబోసేస్తారు. వంటింటిని విక్టొరైన్, ఫ్రాన్సిస్‌లు తమ ఇచ్ఛానుసారంగా ఏలుతున్నారు.

నానాదుస్తులఖర్చు పదివేల ఫ్రాంకులు. కొన్నదుస్తులు ఒకటిరెండు సార్లుమాత్రమే ధరించి, పారేస్తుంది. జో ఆ దుస్తులను అమ్ముతుంది. ఇక వజ్ర-వైఢూర్యాలకు లెఖ్ఖేలేదు. ఇంట్లో ఎక్కడచూచినా అవే. విలువ గల ఏ వస్తువూ నానా దృష్టిని తప్పించుకోలేదు. ఆమెచేతుల్లో పడిన ఏవస్తువైనా స్వచ్ఛంగాఉండడం అసంభవం. ఆమె కోమలహస్తాల్లోపడిన ప్రతివస్తువూ పగిలి, ధ్వంసమైపోవడమో లేక మాసిపోవడమో జరిగితీరుతుంది. ఆ సంవత్సరం నానాఖర్చు ఒక మిలియన్‌కు దాటింది. ఎందరెందరు ప్రేమికులు ఎంతడబ్బు గుప్పినా, ఏమీ మిగలకుండా అయిపోయేది.

నానాకు ఇంకా ఒక్కకోరిక మిగిలిఉంది. తనపడకగదిని మరోసారి అలంకరించుకోవా లనుకున్నది. గులాబీరంగులో పడకగదిని అలంకరిస్తే తన శరీరంతో సమ్మేళనం పొందుతుం దనుకున్నది. శయనాగారంలో ముఖ్యమైనది పడక కాబట్టి నానా ఇంతవరకూ పారిస్‌లో ఎక్కడా కనివిని ఎరుగని పడకను ఊహించుకున్నది.

ఒక బంగారపుమంచం తయారుచేయించాలి. ఆ శయ్యపై తను నగ్నంగా పడుకుని పారిస్‌నగరంపై ఏకఛ్ఛత్రాధిపత్యాన్ని సాగించాలి. ఈ విషయంలో లాబొర్డ్‌టీని సలహాఅడిగింది. అతను ఇద్దరు బంగారుపని వాండ్రను తీసుకొచ్చాడు. ఆ శయ్యఖరీదు 50 వేల ఫ్రాంకులు అవుతుం దన్నారు. ముఫత్ ఆ శయ్యను ఉగాదిబహుమతిగా నానాకు బహూకరించాలి.

నానాకు ఒకవిషయం మరీ ఆశ్చర్యాన్ని కల్గించింది. ఎటునుంచి చూచినా ఇంతడబ్బు ప్రవాహంలా వస్తున్నా, తనకు డబ్బుకు ఇరకాటంగానే ఉంటోంది. ఒక్కొక్కరోజున చేతిలో చిల్లరడబ్బులుకూడా ఉండవు. 'జో' వద్ద అప్పుతీసుకోవలసివచ్చేది. లేకపోతే నవ్వుతూ స్నేహితులజేబుల్లో

చిల్లరడబ్బులుకూడా ఖాళీచేస్తుండేది. ఈవిధంగా కొన్నినెలలనుంచి ఫిలిప్ జేబులు ఖాళీచేస్తూవచ్చింది. తరువాత అతనిదగ్గర కొద్దికొద్దిగా అప్పులుచేస్తూ వచ్చింది. జూలై నెలలో ఫిలిప్ కెప్టెన్ అయినాడు. నానా ఒక్కచూపు చూస్తే అతను మంచులా కరిగిపోయి, డబ్బుతెచ్చి ఇచ్చేవాడు.

ఒకరాత్రి నానాకు ఎందరో బహుమతులు పంపారు. కెప్టెన్ ఫిలిప్ కూడా ఒక సువర్ణచూళికను బహుమతిగా తీసుకొచ్చాడు. అతను వచ్చేసరికి ఆమె ఒంటరిగా డ్రెస్సింగ్‌రూమ్‌లో ఉన్నది. అప్పుడే స్నానంచేసివచ్చి వదులుగాఉన్న తెల్లనిసిల్కుగౌను ధరించి ఎంతో అందంగాఉన్నది.

'ఎంత అందంగా ఉన్నావు!' అన్నాడు ఫిలిప్.

"నువ్వేం బహుమతి తేచ్చావో చూపించు."

అతనుతెచ్చిన బంగారుపెట్టెను తనచేతిలోకి తీసుకున్నది.

"పగిలిపోతుంది. జాగ్రత్తగా పట్టుకో" అన్నాడు ఫిలిప్.

అతను ఆ మాట అనీఅనకముందే ఆ పెట్టె ఆమెచేతుల్లోనుంచి క్రిందపడి పగిలింది. 'అయ్యో! పగిలిందే' అని నానా నవ్వసాగింది. నేల మీద పగిలిన ముక్కలు ఆమెకు ఎంతో విచిత్రంగా కనుపించాయి. వస్తువులు నాశనంచేసి నవ్వే శిశువులాగా ఆమె నవ్వుతోంది. ఫిలిప్‌కు ఒకక్షణం కోపంవచ్చింది. ఆ వస్తువుకోసం తా నెంత తాపత్రయపడ్డాడో ఆమె కేం తెలుస్తుంది? అతను తల్లక్రిందులై పోవడం చూచి నానా 'నా తప్పేముంది? చేతుల్లోనుంచి జారిపడి పగిలింది' అన్నది.

ఇలాఅని మళ్లీ నవ్వింది. ఫిలిప్‌కళ్ళలో నీళ్ళుతిరిగాయి. నానా అతని మెడకు చేతులుచుట్టి - 'ఎంత పిచ్చివాడివోయ్! నామీద కోపంవచ్చింది. కదూ? నీమీద నాకు ప్రేమలేదనుకున్నావు కదూ? కాని నిన్ను నిజంగా ఎంతో ప్రేమిస్తున్నాను తెలుసా? వస్తువులు పగలకపోతే ఎలా ? కొత్తవస్తువులు ఎలా అమ్ముడవుతాయి? వస్తువులన్నీ పగిలిపోవడానికే తయారు కాబడుతున్నాయి. ఈ విసనకర్ర చూడు!' అంటూ ఆమె ఒకవిసనకర్ర పుచ్చుకుని, రెండుగా పగలదీసింది. సిల్కువిసనకర్ర రెండుముక్కలైంది. ఆ విసనకర్ర అలా ముక్కలు కావడం నానాకు ఎంతో ఆనందాన్ని కల్గించింది. తను ఈ బహుమతులను ఎంతమాత్రం లెక్కచెయ్యనంటూ, మరి కొన్ని వస్తువులనుకూడా పగలకొట్టింది.

ఆమె శూన్యనయనాల్లో ఒక చిన్న అరుణరేఖ తోచింది. ఈవిధంగా అన్నివస్తువులనూ విధ్వంసంచేసి పెద్దగానవ్వుతూ, 'అన్నీ నశించాయి! మిగిలిందేమీలేదు' అన్నది.

ఫిలిప్‌కూడా ఈ ఉన్మాదానికి వశుడైపోయి ఆమె మెడమీద, వక్షస్థలంమీద ముద్దులవర్షం కురిపించాడు. ఆమెకూడా అతని బిగికౌగిలిలో పావురాయి పిట్టలా ఒదిగిపోయింది. అతని పెదవులపై పెదవులానించి ముద్దుముద్దుగా "రేపు పదిలూయీలుతెచ్చిపెట్టవూ?' అన్నది.

అతనిముఖం వివర్ణమైంది.

ఒక్కనిమిషం నిశ్శబ్దం. ఆమె డ్రెస్‌చేసుకుంటోంది.

ఫిలిప్ తనఫాలభాగాన్ని ఒక కిటికీగ్లాసుకు ఒత్తుకున్నాడు. అతను తిరిగివచ్చి 'నానా! నువు నన్ను వివాహం చేసుకోవాలి' అన్నాడు.

నానా నవ్వుతూ 'నీకు పిచ్చెక్కిందా ఏమిటి?' అన్నది.

ఈలోగా గదిలోకి జో వచ్చింది. గదినిండా చెల్లాచెదరుగా పడి ఉన్న వస్తువులను చూచింది. నానా వాటన్నిటిని వూడ్చి పారబోయమన్నది.

ఆవాళ జార్జ్‌ని రావద్దన్నది నానా. కాని, అతను నెమ్మదిగా పిల్లిలా ప్రవేశించాడు. అతను ప్రవేశించేసరికి తన అన్నగొంతు విన్పిస్తోంది. అతను తలుపుదగ్గర నిల్చుని, ముద్దులు, వివాహప్రస్తావన— అన్నీ విన్నాడు. అతనిహృదయం గడ్డకట్టినట్టయింది.

అతను సరాసరి ఇంటికివెళ్ళి, వెక్కివెక్కి ఏడ్వసాగాడు. ఈసారి అతనిఅనుమానం రుజువైంది. నానా ఫిలిప్‌కౌగిలిలోఉన్నట్టు ఒక భయంకర దృశ్యం అతనికళ్ళముందు తాండవించసాగింది. తనలో తుఫానులా చెలరేగుతున్న అసూయను, అతను భరించలేకపోయాడు. రాత్రి గడవడం కష్టమైంది. భయంకర జ్వరాగ్ని అతని నరనరాలను కదిపి, కుదిపేసింది. ఆ క్షణంలో అక్కడ తన అన్న ఉన్నట్లయితే అతన్ని తక్షణం చాకుతో పొడిచేసేవాడు.

తెల్లవారిన తరువాత అతనికి ఏం చెయ్యాల్లో తోచలేదు. బస్‌క్రిందకు దూకి, ఆత్మహత్యచేసుకోవాలి! అంతకన్న వేరే గత్యంతరం ఏమున్నది? పదిగంటలకు బైటికివెళ్ళాడు. పారిస్‌నగరంవీధులన్నీ తిరిగాడు. తరువాత

నానాను చూడాలనే వాంఛ తీవ్రమైంది. మూడుగంటలకు నానా భవనంలో ప్రవేశించాడు.

ఆ నాడు మధ్యాహ్నమయ్యేసరికి మేడం హూగన్‌కు ఒకదుర్వార్త చేరింది. క్రితంరోజు సాయంత్రం పన్నెండువేల ఫ్రాంకులు దొంగిలించి నందుకు ఫిలిప్‌ను ఖైదులోఉంచారు. మూడునెలలనుంచి అతను చిన్నమొత్తాలను అపహరిస్తూవచ్చాడు. తనకొడుకుచేసిననేరానికి తల్లికి పట్టరానికోపం వచ్చి, మొట్టమొదట నానాను నిందించింది. ఫిలిప్‌కు నానాకు సంబంధం ఉన్నదని ఆమెకు తెలుసు. ఆమె కుర్చీలో కుప్పకూలికూచున్నది. ఆమెకు ఏం చెయ్యాలో తోచలేదు. ఇంతలో ఆమెకు జార్జ్ జ్ఞాపకం వచ్చాడు. ఈ దుర్భరపరిస్థితినుంచి అతను సంరక్షించబడవచ్చునమకున్నది. అంచేతనెమ్మదిగా కాళ్లీడ్చుకుంటూ మేడపైకి వెళ్ళిచూచింది. కాని, అక్కడ జార్జ్‌లేడు. జార్జ్ పెందరాళే వెళ్ళిపోయాడని ద్వారపాలకుడుచెప్పాడు. ఇది మరో అఘాతం. జార్జ్‌గది చిందరవందరగాఉంది. ఒకకుర్చీ ఒకమూలకు విసిరెయ్యబడివుంది. జార్జ్‌కూడా నానా భవనానికే వెళ్ళిఉంటాడు.

ఆనా డంతా నానాకు మనస్సేమీ బాగుండలేదు. అప్పులవాళ్ళు ఒకటే వచ్చిపోతున్నారు. ఈ అప్పులవారిగొడవతో నానాకు భోజనంకూడా సరిగా రుచించలేదు. రెండుగంటలయ్యేసరికి లాబోర్డెటీ వచ్చాడు. ఆమె తయారుచేయించదలుచుకున్న బంగారుశయ్య డిజైను తీసుకొచ్చాడు ఆమె ఇతరగొడవలన్నీ మరచిపోయి ఆ ఆనందంలో నిమగ్నురాలైంది. ఆ డిజైను చూడగానే చప్పట్లుచరుస్తూ నృత్యం చెయ్యసాగింది. అతను ఆ డిజైన్‌ను గూర్చి వివరించి చెప్పసాగాడు. 'ఇది పడవ - ఇది గులాబిపూగుత్తి - ఇది రతీమన్మధుల నృత్యవర్తులం—' ఇలా వివరించసాగాడు.

నానా పట్టరాని ఆనందంతో తన్మయీభూతురాలైంది. ఇలాంటి శయ్యపై ఏ సామ్రాజ్ఞికూడా పవళించలేదనిచెప్పారు బంగారుపనివాండ్రు. పాదాలవద్ద అలంకరించడం కోసమని మరో కొత్తడిజైను చూపాడు లాబోర్డెటీ. అది రాత్రిదేవతను ఫ్రీగా మలచిన విగ్రహం. రాత్రిదేవత మేలిముసుగు ధరించిఉన్నది. ఒకప్రియుడు ఆమెనగ్నసౌందర్యం బహిర్గతమయ్యేటట్టుగా ఆ ముసుగులాగుతున్నాడు. ఆ చిన్నప్రతిమలో చీకటితప్పులకు ఇలవేల్పయిన తనప్రతిబింబాన్ని' చూచింది నానా.

'దీనిఖరీదు ఆరువేల ఫ్రాంకు లవుతుంది' అన్నాడు లాబోర్డెటీ.

'నా ప్రియ ముఫత్ ఇస్తాడులే' అన్నది నానా.

నానా అతన్ని మెట్లదాకా సాగనంపుతూ, నీదగ్గర పదిలూయీలు ఉన్నాయా?' అని అడిగింది.

లాబోర్డెటీ ఎన్నడూ స్త్రీలకు అప్పివ్వడు. 'లేదమ్మాయీ. కావలిస్తే ముఫత్‌వద్ద తెచ్చిఇస్తాను' అన్నాడు.

నానా 'వద్దులే. ఇక ముఫత్‌వద్ద లాభం లే' దన్నది. రెండురోజుల క్రితమే 5 వేల ఫ్రాంకులు తీసుకున్నది. లాబోర్డెటీ వచ్చివెళ్ళగానే, మళ్ళీ అప్పులవాడు వచ్చి గొడవచెయ్యసాగాడు. నానాకు ఏం చెయ్యాలో తోచలేదు. త్వరత్వరగా డ్రెస్‌చేసుకుని 'జో' ను కూడా పిలవకుండా ట్రికాన్ వద్ద అప్పుతీసుకురావాలని బయలుదేరింది. హాల్లోకిరాగానే జార్జ్ కనుపించాడు.

"మీ అన్నకోసం వచ్చావా?" అన్నది నానా.

"కాదు" అన్నాడు జార్జి వివర్ణముఖంతో.

"నీ దగ్గర ఏమైనాడబ్బున్నదా? నేనుత్వరగావెళ్ళాలి"అన్నది నానా.

"లేదు."

"సరే. నేను త్వరగా వెళ్ళాలి. వెడుతున్నాను."

"ఒక్కమాట. నువు నా అన్నను పెళ్ళిచేసుకోబోతున్నావుకదూ" అన్నాడు జార్జి.

నానా కుర్చీలో కూలబడి నవ్వసాగింది.

"కాని నేనందుకు అంగీకరించను. నువు నన్నే వివాహంచేసుకోవాలి. నే నందుకే వచ్చాను" అన్నాడు జార్జి.

"నే నసలు వివాహమే చేసుకోను."

జార్జికళ్ళల్లోకి వెలుగువచ్చింది. 'అయితే నువు నాఅన్నను వివాహం చేసుకోనని ప్రమాణంచెయ్యి.'

"నీగొడవ మరీఎక్కువైందే. నాఇష్టంవచ్చినవాళ్ళను వివాహంచేసుకుంటాను. అవసరమైతే మీఅన్ననే వివాహంచేసుకుంటాను' అన్నదినానా.

"ఆమాట అనకు"అంటూ ఆమెచెయ్యిపట్టుకుని నలిపాడు జార్జి.

అతని కో చిన్న చెంపదెబ్బ అంటించి, తప్పుకున్నది నానా. 'మీరందరూ ఎందుకూ పనికిరారు. మాఅన్న రెండువందలఫ్రాంకు లిస్తా

నన్నాడు. కాని ఇవ్వకుండా మోసంచేశాడు. నేను డబ్బుకోసం లెక్క చేస్తాననికాదు. అయినా ప్రస్తుతం చాలా చిక్కుల్లో ఇరుక్కున్నాను. మరొకరిని డబ్బుఅడుక్కోడానికి వెడుతున్నాను' అన్నది నానా.

"వద్దు వద్దు" అని బ్రతిమలాడసాగాడు జార్జి.

"సరే. నీదగ్గర డబ్బేమైనా ఉన్నదా?" అన్నది నానా మళ్ళీ. కాని పాపం-ఆరోజున అతనిదగ్గర డబ్బేమీ లేదు. నానా నవ్వుతూ అతనిచుట్టూ చేతులు పెనవేసి నుదుటిని ముద్దాడి 'ఇక వెడతాను. సెలవు. అంతా ముగిసింది' అని వెళ్ళిపోయింది.

"అంతా ముగిసింది! అంతా ముగిసింది!'-ఈమాటలు అతని చెవుల్లో మృత్యుఘంటల్లాగా మారుమ్రోగాయి. అతనికాళ్ళక్రింద భూమి బ్రద్ధలవుతున్నట్టు తోచసాగింది. అతనిమనస్సంతా శూన్యమైపోతున్నట్టనిపించింది. ఒక దీర్ఘనిట్టూర్పు విడిచి, గదంతా కలయచూచాడు. పాతస్మృతులన్నీ ఒక్కుమ్మడిగా పైకుబికివచ్చాయి. 'లామినాట్'లో గడిపినరాత్రులు తను పసిపాపలా నానా మెత్తనివక్షోజాలపై పవళించిన ఆనందమయ క్షణాలు - ఎన్నెన్నో జ్ఞాపకంవచ్చాయి. ఇక ఆ క్షణాలు మళ్లీ తిరిగిరావు. ఇక జీవితం అస్తమించింది. అతనిసమాప్తి. అతనికి జీవితం పూర్తిగా నశించినట్లయింది. అతనికి మరేవస్తువూ దొరక్క డ్రెసింగ్‌రూమ్‌లో నుంచి ఓ సన్ననికత్తెర తీసుకున్నాడు.

నానా మళ్లీ మేడపైకి వచ్చి 'నువ్వింకా ఇక్కడే వున్నావా?' అన్నది.

అతను ఆమెవెంట పడకగదిలోకి వెళ్తూ 'నానా! నన్ను పెళ్ళాడవూ? నానా! నన్ను పెళ్లాడవూ?' అన్నాడు.

నానా దభీల్మని తలుపువేసింది. జార్జి ఒకచేత్తో తలుపుతెరచి, మరో చేత్తో కత్తెర గుండెల్లో గుచ్చుకున్నాడు.

నానా భయంతో కంపించిపోయింది. జార్జి మళ్లీ రెండోపోటు పొడుచుకున్నాడు. నానా పెద్దగా కేకలువేస్తూ 'జో'ను పిలిచింది. జార్జిని చూస్తే నానాకు అమితభయం కలిగింది.

అతను కళతప్పిపోతున్నాడు. కళ్ళు మూసుకుపోయాయి. నిజానికి గాయాన్నుంచి నెత్తురు ఎక్కువగా కారలేదు.

నానా కళ్ళెత్తిచూచేసరికి ఒకవృద్ధాంగన కన్పించింది. ఆమె మాడం హూగన్.

నానా భయకంపితస్వరంతో, 'మాడం! నేను కాదు. నన్ను పెళ్ళాడ మని అడిగాడు. నేను వీల్లేదన్నాను. అందుకని ఈ పనిచేశాడు' అని చెప్ప సాగింది.

మాడం హూగన్ మెల్లగా సమీపిస్తోంది. ఆమె నల్లని దుస్తులు ధరించిఉన్నది.

ఆమె బండిలోవస్తున్నంతసేపూ జార్జినిగురించి ఆలోచించనే లేదు. ఫిలిప్‌నుగురించే ఆలోచించింది. జార్జినిచూడగానే మేడమ్ హూగన్ గావు కేకపెట్టి ముందుకు వంగింది.తనకుమారులలో ఒకడు పరాభవంపాలయ్యాడు, మరొకడు చనిపోయాడు. ఆమె అలాగే మోకరిల్లి జార్జిగుండెలపై చేయి పెట్టి చూచింది. ఇలా చూచి, ఆమె ఒకనిశ్వాసం విడిచింది. అతనిగుండె కొట్టుకుండడం వినిపించింది. అప్పు డామె కళ్ళెత్తి నలుప్రక్కలా కలయచూచింది. నానా చివురాకురెమ్మలా వణికిపోతూ నిల్చునిఉన్నది. 'నేను కాదమ్మా కారణం, మీ పెద్దబ్బాయి. ఇక్కడ ఉన్నట్టయితే మీకు చెప్పగలిగిఉండేవాడు' అన్నది నానా.

'వాడు దొంగ. ఖైదులో ఉన్నాడు' అన్నది మేడమ్ హూగన్.

ఈమాటలు విని నానా ఊపిరిసలుపుకోలేకపోయింది. స్తబ్ధురాలై నిల్చు న్నది. ఆమెకు ప్రపంచమంతా తలక్రిందులై పరిభ్రమిస్తున్నట్టుగా తోచ సాగింది.

కొందరుసేవకు లక్కడికి పరుగెత్తుకొచ్చారు. జార్జ్‌ని బండిలోకి పట్టమని అడిగింది మేడమ్ హూగన్. సేవకులు జార్జ్‌ని మోసుకెళ్ళడం చూస్తూ నిల్చున్నది నానా. వృద్ధురాలైన మేడమ్ హూగన్ మెట్లుదిగిపోతూ, 'మాకు నువ్వెంతో అపకారంచేశావు. ఎంతో అపకారం చేశావు!' అన్నది నానాతో.

అంతే. నానా సమాధిలో ఉన్నట్లుగా కూర్చుండిపోయింది. ఇల్లంతా విశ్చలంగా, నిశ్శబ్దంగా ఉన్నది. మేడమ్ హూగన్ బండి వెళ్ళిపోయింది. నానా తలబాదుకోసాగింది. ఒకపావుగంట తరువాత కౌంట్‌ముఫత్ అక్క డికి వచ్చాడు. అప్పుడుకూడా నానా అలాగే స్తబ్ధురాలై కూచునిఉన్నది.

అతను రాగానే జరిగిన ఉదంతమంతా చెప్పింది. ఒక్కొక్క విషయం ఇరవైసార్లు చెప్పింది.

'ఇందులో నాదేం తప్పుంది చెప్పండి? ఫిలిప్‌ను నేను దొంగతనం చెయ్యమన్నానా? జార్జ్‌ని నేను పొడుచుకోమన్నానా? అందరూ ఇక్కడికి వచ్చి అన్నినిందలూ నా పైనే వేస్తారు' అని వెక్కి వెక్కి ఏడ్వసాగింది. 'కావలిస్తే జోని అడగండి.—జో! చెప్పవే' అన్నది.

'అవునయ్యా! అమ్మగారిహృదయం బాధపడుతోంది' అన్నది జో.

ముఫత్‌కు ఏమనాలో తోచలేదు. అతనుకూడా స్తబ్ధుడైపోయాడు. మేడమ్ హూగన్ ఉదారహృదయం ముఫత్‌కు బాగాతెలుసు. ఆమె లెఫాం డెటీలో ఏకాంతవైధవ్యాన్ని అనుభవిస్తోంది.

'జార్జ్ ఎంత అందంగా ఉండేవాడు! ఎంతముచ్చటగా ఉండేవాడు. ఇక ఎన్నటికీ ఇక్కడికి రాడుగా. ఇక మే మిద్దరం ఉన్నప్పుడు నువు పట్టుకో వలసిన అగత్యం ఎప్పుడూ రాదులే' అంటూ విలపించసాగింది నానా.

ఈ చివరిమాట కౌంట్‌ను తల క్రిందులు చేసింది. 'నువు వెళ్ళి జార్జ్ ఎలా ఉన్నాడో కనుక్కురా. చప్పున వెళ్ళిరా' అన్నది నానా.

కౌంట్ వెంటనే జార్జ్ ఎలా ఉన్నాడోకనుక్కురావడానికి వెళ్ళాడు. ఒకగంటకు మళ్ళీ తిరిగివచ్చాడు అతనువచ్చేసరికి అతనిరాకకోసమే నానా ఆతురతతో కిటికీగుండా ఎదురుచూస్తోంది జార్జ్ చనిపోలేదనీ, బ్రతుకుతా డనీ కౌంట్ చెపితే నానా ఆనందం పట్టలేక నవ్వుతూ పాడుతూ గంతులు వేసింది. జీవితంలో అందం ఆనందం మళ్లీతిరిగివచ్చినట్టుభావించసాగింది.

ఆ మరునాటికే కౌంట్ ముఫత్ ఈ సంఘటన పూర్తిగా మరచి పోయాడు. ఇక మళ్లీ ఎన్నటికీ నానాఇంటికి వెళ్ళకూడ దనుకున్నాడు. ఫిలిప్, జార్జ్‌ల విషాదాంతంద్వారా ఈశ్వరుడు తనకు గుణపాఠం నేర్పాడను కున్నాడు. కాని, ఈ పశ్చాత్తాపం ఎంతోకాలం నిలువలేదు. పశ్చాత్తాపం చాటున ఒకవిధమైన సంతోషం గోచరించింది— అది తన ప్రత్యర్థి జార్జ్ రంగంలోనుంచి తొలగిపోయాడన్న సంతోషమే. ప్రస్తుతం కౌంట్‌ను ఒక ఆవేశం పూర్తిగా ఆవరించింది. సాధారణంగా ఇలాంటి ఆవేశం వృద్ధు లను ఆవరిస్తుంది. 'నానా తనది—తన ఒక్కనిదే' ఇదీ ఆ ఆవేశం. ఆమెను

తా నొక్కడే స్పృశిస్తాడు. ఆమెపలుకులు తా నొక్కడుమాత్రమే వింటాడు. ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాలు తన జీవితక్రమాన్ని నడుపుతాయి.

రోజులు గడిచేకొద్దీ మతవిశ్వాసంకూడా కౌంట్‌ను ఆవరించసాగింది. మళ్లీ చర్చికి వెళ్ళి, పాపాలు నివేదించనారంభించాడు. కాని, ఎంతకూ ఆంతరంగిక సంఘర్షణ చల్లారడంలేదు' అది అనలగుండంగా ప్రజ్వరిల్లుతూవుంది.

ఒకనాటి ఉదయం ఫాకర్‌మంట్ నానా భవనంనుంచి బయటికి రావడం చూచాడు. అత నెందుకు వచ్చిపోతున్నాడని నానాను అడిగాడు. నానా వెంటనే ఆడసివంగిలా ఎగిరిపడింది. అతనిఅసూయతో ఆమె పూర్తిగా విసుగెత్తిపోయింది.

ఆ విసుగుతో 'అవును, నే నతని ఉంపుడుక త్తెను, ఏంచేస్తావేం' అన్నది - సరాసరి అతనిదగ్గరకువచ్చి, అతనికళ్ళల్లోకి సూటిగాచూస్తూ. 'నేను చెబుతున్నది అర్థమవుతోందా? నీ కిష్టమైతే ఉండు, లేకపోతే నువ్వు వెళ్ళిపోడానికి నా అభ్యంతరమేమీలేదు. ఒకవ్యక్తి నాకు సుఖాన్నివ్వగల్గితే నే నతన్ని రప్పించుకుంటాను. అది నా యిష్టం. నీ ఇష్టం ఏమిటో చెప్పు? లేదా అదుగో వాకిలి!' అన్నది నానా నిష్కర్షగా. ఇలాఅని వాకిలి వద్దకువెళ్ళి తలుపుతెరచింది. కాని కౌంటు కదల్లేదు. అలాగే నిల్చున్నాడు. ఆమెనగ్నస్వరూపం అతనికి పూర్తిగా అర్థమైపోయింది. తనకుమించినవారిని ఆమె ఎప్పుడైనా రప్పించుకోగలదు. ఎందరుకావాలనుకుంటే అందరినీ రప్పించుకోగలదు. తనలాంటివృద్ధుల్ని కాదు; నరాల్లో వేడిరక్తం పొంగి పొరలే యువకుల్ని. ఆమెముందు అతను తలవంచుకుని నిల్చున్నాడు. డబ్బుఅవసరమైనప్పుడే తనగుప్పిట్లో చిక్కుతుంది అనుకున్నాడు. ఒకరాత్రి ప్రేమకలాపం. తత్ఫలితంగా ఒకవారం బాధ — ఇలాఉంది కౌంట్ పరిస్థితి. పోనీ, ఇంటిదగ్గరే ఉందామా అంటే, ఇంట్లో అణుమాత్రమైనా శాంతిలేదు. ఫాష్‌రే అనుభవించి, వదిలేసినకౌంటెస్ ఇతర ప్రేమికులకౌగిళ్ళలో శృంగారాన్ని వెదకుతోంది. పెళ్ళిఅయిననాటినుంచి ఈస్టెలీ తండ్రిని చూడనేలేదు. మరీ అబ్బనాకారంగా కనుపిస్తూండే ఆ పిల్ల ఇప్పుడు భర్తనుకూడా గజగజలాడిస్తోంది. వీనట్ ఒక్కడుమాత్రం కౌంటుపట్ల సానుభూతిగా ఉంటున్నాడు. అప్పుడప్పుడు నానా ఇంటికికూడా కౌంటు పోతున్నాడు. తన

స్వగృహంలో క్షణమైనా శాంతిలేక ఎన్ని అవమానాలనైనా ఓర్చి, నానా భవనంలోనే పడిఉంటున్నాడు.

ఇప్పుడు వారిఇద్దరిమధ్య వ్యత్యాసాలనువృద్ధిచేస్తున్నవిషయంఒక్కటే. అది డబ్బు. ఒకనాడు పదివేల ఫ్రాంకులు తెచ్చిస్తానని వాగ్దానంచేసిన కౌంట్ శూన్యహస్తాలతో వచ్చాడు. రెండురోజులనుంచి కళ్లుకాయలు కాచేట్టు వేచిఉన్న నానా ఆకలిగొన్న ఆడపులిలా లేచింది.

'డబ్బులేదూ! అయితే వచ్చినదారినే దయచెయ్యి!' అన్నది.

ఆ రాత్రే అతను పదివేలఫ్రాంకులూ తీసుకొచ్చి నానాఒళ్ళో పోశాడు. నానా దూరంగా నిల్చుని, పెదవులుజాపి అతని కో ముద్దు ప్రసాదించింది. ఆతన్ని స్పృశించడమంటే నానాకు ఒంటినిండా జెర్రులుప్రాకి నట్టుండేది. తరువాత ప్రతినిత్యం వారికి డబ్బువిషయంలో తగాదాలు వస్తూండేవి. అతన్ని డబ్బుకోసమే దగరకు రానిస్తున్నాననీ, ఆతనిదగ్గర మరె లాంటి ఆకర్షణా లేదనీ మొహానకొట్టినట్టు చెప్పేసేది. చక్రవర్తినికూడా ఒకమాటు 'అబ్బ! అతను మహావిసుగెత్తిస్తాడు' అన్నదట. నానాకూడా అతనితో పోట్లాడేసమయాలలో తరుచు ఈమాట ఉపయోగించేది.

నానా పూర్తిగా స్వచ్ఛందవిహారిణిగా మారిపోయింది. రోజూ సరోవరంవద్దకు షికారువెళ్ళి కొత్తకొత్తసంబంధాలు ఏర్పరచుకునేది. ఆ సరోవరతీరంలో ఆమె పురుషులపై వలవేస్తోంటే, అక్కడసమావేశమైన రాజసుతలు, వ్యాపారస్థులకుమార్తెలు ఆమెనుచూచి ఆమెదుస్తులను, హావభావాలను అనుసరించడం మొదలెట్టేవారు. రోజూ సరోవనంలో పదసషికార్లు చేసేది నానా. ప్రతిరాత్రీ ఒక కొత్తపురుషుడు! ఒక కొత్తహోటల్! కొత్త వినోదం! కొత్తఆనందం! కాని, నానా తెల్లవారగానే ఆవిషయం విస్మరించేది. మరుసటిరాత్రి మరో కొత్త ఆనందం!

కౌంటు ముఫత్ ఈ స్వచ్ఛందవిహారాలు తెలియనట్లుగా నటించసాగాడు. నానాకూడా చెప్పలేదు. నానాభవనం అతనికి పెద్ద పిచ్చిఆస్పత్రిలా కన్పించసాగింది. ఒక్కొక్కమాటు కోచ్‌మన్ ఛార్లెస్‌తో అతి చనువుగా మాట్లాడేది, తను హోటలుకువెళ్ళినప్పుడల్లా అతనికి ఫలహారాలు పంపించేది. మరోమాటు అతన్ని ఒక వెధవలా చూచేది. ఒకరోజున గుర్రా

లకు ఎక్కువదాణావేసి తనను నష్టపరుస్తున్నాడని నానా ఛార్లెస్‌తో పోట్లాడింది కౌంటు వారిద్దరినీ విడదీసి, ఛార్లెస్‌ను పంపివేశాడు.

తరువాత నానా వజ్రాలు కనుపించలేదు. విక్టర్ైన్, ఫ్రాంసిస్ పంపి వేయబడ్డారు. జూలియన్‌కూడా వెళ్ళిపోయాడు. ప్రతినిత్యం సేవకులు మారుతూండేవారు. ఒకరోజున కౌంటు తలుపువెనుక ఉండగా నానా తన సేవకురాలితో,ఒక అమెరికన్ శ్రీమంతుడు తననుతీసుకెళ్ళాడని చెబుతున్నది. ఈ మాటలు ఆలకించుటతో కౌంట్ ముఖం వివర్ణమైపోయింది. అతను నిశ్శబ్దంగా మేడమెట్లు దిగి వెళ్ళిపోయాడు.

తరువాత నానా ఒక గాయకునితో సంబంధం ఏర్పరచుకున్నది. కొన్నాళ్ళకు అతను ఆమెను పరిత్యజించాడు. నానా ఆత్మహత్య చేసు కుందామని ఒకగ్లాసు నీళ్ళలో అగ్గిపుల్లలు నానబెట్టి తాగింది. చనిపోలేదు కాని, జబ్బుచేసింది. ఆ జబ్బులో ఆమె పురుషులందరిని 'పందులు, పందులు' అని తిట్టింది.

ప్రతినిత్యం నానాఇంటికి విటులు ప్రవాహంలా వచ్చిపోతున్నారు. కౌంట్ ఎప్పుడు లోనికిరావాలన్నా తలుపుదగ్గరనిలబడి దగ్గవలసివచ్చేది. ఒకరోజున దగ్గకుండానే హఠాత్తుగా లోనికివెళ్ళగా, ఆమె కౌగిలిలోవున్న ఫ్రాన్సిస్ కళ్ళపడ్డాడు.

నానా ఇంటికివస్తూండగా వీధిలో ఎవరైనా పడుపుకత్తెలుకన్పిస్తే వారిని తీసుకొచ్చి, డబ్బిచ్చి పంపించేది. ఒక్కోమాటు పురుషవేషంలో వేశ్యాగృహాలకు వెళ్ళి పడుపువృత్తిని చూచివచ్చేది.

ప్రతినిత్యం తీరనిదాహంతో నానా ఒక్కొక్క కొత్తవ్యక్తిని తాగే స్తోంది. ఆమెలో భోగలాలసత మరింత తీవ్రంగా ప్రజ్వరిల్లుతోంది. పురు షులను చెరుకుదంట్లునమిలినట్లు నమిలి, పిప్పిచేసిపారేస్తోంది. ఒక్కపక్షం రోజులలో ఫాకర్‌మంటును, అతనిధనాన్ని పూర్తిగా లాగివేసి, ఖాళీ గ్లాసులా విసిరేసింది. ఆమెచేతుల్లో ప్రతిపురుషుడూ పండినపండులా రాలి, ఎండి నశించిపోయేవాడు. తరువాత నానా స్టీనర్‌ను ఒకఆటఆడించిచూచింది. అతను ఆమెచేతుల్లో కీలుబొమ్మలా ఆడాడు. అతన్ని ముక్కచెక్కలుచేసి, విసిరికొట్టింది. 'డబ్బు'అనేమాట వింటే అతను భయపడిపోయేవాడు. బికా రిలా వీధులుపట్టాడు.

తరువాతవంతు లాఫలాసిది. ఆరువారాల్లో అతనిఇళ్ళు-వాకిళ్ళు, తోటలు-దొడ్లు అన్నీ హారించుకుపోయాయి. ఆమె అడుగుపెట్టిన చోటల్లా భగ్గుమనిమండిపోయేది. నానా ఈ వినాశనంలో ఎంతో ఆనం దాన్నిపొందేది.

ఫాష్‌రే మళ్ళీ తిరిగివచ్చాడు. ఇప్పు డతను కుటుంబీకుడైనాడు. కౌంటెస్‌తోటి సంబంధం విడగొట్టుకున్న తరువాత రోజ్‌తో ఉంటున్నాడు, రోజ్ అతన్ని స్వభర్తలాగా చూచుకుంటోంది. నానా అతన్ని తనగుప్పిట్లో ఉంచుకుని, అతను కొత్తగా ప్రారంభించిన వార్తాపత్రికద్వారా వచ్చే ధనాన్ని హారించాలని చూచింది. ఆ డబ్బు రెండు నెలలవరకూ ఆమె పూలకూ, అలంకారాలకూ సరిపోయింది.

ఒకరోజున ఫాష్‌రేతో మాట్లాడుతూ లాఫలాసి మూర్ఖత్వాన్ని గురించి చెబుతూ నవ్వసాగింది. నానా 'అతను పట్టితెలివితక్కువ దద్దమ్మ" అన్నది. ఫాష్‌రే ఎక్కించిన ఉద్రేకంతో, లాఫలాసికి ఒకచపేటా ఇస్తానని పంతంపూనింది నానా. ఆ సాయంత్రమే అలా చేసిందికూడాను. 'రోజూ వచ్చి, నాచేతుల్లో దెబ్బలుతినిపో. ఇది నా చేతులకు వ్యాయామం, అన్నది.

ఒకనాడు నానాచేతిలో దెబ్బలు తిన్నతరువాత, లాఫలాసి నానాతో 'నువు నన్ను పెండ్లిచేసుకోవాలి. మనం చక్కనిదంపతులమవుతాం' అన్నాడు. తమ నానాభర్త అయితే పారిస్ నగరాన్నంతా ఆశ్చర్యపర్చవచ్చు ననుకున్నాడు.

"నేను పెళ్ళాడదలుచుకుంటే ఎప్పుడో పెళ్ళాడిఉండేదాన్ని. నీలాటి వాళ్ళు లక్షమంది నాకాళ్ళదగ్గరకు వచ్చారు. కావలిస్తే లెక్క పెట్టుకో-ఫిలిప్, జార్జ్, ఫాకర్‌మంట్, స్టీనర్ ఇంకా చాలామంది ఉన్నారు. అంద రిదీ ఒకేపాట! నేను పెళ్ళాడితే నానా నెందుకవుతాను?' అన్నది నానా. 'ఛీ, వెధవపెళ్ళి' అని నేలమీద ఉమ్మివేసింది—తనకాళ్ళక్రిందే భూలోక కళ్మల మంతా పరుచుకునిఉన్నట్లు.

ఒకనాటిరాత్రి లాఫలాసి అదృశ్యుడైపోయాడు. ఒకవారం తరువాత ఎక్కడో గ్రామంలోఉన్న తనపినతండ్రిగారి యింటికి వెళ్ళాడనీ, ఎవరో అమ్మాయిని వివాహంచేసుకున్నాడనీ తెలిసింది. ఈవిషయం విని నానా

అంతగా దుఃఖించలేదు. కౌంటుతో 'నీ ప్రత్యర్థులలో మరొకడు జారిపో యాడు' అని అతన్ని కౌగలించుకున్నది.

అలాగే కౌగలించుకొనివుండి, 'నీ బాధ అదేకదూ? నువుకూడా నానాను వివాహంచేసుకోదలచుకున్నావు. నీ భార్యపోయినతరువాత అలాగే పెళ్ళాడుదువుగానిలే' అన్నది.

ముఫత్ ఏమీ మాట్లాడలేదు. ఇప్పుడతను ఏ విషయంలోనూఎక్కువ జోక్యం పెట్టుకోవడంలేదు. తను 'అధికారిక ప్రేమికుడు'గా మాత్రం ఉంటున్నాడు. అంతే; నానాపట్ల అతని ఉద్రిక్తసంబంధమాత్రం నానాటికి బలపడజొచ్చింది. ఇప్పుడు నానా చిరునవ్వునుకూడా అతను దబ్బచ్చి కొనుక్కుంటున్నాడు. నానాపడకగది ఒకబహిరంగస్థల మయిపోయింది. ఎందరెందరో విటుల వివిధశరీరాల విచిత్రపరిమళం ఆ గదినిండా వ్యాపించి వుంది. ఆ గదిలో ప్రవేశించినప్పుడల్లా ఇక జన్మలో మళ్లీ ఆ గదిలో అడుగుపెట్టకూడదనుకునేవాడు కానీ, వాకిలి దాటేసరికి నిగ్రహించు కోలేక మళ్ళీ ఆ గదిలోనే అడుగుపెట్టేవాడు. ఆ గదిలో ప్రవేశించే సరికి అతనిమనస్సునిండా ఏదో తీయని మత్తు ఆవరించేది. ఆ మత్తునుంచి అతను బయటపడగలిగేవాడు కాదు. నానా నిరంకుశ నిర్లక్ష్య కామశక్తికి అతను దాసానుదాసుడైపోయాడు.

అతని మెతకతనాన్ని కనిపెట్టి, నానా మరింత నిరంకుశంగా ప్రవర్తించేది. ఆమె స్వాభావికంగా ప్రతిదాన్నీ హీనంగా చూచేది. ఆమె తన చేతికి తగిలిన ప్రతివస్తువును విధ్వంసంచెయ్యడమేకాక దాన్ని కల్మషం చేసేదికూడాను. ఆమెచేతినుంచి జారిపోయినతరువాతకూడా ఆ వస్తువును ఆ కశ్మలం వదిలేదికాదు. కౌంట్ ఆమెగదిలోకి వచ్చినప్పుడు ఆమె చిత్ర విచిత్రంగా ప్రవర్తించేది. గదితలుపులన్నీ మూసి, అతన్ని చిత్రవిచిత్రంగా న్యూనపరిచేది. మెల్లగా చెంపదెబ్బ లంటించి, పసిపిల్లలవలె తొస్సిమాటలు మాట్లాడమనేది. అత నలాగే మాట్లాడేవాడు. తరువాత నానా ఎలుగుబంటు చర్మాన్ని కప్పుకుని, 'ఎలుగుబంటు'నంటూ అతన్ని కరిచేది.

ఒకరోజున యిలాగే 'ఎలుగుబంటు'ఆట ఆడుతూ అతన్ని వెనక్కి తోసింది. అతనినుదురు ఒకకుర్చీకి కొట్టుకుని, బొప్పికట్టింది. నానా పగల

బడి నవ్వింది. ఒక్కొక్కసారి 'కుక్క-ఆట' ఆడమనేది. తన చేరుమాలు గది మూలకు విసిరేసి, అతన్ని పండ్లతో కరుచుకురమ్మనేది.

నానా ఆర్డరిచ్చినశయ్య జనవరినెలలోకాని తయారుకాలేదు. అప్పుడు ముఫత్ నార్మండిలో ఉన్నాడు. రెండురోజులకు కాని రాడను కున్నారు. కాని పనిముగించడంవల్ల అతను వెంటనే వచ్చేశాడు. రాగానే సరాసరి నానా-భవనానికి వెళ్లాడు. అప్పుడు గడియారం పదిగంటలుకొడు తోంది. అతను రావడంచూచి 'జో' ఆశ్చర్యచకితురాలైంది. వీనట్ అతని కోసం నిన్నటినుంచి వెదుకుతున్నాడనీ, వచ్చినవెంటనే పంపించమన్నాడనీ చెప్పింది. ముఫత్‌కు ఆమెచెబుతున్నది ఏమిటో అర్థంకాలేదు. వెంటనే పడకగదివద్దకు పరుగెత్తుకెళ్ళాడు. పడకగదిలోనుంచి నవ్వులు విన్పిస్తు న్నాయి. ముఫత్ గదితలుపు తోశాడు. తనకళ్ళముందరిదృశ్యం చూచి, ముఫత్ నిర్జీవునిలా నిలిచిపోయాడు.

గది కొత్తగా అలంకరింపబడి చక్రవర్తినిఅంతఃపురంలా వుంది. నూతన శయ్య అనంతకోటినక్షత్రస్థగితమైన గగనమండలంలా కళ్ళు మిరు మిట్లు గొల్పుతోంది. నానా ఆ శయ్యపై నగ్నంగా శవశింపుసేవ చేసు కుంటోంది. ఆమె వక్షస్థలపునీడలో మార్కిస్‌డిచౌర్డ్ రాత్రిదుస్తుల్లోఉన్నాడు. ఈ దృశ్యాన్నిచూచి, కౌంట్ కంపించిపోసాగాడు.

మార్కిస్‌కోసమే ఆ బంగారు గులాబీలశయ్య-- అతనికోసమే ఆ రతీమన్మథులపర్తులాలంకరణ --- అతనికోసమే రాత్రిదేవతనగ్నప్రతిమ --- అరవైయేండ్లవ్యభిచారంలో మకిలపట్టిన ఆ ముదుసలి నానాపాదాలవద్ద రోగిలా పడివున్నాడు!

నానాకు కొంచెం ఆందోళసకలిగినా నవ్వు ఆపుకోలేకపోయింది. 'పడుకో, ప్రక్కలోదూరు' అన్నది మార్కిస్‌తో. తర్వాత ద్వారంవద్దకు వెళ్ళి కౌంట్‌తో, 'ఇదేనా సమయం, రావడానికి? వెళ్ళు' అని తలుపు మూసింది. ముఫత్ మూసినగదితలుపుదగ్గరే నిల్చున్నాడు. ఆపాదమస్తకం వణికిపోతున్నాడు. గాలివానకు చెట్టులా కుప్పకూలిపోయాడు. అతనికి ప్రపంచమంతా అంధకారబంధురంగా తోచింది. 'ఈశ్వరుడా! ఈశ్వరుడా! నన్ను నీ దగ్గరకు చేర్చుకో!' అంటూ ప్రార్థించసాగాడు. ఇంతలో అతని భుజానికి ఎవరిదో చేయి తగిలింది. అది వీనట్ చెయ్యి. వీనట్‌సం కౌగ

లించుకుని, పసిపిల్లవానిలా వెక్కి-వెక్కి ఏడ్వసాగాడు. 'అన్నా! అన్నా!' అంటూ ఏడ్చాడు. వీనట్ ముఖాన్ని తన కన్నీళ్ళతో తడిపాడు.

వీనట్ అతన్ని తనవక్షానికి అదుముకున్నాడు. ఇందుకుతోడుగా కౌంట్ జీవితంలో మరో ఆఘాతం తగిలింది. ఆ విషయం చెప్పడానికే వీనట్ నిన్నటినుంచి తిరుగుతున్నాడు. కౌంట్ భార్య కౌంటెస్ సెబైన్ ఒక యువకునితో లేచిపోయింది. పారిస్‌నగరమంతా ఈ వార్త పొక్కింది. వీనట్ ఈసంగతి చెప్పినపుడు కౌంటు ఏమీ చలించినట్లు కన్పించలేదు. ఇక అతనికి జీవితంలో మిగిలిం దేమీ లేదు.

'నన్ను తీసుకెళ్లు. నే నిక భరించలేను' అన్నాడు.

వీనట్ అతన్ని పసిపిల్లవాడివలె తీసుకెళ్ళాడు, ఆరోజునుంచి తన అజ్మాయిషీలోనే ఉంచుకున్నాడు. కౌంటు ఆస్తి పూర్తిగా తరిగిపోయింది. అతను మిగిలిన కొద్దిపాటిఆస్తితో మితజీవనం చెయ్యనారంభించాడు.

నానా, సెబైన్‌లు అతన్ని పూర్తిగా నాశనంచేశారు. అతను మళ్లీ తన మతవిశ్వాసంలోకి, ఈశ్వరుని కౌగిలిలోకి మరలివచ్చాడు.

తరువాత ఒకనాడు మినాన్ నానాభవనానికి వచ్చి, నానాను చూచి వెళ్ళాడు.

కౌంట్, మార్కిస్‌ల కలయిక నానాను దుఃఖాంబుధిలో ముంచింది. ఆమెను రానురాను ఒక అవ్యక్తవిషాదం ఆవరించింది. ఈ విషాదానికితోడు ఒకరోజున లాబోర్డెటీ వచ్చి జార్జ్ మరణవార్తను తెలియజేశాడు.

'నా జిజీ మరణించాడా?' అంటూ నానా వెక్కి-వెక్కి ఏడ్చింది. ఆమెను అనంతమైన విషాదం ఆవరించింది. లాబోర్డెటీ ఆమెను ఓదార్చ బోయాడు. ఆమెఅతన్నిమధ్యలోఆపి 'అందరూ నన్నే ఆడిపోస్తారు. అందరి నాశనానికి నేనే కారణమంటారు' అంటూ ఏడవసాగింది.

తనచుట్టూ ఆమెవెదజల్లిన విషబీజాలన్నీ ఆమెను భూతాల్లా చుట్టు ముట్టాయి. 'నే నీబాధ భరించలేను! నే నీ బాధ భరించలేను! న న్నెవరూ అర్థంచేసుకోలేరు!' అన్నది నానా.

ఆమెకోపం ఇతరులపై జుగుప్సగా పరిణమించింది. ఆమెలేచి, కళ్లు తుడుచుకొని గదిలో ఆందోళనతో అటూఇటూ తిరుగుతూ, 'ఎవరేమన్నా నా కేమీ పరవాలేదు. నేను కఠినురాలనా? నువ్వు నిజంచెప్పు. నా కున్న

దంతా యిచ్చేస్తాను. ఒక్క ఈగకుకూడా అపకారంచెయ్యను. నా కొంగు నాశ్రయించుకొని తిరిగినవారే, నన్ను ఆడిపోస్తున్నారు' అన్నది. తరువాత లాబోరెటీకి ఎదురుగా నిల్చుని, 'నువు నిజంచెప్పు. ఈ మురికిలోకి నేనా వాళ్ళను ఈడ్చింది? అందరూ నాకు దాసానుదాసులై చరించలేదూ? నేనే వాళ్ళందరినీ అధఃపతితులు కాకుండా రక్షించాను. అందరూ నన్ను పెళ్ళి చేసుకుంటామన్నారు. నే నందుకు ఒప్పుకుని ఉంటే నేనూ ఒక కౌంటెస్ నయ్యేదాన్నే. కాని, నేను అంగీకరించలేదు. వాళ్ళ శ్రేయస్సును ఆలోచించే ఒప్పుకోలేదు. నేనే తలచుకుంటే వాళ్ళచేత ఎన్నెన్ని ఘోరాలో చేయించి ఉండేదాన్ని?' అన్నది నానా మళ్ళీ.

ఒక చిన్న టేబిల్‌మీద పిడికిలితో గుద్ది, 'అసలు, ఈ సంఘనిర్మాణమే అసహ్యంగా ఉంది. నిందలన్నీ స్త్రీలే భరించాలి. తప్పులన్నీ తామే చేసి, అన్నిటినీ స్త్రీలపై రుద్దుతారు పురుషులు. నేను ఇందరు పురుషులను చూచాను. నాకు ఏఒక్కరివల్లా లవలేశమైనా సుఖం లభించలేదు. అందరూ నన్ను విపరీతంగా విసుగెత్తించారు. వీళ్ళు లేకుండా ఉన్నట్లయితే నేను ఏ మఠంలోనో సన్యాసినిగా ఉండేదాన్ని' అన్నది నానా.

ఈలోగా 'జో' మినాన్‌ను ప్రవేశపెట్టింది. నానా నవ్వుతూ అతన్ని ఆహ్వానించింది. ఆమె విలాపం ఆగిపోయింది. ఇప్పు డామె పెదవులపై చిరునవ్వు వెలుగులోంది ముసలిబాస్క్ పక్షవాతంతో బాధపడుతూండడంవల్ల అతనిసహాయార్థం ఒక బెనిఫిట్ నాటకం వేస్తున్నామని చెప్పాడు మినాన్, నానా రెండు బాక్స్‌టిక్కెట్లు కొన్నది. తరువాత సాటిన్‌విషయం చెప్పింది. 'అది ఆస్పత్రిలో ఉంది. అది నన్ను ప్రేమించినట్టు మరెవరూ ప్రేమించలేరు' అని చెప్పింది.

నానాముఖంమీది విషాదరేఖ తొలగిపోయింది. ఆమె చేతులకు తొడుగులు తొడుక్కుంటూంటే వారిద్దరూ చూస్తూకూచున్నారు. ఆభవనంలో ఆ భోగభాగ్యాలమధ్య ఆమెఒక్కతే ఠీవిగా నిలబడివున్నది. కొన్నివందల మంది ఆమె కాళ్ళకింద నలిగి, ముక్కలుముక్కలై పోయారు. పురాయుగంలోని రాక్షసరాజ్యంలోలాగా ఆమెపలుకుబడిలోని సామ్రాజ్యంలో ఎముకలు గుట్టగుట్టలుగా పడిఉన్నాయి. ఆమె మానవులపుర్రెలను చితకత్రొక్కుతూ నడుస్తోంది. వాండెవ్రే నిప్పంటించుకోవడం, ఫాకర్‌మాంట్

విషాదాంతం, స్టీనర్ దివాలా, ముఫత్‌ల అధఃపతనం, జార్జ్ శవం, ఫిలిప్ నిర్బంధము, విడుదల, - ఈ వినాశనమంతా ఆమెచుట్టూ చుట్టుకొనివుంది. ఆమె తనవినాశకర కార్యక్రమాన్ని పూర్తిచేసుకున్నది. తన మృత్యుమంది రానికి చిట్టచివరి అంతస్తును నిర్మించింది. మురికివాడలలో పుట్టిపెరిగిన అక్రిమి సంఘాన్నంతాఆక్రమించి,ఆవహించి,ఆవేశించి సంఘాన్ని ఉకలుక లాడేటట్లు చేసింది. అది మంచిదే; అది న్యాయమే. తను ఏ నీచవర్గంలో- తిరుగుబోతులలో, త్రాగుబోతులలో, దేశద్రిమ్మరులలో-పుట్టిపెరిగిందో-ఆ వర్గంపైనే ప్రతీకారంతీర్చుకుంది; పగ సాధించింది. భయంకరమైన మధ్యాహ్న మార్తాండునిలా కామదీప్తిని సహస్రముఖాలుగా విరజిమ్మింది. కాని, ఆమె అంతరంగంమాత్రం నిర్మలంగా అమృతప్రాయంగానే ఉన్నది. ఆమె ఆరోగ్యం, ఆమెసౌందర్యం చెక్కుచెదరలేదు. అయినా ఆమెభవనం ఆమెకు బందిఖానాలాగే తోచింది. ఆమెకు చనిపోయి, మళ్లీ స్వచ్ఛందంగా జన్మించాలనిపించింది।

# 14

నానా హఠాత్తుగా మాయమైపోయింది. ఎక్కడికో? ఎందుకో ఎవరికీ తెలీదు.

ఆమె అదృశ్యం కాబోయేముందు తన భవనం, సామాను, వజ్ర-వైఢూర్యాలు, అన్నీ వేలంలో ఊడ్చిపెట్టేసింది. వేలం అయిదురోజుల పాటు జరిగింది. ఆరులక్షలఫ్రాంకులు వచ్చాయి. చిట్టచివరిసారిగా పారిస్ నగరంలో గెయిటీ థియేటర్‌లో 'మెలూసైన్' లో పాత్రధారిణిగా దర్శన మిచ్చింది. ఒకనాటిరాత్రి హఠాత్తుగా ఆమె కెయిరో వెళ్ళినదన్నవార్త వ్యాపించింది. ఆమె ఎన్నాళ్ళనుంచీ తుర్కిస్థాన్‌చూడాలని అభిలషిస్తోందో ననుకున్నారు.

నెలలు గతించాయి. నానాను అందరూ మరిచిపోయారు. ఎప్పుడైనా ఆమె పేరు తలపుకొస్తే చిత్రవిచిత్రగాథలు మొలకెత్తేవి. వైస్రాయిని బుట్టలోవేసుకుందనుకున్నారు కొందరు, రెండువందలమంది బానిసలతో ఒక పెద్దమహల్‌లో అంతఃపురంలో రాజ్యంసాగిస్తోందన్నారు మరికొందరు,

కెయిరోలో ఒక నీగ్రోను తగులుకుని, నాశనమైపోయిందన్నారు ఇంకా కొందరు. పదిహేనురోజుల తరువాత ఒక ఆశ్చర్యకరమైనవార్త తెలిసింది. ఎవరో ఆమెను రష్యాలో చూచామని చెప్పారు. ఈ వార్త ఒక పెద్ద గాధగా వ్యాపించింది.

ఒక రష్యన్ రాకుమారునికి ఉంపుడుకత్తెగా ఉన్నదన్నారు. ఆమె వజ్రవైఢూర్యాలను గురించి అందరూ అదేపనిగా చెప్పుకొంటున్నారు. ఈ అజ్ఞాతదూరప్రపంచంలో ఆమె సహస్రవిచిత్రమణులను ధరించిన ఒక దేవతాస్త్రీలా కనుపించసాగింది.

జూలైనెలలో ఒకనాటి సాయంత్రం 8 గంటలకు లూసీ కార్లయిన్‌ను కలుసుకుని 'నువు భోంచేశావా? అయితే నాతో రా. నానా తిరిగివచ్చింది' అన్నది. 'త్వరగా రా. ఇలా మనం మాట్లాడుకొంటూండేలోగానే ఆమె చనిపోయి కూడా ఉండవచ్చు' అన్నది.

'చావా? ఎక్కడ? ఎందువల్ల?' అన్నది కార్లైన్.

'గ్రాండ్ హోటల్‌లో మశూచికంవల్ల.'

ఇద్దరూ గుర్రపుబగ్గీలో బయలుదేరారు. లూసీ నానాసాహసకృత్యాలనుగురించి ఇలా చెప్పింది- 'నానా రష్యానుంచి వచ్చిందట. ఏమిచేతనో ఆరాకుమారునితో పోట్లాడిందట. స్టేషన్‌లో సామాన్లువదిలేసి, పినతల్లివద్దకు వెళ్ళిందట. ఆమెబిడ్డకు మశూచికంపోసివున్నదట. ఆ మరునాడే బిడ్డ పోయిందట. తరువాత ఆమెకూ, ఆమెపినతల్లికీ ఏవో తగాదావచ్చిందట. సరిగా సాకకపోవటంవల్లనే శిశువు గతించిందట తరువాత నానా హోటల్‌కువెళ్ళి, మినాన్‌తోకలిసి, తనసామాన్లుతీసుకువద్దామనుకున్నదట. అంతలో నానాశరీరమంతా కంపించనారంభించింది. మినాన్ వెంటనే ఆమెను తనగదికి తీసుకెళ్ళి, కన్నీరుకారుస్తూ సేవచెయ్యసాగాడు. పూర్వం ఒకరినొకరు ఎంతో ద్వేషించుకునేవారు. తరువాత ఇద్దరూ గ్రాండ్ హోటల్‌కు వెళ్ళారు. ఇదంతా నాకు లాబోర్డెటీ చెప్పాడు.'

గుర్రపుబగ్గీ హోటల్‌దగ్గర ఆగింది. అక్కడ జనం గుంపులుగా మూగిఉన్నారు. ఆ ఉదయమే యుద్ధప్రకటనకు అనుకూలంగా వోటుచేయబడింది. అది సాయంత్రసమయం. సూర్యుడునెత్తురుముద్దలాకనుపిస్తున్నాడు.

'అదుగో మినాన్, అతను మనకు కబురుచెప్పవచ్చు' అన్నది లూసీ.

మినాన్ గ్రాండ్‌హోటల్‌పోర్టికోలో నిల్చునిఉన్నాడు. లూసీ అడ గ్గానే అతను కోపోద్రిక్తుడై, 'నాకు తెలీదు. రెండురోజులనుంచీ రోజ్ ఇక్కడే ఉన్నది. తన ఆరోగ్యం పాడుచేసుకుంటే ఎవరు బాధ్యులు!' అన్నాడు. రోజ్ అందవిహీనమైపోతుందన్న భావం అతనికి భయాన్ని కలి గించింది. ఈలోగా అక్కడికి ఫాషరే వచ్చారు. మినాన్ ఫాషరేతో 'నువు పైకివెళ్ళి, ఎలాగైనా రోజ్‌ను పంపించుదూ' అన్నాడు.

లూసీ గదినంబరు అడిగింది. వారికి అక్కడ గుంపులో తిరుగుతున్న ఫాంటను కూడా కనుపించాడు. నానా మేడమీద జబ్బుగా ఉన్నదని విని, 'అయ్యో! పాపం! ఏమిటి జబ్బు?' అన్నాడు.

'మశూచికం' అన్నాడు మినాన్. ఫాంటన్‌కు ఆ పేరుచెప్పేసరికి పైకి వెళ్లాలంటే భయంవేసింది. చీకటి నెమ్మదినెమ్మదిగా వ్యాపిస్తోంది. దూరదూరంగా ఒక్కొక్కలాంతరేవెలుగుతోంది. జనంగుంపులుగుంపులుగా పోగవుతున్నారు. ఆ గుంపుల్లోనుంచి కొందరు 'బెర్లిన్‌పైకి! బెర్లిన్‌పైకి!' అని అరుస్తూపోతున్నారు. 'వెళ్ళండి! వెళ్ళిబుర్రలుపగులకొట్టుకోకండి!' అన్నాడు మినాన్.

గ్రాండ్‌హోటల్‌ముందు ఒకసీటుమీద ముఖాన్ని చేరుమాలులో దాచు కుని, ఒకవ్యక్తి కూచునిఉన్నాడు. ఫాషరేరాగానే అతన్ని మినాన్‌కు చూపించాడు. ఆ వ్యక్తి తల ఎత్తి చూచాడు అతడు కౌంట్ ముఫత్. ఉదయం ఆరుగంటలనుంచి అతను ఇక్కడే ఉన్నాడు. లాబోర్డెటీ ఈవార్త అందించగానే ఇక్కడికివచ్చి కూచున్నాడు. ప్రతిఅరగంటకూ లేచివెళ్ళి, నానాక్షేమాన్ని విచారిస్తున్నాడు' అన్నాడు మినాన్.

కౌంట్ నెమ్మదిగా లేచి హోటల్ వాకిలివద్దకు వెళ్ళాడు. కాపలా దారు వెంటనే 'అయ్యా! ఆమె చనిపోయి ఒకనిమిషమైంది!' అనిచెప్పాడు.

నానా చనిపోయింది! నానాచనిపోయింది! అందరిమీదా పిడుగు పడినట్టయింది. ముఫత్ తిరిగివచ్చి, చేరుమాలులో ముఖందాచుకుని కూచు న్నాడు. 'నానా చనిపోయింది! నానా చనిపోయింది!' అంటూ ఎన్నో గొంతులు మారుమ్రోగాయి.

నానా చనిపోయింది! మినాన్ నిశ్వసించాడు. ఫాంటన్‌ముఖం వివ ర్ణమైపోయింది. ఫాషరేవేళ్ళమధ్య సిగరెట్ నలిగిపోయింది. ఇక నానా

తిరిగిరాదు! ఆ శరీరం!-ఆ కండ్లు - ఆ నడుము - ఆ భుజాలు ఇక ఎవరూ చూడరు. ఆమె చనిపోవడం ఎంత విచిత్రం! లూసీ కడసారిగా ఆమెను గెయిటీథియేటర్‌లో చూచింది. నడుముకు బంగారురంగుగుడ్డధరించి,ఆనాడు ఎంత ఉదాత్తగంభీరంగా ఉన్నది! ఇక పారిస్‌నగరవాసులకళ్ళకు ఆ దేవతా మూర్తి కనుపించదు!

అప్పుడే బ్లాంసీకూడా వచ్చింది. లూసీ, కారొలైన్, బ్లాంసీలు కలిసి మేడమెట్లు ఎక్కసాగారు. మినాన్‌కూడా వారిని అనుసరిస్తూ, 'నేను వేచి ఉన్నానని రోజ్‌తో చెప్పండి' అన్నాడు.

గుంపులు మూగడం హెచ్చింది. 'బెర్లిన్‌పైకి! బెర్లిన్‌పైకి' అంటూ ఊరేగింపులు వెడుతున్నాయి.

మేడమీద నాలుగో అంతస్తులో గది. రోజుకు పన్నెండు ఫ్రాంకులు అద్దె గదినెంబరు 401. తలుపు మెల్లగా తెరుచుకుంది. లూసీ, కార్‌లైన్, బ్లాంసీ ప్రవేశించబోయి ఆగిపోయారు. అప్పుడే లోపల అయిదుగురు స్త్రీలున్నారు. నానా ఈజీచైర్‌లో పడుకుని ఉన్నది. సైమన్, క్లారిసీలు నిలబడి మాట్లాడుతున్నారు. రోజ్ మినాన్ నిశ్చలంగా శవంవంక చూస్తోంది.

మూడురోజులు పగలురాత్రీ నానాకు సేవచెయ్యడంవల్ల ఆమెముఖం వాడిపోయిఉన్నది. ఏడ్వడంవల్ల కళ్లు వాచిఉన్నాయి.

'ఎంతపనిజరిగింది!' అన్నది లూసీ రోజ్‌చెయ్యిపట్టుకొని. నానాను చూడాలని అటువైపుకు చూచింది. కాని దీపం దూరంగా ఉండడంవల్ల నీడలో కనుపించలేదు.

'ఆమెనుఆఖరుసారి గెయిటీథియేటరులో చూచాను, అంతే' అన్నది లూసీ.

'నానా ఎంతో మారిపోయింది. ఎంతోమారిపోయింది. ఎంతోమారి పోయింది' అని రోజ్ మళ్ళీ ధ్యానమగ్నమైన నయనాలతో నానాశవంవంక చూడసాగింది. సైమన్, క్లారిసీలు నానా వజ్రవైఢూర్యాలనుగూర్చి మాట్లాడుకుంటున్నారు. నిజంగా ఆ వజ్రవైఢూర్యాలు ఉన్నవో లేవో ఎవరికీతెలియదు. అంతేకాక ఆమె రష్యానుంచి అనంతమైన భోగభాగ్యాలు మోసుకువచ్చిందన్నారు. ఆ మృత్యుమందిరంలో అందరినీ విషాదఛాయలు

ఆవరించాయి. 'చనిపోయేటప్పుడు చాలా బాధపడిందా?' అని అడిగింది లూసీ.

'చాలా బాధపడింది. అప్పుడు నేను అక్కడే ఉన్నాను' అన్నది గాగా. లూసీకి ఊపిరాడక కిటికీతలుపులు తెరిచింది. బయట నక్షత్రాలతో విశాలాకాశం ఎంతో అందంగా కనిపిస్తోంది. ఇంకా వీధుల్లో జనం ప్రవాహాలుగా సాగిపోతున్నారు. లూసీ కార్‌లైన్‌ను పిలిచింది. ఇరువురూ మేడమీదనుంచి క్రిందికి చూచారు. కౌంట్ మఫత్ ముఖానికి చేరుమాలు కప్పుకుని, ఇంకా అక్కడే కూచునిఉన్నాడు. స్టీనర్, మేరియాబ్లాండ్ ఒక బండిలోనుంచి దిగారు. మేరియాబ్లాండ్ మేడపైకి వచ్చింది. మేడక్రింద పురుషులందరూ సిగరెట్లుకాలుస్తూ నిల్చునిఉన్నారు. ఫాంటన్ బెర్లిన్‌ను ౯ రోజులలో ఎలాపట్టుకోవచ్చునో వివరించి చెబుతున్నాడు.

తరువాత టాటన్‌నెనె, లూయీవాయ్‌లెన్ వచ్చారు.

అందరూ నానాశయ్యవంక చూచారు. లూసీ కిటికీవద్ద విషాదంగా నిల్చునిఉన్నది.

వెలుపల పేవ్‌మెంట్‌మీద 'బెర్లిన్‌పైకి! బెర్లిన్‌పైకి!' అంటూ ఊరేగింపు వెడుతున్నది.

రోజ్ నెమ్మదిగా లేచి, శాలువా కప్పుకున్నది.

శవంగబ్బు గదినిండా వ్యాపించుతోంది.

'ఇక వెడదాం రండి' అన్నది గాగా మిగతా స్త్రీలతో.

అందరూ ఒకసారి పక్కవంక చూచి బైటికివెళ్ళారు. రోజ్ శవం ప్రక్కన టేబిల్‌మీద ఒకమైనపువత్తి వెలిగించింది. ఆ వెలుగులో నానా ముఖం కన్పిస్తోంది. ఆ ముఖం అతిభీకరంగా ఉంది. అందరూ కంపించిపోయి త్వరత్వరగా వెళ్ళిపోయారు. 'ఎంతమారింది!' అంటూ రోజ్ కూడా వెళ్ళిపోయింది.

రోజ్ బైటికివెళ్ళి, తలుపుమూసింది. నానాశవంమాత్రమే మిగిలిపోయింది అక్కడ.

ఆ ముఖంమీద కొవ్వొత్తికాంతి పడుతోంది.

ఆ ముఖం-అది ముఖంకాదు-ఆ గది శవాలు పోగులుగావడివున్న మురికిగదిలా - శ్మశానవాటికలా ఉన్నది.

ఒక నెత్తురుముద్ద - కుళ్ళిన మాంసపుముద్ద।

మశూచికంబొబ్బలు ముఖాన్నంతా ఆవరించాయి. భూకంపంలో బద్దలైన పృథ్వీస్థలిలా ఉంది ఆ ముఖం. అది ఎవరిముఖమో కూడా గుర్తింపడం దుస్సాధ్యం. ఎడమకన్ను పూర్తిగా వికృతమై అదృశ్యమైపోయింది. ఆ మశూచికపు బొబ్బలమధ్య-ఎక్కడున్నదో చెప్పలేం. కుడికన్ను అర్ధనిమీలితమై చీకటి కన్నంలా వుంది. ముక్కులోనుంచి ఇంకా రసి కారుతూనేఉంది. బుగ్గమీది వ్రణం నోటివరకూ వ్యాపించిఉన్నది. భయంకరమైన నవ్వులో నోరు తెరుచుకొని వున్నది. ఒక్క కేశభారంమాత్రం-స్వర్ణపుశోభతో-అస్తమయసూర్యకిరణజాలంలా వెలుగొందుతోంది. 'వీనస్' విచ్ఛిత్తిపొందుతోంది. తను పుట్టిపెరిగిన మురికివాడలనుంచి ఆమె కూడబెట్టుకున్నవిషం - ఒక జాతినంతా భస్మీభూతం గావించిన విషజ్వాల - ఆ విషమే ఆమెవదనమండలంవరకూ వ్యాప్తమై ఆమెను తినివేసింది।

గది ఖాళీగా వుంది। ఇదీ సమాప్తి. బయటమాత్రం 'బెర్లిన్‌పైకి। బెర్లిన్‌పైకి।' అన్న నినాదాలతో ఊరేగింపు వెడుతోంది।

